అరుణాశ్రమ ప్రచురణము 2

# ఆంధ్రానందరామాయణము


గ్రంథకర్త:

కీ॥ శే॥ గుండు లక్ష్మణశాస్త్రిగారు

**వేళంగి,** కాకినాడ తా॥



1939

అరుణాశ్రమము

**నడకుదురు, కాకినాడ.**

శ్రీరస్తు.

# ఆంధ్రానందరామాయణ

## సారకాండము.

గ్రంథకర్త:

కీ॥ శే॥ గుండు లక్ష్మణశాస్త్రిగారు
వేళంగి, కాకినాడ తా॥



ప్రకాశకులు:
అరుణాశ్రమము
నడకుదురు, (వయా) కాకినాడ.

కాకినాడ:
శ్రీపతిముద్రణాలయమున
ముద్రితము.
1939

ప్రథమముద్రణము 1000.

నందన శ్రావణ పూర్ణిమ.



మూల్యము

Rs. 10/- రూపాయిలు.



వలయువారు :—

గుండు రామకృష్ణయ్యగారు,

వేళంగి, కాకినాడ తాలూకా,

తూర్పు గోదావరిజిల్లా.

అని వ్రాయవలెను.

పోస్టు ఖర్చులు కొనువారే భరించవలెను.

శ్రీమత్పరదేవతాయైనమః

# పీఠిక.

'కింకవీంద్రఘటాపంచానన' ఇత్యాదిబిరుదాంకితులు శతావధానులు కీర్తిశేషులు నగు

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

శ్రీమదానందరామాయణము—ఇహపరసాధకంబులును మనోహరములు నగు చిన్న చిన్న గాథలతో నొప్పారు నీమహాకావ్య మాదికవియగు వాల్మీకిచే రచింపఁబడిన శతకోటిప్రమితమైన రామాయణములో నంతర్భాగమని గ్రంథమువలననే యవగత మగుచున్నది. లోకములో నెక్కుడు ప్రసిద్ధముగానున్న రామాయణము షట్కాండాత్మకము. ఇయ్యదియో ? నవకాండాత్మకము- కాని షట్కాండాత్మకమగు గ్రంథ మిరువదినాల్గువేల శ్లోకములు, ఈగ్రంథమో పండ్రెండువేలుమాత్రమే. ఆరామాయణములో రాముని జననము మొదలు రావణవధానంతరము జరిగిన పట్టాభిషేకమువఱకునుగల కథ వర్ణింపఁబడినది. ఈ రామాయణములో నా యీ గాథయే కొన్ని స్వల్పభేదములతో వర్ణింపఁబడినది. ఏకకవికృతములగు గ్రంథముల నిట్టిభేదము లేలకలుగవలెనో యనుప్రశ్నకుఁ దృప్తికరమగు నుత్తరము వచ్చుటలేదు. షట్కాండ రామాయణములోని విషయము లేయొకటిరెండో దక్క— తక్కినవన్నియు విమర్శసహములు. ఇందలి యంశములు మందమతులమగు నస్మదాదులకు నట్టివిగాఁ గన్పట్టవు. ఆకారణమున నిది యన్యకవికృతమేమో యను సందేహము కలిగెడిని, కలుగుఁగాక. శ్రీ మహావిష్ణుని అంశావతారమగు రామునకుసంబంధించిన చరిత్రమే అందును యిందును బ్రతిపాద్యవస్తు వగుటచే రచయితలకును బాఠకులకును శ్రోతలకును "చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్। ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్॥" అను శ్లోకమునందలి ఫలితమును ఆస్తికు లెల్లరు నంగీకరించితీరుదురు. కనుక దీని నాంధ్రభాషలో ననువదించిన బ్రహ్మశ్రీ గుండు లక్ష్మణశాస్త్రిగారు ధన్యులు

"ధన్యో మాఘకవిర్వయం చ కృతినస్తత్సూక్తి సంసేవనాత్" అను మల్లినాథసూరి వచనము చొప్పున సంస్కరణమను మిషతో నామూలాగ్రముగాఁ బరిశీలించుచు గ్రంథకర్తృముఖమున వినిన నేనును ధన్యుఁడను. అష్టాదశమహాపురాణములలోఁ గాని ఉపపురాణములలోఁ గాని ,పంచమవేదమని ప్రసిద్ధిఁ జెందిన మహాభారతములోఁ గాని యెన్నో అంశములు చదువరుల విశ్వాసముమీఁదనే యాధారపడవలసి యుండును. ప్రస్తుతగ్రంథమునకో ? అవిశ్వాసము శతగుణ మెక్కుడుగా నుండవలసివచ్చునని ప్రతిఘట్టమునందును పొడకట్టెడిని. పురాణగాథల మాటకేమి, స్వయంవ్యక్తమగు వేదమునందలి గాథలకుఁ గూడ విశ్వాసముతోడనే యెక్కుడు చుట్టరిక ముండును. ఈయంశ ముపనిషత్తులలోఁ గొన్నిటి తుదను "నాఽవిశ్వాసాయ కిఞ్చిత్" అను వాక్యముచే మనము తెలిసికొనుచున్నారము. వేయేల? మతము, దేవుఁడు, అను విషయముగల ప్రతిగ్రంథమునకును విశ్వాసముతో సంబంధ ముండియేతీరును.

"కద్దన్న వారికి కద్దు. కద్దని మొరలిడిన పెద్దలబుద్ధులు నేడబద్ధ మగునే" అని త్యాగరాజుగారు గానము చేసియున్నారు. ఆగానమునకును.

"నాऽవిశ్వాసాయ" అను నుపనిషద్వాక్యార్థమునకును గల పరస్పరసంబంధము విజ్ఞులు గుర్తింతురుగాక. షట్కాండరామాయణములో రాముని ధీరోదాత్తత్వము చక్కఁగాఁ బోషింపఁబడి యున్నది. దీనిలోఁగూడ నట్టిపోషణము లేకపోలేదు గాని, కొన్నిపట్టుల నీసందర్భము సమర్థించుట కష్టసాధ్యమని నాయభిప్రాయము. సీత మాయలేడిని వెంబడించిన శ్రీరామునికడకు లక్ష్మణునిఁ బంపించుసందర్భమున నాడినమాటలు కడు పేలవముగా నుండును. ఆసందర్భమున కామెయే నొచ్చుకున్నట్లు సుందరకాండ యందలి కొన్నిశ్లోకములవలన నవగత మయ్యెడిని. ఈరామాయణములో నొకానొక సందర్భములో సీత శ్రీరామునివచనమును విశ్వసింపక ఏదోమాదిరి యాఁడుదానివలె సరయూనదిలో నుఱికెదనని, అర్ధరాత్రము వేళఁ బరుగిడును. ఎంతసమర్థించుకొన్నను నా కాయీసందర్భ మెంతో హేయముగాఁ గన్పట్టును. ఇంత కాకున్న నేకొంతయో శంకను గలిగించెడి యంశము లీరామాయణమునం దెన్నియో యున్నయవి. అందులో శ్రీరాముఁడు నవ్వునుగూర్చి చేసిన కఠినశాసన మొకటి. ఇందున్న గాథలలోఁ జాలవఱకు రాముని యేకపత్నీవ్రతమును బురస్కరించుకొని కల్పించినవి. కొన్ని సీతాపాతివ్రత్యోద్బోధకములు. అన్నియు రాముని పరాత్పరత్వమును సమర్థించుటకుఁ దోడ్పడుచుండును. షట్కాండరామాయణములోని రాముఁడు మానవమాత్రుఁడుగా నుండియుఁ బురుషోత్తముఁ డనిమాత్ర మనిపించుకొనును. ఈరామాయణమునందో, ఎక్కడనో మానవమాత్రుఁడుగా నున్నట్లు చిత్రింపఁబడినను సర్వత్ర సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టపరవస్తువుగనే కనుపట్టును. ఆరామాయణమునందు సీతాగ్నిప్రవేశఘట్టమునఁ గాఁబోలును బ్రహ్మాదులు రాముని దర్శింతురు. ఇందో ? చీటికిమాటికి ముప్పదిమూఁడుకోట్లదేవతలును రామునిదర్శనమునకు వచ్చుచుఁ బోవుచునే యుందురు. అందుఁ గుబేరవిమానమును రాముఁ డెక్కినది యొకపరిమాత్రమే. దీనిలోఁ బనివడినప్పుడెల్లఁ గోట్లకొలఁది సేనలతోడను, బ్రజలతోడను ఆవిమానముమీఁదనే ప్రయాణము చేయుచుండును. సూత్రప్రాయములుగానున్న ఆరామాయణములోని యంశములచేత భాష్యప్రాయములగు నిందలియంశములెల్లఁ జాలవఱకు సమర్థనీయము లనుటకు సందియము లేదు గాని, ఆరామాయణమువలె నీరామాయణము మనస్సంతుష్టిని గలిగింపనేరదనియును, కేవలకల్పితమేమో యనియును గొంద ఱనుకొనుట కవకాశము కలుగుచున్నది. ఇది యపోహ కాక సదూహ యైనపక్షమున గ్రంథకర్తృత్వము వాల్మీకికి లేకపోవలసివచ్చును. "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" అనుత్రోవలోఁ బడవలసివచ్చును. అప్పుడుమాత్రము శంకలకు విశ్రాంతి కలుగునా ? కలుగదు. ఏమందురేని ఇట్టిపరమపవిత్రమైనగ్రంథమును- ఏకొంచెమో కాదు పన్నెండువేలగ్రంథమును రచియించి తన పేరిమీఁద దానిని బ్రకటింపక వాల్మీకి పేరిమీఁదఁ బ్రకటించుటకుఁ దగినంత హేతుసామగ్రిని సంపాదింపవలసివచ్చును. గ్రంథప్రాశస్త్యమున కట్టు లెవ్వరో చేసియుందురను హేతు వొకటితక్కఁ దత్పక్షీయులకు హేత్వంతరము దొరకదు.

ఈకాలమునఁ గొందఱువిమర్శకు లట్టిహేత్వాభాసములను గొన్నిపాత్రములయెడలఁ గల్పించుటకు సాహసించుచున్నారు. అట్టిసాహసము నాకు లేకుంటచే నేను దీనికర్తృత్వమును వాల్మీకియందే విశ్వసించి "కల్పభేదాత్కథాభేదః" అని యీగ్రంథకర్త నుడివినశ్లోకమునే ప్రమాణముగాఁ బట్టుచున్నాఁడను.

మఱియు నీగ్రంథమునందలి అనేకబీజములకు శ్రీమద్భాగవతమునందలి అనేకాంశములు ఫలితములుగాఁ గన్పట్టును. దానింబట్టిచూడ నీగ్రంథకర్త శ్రీమద్భాగవతమును జదివి యనంతర మిద్దానిని రచించియుండునని యుం దోఁచెడిని. అట్లగునెడల వ్యాసునికన్న వాల్మీకి యర్వాచీనుఁడు కావలసివచ్చును. ఇట్టి శంకల కుపక్రమించితిమేని మనకుఁ దరణోపాయము దుర్ఘట మగును. కావున నాత్రోవ వదలుకొందము.

శ్రీరామునిదర్శనమునకు వ్యాసుఁడు (ఈవ్యాసుఁడు పరాశరపుత్రుఁడే యని స్పష్టముగా నున్నది.) వచ్చి నట్లు ప్రస్తుతగ్రంథమునఁ గలదు. దీని నెట్లు సమన్వయింపఁగలము?

ఈశంకల కేమి? వీని కేవో సమాధానములుకూడ నుండిన నుండునేమో! అనర్గళమైనధారతోఁ బన్నెండువేలగ్రంథమును రచించినమహాకవికి—లేదా? మహర్షికి—మనకున్నంతమాత్రమును దెలివి తేటలు నుండకుండునా? యనునంశము మనమం దుంచుకొని యెవరేని దీని విమర్శనకుఁ గడంగవలయు నని నాతలంపు.

మఱియు నీగ్రంథములో,

"అతి సర్వత్ర వర్జయేత్" అనునభియుక్తోక్తికి బొత్తిగా నవకాశము నీయక గ్రంథకర్త తాను జెప్పఁ బూనుకొన్న ఆయాయంశములను మిక్కిలి ఛాందసముగా వర్ణించినట్లు కన్పడుచున్నది. ఆయీసందర్భములయందలి గుణదోషములను అనువాదకులవిగా భావింపక చదువరులు మూలమునకే ఆపాదింపవలయును. వీలైనంతలో ననువాదకులు క్లుప్తీకరింప యత్నింపకపోలేదు గాని యెంతయత్నించినను కృతార్థత్వముమాత్రము కలిగినట్టు లేదు. భగవంతునిచరిత్రము గదా; మన మేల క్లుప్తీకరింపవలయును? అనెడి సదూహతో మూలకర్త అట్లు విస్తరించియుండు నని నే నాయీఘట్టములు వినినపిదప సమాధానము జెప్పికొంటిని—ఎంతసమాధానముచెప్పికొన్నను మన స్సింకను గొంకుచునే యున్నది.

మఱియు నీరామాయణములో నారామాయణములోలేని చిత్రవిచిత్రములైన కథాసందర్భములు పెక్కులు కలవు. ఆరామాయణములో లేనంతమాత్రముచేత నాయాయీకథాసందర్భములు పుక్కిటిపురాణము లనుకొనుట యుక్తిదూరమే కాక అనుభవవిరుద్ధమునుగూడ నగును. ఏమందురేని పదకొండు వేలసంవత్సరములు రాజ్యముచేసిన శ్రీరామచంద్రునిచరిత్ర మొక్కరావణవధతోడనే సమాప్త మయ్యెనను కొనుటకంటె అపరిశీలకత్వ మెుం డుండునా? ఆచరిత్రము సుమారు నలుబదిసంవత్సరములలోపున జరిగినది కదా? ఉన్నవయస్సంతయు సీతారాములకుఁ దదనంతరమే యున్నది. ఆవయస్సులోఁ ద్రివర్గబోధకములగు లేదా చతుర్వర్గబోధకములగు చిత్రచరిత్ర లెన్నియు జరుగక కేవలము నిద్రావస్థలోఁ గుంభకర్ణునింబలె రాముఁ డుండెననుకొనుటకన్న నింకేమి పొరపాటుండును? కావున నిందుదాహరించిన రామునిచరిత్రములుగూడ నడచినవానిలో నేకొన్నిమాత్రమో అయియుండును గాని సమగ్రములు గావనుకొనుటయే యుక్తిసహము.

ఈసందర్భము ప్రస్తుతగ్రంథమునఁ బ్రవక్తయగు రామదాసు పలుచోట్ల శ్రోతయగు విష్ణుదాసునితో వాక్రుచ్చియేయున్నాఁడు. షట్కాండరామాయణములో లేకయున్నను ఇందలిచరిత్రములు—అందుఁగాని మఱి యేయితరగ్రంథములయందుఁగాని నిషేధింపఁబడినట్లు ప్రమాణ మేమియు లేకుండుటచే, "అప్రతిషిద్ధ మనుమత భవతి" అనున్యాయమునఁ బ్రాజ్ఞులయనుమతికిఁ బాత్రములే; సందియము లేదు. సాక్షాద్భగవదవతారమగు శ్రీరామునిచరిత్ర మిందుఁ బ్రత్యక్షరమునందును సమగ్రముగా నిండి యున్నది. అక్కతన నీగ్రంథము శ్రీమద్భాగవతముఁబోలె ముముక్షువులకు నుపాదేయ మని ఘంటాపథముగాఁ జెప్పనొప్పెడిని. ఈయంశము రామదాసుఁడు ప్రస్తుతగ్రంథమునఁ బలుచోట్ల వ్యాఖ్యా

నించుచుండే యుండెను. వ్రాసిన కొంతయేని వ్రాయవలయును. ముఖ్యాంశము ప్రస్తుతగ్రంథము నాంధ్ర మున వచువదించిన కవిపూర్వపుణ్యము వర్ణ్యము. "ఫలానుమేయాః ప్రారంభాః"

ఇందలి గాథలు త్రిమతస్థులకు నుపాదేయములే యయ్యు శివవిష్ణుభేదము పాటించునారు నరకగాము లగుదు రని అసకృదావృత్తిగా గ్రంథకర్త రామునిచేతనే ఖండితముగాఁ జెప్పించిన ట్లుండుటచేత నేక ప్రోపాసకులగు వైష్ణవులకేమి, శైవులకేమి, ఇది ఆదరణీయము కాదనుకోవలయును. ఆరామాయణమున నొక్కచో నొకచోట "అత్రపూర్వం మహాదేవః" అనువాక్యము శ్రీవైష్ణవులసిద్ధాంతమునకు భంజకముగాఁ గనుపట్టినది గాని ఇం దట్టివాక్యములు శతపరంపరగా నున్నవి. ఎన్నిటికని క్లిష్టవ్యాఖ్యానము చేసికొందురు అని కాఁబోలు వారిమతాచార్యు లెవ్వరును దీనికి వ్యాఖ్యానము చేయలేదు. శివవిష్ణుభేదమును పాటింపని అద్వైతమతాచార్యులుగూడ నెవ్వరును దీనిని వ్యాఖ్యానించినట్టు లేదు మొదటివారియుపేక్ష విచారణీయము కాకున్నను రెండవవారియుపేక్ష కొంత విచార్యమే. కాని అంతమాత్రముచేతఁ బుణ్యాపు రాశియగు శ్రీరామచంద్రునిచరిత్రముతో నిండియుండిన ఈచరిత్రమున కొకకళంకము గలుగునా? కలుగదు.

"స్రా కిం నరమ్యా సచ కిం నరంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

ఆంధ్రానువాదముకూడ వ్యాఖ్యానమువంటిదే కనుక లక్ష్మణశాస్త్రిగారి యనువాద మీగ్రంథమున కాలోపమును దీర్పఁజాలిన దని సహృదయులు విశ్వసింతురుగాక.

శ్లో॥ కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః,

మతాచార్యులెవ్వరు దీని స్పృశింపకుండుటకు నా కొకహేతువు స్ఫురించుచున్నది. వారు తఱచు వేదాంతబోధకములగు గ్రంథములకే తమతమమతముల కనుగుణముగా వ్యాఖ్యానములు చేసికొనియున్నారు. ఈగ్రంథమునందు వేదాంతవిషయములు లేకపోలేదు గాని శ్రీమద్భాగవతాదులయందుంబలె వ్యాఖ్యానాపేక్షకములగు మాఱుమూలవేదాంతవిషయములు లేవు. అందుచే వా రిద్దానిజోలికి రాలేదని నే నను కొందును — కొందఱు,

"శతకోటి ప్రవిస్తరమ్"

అనువాక్యమునకు నేదో క్లిష్టవ్యాఖ్యానము జేసి ఇరువదినాల్గువే లనునర్థమును సంపాదించుట కలదు. అప్పుడు షట్కాండరామాయణముకంటె నితరరామాయణములు లేనేలే వనికాని, ఒకవేళ యున్నను, అయ్యవి వాల్మీకికృతములు కావనికాని యొకయపోహమును లోకమునకుఁ గలిగింపవలసివచ్చును. అది మూలచ్ఛేదిపాండిత్యప్రకర్షవంటి దని లోఁగడఁ దెల్పియేయుంటిని. ఇది మహాగ్రంథము, దీనింగూర్చి వ్రాయవలసివచ్చినచోఁ దగినంతశక్తిసామర్థ్యములు కలిగి బుద్ధిబలము గలిగియున్న వా రర్హులు గాని సర్వథా అసమర్థస్థితిలోనున్న నావంటివాని కీభారము దుర్వహము. గ్రంథకర్త నాపై నీభారము పెట్టుటచేతనే కాక ఇయ్యది నాథవిష్ణ్వత్కాలమునకు సర్వథా శ్రేయస్కర మని నాకుఁ బూర్తిగాఁ దోఁచుటచే వహింపఁజాలని యీభారమును మోయుటకుఁ దగుదు నని సిద్ధపడి గ్రంథకర్తృముఖమువనే సుమారు రెండుమాసములకాలములో దీని సావకాశముగాఁ బ్రత్యక్షరమును విని యథాశక్తిగా నిపీఠికను వ్రాసితిని. బుద్ధిబలముమాటకు శరీరబలము ముఖ్య మని వేఱుగఁ జెప్పనక్కఱలేదు; ఆబలము చాల లోపించియుండుటచే

నిం దెక్కడనైన కొఱసులు మిగిలియుండు వేమో అని యొకసంశయము కల్గుచున్నది. గ్రంథకర్త విద్వత్కవి గాని కేవలకవి గాకపోవుటచే నట్టిసంశయముతోఁ బనియే లేదనుకోవచ్చును- పైఁగా నెన్ని తరములనుండియో వీరివంశమునందుఁ బండితులును, కవులును, పండితకవులును, ఉన్నయంశము జగద్విదితము. వీరితండ్రి రామస్వామిశాస్త్రిలవారు సుప్రసిద్ధవైయ్యాకరణులు, సాహిత్యధురంధరులు, పౌరాణికాగ్రేసరులు, ఉభయభాషాకవులు. గీర్వాణమున సీతాకల్యాణచంపువును, ఉషాపరిణయనాటకమును, ఆంధ్రమున ఏకప్రాసశంకరశతకమును వీరు రచించిన గ్రంథములు. వీరు లౌకికపండితులగు శ్రీభాగవతులహరిశాస్త్రులవారి ప్రధానశిష్యులలో నొకరు. వీరిని నేను స్వయముగ దర్శించియున్నాను. వీరితాతగారో, ముత్తాతగారో "వ్యాకరణమకరా" బని సమకాలికపండితులచే గౌరవింపఁబడెడి శ్రీవేదులనారాయణశాస్త్రులవారి శిష్యు లని చెప్పఁగా వింటిని. ఈశిష్యత్వమునకు సంబంధించిన యొకఇతిహాసము గలదు గాని గ్రంథవిస్తరభీతిచే దాని నిం దుదాహరింపక విడిచితిని. ఆయితిహాసము నాఁటిశిష్యులకు గురువునందే కాక గురువంశస్థులగు అపండితులయందుఁగూడ నెట్టిగౌరవ ముండెడిదో వ్యాఖ్యానించును. అట్టిపండితవంశమునఁ బుట్టుటయే కాక మహాపండితునకుఁ బుత్రుఁ డయ్యుఁ బండితపుత్రుఁ డనునపప్రథకుఁ దావొసఁగక గురుశుశ్రూషాపూర్వకముగా, కౌముద్యాదుల నధ్యయనముఁ జేసి కవిత రచింపఁబూనిన యిక్కవిరచనలో నొకరు సంస్కరింపవలసిన యంశము లుండనేయుండ వనుట యతిశయోక్తి కాదు. కాని,

"ఆపరితోషాద్విదుషామ్"

అను కాళిదాసోక్తి ననుసరించి సమర్థు లగుకవులుగూడఁ దమగ్రంథము లొరులకు వినిపించుట యాచారమైయున్నది. ఆయాచారమే గ్రంథకర్తను బురికొల్పి నాకీమహాభాగ్యమును సంపాదించిపెట్టిన దని మనఃపూర్వకముగా సంతసించుచున్నాఁడను.

"సతాంసద్భిస్సంగః కథ మపి చ పుణ్యేన ఘటతే"

కవిత్వమునకు ముఖ్యఫలము రసము. ఆరసము సమర్థుఁడైనకవి కథావస్తు వెట్టిదైనను గలిగింపఁగలఁడు; కాని కథావస్తువు

"పుణ్యశ్లోకస్యచరిత ముదాహరణ మర్హతి"

అను నభియుక్తోక్తికి లక్ష్యమైనది దొరకుట పూర్వపుణ్యవిశేష మనుకొనవలసి యుండును. అట్టికథావస్తువు తటస్థించినప్పుడు

"సాధ్యోహి రసో యథాతథం కవిభిః"

అను నభియుక్తోక్తి కించుక తనరచన జంకినను గ్రంథకర్త ధన్యుఁ డనియే యెంచవలసియుండును. ప్రస్తుతగ్రంథమునం దెన్నియో కథలు పిట్టకథలుగానున్న వికూడ నవరసములలో నేదోయొకరసమునకు నుపోద్బలకములుగా నుండుటచే గ్రంథకర్తకుఁ దీర్థమును స్వార్థమును గలిసివచ్చినది. ప్రధానఫల మనఁగాఁ బారలౌకికఫలము అది భగవద్గుణానువర్ణనమువినాగా నెంతమంచికవిత్వము రచించినను కలుగ నేకలుగదు. చూడుఁడు, మహాకవియు మహాభక్తుఁడును అగు జయదేవుఁ డేమనుచున్నాఁడో ?

శ్లో॥ బీజం యస్య పురార్జితం సుచరితం ప్రజ్ఞా నవీనాంకురః ।
కాండః పండితమండలీపరిచయః కావ్యం నవః పల్లవః ।
సూక్తిః పుష్పపరంపరాపరిణతి స్సోఽయం కవిత్వద్రుమః ।
కిం వంధ్యః క్రియతే వినా రఘుకులోత్తంసప్రశంసాఫలమ్॥

ఈగ్రంథ మింతవఱకు వచనరూపముగా నెవరో తెలుఁగులోని కనువదించినను పద్యరూపముగా నాకెఱిఁగినంతలో నెవరును ననువదించినట్లు తెలియకపోవుటచే, పిష్టపేషణాదిదోషసందర్భములతోఁగూడ నిక్కడికి నవసరము లేదు. ఇందలికథ లనేకములు సుప్రసిద్ధహరికథకులు (మహారాష్ట్రులు, కర్ణాటకులు) హరికథలలోఁ బ్రస్తావించుట కలదు. ఈగ్రంథము వినకపూర్వము అవి వారి స్వకపోలకల్పితము లనుకొనుచుండువాఁడను. ఇప్పుడు వానితత్త్వము తెలిసికొంటిని. ఈరామాయణప్రచారము మనదేశములోఁ గొంతతక్కువయైనను, ఉత్తరదేశములో విస్తరించియేయున్నదని తోఁచెడిని. ఏమైనను షట్కాండరామాయణమున కున్నంతప్రచారముమాత్ర ముత్తరదేశమునఁగూడ దీనికి లేదనియే అనుకొనవలయును. ఈయాంధ్రానువాదము తత్సమపదభూయిష్ఠముగా నున్నను చాలభాగము తేలికశైలిలో నుండుటచేఁ బ్రతివారికిని అందుఁబాటులో నుండును గనుక నిదివఱలో నీదేశమందుఁ బ్రచారము తక్కువైనను, ఇఁకముందట్టిలోప ముండదని నానమ్మకము. ఇందలియితిహాసములు మిక్కిలి నీతిబోధకములుగా నుండుటచే, కళాశాలావిద్యార్థులకుఁ బఠనీయములుగా ఆవిద్యాశాఖాధికారులు నిర్ణయించి గ్రంథకర్తకుఁ బ్రోత్సాహకు లగుదురని విశ్వసించుచున్నాను. గ్రంథకర్త యీగ్రంథరచనకుఁ బూర్వము రామచంద్రవిలాస మను ప్రబంధమును, శ్రీరామపాదుకాపాలన మను నాటకమును రచించియుండుటచే దీనిరచననాఁటికిఁ గవితాధార సానబట్టినకత్తిగాఁ బరిణమించినట్లు కన్పట్టుచున్నది. ఆయీవిషయములెల్ల విచక్షణులగు చదువరులకు గోచరించునట్టివే కనుక నిఁక విస్తరింపను. గ్రంథకర్తకు, తారకమంత్ర ముపాస్య మగుటయుఁ దారకమంత్రాధిష్ఠానదేవత కాలవాలమగు రామాయణము రచనీయ మగుటయు మహాదృష్టము. కవి తాను తరించెను. వంశమును తరింపఁజేసెను. లోకమునుగూడఁ దరింపఁజేసెను. భగవంతుఁ డీయనకు సర్వథా శ్రేయఃప్రదాత యగుఁగాక.—

ఓం తత్సత్

ది 8—9—1939
కడియం.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

# విజ్ఞప్తి.

"క్వ సూర్యప్రభవో వంశః, క్వ చాల్పవిషయా మతిః ?
తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపే నాఽస్మి సాగరమ్॥"

కాళిదాసమహాకవియే యిట్లు చెప్పికొనఁగాఁ దత్పాదరజఃపరమాణువుం బోలని యల్పజ్ఞుఁడ నగు నే నిట్టిమహాకార్యమునకుఁ బూనుట సాహసమే యగును. అయినను సహృదయులప్రోత్సాహశక్తియు శ్రీరామచంద్రపాదారవిందభక్తియు నన్నీగ్రంథరచనకుఁ బురికొల్పినవి.

వాల్మీకికృత మని చిరవిఖ్యాత మైన యీ యానందరామాయణమునఁ గావ్యలక్షణములకుఁ గథాసందర్భములకు విరుద్ధము లగువిషయములు చాలచోట్లఁ గాన్పించుచున్నవి. అయినను ఆర్షవచనములలో విరుద్ధములుగాఁ గన్పట్టువిషయముల కెట్టిసమర్థనము లుండునో అస్మదాదులకుఁ దెలియకపోవచ్చును. సర్వపౌరాణికవిరుద్ధగాథలకును మన ప్రాచీనులు "కల్పభేదా త్కథాభేదః" అని యొకసమర్థనసూత్రమును జెప్పుదురు. కావున నట్టిసందర్భముల నెట్టిమార్పులును జేయక యథామూలముగనే యనువదించితిని.

'కల్పభేదా త్కథాభేదః' అను నీసమర్థనసూత్రము నవనాగరకుల మగు మన కంతవిశ్వసనీయముగాఁ దోఁపకపోవచ్చును కాని శ్రీరామునిసమకాలికులే యగు వాల్మీకివిశ్వామిత్రులు రచించిన శ్రీమద్రామాయణాధ్యాత్మరామాయణములలో సైతము పెక్కుతావులఁ బొడసూపిన యీకథాభేదముల సమర్థించుకొనుట కీసూత్రము దక్క మనకు మఱియొకయాధారము లేదు.

ఈ నాయనువాదము "మక్కికిమక్కి"గాఁ గాక నిర్బాధకము లగుచోట్ల సందర్భానుసారముగాఁ గొంచెము పెంచియుఁ బునరుక్తిముఖదోషగ్రసితము లగుచోట్లఁ గొంచెము కుదించియు రచించితిని. నీతిభక్తిభరితము లగు నచ్చటచ్చట సన్నివేశములలోఁ జాలవఱకు స్వతంత్రించితిని.

రసమాత్రగ్రహణపారీణులు సహృదయులు నగు పాఠకులచెంత నాకవితా ప్రమాదముల నంగీకరించుచు సవినయముగ నంజలింతును. వాల్మీకివ్యాసకాళిదాసాదులరచనలుగూడ విమర్శసహములు గావని వాదములు చెలరేగిన యీకాలమున నిర్దుష్ట మగురచన సాగించితి నని నావంటియల్పుఁ డెట్లు శపథము చేయఁగలఁడు ?

నాకబ్బమును శ్రద్ధావాత్సల్యములతో నామూలాగ్రముగా విని కవితాప్రమాదములఁ గొన్నింటిని సవరించి నన్నాదరించిన కవిసార్వభౌములగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికిని, మఱియు నమూల్యమగు పీఠికతో నన్ననుగ్రహించిన కింకవీంద్రఘటాపంచాననులు, ప్రభుత్వాస్థానకవీంద్రులు, శతావధానులు నగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికిని నిరవధికభక్తిభరితముగాఁ బరసహస్రవందనము లర్పించుకొనుచు నాకృతజ్ఞత వెల్లడించుకొందును.

మఱియు నీగ్రంథమందలి లేఖకప్రమాదముల సవరించుటయేగాక మొదటినుండియు నావలె గ్రంథభారము వహించి బహువిధముల నాకుఁ దోడ్పడిన 'అవధానిశేఖర' 'ఆయుర్వేదాచార్య' గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిని చిరతరాయురారోగ్యైశ్వర్యయశోభరితునిగా నొనరించి రామచంద్రుఁడు రక్షించునుగాక యని యాశీర్వదింతును.

10–8–1939
వేళంగి,
కాకినాడ తా॥

ఇట్లు,
ఉభయభాషావిద్వత్కవివిధేయుఁడు,
గుండు లక్ష్మణశాస్త్రి,
గ్రంథకర్త.



శ్రీరామచంద్రవిలాసపాదుకాపాలన

ఆంధ్రానందరామాయణాది

**బహుళగ్రంథకర్తలు**



ఉభయభాషావిద్వత్ప్రసిద్ధులు.

# బ్ర॥ శ్రీ॥ గుండు లక్ష్మణశాస్త్రిగారు

వేళంగి, కాకినాడ తా॥

జననము:

స్వభాను వైశాఖ శు ౬

16—5—1884

మరణము:

విరోధి పుష్య బ

12—1—1950

కీర్తిశేషులగు

# గుండు లక్ష్మణశాస్త్రిగారి జీవిత సంగ్రహము*

శ్రీ మేడవరపు విశ్వేశ్వరశాస్త్రిగారు, వెలంపాలెం, ద్రాక్షారామ.

గురుదేవులగు లక్ష్మణశాస్త్రిగారు స్వభానువత్సర వైశాఖ శుద్ధ స్థిరవాసరమున (16–5–1884) జన్మించిరి. వీరినివాసము కాకినాడ తా॥ వేళంగిగ్రామము. తండ్రి వైయాకరణసార్వభౌములు, సాహిత్యచక్రవర్తులు, మహాకవులు నగు రామస్వామి శాస్త్రిగారు. తల్లి సుబ్బమాంబ. శాస్త్రిగారి యగ్రజులు రామబ్రహ్మశాస్త్రిగారు. అనుజులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. అన్నదమ్ములు ముువ్వురును తండ్రిగారియొద్దనే విద్యాభ్యాసము చేసిరి. లక్ష్మణశాస్త్రిగారు ప్రత్యేకముగా బ్రహ్మశ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారికడ వ్యాకరణశాస్త్రము నార్షసంప్రదాయానుసారముగా నభ్యసించి ప్రాక్తనసుకృతవశమ్మున మహాకవులై, మహాపౌరాణికులై, "పుత్రాదిచ్ఛేత్పరాజయ" మ్మను నదృష్టమును తండ్రిగారికిఁ జేకూర్చిరి. వీ రనేకపట్టణముల నత్యద్భుతముగా నెన్నోమారులు పురాణములఁ జెప్పుచు సాహితీసభల నిర్వహించుచు జనామోదము వడసిరి. వీరి రచనలు శ్రీరామచంద్రవిలాసము (ప్రబంధము,) శ్రీరామపాదుకాపాలనము (నాటకము,) ఋణబాధ, శంకరశతకములు మున్నగునవి.

ఏఁబదియేండ్లు గడచినపిదప శాస్త్రిగారిజీవితము దుఃఖభరిత మయ్యెను. నిజధర్మపత్నియు మహాసాధ్వియు నగు సూరమాంబ వ్యాధిగ్రస్తయై మరణించెను. పిదప గీర్వాణాంధ్రాంగ్లకోవిదుఁడు తనంతవాఁడు నగు జ్యేష్ఠపుత్రుఁడు రామస్వామిశాస్త్రియు మరణించెను. అశనిఘాతములవంటి ఈయుపద్రవములఁ జిక్కినపిదప శాస్త్రిగారిజీవితము చిరకాలమునకుఁగాని కుదుటఁబడలేదు.

విపద్భూయిష్ఠమైన ఈయవస్థ సంప్రాప్తించినకాలముననే (పత్నీవియోగమునకుఁ బూర్వమే) శాస్త్రిగారు మనశ్శాంతికొఱకు ఆనందరామాయణము ననువదింప మొదలిడి నాలుగైదేండ్లలోఁ బూర్తిచేసిరి. పుత్రమరణానంతర మెట్లో తేరుకొని మిక్కిలిశ్రమతో 10 వేల గద్యపద్యములుగల తమమహాగ్రంథమునకు శుద్ధప్రతిని నిర్దుష్టముగ తయారుచేసి పిదప నత్యుత్సాహముతో ననేకమహాసభలలో నానందరామాయణము నద్భుతముగాఁ బురాణముఁ జెప్పుచుఁ దన్ముద్రణార్థమై దేశముపలుచోట్లఁ దిరిగిరి.

---

* శ్రీ విశ్వేశ్వరశాస్త్రిగారు గుండు లక్ష్మణశాస్త్రిగారి జీవితచారిత్రమును సమగ్రముగా రచించిరి. స్థలాభావముచే దాని నిట సంగ్రహముగా ప్రకటించితిమి. (ప్రకాశకులు)

శ్రీ కృష్ణమూర్తిగారును ఇంచుమించుగా సమకాలముననే ఒకరికిఁదెలియక యొక రానందరామాయణము ననువదించియుండిరి. అనువాదపద్ధతియందును గవితాపాటవమునందును వీరిరువురును నొకరి కొకరు తీసిపోరు. శ్రీ కృష్ణమూర్తిగారి యనువాదము చాలవఱకు "మక్కికి మక్కి" గా నుండును. లక్ష్మణశాస్త్రిగారి యనువాదమున స్వాతంత్ర్య మెక్కువగానుండును. శ్రీ కృష్ణమూర్తిగారు మిగిలిన రామాయణము నంతను అనువదించిరో లేదో తెలియదు. లక్ష్మణశాస్త్రిగారుమాత్రము సమగ్రముగా ననువదించిరి. మిగిలినభాగములనుగూడ త్వరలోనే ప్రకటింపఁ గలుగుదుమని విశ్వసించుచున్నాము. పవిత్రతరమగు రామచరిత్రమును ఆంధ్రభాషలో ననువదించి ధన్యులైన యీ కవిద్వయమునకు మాజోహారులు.

ఈమహాకార్యమున గురుభక్తిభరితులగు శ్రీ మేడవరపు విశ్వేశ్వరశాస్త్రిగారును గ్రంథకర్తగారి పుత్త్రులగు శ్రీ రామకృష్ణయ్యగారును చేదోడు వాదోడుగా నిలిచి నాభారమును కొంత చులుకన జేసిరి. మృతజీవులగు లక్ష్మణశాస్త్రిగారి యనుగ్రహము వారిపైఁ బ్రసరించుఁగాక.

మిక్కిలి శ్రద్ధతో నీమహాగ్రంథము నిట్లు ముద్రించిన 'శ్రీ పతి ప్రెస్' వారు సర్వదా అభినందనీయులు.

అరుణాశ్రమము,
న డ కు దు రు
1–9–52.

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి.

# కృ త జ్ఞ త

ఈమహాగ్రంథముద్రణమునకు సమాదరముతో నయాచితముగ ధనసాహాయ్య మొనర్చిన ఆ యా దాతృశిఖామణులకు మాకృతజ్ఞత. కీర్తిశేషులగు మానాయన గారి యీ రచనను చిత్తుప్రతుల యాధారమునఁ జక్కఁగా సంస్కరించి ప్రకటించిన యరుణాశ్రమాధిపతులకు మాయభివందనములు. ఆంధ్రమహాజనుల సాహాయ్యమున నిట్లే మిగిలినగ్రంథ మంతయును ప్రకటింపఁబడుఁగాక యని యాకాంక్షించుచున్నాము.

వేళంగి,
4–9–52.

విద్వద్విధేయులు,
గ్రంథకర్తగారి పుత్త్రులు.

# ఆనందరామాయణముద్రణమునకు
# ధనసాహాయ్యమొనరించినవారు

| | | | |
|---|---|---|---|
| | శ్రీ | సాలగ్రామ సుబ్రహ్మణ్యంగారు, రాయవరం | రు 100–0–0 |
| | ,, | సాలగ్రామ చింతామణిగారు, ఇంజరం | 100–0–0 |
| | ,, | మేడవరపు విశ్వనాథంగారు, మండపేట | 100–0–0 |
| | ,, | మేడవరపు వెంకటేశ్వర్లుగారు, మండపేట | 100–0–0 |
| | ,, | మేడవరపు సర్వేశ్వరశాస్త్రిగారు, మండపేట | 100–0–0 |
| | ,, | బొగ్గవరపు సోమన్నశాస్త్రిగారు, మండపేట | 100–0–0 |
| | ,, | సామంచి శ్యామలశాస్త్రిగారు, హాసన్‌బాదా | 100–0–0 |
| * | ,, | మార్ని అమ్మాయిగారు, వేళంగి | 100–0–0 |
| | ,, | చెన్నుభొట్ల చిరంజీవి అనే వెంకటసోమ సూర్యమాంబగారు, బి. యస్. సి., బి. ఇ. డి.. చామర్లకోట | 100–0–0 |
| | ,, | రేగిళ్ళ శివరామశాస్త్రిగారు, కుయ్యేరు | 50–0–0 |
| * | ,, | మెర్ల తాతయ్యగారు, వేళంగి | 50–0–0 |
| * | ,, | యార్లగడ్డ కొండయ్యగారు, వేళంగి | 50–0–0 |
| * | ,, | మెర్ల వీరయ్యగారు, వేళంగి | 30–0–0 |
| * | ,, | మెర్ల నారయ్యగారు, వేళంగి | 30–0–0 |
| * | ,, | ఇనుపకోళ్ళ వెంకన్నగారు, వేళంగి | 25–0–0 |
| * | ,, | మార్ని లచ్చమ్మగారు, వేళంగి | 25–0–0 |
| * | ,, | వెలుగుబంటి నారయ్యగారు, కూరాడ | 25–0–0 |
| | ,, | మేడవరపు వెంకటేశ్వర్లుగారు, వెల్ల | 25–0–0 |
| | ,, | మేడవరపు విశ్వేశ్వరశాస్త్రిగారు, వెలంపాలెం | 25–0 0 |
| | ,, | మేడవరపు సత్యనారాయణమూర్తిగారు, హాసన్‌బాదా | 25–0–0 |
| * | ,, | మెర్ల వెంకటరావుగారు, వేళంగి | 25–0–0 |
| * | ,, | పాతూరి శ్రీమన్నారాయణమూర్తిగారు, వేళంగి | 25–0–0 |
| | ,, | ఉండవిల్లి సూర్యారావుగారి కు॥ సూరన్నగారు, నదురుబాదా | 25–0–0 |
| | ,, | మెర్ల శేషయ్యగారి కు॥ సూర్యప్రకాశంగారు, నదురుబాదా | 25–0–0 |

| | | | |
|---|---|---|---|
| | (శ్రీ) | గుండు రామలక్ష్మమ్మగారు, నడకుదురు | రు 25-0-0 |
| | ,, | ఉండవిల్లి సత్తిరాజుగారు, నదురుబాదా | 20-0-0 |
| | ,, | ఉండవిల్లి పెదగోపన్నగారి కు॥ సత్యంగారు, నదురుబాదా | 20-0-0 |
| | ,, | పోతుల రామకృష్ణయ్యగారు, నదురుబాదా | 20-0-0 |
| * | ,, | పాతూరి తమ్మిరాజుగారు, వేళంగి | 15-0-0 |
| * | ,, | ముత్యాల సత్యంగారు, వేళంగి | 15-0-0 |
| * | ,, | మెర్ల చినవీరన్నగారు, వేళంగి | 10-0-0 |
| * | ,, | చంద్రు రామన్నగారు, వేళంగి | 10-0-0 |
| * | ,, | కర్రి మాచరయ్యగారు, కుమారప్రియం | 10-0-0 |
| | ,, | ఉండవిల్లి రామన్నగారు, నదురుబాదా | 10-0-0 |
| | ,, | మాధవభొట్ల సూర్యనారాయణమూర్తిగారు, నదురుబాదా | 10-0-0 |
| * | ,, | యార్లగడ్డ సర్వారాయుడుగారు, వేళంగి | 10-0-0 |
| | ,, | సానిపిలి బుల్లిఅబ్బాయిగారు, నదురుబాదా | 5-0-0 |
| * | ,, | తోటకూర రామస్వామిగారు, కుమారప్రియం | 5-0-0 |
| * | ,, | కోన వెంకట్రావుగారు, కుమారప్రియం | 5-0-0 |
| * | ,, | చంద్రు వెంకటరావుగారు, వెంటూరు | 5-0-0 |
| * | ,, | పాతూరి వీరన్నగారు, వేళంగి | 5-0-0 |
| * | ,, | ఉండవిల్లి పాపాయమ్మగారు, రంగంపేట | 4-0-0 |
| * | ,, | వల్లూరి వెంకట్రాజుగారు, వేళంగి | 4-0-0 |



* ఇవి గ్రంథకర్తగారు స్వయముగా స్వీకరించినవి.

# విషయసూచిక.

శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# ఆంధ్రానందరామాయణము

## సారకాండము

### ప్రథమాశ్వాసము



గౌరీశివపాదపంకజపురస్సీమన్ మహోత్సాహినై
రాగాలాపము కర్ణతాళమును మీఱఁగ న్నాట్యముం జేయుచున్
బాగొప్పన్ సురమోదముం డగుకరిద్వక్త్రుఁ డిందు కావ్యక్రియో
ద్యోగంబున్ ఫలియింపఁజేసి నను సంతుష్టాత్మునిం జేయుతన్. 1

ఉ. శారదనీరదాంగరుచిసారవినిర్జితసాంద్రచంద్రికా
సార దయాప్రసార కవిసంఘనుతాత్మకళాప్రచార శ్రీ
నారదముఖ్యదేవమునినాథసమర్చితపాదపద్మ యా
శారద సత్కళాతతి విశారదుగా ననుఁ జేయుఁగావుతన్. 2

ఉ. ధాతకుఁ బ్రాణిసర్జనవిధాతకు వాగ్రమణీయవల్లకీ
గీతకుతూహలప్రకటకృన్నిజపాణిసరోజతాళసం
ధాతకుఁ బుణ్యపాపఫలదర్శకజీవలలాటపట్టని
ర్ణేతకు వాక్సతీహృదయనేతకుఁ ద్రాతకు భక్తి మ్రొక్కెదన్. 3

శా. అక్షీణాహవదక్షరాక్షసవిపక్షా! దేవతాపక్ష! స
ద్వక్షశ్శ్రీవరలక్ష! పత్త్రితవిభాస్వద్విష్కిరాధ్యక్ష! భ
క్తక్షేమంకరకల్పపాదపసదృక్షా! విస్ఫురత్పుండరీ
కాక్షా! సర్వవిపన్నరక్షణసుదీక్షాదక్ష! రక్షింపుమా! 4

ఉ. ఏలలనాకటాక్షలవ మేనియు సోఁకినమాత్ర నిత్యని
ర్వేలవిశాలసంపదభివృద్ధి కరామలకోపమానమౌ;

నేలలితాంగిసేవ సకలేప్సితముఖ్యనిధానమా, సదా
పాలితశీల నయ్యుదధిబాలను నెమ్మది సంస్మరించెదన్. 5

సీ. ఇంతి! నీహృదయం బెరెట్టిదై యుండునో, పార్వతీనామనే పల్కుచుండె
సన్నుదీయర్ధాంగ మాక్రమించుటకో నె, పతిభక్తిమాట సుస్పష్ట మయ్యె
నీవు మెట్టినచోట నిశ్చయంబుగ సర్వ, మంగళం బౌట సుసంగతంబు
చండికానామవిఖ్యాత వౌ నీవె, యార్యాహ్వాయముఁ గొంట యద్భుతంబు
గీ. ఇట్టిదానవటంచు ని న్నెఱిఁగి, యెఱిఁగి, పెండ్లియాడితి జగములఁ బేరువడితి
ననుచుఁ బార్వతితో మేల మాడునట్టి, చంద్రశేఖరు మదిలోన సంస్మరింతు.

ఉ. అప్పు శిరంబునం గలుగునట్టిడ వీవిఁక నే నపర్ణఁ జు
మ్మెప్పుడు నీవు భిక్షుకుఁడ వే నగరాజకుమారికన్, ప్రభూ!
తప్పవు నీకు నాకు బెడఁదల్ సతతం బని ప్రేమ భర్తతో
నొప్పుగ మేలమాడు చతురోక్తివిశారద గౌరిఁ గొల్చెదన్. 7

ఉ. శ్రీరఘురామచంద్ర! యతసీకుసుమోపమనీలదేహ! స
త్తారకమంత్రరాజజపతత్పరభక్తహృదంబుజాతసం
చార! ధరాత్మజాధిప! నిశాచరశుష్కవనీదవానలా
కార! నతార్తిభంజన! జగజ్జనరంజన! నన్నుఁ బ్రోవుమా. 8

ఉ. ఏయెడ రామగాథ వచియింతురొ యచ్చట సానురాగుఁడై
హాయిగ నిల్చి కంటఁ బ్రమదాశ్రులు చింద నిసర్గభక్తిఁ జే
ద్దోయిని మోడ్చి మ్రొక్కుచును దుష్టి రహింపఁగ రామ! రామ! రా
మా! యని సంస్మరించు హనుమంతుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 9

శా. ఏమంత్రమ్మును నిచ్చలుం దలఁప నే నీరీతి విద్వత్కవి
స్తోమానుగ్రహపాత్ర మైతిని కళాస్తోమమ్ముఁ గైకొంటి నా
శ్రీమత్తారకమంత్రమున్ సుకవితాశ్రీ నిచ్చియున్నట్టి శ్రీ
రామస్వామిబుధేంద్రు మజ్జనకు నప్రమత్త్వమ్మునన్ మ్రొక్కెదన్. 10

శా. ఉల్లాసప్రదభర్తృపాదభజనాత్యుచ్చైర్యశోరాజిసం
పల్లాభాన్విత! యన్నదాననియమప్రఖ్యాత! సుబ్బాంబ! యో
తల్లీ! త్వత్పదపద్మయుగ్మమునకున్ దండప్రణామంబు లు
త్ఫుల్లాత్మన్ ఘటియించి కావ్యరచనోద్యోగంబు సాగించెదన్. 11

చ. ఘనఫణిరాడ్వచఃప్రకరకంధి సుధీపటుమంథరాగమం
ధనభవపాండితీమృదుసుధారసదానవిశేషసత్క్రియా
జనితయశఃపటావృతవిశాలదిశాంతుని శాంతు మద్గురున్
మనమునఁ బేరయాఖ్యు బుధమాన్యుఁ దలంచి నమస్కరించెదన్. 12

చ. భువిని జలంబు పాల్గలియఁ బోసినఁ బాలనుమాత్ర మంచ పా
టవమునఁ ద్రావురీతిఁ బ్రకటం బగుకావ్యమునన్ గుణంబె స
త్కవి కని సంతసించు నెమకం దొకతప్పిద మున్న నట్టిస
త్కవులకు నాదుకావ్యము ముదం బిడుఁగాక నశేషభంగులన్. 13

ఉ. బాగుగ నౌచితీరసవిభాసురమౌ కృతిఁ గింకవుల్ రస
శ్రీగరిమంబుఁ గానకయె చెద్దలఁ జూతురు వార్ధిలో మణీ
పూగము వీడి నత్తలకుఁ బొంచెడికొంగలరీతి నాపురో
భాగులు తప్పు వట్టినను వాటిలునే యొకలోటు మత్కృతిన్. 14

## —* కర్తృవంశావళి *—

శా. మూలాధారముఖాబ్జషట్కగతుఁడై ప్రోద్యత్సహస్రారస
న్నాళీకస్థిరవాసుఁడై చిదచిదానందస్వరూపాఢ్యుఁడై
లీలాకల్పితజీవనాటకజనాళీసూత్రధారుండు నై
జ్వాలాకారత నుండు నిర్గుణపరబ్రహ్మంబు తా భాసిలున్. 15

చ. తతసగుణస్వరూపమును దాల్చెను నిర్గుణ మైనబ్రహ్మ మూ
ర్జితదరచక్రసాధనుఁడు కృష్ణశరీరుఁడు లోకరక్షణో
ద్యతుఁడు ధృతవ్రతాభిమతదాయకుఁ డీశుఁడు నిందిరాసతీ
యుతలలితోరువక్షుఁ డయి యుప్పతిలెన్ హరి విశ్వగర్భుఁడై. 16

గీ. అట్టిహరినాభిపద్మమ్మునందుఁ బుట్టి, పూని తత్కృపచే సర్వభువనసృష్టిఁ
జేయుచును నాల్గుమోములు జెలువుమీఱ, ధాత రాజిల్లు సురసుఖదాతయగుచు.

ఉ. ఆపరమేష్ఠిమానసమునందు జనించుట జ్ఞానపూర్ణుఁడై
పాపవిదూరుఁడై నిజతపఃపరిపూతవినిర్మలాత్ముఁడై,
ప్రాపుగ సర్వమౌనినికరంబులలోఁ దలమానికంబునై
శ్రీపతితుల్యుఁ డార్యజనసేవితుఁ డొప్పు నగస్త్యుఁ డీభువిన్. 18

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రివృద్ధిగర్వంబెల్లఁ, జెనకె యుక్తిగను జేజేలు మెచ్చ
నెవ్వాఁడు నహుషభూమీశుగర్వ మడంచి, పాముగా భూమిపైఁ బడ శపించె
నెవ్వాఁడు భూసురాహితుఁ డైన వాతాపి, నుగ్రగర్భాగ్ని నాహుతి యొనర్చె
నెవ్వాఁ డుదధివారి నెల్లఁ జేతను బట్టి, యాపోశనమ్ముగా నట్టె పీల్చె
గీ. ఆయగస్త్యుఁడు కులఋషి యగుట నతని, కులమువారెల్ల నాగస్త్యగోత్రు లైరి
"గుంటి"వా రని గృహనామ ముండె వారి, కాశ్వలాయనశాఖవా రైరి వారు.
సీ. శ్రీభీమమండలస్థితమును మల్యాప, గాతీరవాసప్రకాశితంబు
సకలసంపద్భోగసంయుతంబును భవా, నీశంకరావాసనిస్తులంబు
ధర్మార్థకామ్యాదివిధానాదరానేక, సుజనతావాససంశోభితంబు
శ్రీరాచకులసుధాసింధురాకాసుశా, కాంతోపమాన వేంకటకుమార
ఆ. వె. మహీపసూర్యరాయమనుజేంద్రసద్బాహు, పాలితంబు దేవతాళినిలయ
విభవయుక్త మైన వేళంగినామక, పురము వారి జన్మభూమి యయ్యె. 20
కం. శాంతులు కవివరనుతధీ, మంతులు శ్రీరామభక్తిమంతులు విద్యా
వంతులు బ్రహ్మానంద, స్వాంతులు నాగస్త్యగోత్రసంభవు లుర్విన్. 21
ఆ. వె. వారిలోన మున్ను భగవత్సుధీచంద్రుఁ, డవతరించి కళల నంది మించె
వారిలోన మున్ను భగవంతుఁ డౌ చంద్రుఁ, డవతరించి కళల నందినట్లు. 22
కం. నరమనుజపూజ్యుఁ డాకవి, నరమను దగఁ బెండ్లియాడె సాధుచరిత్రన్
సురమనుజపూజ్యుఁ డౌ శౌ, రి రమను మును బెండ్లియాడు రీతిని వేడ్కన్. 23
ఉ. ఆనయశాలిదంపతుల కాత్మజుఁడై ప్రభవించి మించె ల
క్ష్మీనరసింహకోవిదుఁడు శ్రీపతితుల్యుఁడు నుజ్జ్వలద్దిశా
మానవతీపటాయితసుమంజులకీర్తియు రాజలోకస
న్మానితుఁ డాత్మబాంధవసమాజశిరోమణి సత్కళాఢ్యుఁడై. 24
కం. ఆమహితుభార్య యగుచుం, గామాంబ ప్రసిద్ధిఁ గాంచె ఘనతరభక్తి
ప్రేమాస్పద భూనుతసా, ధ్వీమణి నిరతాన్నదానవిఖ్యాత కడున్. 25
కం. ఆమిథునమ్మున రామ, స్వామియుఁ బట్టాభిరామశాస్త్రియు ననఁగా
ధీమణు లిరువురు పుట్టిరి, భూమిన్ విద్వజ్జనానమోదము మెఱయన్. 26
ఉ. సోదరు లిద్దఱుం బ్రథితసూరులె గాని ద్వితీయుఁ డందులో
వాదిమదేభసింహ మయి వాసిలె నిత్యము శిష్యకోటి కెం

తో దయ భోజనాదిపరితుష్టి యొనర్చుచు సర్వవిద్య ల
త్త్యాదర మొప్పఁ జెప్పె హరివంతవిశాలయశఃప్రకాశుఁడై. 27

గీ. స్తుత్యపట్టాభిరామపాండిత్య మెంత, వర్ణనముఁ జేసినను స్వభావంబె గాని
యతిశయోక్తి రవంత గా దహహ! యతని, పూర్వజన్మార్జితం బగుపుణ్యమేమొ.

గీ. అతనిగృహలక్ష్మి యై లచ్చమాంబ యొప్పె, నామెసుగుణాళి వర్ణింపవలని యగునె
అన్నదానంబునం దామె యన్నపూర్ణ, తతసతీధర్మముల నరుంధతియె యామె.

శా. భూమిం బుట్టిరి వారికిన్ సుతులు సంపూర్ణజ్ఞులై నల్వురై
రామబ్రహ్మము రామకృష్ణయయు సుబ్రాయుండుఁ బాపయ్యయున్
రామాంధుల్ మునుపుట్టినట్టులు జగత్ప్రఖ్యాతభాస్వద్యశుల్
ధీమంతుల్ బుధలోకవంద్యులుఁ గృతార్థీభూతవిద్యానిధుల్. 30

శా. ఆమాన్యోత్తములందుఁ బెద్ద యయి తా నంతర్వచశ్శ్రేష్ఠుఁడై
రామబ్రహ్మమనీషి యొప్పె సుగుణభ్రాజిష్ణుఁడై సద్యశః
స్తోముండై రఘురామమంత్రజపనిర్ధూతాఖిలాఘుండు నై
భూమానందనిధానతత్త్వకలనాపూర్ణప్రభావాఢ్యుఁడై. 31

గీ. జనకతుల్యతఁ జెందియు జనకు మించెఁ, గళలచేతను బరతత్త్వకలనచేత
బ్రహ్మవిజ్ఞానమూర్తియై ప్రబలె నవని, నతని వర్ణింప శేషుని కైనఁ దరమె.

క. రామబ్రహ్మబుధేంద్రుఁడు, ప్రేమాంచితమానసుండు పెండిలియాడెన్ ।
గామాంబను ముని శంభుఁడు, కామాంబను బెండ్లియాడుకరణిన్ ధరణిన్. 33

క. హితవృత్తి యగుచు సంతత, పతిపదపద్మార్చనమునఁ బద్మకు సరియై
అతిలోకకీర్తివైభవ, యుతయై కామాంబ దనరె నుర్విన్ మిగులన్. 34

క. ఆమిథునమ్మున రామ, స్వామిబుధేంద్రుండు పుట్టె సౌమ్యగుణుండై
భూమకళాకోవిదుఁడై, భూమిసుతానాథపాదపూజారతుఁడై. 35

సీ. శబ్దశాస్త్రాదిసచ్ఛాస్త్రంబులకునెల్ల, నేకవి నిధి యంచు నెంచఁబడెనో
సాహిత్యవిద్యారసజ్ఞత్వమునకెల్ల, నేకవి నిధి యంచు నెంచఁబడెనో
ధర్మశాస్త్రోక్తసారాంశములకెల్ల, నేకవి నిధి యంచు నెంచఁబడెనో
పౌరాణికగ్రంథభావబోధంబున, నేకవి నిధి యంచు నెంచఁబడెనో

గీ. సరససంగీతసత్కళాసారమునకు, నేకవీంద్రుండు నిధి యంచు నెంచఁబడెనో
నవరసాలంకృతం బైనకవనమునకు, నేకవీంద్రుండు నిధి యంచు నెంచఁబడెనో.

సీ. ధ్యానించిన౯ రామ। తారకమంత్రంబు, సీతావిభుఁడు చెంతఁ। జేరవలయుఁ
జెప్పిన౯ బాఠముల్। శిష్యసంఘంబులు, సుఖబోధమున లోన। సాగియవలయు
వాదించినన్ బుధ। వారణావళియెల్లఁ, బంచాస్య మంచు భా।వించవలయుఁ
బట్టిన౯ యోగంబు। పద్మాసనస్థుఁడై, కపిలుఁడే యని జనుల్। గాంచవలయు
గీ. నట్టిరామకవీశుని। యలఘుమహిమ. వర్ణనముఁ జేయ నహి బృహ।స్పతి విధాత
లైనఁ జాల రనంగ నీ।యవనియందు, నల్పమతులకు మాబోంట్ల। కలవి యగునె.

కం. లిబ్బులపడఁతిని శ్రీహరి, యుబ్బుచుఁ బెండ్లాడురీతి। నురుముదము మది౯
జొబ్బిల రామకవీశుఁడు, సుబ్బాంబను బెండ్లియాడె। సుగుణకదంబన్. 38

చ. పరమపతివ్రతాఢ్య యయి। భర్త్రనురాగనితాంతరూఢసుం
దరహృదయాబ్జ యై హరిప।దప్రథమాననిసర్గభక్తిబం
ధుర యయి యన్నదానపరి।శోషితవర్ధితదీనలోక యై
పరఁగెను సద్గుణైకవిభ।వమ్మున నెంతయు సుబ్బమాంబ తాన్. 39

మ. అనసూయాత్రులఁ బోలు సుబ్బమకు రా।మాఖ్యాకసత్సూరికిన్
వనజప్రోద్భవపద్మనాభగిరిజా।ప్రాణేశనీకాశు లై
యనసూయాదిగుణప్రకాండయుతు లై। యానందసంయుక్తు లై
జననం బందిరి ముప్వు రాత్మజులు భా।స్వత్కీర్తివిస్ఫూర్తు లై. 40

శా. రామబ్రహ్మమనీషి లక్ష్మణుఁడు సు।బ్రహ్మణ్యా మ న్పేర్లచే
భూమప్రజ్ఞులు వార లొప్పిరి కళా।పుంజీభవన్మూర్తు లై
రామస్వామిగురుప్రభూతకరుణా।ప్రాప్తప్రియంభావుక
శ్రీమత్తారకమంత్రరాజజపసం।ప్రీతాఢ్యచిత్తాబ్జు లై. 41

గీ. వారిలోపల రెండవ।వాఁడ నేను, లక్ష్మణాఖ్యుఁడ శ్రీమ ది।లాసుతేశ
తారకాహ్వాయమంత్రసం।ధానలబ్ధ, వివిధకవితావిశేష వై।భవము మెఱయ. 42

గీ. రామచంద్రవిలాస శ్రీ।రామచంద్ర, పాదుకాపాలనాదిభ।వ్యప్రబంధ
నాటకాదుల రచియించి।పాటవమున, నోజ గడియింపఁ గాంచి ము।న్నొక్కనాఁడు.

క. నరసింహాదా సనం దగు, వరమిత్రుఁడు ముక్కవిల్లి।వంశజుఁ డత్యా
దరమున ననుఁ గని సీతా, వరభక్తిం బలికె మిత్ర।భావం బలరన్. 44

ఉ. ఓకవిరాజచంద్ర! సుగుణో।త్తమ! సర్వకళావిశాల! య
స్తోకసుధీప్రభావ! పరి।తోషితశిష్యవరా! సుశాంధ్రభా

పాకవితావిశేషములఁ జక్కనికబ్బములన్ రచించి యా
యాకృతు లిందుశేఖరున కర్పణముం బొనరించి శౌనకన్. 45

మ. భవదీయప్రకటప్రబంధకవితాపాండిత్యశౌండీర్యమున్
గవితాశ్రీవరసార్వభౌములు శిరఃకంపాయితానందసం
స్తవ మొప్పార గణించిరేకద బుధేంద్రా! లక్ష్మణాఖ్యాకస
త్కవివర్యా! విను మస్మదీయము భవత్కార్యంబు నాకోరికన్. 46

మ. వనజాక్షుం డగురాముగాథ దురితధ్వాంతార్కతుల్యంబు పా
వనమున్ మోక్షద మాట సర్వజగతీప్రఖ్యాతసిద్ధాంత మో
యనఘా! త్వన్మధురోక్తిసంపదలతో నానందరామాయణం
బనుకావ్యంబును దెల్గు సేయుము రసజ్ఞానందసంధాయి వై. 47

వ. అను మిత్రవాక్యం బంగీకరించి శతకోటిరామాయణాంతర్గతంబును వాల్మీకిమహా
మునిప్రణీతంబును నగు నానందరామాయణం బాంధ్రీకరింపఁ గృతనిశ్చయుండ నై
యనూచానకవిసంప్రదాయానుసారంబుగా నిరంతరాయకావ్యపరిసమాప్తికై స్వేష్ట
దేవతామాతాపితృగురునమస్కరణపురస్సరమ్ముగా సుకవికుకవిలక్షణప్రకటనం
బొనరించి ప్రబంధోపక్రమయోగ్యం బైన యొకశుభముహూర్తంబున. 48

## షష్ఠ్యంతములు

క. శంకరునకు నిజభక్తశి, వంకరునకు నర్ధదేహభామాంకునకున్
హుంకరణమాత్ర హతమక, రాంకునకును విమలశారదాంబుదరుచికిన్. 49

క. హరునకు నాశ్రితభవభయ, హరునకుఁ ద్రిపురాసురాళిహరునకు స్మరసం
హరునకు దక్షదురధ్వర, హరునకుఁ బరునకును రాజతాద్రిచరునకున్. 50

క. మారమణీపతిహితున కు,మారమణీపతికి నటనమంజులగతికిన్
వారితదనుజోద్ధతికిని, తారకమంత్రైకమననతత్పరమతికిన్. 51

క. కుంజరరూపనిశాచర, భంజనభయకృత్త్రిశూలపాణికి యోగీ
ట్పుంజవినిర్మలమానస, కంజాతార్కునకు భక్తగణసేవ్యునకున్. 52

క. రంగదభంగజటాంతర, సంగతచంగత్తరంగసంఘాతలస
ద్గంగోత్తమాంగునకును ని, షంగీకృతవారినిధికి సద్గుణనిధికిన్. 53

క. మంగళసంధాయికి వే, ళంగిపురీశునకు భూతిలలితాంగునకున్
అంగీకృతవృషభాధ్యతు, రంగునకు భవానిశంకరస్వామి కిలన్. 54

న. సమర్పితమ్ముగా నాయొనర్పంబూనిన యాంధ్రానందరామాయణమ్మునకుఁ గథాక్రమం బెట్టి దనిన.

## కథాప్రారంభము

ఉ. భూమిజ వామమం దనిలపుత్రుఁడు ముందును వెన్క లక్ష్మణ
స్వామియు శత్రుజిద్భరతసంజ్ఞులు ప్రక్కలఁ గోణసీమలన్
ప్రేముడి వానరేశ్వరవిభీషణజాంబవదంగదు ల్దగన్
శ్యామలవర్ణుఁడై నడుమఁ జక్కఁగ నొప్పినరాముఁ గొల్చెదన్. 56

ఉ. రావణుఁ గూల్చి తీర్థనికరమ్ములఁ గ్రుంకి దశాశ్వమేధసం
భావితుఁడై విలాసి యయి ప్రాప్తసతీసుతుఁడై స్వపార్థమై
తా వసుధం జరించి విధితంబుగ రాజ్యము నిర్వహించి పూ
జావిధిఁ దెల్పి స్వీయపదసంస్థితుఁ డౌ రఘురాముఁ గొల్చెదన్. 57

మ. ఒకనాఁ డద్రిజ వెండికొండపయి సొంపొప్పారఁగాఁ బ్రాణనా
థుకడన్ జేరి నమస్కరించుచును సంతుష్టాంతరంగమ్ముతో
నకలంకస్థితి ముక్తిదాయకసమగ్రానందరామాయణ
స్థకథాకర్ణనవాంఛ నిట్లనియె విశ్వక్షేమసంధాత్రియై. 58

మ. పరమేశా! శ్రవణోత్సవంబు మెఱయన్ బౌరాణికగ్రంథస
చ్చరితల్ చాలఁగఁ జెప్పియుంటి విఁక శస్తంబున్ శుభం బైన శ్రీ
ధరణీజాధిపజన్మకర్మవిలసద్గాథల్ వినం గోరెదన్
పరమానందకరమ్ముగా నిపుడు దేవా! చెప్పు మయ్యా! కృపన్. 59

చ. అన విని శంభుఁ డిట్లనియె నగ్గిరికన్యకఁ జూచి ప్రేముడిన్
మనమున సంతసించితిఁ జుమా భవదీయకుతూహలంబు పా
వనము శుభప్రదంబు భవబంధవిమోచనసూచకంబు నా
విను మిఁక రాఘవేశ్వరునివిశ్రుతగాథ వచింతు నింతిరో! 60

వ. ఓ దాక్షాయణీ! రామకథావిశేషంబుఁ బూర్వాన్వయక్రమమ్మున నుడివెద వినుము. నాచే నుడువంబడు పుడమిఱేండ్లు వరుసగా నొకని కొకఁడు కొమరుం డని తెలియుము. ఆదినారాయణుండును జతుర్ముఖుండును మరీచియుఁ గశ్యపుండును సూర్యుండును వైవస్వతమనునాముం డగుయముండును నిక్ష్వాకుండును శశాదనాముం డగు వికుక్షియుఁ బురంజయేంద్రవాహనాముం డగుకకుత్స్థుండును ననేనసుండును విశ్వ

రంధియుఁ జంద్రుండును యువనాశ్వుండును శాబస్తుండును బృహదశ్వుండును గువల యాశ్వుండును దృఢాశ్వుండును హర్యశ్వుండును నికుంభుండును బర్హణాశ్వుండును గృతాశ్వుండును శ్యేనజిత్తును యువనాశ్వుఁడును త్రసద్దస్యునాముండగు మాంధా తయుఁ బురుకుత్సుండును త్రసద్దస్యుండును ననరణ్యుండును హర్యశ్వుండును నరు ణుండును త్రిబంధనుండును సత్యవ్రతనాముండగు త్రిశంకుండును హరిశ్చంద్రుండును రోహితుండును హరితుండును చంపుండును సుదేవుండును విజయుండును భరుకుం డును వృకుండును బాహుకుండును సగరుండును నసమంజసుండును నంశుమంతుండును దిలీపుండును భగీరథుండును శ్రుతుండును నాభుండును సింధుద్వీపుండును నయుతా యువును ఋతుపర్ణుండును మిత్రసహాకల్మాషపాదనాముఁడగు సుదాసుండును నశ్మ కుండును నారీకవచనామకుండగు మూలకుండును దశరథుండును నైడవిడుండును విశ్వసహుండును ఖట్వాంగుండును దీర్ఘబాహునాముండగు దిలీపుండును రఘువును నజుండును దశరథుండును నను రాజచంద్రు లేతద్వంశసంభూతులై రందుఁ గడపటి వాఁడగు దశరథునిపుత్రుఁడే సుమా రామచంద్రమూర్తి యని మఱియు నిట్లనియె.

చ. అరువదియొక్కఁ జేండ్లు యుదరయం బిటు లయ్యెను మున్ను భావిలో నరువదియొక్కమంది మహిరతాత్ములు పుట్టఁగలారు మధ్యమం బిరవుగ రామచంద్రుఁ డుదరయించె మునీంద్రులు ప్రస్తుతింపఁ ద త్పరమయశోనిధానరవద్యచరిత్రము నీకుఁ జెప్పెదన్. 62

ఉ. శ్రీతరుణీనివాససరసీరుహమట్లు నితాంతభాసురం బై తపనీయసౌధనికరాన్వితమై సరయూతటమ్మునం దాతతవైభవమ్మున సురాధిపపట్టణతుల్యమైన సా కేతపురంబు భాసిలు సికేతనకేతనజాత మొప్పఁగన్. 63

ఉ. ఆపురవాసియై దశరథాహ్వయభూపతి మించె జాంబవ ద్వీపము నిస్సపత్నసముదీర్ణబలంబున నేలుచుండ నమ ద్భూపుఁడు ధర్మవర్తితుఁడు భూతలవాసవుఁడై జగత్త్రియీ వ్యాపృతవిక్రమక్రమసమార్జితదివ్యయశోవిశాలుఁడై. 64

గీ. ఆపురాభ్యాశమునఁ గోసలాఖ్యదేశ, మమరు నచ్చటఁ గోసలుం డనెడిఱేఁడు పుణ్యాత్ముఁ డుండె నతనికి ముద్దుపట్టి, కలదు కౌసల్య యనుపేరు గలగుణాఢ్య.

ఉ. ఆపెను దండ్రి యాదశరథావనిభర్త కొసంగ సుస్థిర వ్యాపృతనిశ్చయుం డయి ధరామరసమ్మతి లగ్ననిశ్చయం

వాసిదనర్గ నసం బెలువ ర నర్తకులు నుత్తము లైనదూతలన్
శ్రీవరివ్రాస్తలం బనిచె ర నిస్తులనై భవ మా నయోధ్యకున్. 66

ఉ. అంత నయోధ్యలో దశరథక్షితిపుం డొడయంగ నమిత్రుండై
ప్రాంతనిగూఢమంద్రికృతర వర్ణనముల్ జెలువొంద బోగపుం
గాంతలనాట్యశోభ చెలఁగర గ సరయూజలసీమ రాత్రి న
త్యంతముదమ్మునం జలవిర హారము జేయుచు నుండె హాయిగా. 67

వ. సరిగ నక్కాలమ్మున లంకాధీశ్వరుం డగురావణుండు బ్రహ్మకడ కేగి నమస్కరించి యోకమలాసనా! దేవదానవాదిమహాయోధులకైన నవధ్యుండ నగు నాకు మరణం బెట్లు నిర్ణయించితివో చెప్పు మనిన విని చతురభాషణుం డగుచతురాననుం డిట్లనియె. 68

సీ. పావనతర మైన ర భాస్కరాన్వయమున, దశరథావనిభర్త ర దనరుచుండె
నతనికిం గోసలర క్షితినాథపుత్రిక, కౌసల్య భార్య కాంగ గలదు జుమ్మ
ఆమెకునమ్మున ర నబ్జనాభుండు శౌరి, పుత్రుండై జన్మించి ర భూరిమహిమ
నీలంక వడిం జేరి ర నిన్నని మడియించు, నిట్లు నీమృతి విధిర యింపంబడియె

గీ. నేఁటి కిరువదినమున ర నేలవేళ్ళు, లరసి మూర్తంబుఁ బల్కెడి ర వారలి కొస
గార్ధ్యుడను బంర్ష్మ మూడు సత్యము నచింతు. రక్కసులకేఁడ! నేను మాసద్గ్రహములారా.

వ. అను పలుపల్కుల కులికిపడి రావణుండు ససంభ్రమమ్మున నాత్మపురమ్మున కేతెంచి రాఁబోవు ననర్థమ్మునకు మున్నె ప్రతిక్రియ నొనర్చుట యుక్తం బను న్యాయం బాలోచించి కౌసల్యను దశరథుండు పెండ్లియాడినం గదా వెన్నుండు నన్నుం జంప నవతరించు, దశరథుం జంపి కౌసల్య నపహరించి వివాహభంగం బొనర్చితినేని యనర్థంబు దప్పు నని నిశ్చయించి ససైన్యుండై పుష్పకం బెక్కి సరయూనది నోడపై నున్నదశరథు నెదిరించి, 70

సీ. శంఖభేరీధ్వనుల్ ర చదల లంటి మ్రోయ, భటసింహనాదముల్ ర ప్రబలుచుండ
శస్త్రశస్త్రాస్త్రసంర సక్తహస్తప్రహస్త, నికుంభకుంభాదిర సైనికులును
వెంట రా గశరథోర్వీనాథుసైన్యముఁ, గడతేర్చి నదిలోనఁ ర గలిపినైచి
జేఁడు ప్రస్గడ యున్న ర యోడ నింతింతలు, ముక్కలై నదిలోన ర మునుఁగఁ దన్నె

గీ. అరిగె నంతట దశరథుం ర డతనిమంత్రి, దైవశక్తిచే నుండుటచే ర దాపుఖండ
మూతఁ గొని గంగ దాఁటుచు ర నుదధి నొక్క, దీవిదరిఁ జేరి బ్రదికిరి ర దైవకృపను.

గీ. రక్కసులతేఁడు జయజయరావ మెసఁగఁ, బుష్పకం బెక్కి కోసలపురికి వచ్చి
కోసలు జయించి కౌసల్యఁ గొనుచు మిగుల, పొంకమున నేగె మది పాపశంక లేక.

వ. ఇట్లాకాశమార్గమ్మునఁ గౌసల్యఁ గొని యేగుచు సముద్రమధ్యమునఁ జెరలాడు నొకతిమింగిలమ్మును గని యికౌసల్యను లంక నుంచితినేని నాశత్రువు లగునిర్జరులు గూఢముగా వచ్చి కొంపోవుదురు గాన నీతిమింగిలముచెంత నీమెను దాచి యుంచుట మంచి దని యెంచి యొకపెట్టెయం దాకౌసల్యం బెట్టి యాపెట్టె నాతిమింగిలమునకు న్యాసంబుగా నిచ్చి యారావణుండు లంకాపురిం జేరె. 73

ఉ. అంతఁ దిమింగిలంబు దనయాస్యగుహాస్థలిఁ బెట్టె నుంచి య
త్యంతము వార్ధిసంచరణతత్పరతన్ బరువెత్తి యొక్కెడం
బంతము మీఱ దాయ పగఁగనంజరముం గని చంప నెంచి యా
స్వాంతరపేటికన్ దటముననం దొకచో నిడి పోయె లోనికిన్. 74

## —* కౌసల్యాదశరథవివాహము *—

సీ. అంత నాజియు మంత్రి యచ్చోటికే వచ్చి, విస్మయం బమర నాపెట్టెఁ జూచి
కప్పువిచ్చి యం దున్నకౌసల్యఁ గనుఁగొని, యిదియు రావణకృత్యమే యటంచుఁ
దలఁచి యప్పుడు ముహూర్తం బౌట నారాజు, పెండ్లాడె గాంధర్వవిధిని నామెఁ
జూతము రానున్న దోద్యంబు లని ముప్పు, రప్పెట్టెలోఁ జేరి యపుడె దాని

గీ. మూత బిగియించి రమ్మత్స్యమును వినోధి, విజయ మూర్జించి వచ్చి యాపెట్టె మరల
నోట నిడుకొని పోయి మన్నీటిలోన, సంచరించుచు నుండె స్వేచ్ఛాప్రవృత్తి. 75

వ. ఓ పార్వతీ! విధివిహితకార్యము లెన్నియంతరాయము లొదవినను గాకుండునే?
వినుము. 76

ఉ. పందిరి తోరణాళి ద్విజబంధుపురోహితమిత్రవర్గముల్
విందులు పాలకీల్ కవులు వేశ్యలు మంగళఘోషణంబు లిం
పొందెడి భక్ష్యభోజ్యతతు లొక్కటిసైతము లేకయుండినన్
సుందరి! వారిపెండ్లి విధిచోదిత మూట పొసంగె నవ్విధిన్. 77

ఉ. రావణుఁ డంత లంకకును బ్రహ్మను బిల్చి సభన్ వసించి వ
హ్వా! విధి! నీదుపల్కులు యథార్థము లౌనఁట గాదె నేఁటికిన్
నీవచనం బసత్యముగ నే నొనరించితిఁ జూడు మయ్య! సం
భావిత మైనబుద్ధిబలపాటవ మున్న నసాధ్య మే మగున్? 78

ఉ. ఆజికి కోసలేంద్రసుత యాలి యగుం జుమి యంచు మున్ను నా
కో జతనమ్ముగా భయము దోఁపఁగఁ బల్కితి కాని యిప్పు డా
యాజిఁ జంపి కోసలనృపాత్మజ నొక్కెడ దాచినాఁడ నా
కే జయ మయ్యె వెన్నుఁ డిఁక నెట్టులు పుట్టునో యెట్లు చంపునో! 79

వ. అన విని చతురాననుండు "దంపత్యోః పుణ్యాహ" మ్మని యాశీర్వచనంబుఁ బలికిన
నచ్చెరువుం దొందరపాటుఁ దోఁప దశాననుండు డగ్గుత్తికతో నేమంటి వేమియయ్యెఁ
జెల్పు మనిన నజుం డి ట్లనియె. 80

గీ. నాఁడు నీతోడ నుడివిననాఁడె పెండ్లి, యయ్యె నిఁక సందియం బేటికయ్య! వినుము
దైవకృత్యంబుఁ దప్పింపఁ దరము గాదు, నమ్ము గర్వమ్ము మాని రేద్రిమ్మరీఁడ!

వ. అనిన రావణుఁ డావిధివాక్య మసత్య మని నిరూపింపఁ దలఁచి దూతలచేఁ దిమింగి
లముకడ నున్న పేటికఁ దెప్పించి పరమేష్ఠిసమక్షంబునఁ బైకప్పు విప్పించి యందున్న
కౌసల్యాదశరథసుమంత్రులం జూచి డెందమ్మున నాశ్చర్యభయక్రోధసంభ్రమా
వేశంబు నొంది యాముగ్గురం జంప నెంచి యొర నున్న చంద్రహాసంబు దూసిపట్టిన
నాతని వారించి విరించి యి ట్లనియె. 82

శా. ఆహా! సాహస మేల? మీ తెఱుఁగ వారా! రావణా! మున్ను దు
ష్టాహంకారతఁ గోసలాత్మజను గాదా దాచినా విప్పు డు
త్సాహం బొప్పఁగ ముగ్గు రై రిటువయిన్ జన్మింపఁడే రాముఁ డు
ద్బాహుం డై శతకోటిసైన్యయుతుఁ డై త్వత్ప్రాణసంహారి యై. 83

కం. కావున సాహస మేలా, కావర మిది యేల? దీర్ఘకాలము జగతిం
జీవింపఁగలుగువారల, రావణ! చంపంగ నీతరంబే తలఁపన్? 84

కం. కాఁగలది కాక మానదు, వేగముగా నేఁగి నిపుడె వినయము మీఱన్
సాగఁగ నంపు మయోధ్యకు, నేగొడవలఁ బోక సుఖము లెల్లం గొనుమీ. 85

ఉ. ఆవిధివాక్యమే నిజ మటంచుఁ దలంచి భయంబు మీఱఁగా
రావణుఁ డంత పేటికఁ ద్వరన్ నిజదూతలచేత నుంచి యా
భూవరు స్వస్థలిన్ విడిచి పుచ్చఁగఁ బంచి వసించె లంకలో
భావివిపద్భరానుభవబంధుర మై హృదయంబు గ్రాగ్రపడన్. 86

సీ. అంత నక్కడ నయోధ్యాపురంబున రాజు, రాకఁ గన్గొని ప్రజల్ ప్రమద మంది
ఘనవాద్యముల నెదురేఁగి యుత్సవము మీఱి, రాజును దనమందిరమ్ముఁ జేరి

సుఖముగా నుండె నీ **ర** శుభవార్త విని కోస,లాధీశుఁ డంతట **ర** నతిముదమున
దశరథు రప్పించి **ర** తనపుత్రిక నొసంగి, పెండిలిఁ గావించి **ర** వేడ్కమీఱ
గీ. నల్లునకు నాత్మజాతకు **ర** నరణముగను, దనదుకోసలదేశమం**ర**తయు నొసంగె
నాటినుతఁ గోసలేంద్రులు **ర** నాగఁ దనరి, రర్కవంశజు లైనధ**ర**రాధిపతులు. 87

వ. అంత దశరథుండు మగధరాజపుత్రిక యగుసుమిత్రను కేకయరాజతనయ యగు కైకేయిని విధ్యుక్తముగాఁ బరిణయమాడి పిదప సప్తశతసంఖ్యాక లగుభార్యల నచ్చటచ్చట సంగ్రహించె. వారిలోఁ గౌసల్యాసుమిత్రాకైకేయిలుమాత్ర మాభిజాత్యాధికసౌందర్యయౌవనాదిసంపదభిరామ లై దేవేరు లైరి. తక్కంగలవారు భోగిను లై రిట్లు దశరథుఁ డాయువతులతో బహువిధభోగమ్ము లనుభవించుచు భూలోకదేవేంద్రుఁడై దానాదిసద్గుణనిధియై చిరకాలము పరమసౌఖ్యము లందుచు రాజ్యంబుఁ జేయుచుండెఁ గాని యొక్కముదితయందైనను బుత్రసంతతి లేకుండుటం జేసి యాతం డసంపూర్ణమనోరథుం డయ్యె నని శివుండు వెండియు నిట్లనియె. 88

## —* దశరథుఁడు కైకేయికి వరములిచ్చుట *—

ఉ. అంతట దేవదానవు ల**ర**హంకృతి మీఱఁగ రాజ్యలోభు లై
వింతగఁ బోరుచుండ విను**ర**విధి "నజాత్మజుఁ డేడ నుండు నా
చెంత జయం" బఁటం జొకవి**ర**చిత్రరసంబు జనించె వాయు న
త్యంతరయమ్మునం జని య**ర**జాత్మజుఁ బిల్చె మహేంద్రుపంపునన్. 89
గీ. ఆలి కైకేయి వెంటరా **ర** నజసుతుండు, సాహసము మీఱ నిర్జర**ర**సార్వభౌము
నాజ్ఞతలఁదాల్చి వెడలి యత్యద్భుతముగ, దనుజబలములఁ దా**ర**కెఁ దుర్ధర్షుఁ డపుడు.
ఉ. పోరితమందు నొక్కయెడ **ర** భూపరథాక్షము భగ్నమయ్యె, దు
ర్వారరణప్రసక్తుఁ డగు **ర** రా జది చూడకయుండఁ గైక యా
తేరున నక్షమట్లు కడు**ర**దెంపున వామకరం బమర్చె నా
భూరమణుండు నిర్జరవి**ర**భుం దనియించె జయంబుఁ గాంచుచున్. 91

వ. అనినఁ బార్వతి పరమేశ్వరుం జూచి ప్రాణేశ్వరా! కోమలాంగి యగు నాకైకేయి యతివీరంబగు నప్పని నెట్లాచరింపఁగలిగె ననఁ బరమేశ్వరుం డిట్లనియె. 92

సీ. ఒకనాఁడు కైకేయి **ర** యుపవనాంతరమునఁ, జెలులతో విహరించి **ర** చెలఁగి యచట
ఘనతపోనిష్ఠితు **ర** ముని నొక్కనిం గాంచి, బాల్యచాపల్యంబు **ర** బరఁగ నతని

వదన మెల్లెడ మహీపంకంబు పుద్దిన, దెలిసి యాతఁడు కనుల్ దెఱచి చూచి
"సుందరీ! నీమోము ముందుగా నెవ్వరు, నుదయమ్మునం జూడకుంద్రుగాక"
సీ. యనుచు శపియించి యామున్యన్యవనముఁ, జేరఁ బయనించుచుండఁగాఁ జిత్తమందు
భయముఁ జెందుచుఁ గైకేయి భక్తితోడ, మునిసమీపమ్మునకుఁ జేరి వినయ మమర.
సీ. తనదు డాకేల నాతని దండమును గ, మండలువుఁ గొని యమ్మునిమాన్య హస్త
ములకు నందిచ్చి వందనంబుల నొనర్ప, నందులకు సంతసిల్లి యిట్లనియెఁ దపసి.
సీ. బాల! నీదగు డాకేలు వజ్రలీలఁ, గఠినతర మౌచు నెద్దానఁ గాని నాశ
మంద దీశాపమును వినుమంటకుండు, ననుచుఁ గరుణించి చనియె నమ్ముని యథేచ్ఛ.
సీ. కావఁ గైకేయికిని వామకరము నప్పుడు, ఇరుసుగా నుండుటకు శక్తి యిట్లు కలిగె
కాని యిది కోమలాంగుల కగాదు కఠిన, దేహులకుమాత్ర మొనరింపఁ దీయనొక్కొ!
వ. విను మమ్మహారణమ్మునందు దశరథుండు కైకేయి యొనర్చిన మహోపకారమ్ము
నకు డెందమం దానంద మంది యిట్లనియె. 97
కం. ప్రాణముఁ గాపాడితి వో, ప్రాణేశ్వరి! బ్రదికినాఁడ రక్కసిగమితో
నే నున్నతఱి రథంబును, హానిం జెందంగనీక యాగితి వహహా! 98
ఉ. కాన భవత్కృతం బయిన కార్యముచేఁ గడు సంతసించితిన్
మానుగ రెండుకోర్కు లిడ మానసమందుఁ దలంచియుంటి నో
మానవతీలలామ! యనుమానము మానుచుఁ గోరుమా యనం
గా నయమారఁ గైకయును గాంతునిఁ జూచి వచించెఁ బ్రేముడిన్. 99
గీ. ప్రాణనాయక! యవసరమైనయప్పుడు, కోరెదనుగాక వరములఁ గోర నిపుడు
కాన మీచెంతనే న్యాసగతిని దాచి, యడిగినప్పుడె యిమ్ము ధర్మాత్మ! యనిన.
వ. దశరథుండును సమ్మతించి కైకను వెంటఁగొని సపరివారుండై యయోధ్యాపురమ్ముఁ
జేరి సుఖం బుండె, నిట్లు కొంతకాలంబు జనిన వెనుక నొక్కనాఁ డాదశరథుండు.

## —* దశరథుఁడు మునికుమారునిఁ గూల్చుట *—

ఉ. అద్దమరేయివేళ మృగయాస్పృహ మీఱఁగ శబ్దవేధి యన్
విద్దెఁ బరీక్ష సేయఁ దగు వేషముతో సరయూతటాటవిం
దద్దయు వేడ్కఁ జేరి యటఁ దార్కొను క్రూరమృగమ్ముల న్వడిన్
హద్దులు దాఁటనీక ప్రదరాగ్నికి నాహుతిఁ జేయుచుండఁగా. 102

సీ. ఆయరణ్యమునఁ బుట్టంధులౌ తనతల్లి, దండ్రుల శ్రవణాభిధానవైశ్య
మునికుమారుఁడు ప్రేముడినిఁ గావడి నమర్చి, కాశికాపురి కేగు కౌతుకమునఁ
పవలుఁ బోయిన ఘర్మబాధయా నని రేయిఁ, గావడి మోయుచుఁ బోవుచుండ
దారిలో వార లా తనయునిఁ గని మమ్ముఁ, బీడించుచుండె దప్పిక కుమార
ఆ. వె. ఇపుడు నీరు దెచ్చి యిచ్చిననేగాని, బ్రదుకఁజాల మధిక బాధ యయ్యె
ననిన సుతుఁడు వారి నచట నొక్కెడ నిల్పి, కుండఁగొనుచు నీటికొఱకుఁ జనియె.
మ. సరయూనిర్ఝరమందు నాతఁడు మహోత్సాహంబుతోఁ గుండ న
ద్దఱి ముంపంగ వినంబడెం బుడబుడధ్వానంబు— తచ్ఛబ్దముల్
ఖరబాణాంచితచాపుఁడై నృపతి యాకర్ణించుచున్ భ్రాంతిమై
కరి యంచున్ దలపోసి కర్మగతి తత్కాండం బొగిన్ బ్రేసినన్. 104
తే. నీరు ముంచెడి వైశ్యకుమారు వక్ష, మందు నమ్ములికి నాటిన యంత నతఁడు
శివశివా! యని దరిని మూర్ఛిల్లిపడియె, నపగతప్రాణుఁడును గాక యార్తి జెందె.
క. అటు నిటుఁ బొరలుచు వక్షస్తటసంగతపటునిశాతశరాంబక దు
ర్ఘటబాధాయుతుఁడై యుత్కటబహునిశ్వాసవాతకంపితుఁ డగుచున్. 106
వ. కొంతవడికిఁ దెలిసి గద్గదకంఠరవుండై యి ట్లనియె. 107
తే. ఎవ్వఁడో పాపి నన్ను నిర్హేతుకముగ, నిరపరాధిని యంధులౌ గురుల నీరు
వట్టునకు భక్తిమై నీరు వట్టుచుండఁ, జావ నేసెను దీనరక్షక! మహేశ! 108
మ. అకటా! యంధులు తల్లిదండ్రు లట తృష్ణాయత్తు లైనారు వా
రికి వారిం గొని యీయనైతి నిఁక వారిం జూచువా రెవ్వరో?
వికలం బయ్యెఁ బితౄణముక్తి తపము న్విచ్ఛిన్నమైపోయె మా
మకవార్త న్విని గుండె జల్లుమన నెమ్మాడ్కిన్ విచారింతురో? 109
తే. ఏనె కనుదోయిగా వార లింతకాల, మశ్రమమ్మునఁ గడపినా రక్కటకట!
యెంతపాపినో! వార లున్నంతవఱకు, నంఘ్రిసేవ నొనర్చుభాగ్యంబు దప్పె. 110
మ. పరమేశా! యొరు వేడఁగాఁ జనను నే బాధింప నేప్రాణి నె
వ్వరితోఁ డం బరుషంబులాడఁ దపముం బ్రహ్మావలోకంబు సు
స్థిరభక్తిన్ బితృసేవనంబు సుకృతశ్రీకాముఁడై చేయు నా
కరయన్ శస్త్రముచేతఁ జావు మని వ్రాయన్ జెల్లునే నీకిటుల్. 111
కం. కొడుకా! కొడుకా! యనుచు, న్నిడుకుచుఁ దలిదండ్రు లేడ్వ మిడుకకుఁ డని యే
కొడు కికఁ నోదార్చు నొకో!, కడసారి జోహారు కైనఁ గఱ వయ్యెఁ గటా!

కం. మునిసుతుఁడఁట మునివరుఁ, డఁట ఘనపితృసేవకుఁడు నంట కానని వారా
జననీజనకుల వడవే,ర్పసు జనువానికఁట శస్త్రవధ యఁట బళిరే! 113

కం. నాకుం జా వని యేడ్వను, చీకులు వృద్ధులగు గురులు చిత్తం బెరియం
జీకాకుఁ జెంది యీపై, నేకరణిఁ జరింతు రంచు నేడ్చెద నకటా! 114

వ. అను నార్తరవంబు దశరథుఁ డాలించి యయ్యయ్యో? ప్రమాదము సంభవించె నని భయభ్రాంతుండై యటఁ బడియున్న మునికుమారుం జూచి దుఃఖితుండై మునికుమారా! నే రవివంశజుఁడ దశరథాహ్వయుఁడ నజ్ఞానమ్మున గజభ్రాంతిచే నిన్నుఁ గొట్టితిఁ దప్పుచేసితి క్షమింపు మన నావైశ్యమునికుమారుం డి ట్లనియె. 115

తే. ఇనకులేశ్వర! నీదు తప్పేమి కలదు?, నీవలన నాకు నిచ్చటఁ జావవలసి
యుండ నదియేల తప్పు విధివ్యక్తమగుట, జన్మ మొందిన నెప్పుడైనఁ జావు ధ్రువము.

ఉ. కాన భవత్ప్రయుక్తఖరకాండము వక్షము నాటెఁ గాని నా
ప్రాణముఁ దీయకున్న దిఁక బాధ భరింపఁగ లేను రాఘవా!
దీనినిఁ దీసివేయు మిఁక దేవపురమ్మున కేగువాఁడ నో
మానవనాథ! యంధులు జనకమా తలిదండ్రులు వారిఁ జూడుమా. 117

కం. వడవాతఁ బడినవారికి, జడముం గొన వచ్చి యిచటఁ జచ్చితి నీచేఁ
గడవ నుదకంబుఁ గొని చని, వడఁ దీర్చి మదీయగురుల బ్రదికింపు నృపా! 118

ఉ. కాని భవత్కృతం బయిన కర్జము మున్నుగఁ జెప్పఁబోకుమా
కాననవృక్షమూలమునఁ గావడి నుండిరి వారి దప్పికన్
బో నటుచేసి యోపిదపఁ బుత్రుఁడు మిమ్ముల వీడి యిప్పుడే
ప్రాణములం ద్యజించె నని పార్థివముఖ్య! వచింపుమా దయన్. 119

వ. అనిన విని దశరథుం డయ్యయ్యో! యెంతటి పాపినైతి మీపుత్రుం జంపితి నని యీతని తలిదండ్రుల కీదుర్వార్త నెట్లు నుడువుదు దైవమా! దుర్వ్యసనాసక్తులకుఁ జేపురాని దారుణంబు లుండునే? యని విలపించి మునికుమారుని వక్షమ్మున నున్న బాణంబు నూడఁదీసినఁ దత్క్షణంబు మునికుమారుండును, 120

తే. దైవతములార! నాతలిదండ్రులార!, యిదె నమస్కార మనుమతి నిడుఁడు మిమ్ము
వీడి చనుచుంటిఁ దెలిగంటి నేటి కిప్పు డ,టంచుఁ బ్రాణంబు విడనాడె నాక్షణంబ.

వ. దశరథుండు నమ్మునికుమారు మరణంబుఁ జూచి యెంతయో చింతించి నీటికడవ గైకొని యడుగులు తడఁబడ నడచుచు నెట్టకేలకు న్ముదుసలులు నుడువక యెక్కడ

బడుగులై వడఁగొని పడియున్న చీకులగు నమ్ముదుసలిదంపతులకడ కేగుచున్నతఁటి నాతని యడుగుచప్పుడు లాలించి కొడుకని యెంచి యాదంపతులును, 122

కం. కొడుకా! యియ్యది యేమొకొ, వడఁగొని నే మిచట నవయ వాహినిలోనం
బడి యీఁదులాడుచుంటివొ, తడ విటు చేయంగ నీకుఁ దగునా? తండ్రీ! 123

తే. నిన్ను నేత్రమ్ముగా నమ్మియున్న మాకు, సేవఁ జేయుటలో నిట్లు చేయ వెపుడు
కంఠనాళము లెండెనో కన్నతండ్రి!, తెమ్ము నీ తెచ్చు జలము మాకిమ్ము పుత్ర!

వ. అనిన దశరథుండును బ్రతివచనరహితుండై జలకుండిక వారల కందిచ్చిన నతిసంభ్రమమ్మున నందికొని యందున్న జలంబులు తృష దీరునటులు గ్రోలి వడఁదీరి కొడుకు మారు వల్కఁ డల్కఁ జెందెనో యని యెంచి యతనిదిక్కు మొగంబై యాదంపతులి ట్లనిరి. 125

చ. వడఁగొని డస్సి యుంట నిటు వల్కితి మయ్యయొ! యింతమాత్రకే
కొడుక! క్రుధం గొనం దగునె? కూరిమి మాటల నాడవేల? నీ
యెడఁద సహింపు మన్న! యిటు లెన్నఁడు నేమనమన్న తండ్రి! యీ
బడుగులమైన మాకు నిఁకఁ బ్రాపగువాఁ డొకఁడేనిఁ గల్గునో! 126

తే. ఆలసించితి వని యిటులాడు టొకఁడె, కాని కోపమ్ముచేఁ గాదు కాన నిపుడె
రమ్ము మాటాడి కౌఁగిలి యిమ్ము తండ్రి!, యీవుపేక్షించు నెడల మాకేది దిక్కు?

వ. అంత దశరథుండు భయప్రచలితాంగుండై కర్తవ్యతాలోచనుండై సాంబుచలత్పక్ష్మలోచనుండై నుడువులు దడబడ నయ్యయో! యీతాపసులు తమ పాపఁ డని యెంచి మాటలాడుచున్నవారు వీరి కేమొగంబుఁ బెట్టుకొని మీపాపని రూపు మాపిన పాపి నని చెప్పఁగలవాఁడ? దైవమా! పాపరాని పాపంబు దాపురించె నేమిసేయుదు నని యెంచి వారికి నమస్కరించి గద్గదాల్పకంఠుండై యి ట్లనియె.

ఉ. ఓమహనీయులార! భవదుత్తమపుత్రునిఁ జంపినట్టి యు
ద్దామదురంతపాతకుఁడఁ దావకపుత్రుఁడఁ గాను కోసల
క్ష్మామహిళాధిరాడజకుమారుఁడఁ బంక్తిరథాహ్వయుండ మీ
ప్రేమ నిరాశ్రయంబు నొనరించితి నజ్ఞతఁ దప్పు సైపుఁడీ. 129

తే. గజపరిభ్రాంతిఁ గోలచే గాడ నేయ, సొమ్మసిల్లి యోతండ్రి! యోయమ్మ! యనుచు
మిమ్ముఁ బిలుచుచు విడచెఁ బ్రాణమ్ము లకట!, చెప్ప వచ్చితి మీకొడ సిగ్గులేక.

వ. అనిన నాదంపతులు కర్ణకఠోరవజ్రపాతసదృశంబైన నృపవచనంబు విని నంత బుత్రమరణశ్రవణదురంతదుఃఖపరవశులై పరశుఖరధారానిర్మూలితంబులై కూలు భూజం

బుల నోజం బుడమిం బడి మృతప్రాయులై కొంతవడికి లేచి హా! పుత్రరత్నమా! యని యడలుచుఁ గన్నుగవనుండి నీరోడ్డె పాఱ నాహా! యని యేడ్చి యేడ్చి యోదశరథా! యెంతపని చేసితివి? మా ఱెక్కలు విఱిచితివి మా కొమరునిఁ జంపిన కోలచే మమ్ముఁగూడఁ గూలనేసి మాకు దుఃఖవిముక్తిఁ జేసి పున్నెంబుఁ గట్టికొనుము. మాపుత్రుఁడు పడియున్న తావునకు మమ్ముఁ గొంపొమ్మన నప్పుడమి ఱేఁడు కావడి నంసమ్మున వహించి యాదంపతులఁ దత్సుతసమీపంబు జేర్చిన వారడలుచు దమకరమ్ములచేఁ బుత్రదేహ మంటుచు నాయొడలిపైఁ జచ్చిన విధమ్మునఁ బడి కొంతవడికి లేచి పుత్రు నుద్దేశించి యి ట్లనిరి. 131

ఉ. మమ్ముల వీడిపోకు సుకుమారకుమారక! మమ్ముఁగూడ నీ
వెమ్మహి కేగెదో యట కిదే కొని పొమ్మిఁక లెమ్ము లెమ్ము మీ
యమ్మను గన్ను సొమ్మసిలి యార్తినిఁ గుండెదు సేగి మాన్పఁగా
ర మ్మిటు లేద్వఁగాఁ గనికరమ్ము వహింప వదేల పుత్రకా! 132

తే. మాకు నీచేయు సేవలు మఱపురావు, నీదు శాంతియు ధర్మవినీతబుద్ధి
తపముఁ బితృసేవ యోర్పు వ్యర్థంబు లగుచుఁ, గడకు నిన్నిటుచేసెనా? కన్నతండ్రి!

తే. పిలువఁగనె వచ్చి వందనమ్ముల నొనర్చి, యేమిపని యంచు సేవల నెల్లఁ జేసి
మమ్ము సుఖవంతులుగ జేయు మాన్యచరిత!, వందనం బిడ రావేమి? పలుక వేమి?

తే. మాకుఁ దుదికర్మ మకట! కుమార! నీవు, చేయు దని డెందమందు నాసించియుండ
హార, హారా! మేమె నీకుఁ జేయుంగవలసె, నధికపాపుల మగుట నాహహా! కుమార!

వ. అని పలవించి పలవించి దశరథుని దిక్కు మొగంబై సక్రోధులై యాదంపతు లి ట్లనిరి. 136

ఉ. హా! నరనాయకాధమ! దురాత్మక! నాసుతుఁ డేమి చేసెరా?
మానుల మేము శాంతిమయమార్గములం జరియించువార మే
హానియుఁ జేయ మెవ్వరికి నట్టితపస్విని జంపి తేలరా?
మానవరూపరాక్షసుఁడ! మమ్మునుఁ జంపినవాఁడ వైతయో? 137

వ. అని విచారించి సదశరథులై యాదంపతు లక్కుమారశరీరంబుఁ జితిఁ జేర్చి యగ్ని సంస్కారంబుఁ గావించి పుణ్యలోకప్రాప్తికై పుత్రు నుద్దేశించి నివాపాదిక విధుల నెఱవేర్చి కోప మాపలేక దశరథుని దిక్కు మొగంబై రాజాధమా! మమ్మిటు పుత్రమరణదుఃఖితులుగాఁ జేసితి వైన నజ్ఞానకృతంబగుట గొంత సైచితిమి గాని

నీవును మావలె నంత్యకాలమ్మునఁ బుత్త్రప్రవాసరూపవియోగదుఃఖితుండవై పుత్త్రా ! పుత్రా ! యని పలవించుచు మరణించెదవుగాక యని శపించి వా రాచితియందుఁ గూలి విదగ్ధభౌతికశరీరులై విదగ్ధదివ్యశరీరులై విమానారూఢులై పుత్రుఁ డేగిన పుణ్యలోకమ్ములకుఁ జనిరి. 139

తే. ఆజి యంతట మనములో ǂ నార్తి జెంది, నాదు కతమున ముగురప్రాǂణంబు లేగె
నెంత పాపంబు వ్యసనదుǂర్వృత్తివలన, గలిగె నిటువంటి పను లింక ǂ సలుప నేను.

తే. కుడిచి కూర్చుండలేక యీǂఘోరకార్య, మకట ! నేనేల చేసితి ǂ వ్యాధు రీతి
వేటకాఁడైన నిట్టు ఘోరǂవృత్తి జనదు, దైవమా ! యెట్టికర్మమ్ము ǂ తారసిల్లె. 141

వ. అనుచు బశ్చాత్తాపనిర్ముక్తపాపుఁడై యవిముక్తాంతస్తాపుఁడై యాభూపతి పురంబుఁ జేరి కులగురువగు వసిష్ఠుని రప్పించి యతని కి ట్లనియె. 142

మ. గురువర్యా ? తిని యుండలేక యొక యొǂగ్గుం జేసి నే వచ్చితిన్
గరియం చెంచుచు శబ్దవేధినిఁ బరీǂక్షం జేయఁగాఁ గోరి యా
సరయూప్రాంతమున న్దపస్విసుతున్ ǂ సంహారముం జేయఁ ద
ద్గురు లంధుల్ శపియించి రాత్మజునికై ǂ దుఃఖించుచుం జావఁగాన్. 143

తే. కానఁ దద్ఘోరపాపంబుǂకడ చనంగ, నేమి శాంతి విధించెదో ǂ యిపుడు నాకు
దెల్పి చేయించు మద్దాని ǂ సల్పువాఁడ, వేగ దయఁజూడు మార్య ! విǂవేకధుర్య.

తే. ఆనుడుల్ మౌనిశేఖరుం ǂ డాలకించి, రాజుచేతను జేయించె ǂ వాజిమేధ
మట్టు లొనరించి నిర్దోషుఁ ǂ డగుచు రాజు, ముదముతో నుండె సాకేతǂపురమునందు.

## ఋశ్యశృంగ చరిత్రము

ఉ. అంతటఁ గొంతకాలమున ǂ కాజికిఁ గోసలరాజపుత్రికిం
గంతుని ముల్కియో యనఁగఁ ǂ గల్కి జనించెను ముద్దు లొల్కఁగా
శాంత యటంచు నామ మిడి ǂ చంద్రకళం బలె బెంపుఁ జెంద నా
యింతిని రోమపాదునకు ǂ నిచ్చె హితుం డని యాజి పుత్రిగాన్. 146

ఉ. అంతటఁ గొన్నినాళ్ళుచన ǂ నంగమహీశుని దేశమందు నా
వంతయు వృష్టి లేమిని జǂనావళి యార్తినిఁ జెందుచుండ భూ
కాంతుఁడు రోమపాదుఁ డటుǂగల్గిన విప్రులఁ బిల్వఁ బంచి త
చ్ఛాంతినిఁ దెల్పుఁడన్నఁ బ్రమǂదమ్మున వారు వచించి రీగతిన్. 147

తే. రోమపాదమహీశ ! యీశాంతిభామ మన్య, శాంతులం బోదుకల దాక శాంతికర్మ
మదియు దుస్సాధ మైనదియైన వినుమ, టంచు నారాజుతోడ వచించి రిట్లు. 148

ఉ. అంగమహీధవా ! యిటకు నంతికదేశవనాశ్రమమ్ములో
నం గలఁ డవ్విభండకుని నందను డాఖ్యను ఋశ్యశృంగుఁ డా
సంగవిహీను నిచ్చటికిఁ జయ్యనఁ దెచ్చితివేని దేశమం
దుం గల బాధ శాంత మగుఁ దోరపుఁ బంటలు పండు భూస్థలిన్. 149

తే. అనిన విప్రుల యభిమతం బరసి రాజు, విశ్వమోహనసౌందర్యవినుతలైన
వారకాంతలఁ బలువురఁ బనిచె వాని, సుతునిఁ గొనిరండు మీనేర్పుఁ జూత మనుచు.

వ. ఇట్లు పంప నవ్వారాంగన లేగి సరసగాననాట్యవిలాసంబులచే నమ్మునిసుతుని వంచించి యంగదేశమునకుం దెచ్చి రన దాక్షాయణి ప్రాణేశా ! యిది కడు వింతగా నుండె నాశాంతుని వెలకాంత లెట్లు మోసగించి తెచ్చిరో విస్తరించి చెప్పు మన శంకరుం డిట్లనియె. 151

ఉ. అంగమహీశుఁ డత్తఱి ద్విజాళి వచించిన తత్క్షణంబ వా
రాంగనలం గనుంగొనుచు సాదర మొప్పఁగఁ బల్కె ఋశ్యశృం
గుం గొని తెత్తురేని వెలకోమలులార ! ధనంబు లిత్తు మీ
కుంగల శక్తిచేత ననుకూలము సేయుఁడు కార్యమం చనన్. 152

మ. చపలాభావఘనప్రభామిళితసజ్జాంబూనదాలంక్రియా
విపులస్వచ్ఛమణీఘృణిస్ఫురణతావిఖ్యాతభూరిప్రభా
నుపమప్రావృతకానకప్రసవసంయుక్తాచ్ఛచిత్రాంబరా
శివరీభూతరవిప్రకాశతనువల్లీయుక్తలై వేశ్యలున్. 153

సీ. ధీరమానవమనోధీరతాహరణకృ, న్మారబాణావళిసార మనఁగ
భూలోకచిత్రసమాలోకనాయాత, కాలాబ్దచంచలాజాల మనఁగ
పాత్రశిల్పికృతాతిచిత్రభూషాసక్త, గాత్రశోభిసువర్ణపుత్రిక లన
లోకమోహక్రియాశ్రీకుమారనియుక్త, సాకల్యమోహమంత్రాకృతు లన

తే. రంగులంగాల బంగరుకొంగు లలర, భృంగము లనంగ ముంగురుల్ చెంగలిడఁగ
సంగరహితుని నాఋశ్యశృంగుఁ గనఁగ, బొంగుచుం బోయె వేగ వారాంగనాళి.

వ. ఇటు లేగుచు వారు మధ్యేమార్గమ్మునఁ గులుకుపలుకులు పలుకుచుఁ దమలో దా మిట్లనుకొనిరి. 155

సీ. ఈతనిం దేలేమె ? యీతఁ డెక్కడె గాధి, సంభవుండగు మునీశ్వరుని కన్న
ఈతనిం దేలేమె ? యీతఁ డెక్కడె మంద, కర్ణభవుండైన ఘనుని కన్న
ఈతనిం దేలేమె ? యీతఁ డెక్కడె పురూ,రవుఁడను నృపముని ప్రభుని కన్న
ఈతనిం దేలేమె ? యీతఁ డెక్కడె రాజ, మునుల కన్నను బ్రహ్మమునుల కన్న
తే. ఇమ్మహిని వారి కెన్నేసి కొమ్ము లున్న, మనకు వశ్యులు గానట్టి మునులు గలరె ?
యొంటికొమ్మున్న వీనిఁ జేకొంట యరుదె?, కొమకుఁ బ్రాయముఁగలవీనిఁ గొనగ లేమె?

వ. ఇట్లు విచ్చలవిడిగా ముచ్చటించు కొనుచు. 157

మ. మణిమంజీరఝుణంఝుణక్వణనయుగ్మన్మంద్రక్రమాంచత్కళా
చణరక్తాంబుజకల్యరాగతలసంచారాచ్ఛపక్ష్మాంగనా
గణచంచద్గతి దేశికాయితపదారఘుం బుర్వీఁ గైసేయఁగా
గణికాజాతిశిరోమణుల్ చనిరి వేగం బొప్ప నప్పట్టునన్. 158

చ. చని మునినందనాశ్రమముఁ జక్కని నొక్కెడఁ బొంచి యుండి త
జ్జనకుఁడు లేనివేళఁ గని చయ్యన లోనఁ దళుక్కు మంచు గా
ముని శరపుంజమో యనఁగ ముంగిటఁ జేరిన వారి నాతఁడు
న్మునులు మహానుభావులను బుద్ధినిఁ జూచి ససంభ్రమమ్ముగాన్. 159

మ. ముదితా ! పార్వతి ! ఋశ్యశృంగముని స్త్రీపుంసాదిభేదక్రుధా
మదమోహాదు లవెట్టివో తెలియఁడు న్మాత్రక్రియ న్సర్వభూ
తదయాళుత్వము శాంతి దాంతి పితృపాదద్వంద్వవహ్న్యర్చన
మ్మాఁ దపం బధ్యయనంబు దప్ప నితరంబుం గానఁ డెప్పట్టునన్. 160

ఉ. అట్టి ఘనుండు వారవనితాళి హఠారంగున వచ్చి ప్రోలఁ గ
న్పట్టిన యంత లేచి వెలనారుల చెంతకుఁ జేరి మ్రొక్కుచుం
జుట్టుఁ బ్రదక్షిణమ్ముఁ బరిశుద్ధమనమ్మునఁ జేసి యోమునీ
ట్పట్టమహేంద్రులార ! యిటు స్వాగతమా ! దయచేయుఁ డర్మిలిన్. 161

ఉ. పాదజలార్ఘ్యము ల్గొనుడు పండ్లివె సాపడి సాంద్రమహా బృసిక్
సాదరులై వసించుచుఁ బ్రశాంతిని జెందుడు మహానులార ! మా
పై దయ మీారు వచ్చితిరి పచ్చరులై శ్రమమొంది యిట్టి మీా
పాదరజోభియోగమునఁ బావనమయ్యె మదాశ్రమం బిటన్. 162

వ. అన విని వారసుందరులు మునినందను డిచ్చు సత్కారమ్ము లందికొని కనుసన్నలఁ దమలోఁ దా మన్యాపదేశమ్మునఁ జిఱునవ్వు నవ్వుచు మునిసుతునిం జూచి యి ట్లనిరి. 163

తే. మునికుమారక! యేవనంబునకు నీవు, వచ్చినట్టులు చూడము । నిచ్చలు నిట
నేమిసేయుదు వేవేళ్వ । వెనని సుతుఁడ, వనిన వారలతో మునియనియె నిట్లు.

ఉ. ఓమునులార! నాజనకుఁ । డుత్తమశక్తి విభండకుండు నా
నామము ఋశ్యశృంగుఁడు ధనంజయసేవయుఁ దండ్రిసేవ యు
ద్దామతపంబు బ్రహ్మము నిరంజనము యోగము బ్రహ్మచర్యము
న్నేమముగా నొనర్చు చిటనే వసియించెద నెల్లకాలమున్. 165

వ. అనిన నమ్మునిసుతునికడ నప్పడఁతుకలును. 166

చ. శ్రుతుల సమస్వరంబు బరిశుద్ధముగాఁ దగ నేళగించి స
మ్మతమున మూర్ఛనాస్వరసమమ్ముగ గ్రామవిశేషతానసం
గతముగఁ దంత్రికానురణన మ్మొనరించుచుఁ దాళయోగసం
భృతతతమర్దళారవసమీకృతగానముఁ జేసి రత్తఱిన్. 167

సీ. కులుకుగుబ్బలఁ బైటకొంగు రంగుహారంగు, ముంగిటఁ దమతోడఁ । జెంగు లిడఁగ
మొలనూళ్ళ చిఱుగంట । నులివు కాళ్ళ జెలంగు, గజ్జెల రవముతోఁ । గలియుచుండ
బదియాఱునన్నె మేనొన్నంగరంగులు, కడగోడలకు హొయల్ । గలుగఁజేయఁ
దమలంపు నెత్తావి । గమగమలాడుచు, జటపూలతావితో । జత నొనర్ప

తే. కాళ్ళయందెలు గజ్జెలు । ఘల్లు మనఁగఁ, గెంపు కేల్దమ్ములం ద్రిప్పి । సొంపు దనర
బొమలఁ గన్నులు హావభావములఁ దెలుప, నటనమాడిరి విటధైర్యఘటముపగుల.

మ. త్రిపతాకార్ధపతాకము ల్మొదలు కేల్ద్రిప్పుల్ జెలంగ న్మృదు
ప్రపదాంచద్వృహాసవ్యదక్షిణగతిప్రక్షేపగోమూత్రికా
నుపమార్ధాదికమండలప్రథితగత్యుద్దామసంచార నే
యుపచారంబులు లేక నాట్యములు సేయం జొచ్చి రవ్వేశ్యలున్. 169

సీ. కల్యాణికారాగకామవర్ధన్యాది, ప్రకటరాగాళిసంపదలు నింప
గీరవాణులో! మత్తకేకారవంబులో!, కోకిలారవములో । కో యనంగఁ
దానమానవిదానమూను తానముతోడి, పదవర్ణపల్లవి । ప్రకర మమరఁ
జిలువ లాకర్ణింప । శిలలైనఁ గరగంగ, నెండిన మ్రాకులు । నిగురు లొంద

తే. మింటఁ దెఱగంటి యచ్చర | మిన్న లెల్ల, "మించి రే మమ్ము నీనెల | మించు బోఁ"డ్ల
టంచుఁ గనుగొని బళి రే! య|టంచుఁ బొగడఁ, బాట పాడిరి వేశ్య ల|బ్రంబుగాగ.

వ. ఇట్లు గానంబుఁ జేసి మునిసుతుని మరులు కొల్పఁ దలంచి గాఢాలింగనచుంబనాది స్వజాతిసామాన్యకృత్యమ్ముల నెఱపి యి ట్లనిరి. 171

తే. మాఫలమ్ములఁ దిని చూడు | మా యటంచు, శర్కరాఘృతపక్వ భ|క్ష్యమ్ము లొసఁగ
నసమమాధుర్యవాంఛతో | నారగించి, మదవతులఁ గాంచి యిట్ల నె|ముదముఁ జెంది.

కం. మీ రిచ్చిన యీఫలముల, పారస్వాదువు లపూర్వ|భక్షితములు నే
తారవములో యివి మా కే,తీరున లభియించు నయ్య | ధీయుతులారా? 173

వ. అని మఱియు మునిసుతుండు వారి ముక్తాహారాదులం గాంచి యదృష్టపూర్వంబు లగుట నక్కజం బంది యి ట్లనియె. 174

సీ. మీగళంబులనున్న | మేలిరుద్రాక్షముల్, తెల్లనై యెఱ్ఱనై | తేజరిల్లు
యీనారచీరలు | నీముంజమేఖల, లెవ్రేలి దర్భము|లెచట నుండు
మీరు తాల్చిన బూది|సౌరభంబుగ నుండె, మీకాలిపాదుకల్ | మృదువులౌర!
మీపాడుసామంబు | లోపికతో విన్న, బ్రహ్మముం గలియు ట|బ్రంబె తలఁప

తే. మీపదద్వయి సేవింప | నోపియున్న, శాంతుఁ డాపయిఁ దద్భగ|వంతుఁడె యగు
నామునీంద్రుఁడు నగు గరు|ణామయుండు, స్వస్తి చెప్పుటలో మీకు | సాటి కలదె?

కం. ఎవ్వనికడ నేర్చితిరీ, మవ్వపు సామంబు దీన|మధురత తగు మీ
కివ్విధి జెప్పిన సద్గురు, వెవ్వఁడొ నాకిట్లు చెప్పఁగ నే? సేవింపన్. 176

ఆ. వె. మారు గట్టినట్టి|నారలు మున్నుగాఁ, గల్గు నిట్టి వస్తు|కాండ మెల్ల
నెచటఁ బుట్టియుండు | నెట్లు మాకు లభించుఁ, జెప్పఁడయ్య? యోగ|సిద్ధులార!

వ. అనిన వారకామినులని రోమునితనయా! మే మపూర్వతపస్సిద్ధులము గాన మా మాయావాసమ్ములలో నిట్టి ఫలాదులు గల్గు వీనిపై నీ కిచ్చ గలదేని యచ్చటికి రమ్ము. నీకును లభించు మాసహవాసమ్మున నొక్కనాటికి నీవును మావలె నపూర్వతపస్సిద్ధుండ వగుదువని నమ్మించి యమ్మించుబోం డ్లామునికుమారు వెంటఁగొంచు నంగదేశముఁ బ్రవేశించు నంతలోన. 178

మ. జలదంబుల్ చద లావరించి చపలా|సంఘాతరంగ త్తళ
త్తళకాంతుల్ మెఱయంగ గర్జలు మహా|ధ్వానమ్ముతో మ్రోయఁగా
జలధారాసికరంబు నంగభువి వి|స్తారంబుగా డించె భూ
స్థలి సస్యాదులు వృద్ధిఁ జెందె జన ము|త్సాహంబుఁ జెందె న్మదిన్. 179

ఉ. అంతట రోమపాదనృపుఁ ǂ డాప్తులతో నెదురేగి పూజల
త్యంతముదమ్ముతో సలిపి ǂ యాత్మగృహమ్మున నుంచి నిత్య మా
శాంతుఁ డిట న్వసించునని ǂ సాధ్వియు దత్తతనూజయైన యా
శాంతను ఋశ్యశృంగున కొసంగి వివాహమొనర్చె నయ్యెడన్. 180

వ. ఇట్లామునితనయుం డాశాంతను వివాహంబై రోమపాదునింట నుండె నత్తపసి యిన్న తనదేశమ్మున నుండుటం జేసి దేశం బీతిభీతిరహితంబై నరీతిం జెంది సర్వసస్య సమృద్ధంబయ్యె రోమపాదుండును కొంతకాలంబు చన నత్తపస్వియాజ్ఞానుసారమ్ముగా నొక జన్నం బొనర్చి పుత్రసంతానవంతుఁడై యానందించుచు నాతనివలన జ్ఞానబోధంబుల నొందుచు సుఖమ్ముగా నుండె. 181

## —* దశరథుఁడు సంతతిలేమికి వగచుట *—

తే. అనఁగ విని గౌరి భర్తతో ǂ ననియె నిట్లు, ప్రాణనాయక! సాకేతరమందు నాజి
యెట్లు లుండెను పిదప నేరమేమి చేసె, వాని నెల్లను దెల్పుదేవా! యనంగ.

వ. దాక్షాయణితో నిటలాక్షుం డిట్లనియె. 183

ఉ. అంత నజాత్మజుండు దశరథమహేంద్రుఁడు రయం బొకదాని కైనఁ దా
సంతతి లేదటంచు మదిఁ ǂ జాలఁగఁ గుంది వసిష్ఠుఁ బిల్చి యో
శాంతమతీ! సుతాప్తి కొకసత్క్రతు వే నొనరింతు దేనిఁ జే
యింతువొ తత్పదార్థగణమిప్పుడె తే బనుతు న్వచింపుమా. 184

చ. అన విని యవ్వసిష్ఠుఁ డనె ǂ నాత్మజలాభముగా సుతేష్టి నీ
వొనరిచితేని నీకు దశరథయోదయు పరా నివి సత్య మైనదే
ఘనుఁడగు ఋశ్యశృంగముని ǂ గాతికి మొప్పఁగఁ దెచ్చితేని నా
తనిని బురస్కరించి యరథాధిపగా నొనరింతు మిష్టినిన్. 185

తే. అనఁగ రాజయు రోమపాదుని గనంగ, నంగదేశమ్మునకు నేగి ǂ యచట నున్న
ఋశ్యశృంగుని నాతనియింతితోడ, నెంటఁ గొని తెచ్చెఁ దనదగు ǂ పీటి కెలమి.

మ. ఇటు లేతెంచిన ఋశ్యశృంగుఁ గని యశ్వసింద్రుల్ సమీపాపగా
తటభూమి న్మఖశాల నేర్పరచి శాస్త్రప్రక్రియన్ సంమద
స్ఫుటపద్మాసనుఁడై సదారుఁ డగుచుం ǂ బుత్రార్థియై తేని న
చ్చట దీక్షాన్వితుఁ జేసి యైంద్ర మగు యజ్ఞం బొందు సేయింపఁగాన్. 187

వ. అంత వసిష్ఠాదులతోఁ గూడి ఋశ్యశృంగుఁడు రాజుచేఁ బుత్రకామేష్టి విధ్యుక్త
ముగాఁ జేయింప నచ్చటి జనంబు లచ్చెరువొంద నగ్నికుండమువలన దివ్యపాయస
సంపూర్ణస్వర్ణపాత్రసంయుతకరుండై యగ్నిదేవుం డావిర్భవించి దశరథున కా
పాయసపాత్ర మొసంగి యంతర్హితుం డయ్యె నంత. 188

ఉ. పాయసపాత్రముం గొని నృపాలుఁడు వేడుక బాయసాన్న మున్
జాయలకు న్సమంబుగ బ్రసాదముగా నిడ వార లంత నా
ప్యాయన మొప్పఁ గైకొని మహాముద మొందుచు నుండ సభ్యులు
న్నాయురె! యంచు మెచ్చి రతిమానుషశక్తిని ఋశ్యశృంగునిన్. 189

ఉ. అంతటఁ గైక తా మది సనాదర మొంది స్వభాగపాయసం
బంతయు నంజనాద్రిపయి నప్పుడె పాఱఁగ వైచె, నద్దిత
త్ప్రాంతమునందు నున్న యొక గ్రద్దపయిం బడ నాపులుంగు తా
వింతగ దివ్యసుందరసువిగ్రహయౌ చెలి యయ్యెఁ బార్వతీ! 190

వ. అనిన నాగ్రద్దపైఁ బాయసంబు పడినంతఁ జెలి యాట కేమి కతంబో యిది కడు
వింతగాఁ దోచెఁ దచ్చరిత్రంబు నుడువు మన బార్వతితోఁ బరమేశ్వరుం డిట్లనియె.

తే. బ్రహ్మసభలోన మున్నొకపరి సువర్చ,లయను నచ్చర తన యభినయము నందుఁ
దప్పుఁ జేసినఁ గోపించి ధాత దాని, గృధ్రి వగు మంచుఁ దా శపియించె నపుడు.

ఉ. అంతట నాపడంతి మది నార్తిని గుందుచు ధాతఁ జూచి శా
పాంతము జెప్పవే యనుచుఁ బ్రార్థనఁ జేయఁగ నంజనాద్రి నీ
వింతిరో! గ్రద్ద వౌచు వసియింపఁగఁ గైకయి పాయసంబు నీ
చెంతకుఁ బాఱునైన నతిశీఘ్రమె నీనిజరూప మయ్యెడున్. 193

తే. అజుఁడు శపియింప గ్రద్దయై యంజనాద్రి, నున్న యచ్చర యాపరమాన్నభాగ
మట్లు స్పృశియించి యెప్పటియతివ యగుచు, దివిజలోకమ్మునకుఁ జేరె దివిజు లలర.

తే. కైక యీరీతి నాత్మభాగంబు విడువ, నాత్మభాగమ్ములను నిసుమంతఁ దీసి
తక్కుఁగల రాజభార్య లిద్దఱును గైక, కిచ్చి రమ్మువ్వురిటు భుజియించి రపుడు.

మ. పరమాన్నంబు భుజించి యా నృపసతుల్ పాండుచ్ఛవిం బొల్చు సుం
దరదేహప్రభ లొప్పమీఱ దివిషత్తన్వీవతంసాంగభా
స్వరకాంతిన్ బురుడించి గర్భవతులై సంజాతహర్షాఢ్యలై
నిరతంబు న్నిజగర్భదోహదకళానిర్నిద్రలై రెంతయున్. 196

ఉ. చిట్టుము లోకిరింతలు రుచించవమి భోజ్యపదార్థపాళిలో
మట్టిఁ దినంగ వేడుక క్రమక్రమమాంద్యపదప్రచారముం
గట్టిగ మాటలాడమి సుఖమ్ముగ నిద్రిలు టాదిగాగ నా
పట్టపు దేవెరుల్ ప్రకటభావత వేవిళు లొంది రీగతిన్. 197

చ. బలములు లేనివారు మృదుభావలుఁ గోమలదేహలుం ధరా
వలయము నేలు రాజునకుఁ బట్టపుదేవులు లేక లేకయే
కలిగెను గర్భముల్ పిదపఁ గ్గలెను వేవిళు లిట్లు బాపురే!
యిల నిక వారి వైఖరుల నెవ్వరు చెప్పఁగలారు కోమలీ! 198

తే. ఇటులు కలిగిన వేవిళు లెల్లఁ జూచి, పుత్రులే వారలకు నింకఁ బుట్టఁగలర
టంచుఁ బురకాంతలెల్ల భార్యర్థజాత, మందఱకుఁ దెల్పి మది మోదమంది రపుడు.

వ. ఇట్లు గర్భిణులైన భార్యలం జూచి యానందించుచు రఘువంశకళాధరుండగు దశరథుండు కుమారసంభవమున కెదురుచూచుచు సుఖమ్ముగా నుండెనని చెప్పుటయును.

—: ఆశ్వాసాంతము :—

భుజంగప్రయాతము. సరోజాక్షమిత్రా! శరన్మేఘగాత్రా!
ధరాత్రాఢ్యచాపా! దయాసాంద్రరూపా!
ధరాభారరక్షస్తమోఽర్కప్రభావా!
పరారణ్యదావా! భవానీశదేవా!

ఆంధ్రానందరామాయణమున
ప్రథమాశ్వాసము సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# ఆంధ్రానందరామాయణము

## సారకాండము

### ద్వితీయాశ్వాసము



మత్తారకమంత్రచింతనరతా! చిద్రూప! భక్తావళీ
క్షేమప్రాపణశక్తపాదయుగళా! శ్వేతాంగమద్భాసురా
వామాంగీకృతశైలరాజతనయా! వందారుబృందారకా
సోమాలంకృతమౌళి! యోగిజనసంస్తుత్యా! భవానీశ్వరా. 1

వ. అవధరింపుము.

చ. అనువుగఁ బ్రాణనాథుఁ గని యంబిక గాఢతరానురాగయై
"ఘనతరమైన రాఘవునిగాథ పదంపడి యెట్లు చెల్లెనో
విన నభిలాష మయ్యెడు సవిస్తరము న్వచియింపుమా" యన
న్విను మని శంభుఁ డిట్లనె నవీనసుధామధురోక్తు లొప్పగాన్. 2

#### భూమి బ్రహ్మతో తనబాధలఁ దెల్పుట

చ. దశరథుఁ డుర్వి నేలుతఱి దర్పితులై బహుఘోరకర్ములై
దశముఖముఖ్యరాక్షసులు తంద్రత సాధుల నేపరించుటన్
భృశతరదుఃఖయై ధరణి విశ్వసృడంతికసీమఁ జేరి తా
విశదముగా నిశాటకృతపీడల నెల్ల వచింప నాతఁడున్. 3

ఉ. ధారుణి నింద్రముఖ్యులగు దైవతవర్యుల వెంటఁ గొంచుఁ దా
సారసపత్రనేత్రపదసన్నిధిఁ జేరి నమస్కరించి "యో
మారసహస్రసుందర! రమారమణా! జగదేకవీర! స
త్కారుణికాగ్రగణ్యా! హరి! ధారుణిబాధల నాలకింపుమా. 4

ఉ. నావలన న్వరాలు గొని నాయము వీడి జగజ్జనమ్ములన్
దేవతల న్నృపాలుర యతిప్రవరాళిని బాధపెట్టుచుం
దేవనరాహిముఖ్యయువతీమణులం జెఱఁ బెట్టుచున్ కడున్
రావణుఁ డిట్లు లోకముల రాయిడిఁ బెట్టుచు నుండె శ్రీపతీ! 5

ఉ. తోరపు ప్రేగు నెంతయిన దూలక మోయుదుఁ గాని యొక్క దు
ష్కారిని మోయలే నిపుడు సాధుల బాధలఁ బెట్టు రక్కసుల్
మీరిరి వారి బాధలు నమేయము లోర్వఁగ లేనటంచు నీ
ధారుణి మొఱ్ఱ వెట్టెడి నుదారగుణాలయ! దీనిఁ బ్రోవుమా. 6

తే. మున్ను నాచెంత వరములఁ బొందు నపుడు, నరులు గాక యవధ్యత నొరుల వలన
దాను గోరెను వానికి మానవుండె, మారకుం డని వ్రాసితి మారకుండ. 7

ఉ. కావున నీవు వేగముగఁ గౌతుక మొప్పఁగ మానవుండవై
దేవ! దయామయా! వసుమతిం జనియించి కృతాపరాధులౌ
దేవవిరోధులన్ దగ శిక్షించి విపన్నులఁ బ్రోచి యాధరన్
పావనధర్మము న్నిలిపి వైళమ యాత్మపురమ్ముఁ జేరుమా. 8

సీ. అనఁగ బ్రహ్మను జూచి యనె వెన్నుఁ డిట్టులు, నే నిల బదితేర్లఱేనియాండ్ర
కాత్మజాతచతుష్టయంబుగా జన్మించి, కడతేర్తు రాక్షసగణము నెల్ల
సురల వానరరూపధరులుగా జనియింపఁ, జేయుము నాకని సాయ పడఁగ
గాంధర్వి దుందుభి మంథరగాఁ జేయు, మాభిషేచనవిఘ్న మాచరింప

తే. దానఁ గానకు నే నేగి దానవులను, జంపఁగలవాఁడ ద్వాపరసంధియందు
బూతనగఁ బుట్టు మంథర క్ష్మాతలమునఁ, గంసనియమితదుష్కర్మకారిణి యయి.

చ. అను నభయంబు సేకొని సురావళి నల్వఁ బురస్కరించి భూ
మిని గతదుఃఖఁ జేయుచు నమేయముదం బలరంగ విశ్రవ
స్తనయుని చావు నిక్క మిది తప్పదు వెన్నుఁడు రాముఁడై ధరన్
జననముఁ జెందు నంచును బ్రశంస యొనర్చుచు బోయె నిండ్లకున్. 10

వ. అంత సాకేతపురమ్మున గౌసల్యమున్నగు దేవేరులు మువ్వురకుం గ్రమమ్మున మాస
ములు గతించి యాఱవ మాస మేతేర వసిష్ఠానుమతిం జెంది దశరథుండును. 11

కం. ప్రేమ దలిర్పఁగ దనకున్, శ్రీమద్గుణులైన సుతులు చేకూరుట కా
సీమంతినులకుఁ బుంసవ, సీమంతము లపుడు చేసెఁ జిత్తం బలరన్. 12

చ. అలసవిలాసలైన సతు లంతట మాసము లెల్లఁ బూర్తియై
చెలఁగఁగఁ జంచలాలతలొ శ్రీసతులో యన నచ్ఛకాంతిఁ బెం
పలరుచు పాండుగండముకురాంతరబింబితకర్ణపుష్పసం
కలితసరోజలై వెలయఁగా నొకనాఁడు జగత్ప్రియంబుగా. 13

## శ్రీ రా మ జ న న ము

సీ. శీతమై గంధసంనేతమై మంథరా, యాతమై మృదువాతపోత మమర
విమలమై విస్ఫురత్కమలమై గంభీర, కమలమై యాపగాక్రమము దనర
తోరమై యాక్రాంతతీరమై భంగప్ర,పూరమై లసదకూపార మమర
ఘనములై షట్పదారవనములై విహగని, స్వనములై బహుపుష్పవనము లలర
తే. హోమవహ్నుల నుజ్జ్వల ధామ మమర, ఖలమనమ్ముల బహుళదుఃఖంబు గమర
సాధుహృదయాబ్జము ల్వికస్వరత నొంద, నసమనిర్మలకాంతి నాకసము దనర.

చ. వరమధుమాసమందు సితపక్షమున న్నవమీతిథి న్నిశా
కరుఁడు పునర్వసుం గలియఁ గర్కటలగ్నము రాగ సూర్యుడుం
గురుకుజశుక్రభానుజులు కూరిమి నుచ్చపదంబు లొందఁ జం
దురుఁడు స్వగేహమందు గురుతోడ హితుండయి కూడి యుండగన్. 15

సీ. నీలాభకాదంబి నీజాలహారినీల, మాలాజిదంగరుగ్జాల మమర
ఫాలాలసన్మధుపాళీసమాలకా, భీలాసితప్రభాజాల మమర
బాలారుణప్రభాజాలంబు నిరసింప, జాలు కెంగేలి మేల్పాలు గ్రాల
రోలంబయుగముతో మేలైన దుగతమ్మి, పూలనం గందోయి లీల దనర
తే. పాలకడలి వెడలు నెలబోలు వాని, నేలు సోయగమున మరుబోలు వాని
గ్రాలు రేకల యడుగుల జాలు వాని, లీల కౌసల్య యొక ముద్దుబాలు గనియె.

తే. మఱియు సుకుమారు నర్కసమాన తేజు, నిభకరాభసుబాహు నిశుభవిశేష
కలితవరలక్షణంబులు గల్గు సుభగ, మారుని సుమిత్ర యొక్క కుమారుఁ గనియె.

ఉ. శ్రీమహితుల్ శుభప్రదవిశేషసులక్షణలక్షితాకృతుల్
ద్యోమణితుల్యతేజు లురుదోర్యుగళుల్ కమలాభలోచనుల్
సోమసుమాస్త్రులట్లు సురలోకభిషజ్జనులట్లు కైకకుఁ
భూమకళాసమంచితులు పుత్రకు లిర్వురు పుట్టి రొప్పుగన్. 18

కం. పాడిరి గంధర్వులు వెస, నాడిరి రంభాదివేశ్య లమరులు మింటం
గూడి వెదజల్లి రంతట, వాడని సామోదపుష్పవర్గము నెల్లన్. 19

సీ. నీలాంగరుచితోడ నిగనిగ ల్దనరారు, రత్నభూషావళీ ప్రభలతోడ
నాజానుదీర్ఘబాహాచతుష్టయితోడ, దరచక్రముఖ్యాయుధములతోడఁ
గనకచేలముతోడ గటిసూత్రకేయూర, కంకణముద్రికా గణముతోడ
గుండలములతోడ గుముదాప్తసమముఖ, కస్తూరికాతిలకంబుతోడ
తే. తమ్మిరేకులఁ బోలు నేత్రములతోడఁ, దిరుగుచుండెడి నీలిముంగురులతోడ
మంజుతరమూర్తి కౌసలాత్మజకు ప్రోల, జూడఁగానొప్పె హరి యామె చోద్యమంద.

మ. ఇటు జన్మించిన యాదివిష్ణుఁ గని యెంతే సంతసం బంది తా
నిటలన్యస్తకరాంబుజాంజలియునై నీరేజపత్రేక్షణా!
పటుతేజోయుతదున్నిరీక్ష్య మగు నీ భవ్యాకృతిం బాసి ప్రా
కటబాలాకృతిఁ జెందు మన్న శిశువై కన్పించె నా చక్రియున్. 21

వ. మఱియు నావిష్ణుని పాన్పగు శేషుండు సుమిత్రకును, పరమాయుధంబులగు శంఖ
చక్రములు కైకకును, స్వస్వరూపములతో నొక్కింతతడవు ప్రోలఁ గన్పించి
మాతృసంప్రార్థనంబున బాలాకారములఁ దాల్చి యుండు నంత దశరథుండు. 22

ఉ. బాలురు పుట్టి రంచు శుభవార్త వినంబడినంత సూతికా
శాలకుఁ బోయి పుత్రముఖచంద్రనిరీక్షణజాతకౌతుక
శ్రీలలితాననుం డయి వసిష్ఠముఖాఖిలసూరివాళికిన్
జేలగజాశ్వధేనుధరణీమణిదానము లెల్లఁ జేసి తాన్. 23

వ. మఱియుం దక్కిన దాసదాసీజనమ్ములకు యథాభిలషితమ్ముగా ధనమ్ము లిచ్చి
పురంబునం గల్గు నెల్ల బాలికాబాలకులకు వలయుపదార్థము లవ్వారిగా నిడి యలం
కరణపురస్సరంబుగా బురంబున మహోత్సవంబుఁ జేయించి సకలదేవాగారంబులం
గల్గు హరిహరాదుల కర్చావిధానంబునఁ బూజలు జేయించి యానంద మొందు
చుండు నంత బదునొకండవ దినమ్మున వసిష్ఠుం డాబాలకులకు జాతకర్మాదిసంస్కా
రంబుఁ గావించి కౌసల్యాపుత్రునకు యోగిధ్యేయుఁ డగుట రాముఁ డనియు దివ్య
లక్షణంబులు గలవాఁడగుట సుమిత్రాపుత్రునకు లక్ష్మణుం డనియు భూభారవహన
శత్రుసంహరణంబులు గలవారగుట కైకేయీయమళులకుఁ గ్రమమ్మున భరతుం
డనియు శత్రుఘ్నుం డనియు నామకరణంబులు జేయించె. 24

సీ. అంతఁ గౌసల్యాదికాంతలు దమతమ, కొమరులకుం బలికిగోళ్ళపతక
ములు ముత్తెసరులునుమొలనూళ్ళు నేలైన, ముత్తియంబులు నగ్రమునఁ జెలంగు
రావియాకులఁబోలు శీవిసూ పతకంబు, లందెలు గజ్జెలు నందమైన
రంగారు రతనంపుటుంగరమ్ములు నేల్మె,యుంగుడాల్లల్లు మురుగుల జతలు

తే. మున్నుగా నెల్లభూషణమ్ముల నమర్చి, మోముఁదమ్ములఁ గస్తురిబొట్టు లునిచి
ముద్దుచెక్కిలి జంటల ముద్దు లిడుచు, సంతసిల్లిరి తన్మయస్వాంతలగుచు. 25

వ. ఇట్లు శుక్లపక్షశీతాంశునిక్రియ గళాభివర్ధనంబునం బొల్చు సుతులం గాంచి జననీ జనకు లానందసాగరంబున నోలలాడుచుండి రంత గౌసల్యాంతఃపురమ్మునఁ గౌసల్య తనపుత్రునకు డోలారోహణోత్సవంబు నిర్వర్తింపఁ బురంబునం గల్గు పురంధ్రీజనమ్ముల రావించి వారికిఁ జందనాదిమర్యాదలం దీర్చి ముద్దుబాలుఁడగు రాముని బంగరు తూఁగుటుయ్యాల నుంచె నంత నిరుగడల నాపురంధ్రు లెల్ల నిల్చి యబ్బాలుని సోయగంబుఁ గాంచి తమలోఁదమ రిట్లనుకొనిరి. 26

ఉ. కన్నులు చూడు మమ్మ చెలి! కంజము లమ్మ! మొగంబుఁ గాంచితే!
పున్నమచందురుండె సుమి ముంగురులా? యివి తేటులా? చెలీ!
సన్నని మధ్యమంబుఁ బద సారసముల్ తనుకాంతిఁ జూడుఁడీ
యన్నవమిన్నలార! యితఁ డారయ వెన్ననిఁ బోలు బాపురే! 27

కం. అనుచుం గాంతలు బాలునిఁ, గనుకని యుయ్యాల నుంచి కడుసంతసముం
గొని తా ముయ్యెల నూపుచు మన మలరం బాడి రిట్లు మంజుల ఫణితిన్. 28

కం. జోజో! సుందరనామా!, జోజో! కాలాబ్దధామ! సురరిపుభీమా!
జోజో! భూమిలలామా!, జోజో! ముఖకాంతివిజితసోమా! రామా! 29

ఉ. లాలి పయోజనేత్రునకు లాలి భుజంగమతల్పవర్తికిన్
లాలి పయోదగాత్రునకు లాలి పదానతకామపూర్తికిన్
లాలి పతంగపుత్రునకు లాలి దిగంతనిషక్తకీర్తికిన్
లాలి రమాకళత్రునకు లాలి ఖలార్తికి రమ్యమూర్తికిన్. 30

వ. ఇట్లతివినోదమ్మున నాకాంత లారామచంద్రునకుఁ గపురంపు టారతు లిచ్చి దీవించి చనినపిదప గౌసల్యాదికాంతలు తమతమపుత్రులం బెనుచుచుండ నబ్బాలుర కాఱవ మాసం బేతెంచె నంత. 31

తే. పంక్తిరథుఁడును సౌవర్ణ ౹ పాత్రికలను, బాయసాన్నంబు నల్వురు ౹ బాలురకును
బుడమివేల్పులు మంత్రముల్ ౹ నుడువుచుండఁ, బ్రాశనమ్ములఁ జేయించెఁ ౹ బ్రమదమునను.

వ. క్రమమ్మున నాబాలకులు నాలుగైదేండ్లప్రాయంబు గలవారై కలభాషణమ్ముల జననీజనకుల నానందింపఁ జేయుచుండిరి. మఱియు రామునకు లక్ష్మణుండును, భరతునకు శత్రుఘ్నుండును, మిత్రులై శబ్దార్థంబుల పోలిక నవినాభావసంబంధమున భోజనశయనాసనక్రీడాదులం బొల్చియుండి రంత రామచంద్రుండు నీడుజోడగు సంగడీఁడులతోఁ గూడి బాలకేళీలోలుఁడై యుండె. 33

## రాముని బాల్యక్రీడలు

ఉ. బాలకులార! నేఁడిచటఁ ౹ బార్థివు నాటల నాడు కొందమే!
బాలకు లీరు సైతు లఁట, ౹ పార్థివుఁ డేనఁట, మీర లిప్పుడే
యేలికపన్నుఁ దెండన ని ౹ దే యని యల్పశిలాళి బాలకుల్
జాల నొసంగినన్ మదిని ౹ సంతస మొందెను రామచంద్రుఁడున్. 34

ఉ. దాఁగిలిమూఁతలాడుదము ౹ తప్పక నన్గను డంచు రాముఁడుం
దాఁగిన రాము బాలకులుఁ ౹ దత్పదరేఖల గుర్తు జూచుచున్
దాఁగినచోటఁ బట్టిన న ౹ తండు గ్రహించి శుచిస్మితాస్యుఁడై
దాఁగుడుమూఁతలాడ నిది ౹ తక్క మఱొక్కటి యాడ రండనున్. 35

వ. మఱియు నారామచంద్రుఁ డిట్లనుదినంబును గేళీవినోదతత్పరుండై సంగడీఁడులం గూడి. 36

ఉ. ఒక్కసికొక్క నొడ్డువిడు ౹ సోమనగుంటలు గట్టెగజ్జెముల్
చిక్కణబిళ్లు గొబ్బిళులు ౹ సింగనదాఁటులు బుట్టచెండులుం
ద్రొక్కుడుబిళ్ళ లప్పచులు ౹ తూరనలేఁకము లీలకూఁత లొ
క్కొక్కటి యాడి యెల్లరకు ౹ నుల్లము రంజిలఁ జేయు నిత్యమున్. 37

మ. ఒకనాఁ డాజి భుజించువేళ రఘువర్యుం డచ్చటన్ జేరి యొ
క్కకడిం జేకొని పర్వులెత్తె నృపుఁడో ౹ కౌసల్య యెట్లేగ బా
లకునిం దెమ్మను నంతలో నతఁడు లీలం దల్లిఁ గేడించి వ
చ్చి కడిన్ జక్కఁగఁ దండ్రినోట నిడె తచ్చిత్తంబు లుప్పొంగగాన్. 38

వ. ఇట్లారామలక్ష్మణభరతశత్రుఘ్నులు బాలకేళీలోలురై జననీజనకుల నానందింపఁ జేయుచు. 39

మ. కటకాద్యాభరణప్రసాధితతనూకాంతుల్ దగం దండ్రిచెం
గటఁ బేరోలగమందుఁ బీఠముల విన్యాణంబుగా నుండ్రు ప్రా
కటమా ముక్తిచతుష్టయం బనఁగ భూకాంతుండు నవ్వారితో
నిటు నిచ్చల్ ముద మొందు నాతఁ డహహా! యేపుణ్యముం జేసెనో? 40

వ. క్రమమ్మున నాబాలకుల కాఱవవత్సరం బేతేర దశరథుం డాచార్యుఁడగు వసిష్ఠునితో నాలోచించి బ్రహ్మవర్చసకాముఁడగు విప్రున కైదవవత్సరంబునను, బలకాముఁడగు క్షత్రియున కాఱవవత్సరంబునను, ధనకాముఁడగు వైశ్యున కష్టమవత్సరంబున నుపనయనసంస్కారంబు విహితం బగుట వారల కుపనయనంబులు నెఱవేర్చి వసిష్ఠునికడ విద్యాభ్యాసమ్మున కొప్పగించినంత. 41

ఉ. వేదము లంగము ల్వివిధవిద్యలు నాటకముఖ్యముల్ ధను
ర్వేదముఁ దద్విశేషము లవిస్మృతితోడఁ బఠించి యొజ్జపై
సాదరభక్తిఁ జెందుచు నిరంతరదంతురితాత్మశక్తి సం
పాదితపాండితీసుమహిమం దనరారిరి విజ్ఞులౌ ననన్. 42

చ. ఇటు గురునింట వారు వసియించుచు నిచ్చలు బ్రహ్మచర్యముం
బటుతరనిష్ఠఁ జల్పి గురువర్యుఁడు సైన్యము దోడరా ధరా
కటకములోని తీర్థములఁ గాంచి నిమజ్జన మొంది పూతులై
వటువరు లర్ధవర్షకృతపర్యటనుల్ పుర మేగి రెల్లరున్. 43

వ. రామలక్ష్మణభరతశత్రుఘ్ను లిట్లు సకలవిద్యావినీతులై గురుపితృజనానురాగ పునీతులై యయోధ్యానగరమ్మున సుఖం బుండునంత. 44

సీ. ఒకనాఁడు కౌశికుం డుర్వీశుఁ బొడఁగాంచి, యతనిచేఁ బూజితుం డగుచు వేడ్క—
దశరథ! యొకయజ్ఞతంత్రంబు నేఁ జేయ, నెంచితి విఘ్నంబుఁ గాంచకుండ
సవనరక్షకు రామచంద్రుని లక్ష్మణుఁ, గొన్నినాళ్లైన నిమ్మన్న రాజు
నలవసిష్ఠునితోడ నాలోచనముఁ జేసి, రాము లక్ష్మణు ముని రాజునకును

తే. అర్పణముఁ జేయ నాకుశి కాత్మజుండు, ప్రీతిఁ జెందుచు వారల వెంటఁ గొనుచు
నతిముదమ్మున నడచి కామాశ్రమంబుఁ జేరి, యారేయి యచట వసించె నెలమి.

ఉ. రేయి గతింప ముువ్వురు సరిజ్జలమజ్జితులైనపిమ్మటన్
బాయని ప్రేమ విద్యలను వారికి మానివరుండు తెల్పఁగా
నాయతిసౌఖ్యవాంఛ గొని యాయతికిం గురుభక్తితోడ న
త్యాయతబాహు లాదశరథాత్మజు లిర్వురు మ్రొక్కి రయ్యెడన్. 46

చ. కలికి మహేంద్రునందుఁ జిరకాలనిబద్ధమనస్క యౌటచేఁ
దెలిసియు నాతనికి సుఖరతి ప్రమదంబునఁ దేల్చె నంత నీ
వలను మహేంద్రుఁ డేగుతఱి వానినిజాకృతిఁ గాంచి గౌతముం
డలుగుచు వారొనర్చిన దురాచరణంబు గ్రహించె త్రోవలో. 62

వ. అని చెప్పి కౌశికుండు మఱియు రామచంద్రునితో నిట్లనియె. 63

మ. ధనమత్తుల్ పొగరెక్కి కాముకగుణాంధత్వమ్మున న్వావి వ
ర్తనము న్వర్ణవిభాగము న్విడిచి జారత్వమ్ముచే నుత్తమాం
గనల న్మాయల బల్మిఁ గూడిన యశోనాశమ్మునుం జెంది యా
ఘనబాధాకరనారకప్రబలదుఃఖం బందరే? రాఘవా! 64

చ. కులము గణింప రెంతయును గొప్ప నశించు నటంచుఁ జూడ రీ
యిల నపకీర్తికి న్వెఱువక సరివారలు నింద జేసినం
దలఁకరు తల్లిదండ్రులకు దైవతకోటికి జంకబోక చం
చలలగు కామిను ల్విటులసంగతిఁ గూడెద రయ్య రాఘవా! 65

చ. తనకులధర్మము న్విడిచి దారము గట్టినవాని రోసి వం
చనము నొనర్చి బందుగు లసహ్యముఁ జెందఁగ దుష్టయై ధనాం
గనగతి జారునిం గలిసి కామసుఖమ్ములఁ జెందునట్టి యా
వనితను బల్మి నగ్నిఁ బడవైచినఁ బాపము లేదు రాఘవా! 66

వ. ఇట్లు గౌతముం డాశచీకాంతుం జూచి సురాధమా! ధనమదాంధులగువారలకు నాశనకాలము సమీపించు తఱి నిట్టి యధమాధమంబగు దురూహ జనించుట నైజమే కావున నీవును త్రిలోకీసామ్రాజ్యైశ్వర్యమదాంధుండ వగుట మానప్రాణధనరాజ్యైశ్వర్యనాశంబునకై యీనీచకృత్యం బొనర్చితివి. మున్ను నహుషుం డింద్రుఁడై నీభార్యయగు శచిని నే నింద్రుఁడఁ గాన నీ వింద్రాణి వగు మన్న నాయుదంతమును నీవు పదభ్రష్టుఁడవై పద్మనాళాంతరమున దాఁగి కొంతకాలమునకు వచ్చి విని యెంత దుఃఖాభిమానరోషవివశుండ వైతివో మఱచితివే? పరభార్యలట్టివారలు గారా? యానాఁడు శచీకాంతకు మానభంగము రాకుండఁ గాపాడి రక్షించినవారు బృహస్పతిమున్నగు తాపసులు గారా? ధనమదాంధుఁడగు నహుషుని నేత్రమ్ములకు దరిద్రాంజనం బలఁది గ్రుడ్డితనముఁ బోఁగొట్టి మన్ను మిన్ను గన్పడునట్టులు పదభ్రష్టునిఁ జేసి యిలపై నధమజన్మ మొందునట్లు శపించి నీ కుప

కృతి సేసినవారు తాపసులు గారా? నిన్ను వెండియు రాజ్యరమ వరించునటులు చేసి త్రిలోకీసామ్రాజ్యసింహాసనాసీనుఁగాఁ జేసినవారు తాపసులు గారా? అట్లు చెడి బ్రతికి మదాంధుండవై బ్రాహ్మణద్రోహివై విశ్వాసహీనుండవగు నోతులువా! నీ కిపుడు తాపసాంగనాభిలాష మయ్యెనా? కానిమ్ము. నీ విఁకఁ దాపసులశక్తిఁ జూచెదుగాక యని మఱియు. 67

ఉ. పాఱు లశక్తు లంచు లఘుభావము మీఱఁగ నిన్నుఁబోలు దు
ష్కారులు తాపసాళి కపకార మొనర్చిన సాఁగివచ్చునే?
యారయ వేనభూపనహుషాదులు బ్రాహ్మణనిందఁ జేసి య
వ్వారిగ నాశముం గనరె? యవ్వారలకంటెను నీవు గొప్పవే? 68

వ. కావున నోకామాంధా! నీవు సహస్రదుర్భగశరీరుండ వగుదుగాక యని శపింప నమ్మునిని బ్రసన్నునిగాఁ జేసికొని తనకుమాత్రమే యోనులుగాఁ గాన్పించుటకును బెరవారలకు నేత్రములుగాఁ గాన్పించుటకును వరంబు వడసెఁ గాన నింద్రుండు నాఁటగోలె సహస్రాక్షుం డనఁగఁ బరఁగె నిట్లింద్రుని శపించి యుటజంబుఁ జేరి సక్రోధుండై యహల్యం గాంచి నీ వీనిర్జీవవనంబున శిలవై యుందువుగాక యనిన నామె పశ్చాత్తాప మొంది శాపముక్తికై పతిం బ్రార్థింప గౌతముండు నీవట్లు చిరకాల ముండుతఱి శ్రీమన్నారాయణుండు రవివంశమ్మున రామచంద్రాహ్వయంబున నవతరించి కారణాంతరమున నీచెంత కేతెంచు నమ్మహనీయపాదపరాగసంపర్కమునం బూతవై పూర్వరూప మొంది నన్నుం గూడెద వంచు నుడివెఁ గాన నోరామా! నాఁటనుండియు నహల్య శిలారూపము నొంది నీదర్శనమ్మునకై యిటు తపించుచు వేచియున్నది గాన దీనిం బరమపవిత్రురాలిగాఁ జేయు మన రాముఁడును దనపదపరాగమున నామెను విధూతపాపగా నంగీకృతపూర్వరూపగాఁ జేసె నంత జేజేలు విరులవానఁ గురియింప మింట గంధర్వగానంబులు జెలంగ నచ్చరల యాటపాటలుం దనరారఁ దత్కాలం బఖిలజంతుసంతోషకారణం బయ్యె మఱియు.

ఉ. గౌతముఁ డల్కమీఱ నదిగా శపియించిన దండకాటవిం
గౌతమి యంచు నామమెసఁగన్ బ్రవహించె నహల్య విశ్వవి
ఖ్యాతరఘూద్వహాంఘ్రికమలాగ్రపరాగపునీత యయ్యెనన్
స్ఫీతచరిత్రఁ గొందఱు వచింతురు మానివరేణ్యు లొప్పుగన్. 70

తే. కల్పభేదంబుచే రామగాథ పెక్కువిధములై యుండు నొక్కటేవిధము గాదు
యెప్పు డేముని యేరీతిఁ జెప్పె నట్టి, యార్ష భేదము లెల్ల సత్యములె తలఁప. 71

వ. ఇట్లు ఆయహల్య పరమపవిత్రయై రాముఁ బూజించి నిటలతటఘటితాంజలి యై యిట్లు వినుతించె. 72

## —* అహల్యాస్తవము *—

మ. కరుణాసాగర ! పాదభక్తజనరక్షాదక్ష ! దుర్వారదు
ర్భరబాధాకరసంసృతిప్రబలపారావారసంతారకా !
సరసీజాయతలోచనా ! హరి ! నమస్కారంబుఁ గైకొమ్ము దే
వ్వరకోట్యర్బుదసుందరాంగ ! రఘురామా ! భక్తకల్పద్రుమా ! 73

మ. ఘనదేహ ! రఘురామ ! రాఘవ ! రమాకాంతాభిరామా ! యటం
చును నిన్నే స్మరియింప నాయఘము లెందుఁ బోయెనో నేను బూ
తను నిర్దోషఁ గృతార్థ నైతి నహహా ! త్వన్నామమాహాత్మ్యము
న్ననమం జెంచఁగ నావశం బగునె ? రామా ! భక్తకల్పద్రుమా ! 74

మ. నిను వీక్షించినమాత్ర మోద మెడఁదన్ జేకూరె నాకింత నీ
గనియుం జెంచిన కోసలాత్మజకు నా కౌతూహలం బెంతయో
ఘనులౌ యోగులకుం గనంబడని నీ కాల్దమ్ములం గంటి నో
మనుజాకారరమాసతీశ ! రఘురామా ! భక్తకల్పద్రుమా ! 75

మ. ఘనపాపం బొనరింప నన్నుఁ గని నాకాంతుండు నిర్దోషతా
నను జేయం దలపోసి "సర్వవిభుఁడౌ నారాయణుం డింతికో !
యినవంశమ్మున రాముఁడై పొడమి నీ యేనన్నుఁ బోగొట్టు" నం
చనె నట్లయ్యె భవన్మహత్వమున రామా ! భక్తకల్పద్రుమా ! 76

మ. క్షమ నాకంటెను దను లేరి ? మఱి నీరకంబెం బ్రబదీనావన
క్షము లేరి ? కరుణాసముద్ర ! యిటు నీ గానంగ నాపాపపం
కము సూర్యాన్వయసంభవుండ వగుటం గాంబోలు నెంచె న్మహా
త్మ ! మహాంభోధరనీలదేహ ! రఘురామా ! భక్తకల్పద్రుమా ! 77

మ. వరయోగీంద్రులు యోగశక్తిని భవత్పాదారవిందమ్ము లం
తరహృత్పీఠమునందు నిల్పి నిరతధ్యానాదియోగాంగసుం
దరపుష్పంబులఁ బూజ సేసి పరమానందాబ్ధిలో నుండ రే
యరయన్ యోగిజనాభిగమ్యుఁడవు రామా ! భక్తకల్పద్రుమా ! 78

మ. సువిరాజన్మధుపాయసాజ్యదధిమత్సుక్షీరమార్ద్వీకపుం
డ్రవరిష్టేక్షురసామ్రశర్కర లనంతా ! శాశ్వతస్వాదుతా
ప్రవణంబౌ భవదీయనామరుచికిన్ భావింప గ్రిందౌగదా
యవనిన్ సామ్య మిఁకేమి కల్గు రఘురామా ! భక్తకల్పద్రుమా ! 79

మ. భవసాహస్రపరంపర న్మును లసద్భక్తిప్రపూతాత్మ నీ
మవరాంఘ్రిద్వయి నెంత గొల్చితినో ! పాఘుస్వాంత ! దీనావన
ప్రవణా ! రాఘవ ! ధన్యు నైతి నిఁక నేభక్తుల్ ననుం బోల రీ
యవని న్నాకౌకలోటు లే దహహా ! రామా ! భక్తకల్పద్రుమా ! 80

## దండకము

శ్రీమద్రమాకామినీమానసాంభోజభృంగా ! లసత్పాణిపంకేజభాస్వద్రథాంగా ! పతంగావళీనాథరంగత్తురంగా ! దయాపాంగసంవీక్షణప్రాప్తిసంతుష్టభక్తాంతరంగా ! నమల్లోకపాపౌఘభంగా ! భుజంగాధిరాట్తల్పసంవేశితాంగా ! పతంగాన్వయాంభోధిరాకాసుధాంగా ! దశస్యందనక్ష్మాతలాధీట్కుమారా ! కుమారీచతూలాద్రివాహూలసారా ! సుసాధ్వీమణీకోసలేశాత్మజాగర్భసచ్ఛుక్తితారా ! సుమేరూర్వరాభ్రోపమానాథ్యధీరా ! జగద్భారనిర్వాపనోరీకృతస్తుత్యమాయామనుష్యావతారా ! మహాతారకాఖ్యాకసన్మంత్రసమ్యగ్జపాధీనసద్భక్తచిత్తాబ్జనిత్యప్రచారా ! దిశాస్త్రైణచేలాయమానామధీనాయకాచ్ఛాతపాకారకీర్తిప్రపూరా ! మహాసంపదాళీజితేంద్రా ! దయాసాంద్ర ! శ్రీరామచంద్రా ! భవచ్ఛక్తి వర్ణింప శేషాహిభాషేశ్వరాచార్యులుం జాల రన్న న్బలీ ! మూఢనౌ నేను వర్ణింపఁగా నేర్తునే దేవదేవా ! గృహారామవిత్తాదులం దాశ వర్జించి యంతర్భవద్వైరిషట్కంబు నిర్జించి వైరాగ్యముం గాంచి కోనం బ్రవేశించి పర్ణాంబువాతాదులై యుండి యష్టాంగయోగం బుపార్జించి నిర్జన్ సమక్షోణి పద్మాసనాసీనులై మౌనముం దాల్చి యాధారముం బార్ష్ణిభాగంబుచే మూసి తత్పూరకాద్యక్రమం బొప్పఁగా వాయువున్ లోన బూరించి నేత్రమ్ముల న్మూసి యాదృష్టిని న్నాసికాగ్రమ్ముపై సూటిగా నిల్పి చిత్తంబు నీమీఁదికిం జేర్చి యావాయువాధారముం దాటి పైపైకి వ్యాపింపఁగాఁ జేసి యారీతి బంచాబ్జముల్దాటి యాగ్నేయముం జెందఁగాఁ జేసి తన్మూలసౌషుమ్ననాడీగతిన్ బ్రహ్మరంధ్రస్థితంబౌ సహస్రారపద్మాంతరాధోముఖజ్యోతిరాఖ్యస్వరూపమ్మునం దైక్యముం జేసి తద్రూపసాక్షాత్పరబ్రహ్మమై యుండు నిన్నుం గనంగా మదిం గోర్కి సంధిల్లఁగా జ్ఞానచక్షుష్కులై నిత్య మీరీతి యోగంబు

నభ్యాసముం జేయుచున్నట్టి యోగీశబృందానకైనం గనన్ శక్యముం గాని నీదివ్యరూ
పంబు నేఁ డేను మాంసాక్షిఁ జూచితిం గాన శ్రీరామ! నేనెంత ధన్యాత్మనో? నీదు
సత్తారకం బెప్పుడున్ లోన భావించుటం జేసి నీదర్శనం బయ్యెఁ బాపంబు లెల్లం బటా
పంచలై పోయె నేనింక నీదివ్యమంత్రంబు పేడం జుమా రామ! నేనాడు వాక్యమ్ములం
దప్పులం ద్రోసి మన్నించి నీపాదనీరేజదాసి న్నను న్నిచ్చలు న్నీదు మంత్రానుసంధాన
పారీణగాఁ జేసి యానందపాథోధివార్మగ్నగాఁ జేసి తాపత్రయిం బాపి సంసారదుఃఖ
మ్ములన్ మాపి నాపై దయం జూపి యోంకారరూపుండవై నట్టి నీలోన నేకత్వముం
జెందఁగాఁ జేసి రక్షింపు మి ట్లెప్పుడు న్వందనమ్ముల్ ఘటింతుం జుమా నీలమేఘాభ
మూర్తీ! జగత్కీర్తీ! సమద్భక్తకామప్రపూర్తీ! ద్యుమచ్చక్రవర్తీ! లసద్రూప!
శ్రీరామమూర్తీ! నమస్తే నమస్తే నమస్తే నమః. 81

వ. అని యహల్య భక్తిప్రవణచిత్తయై నుతించి పూజించినంత రామచంద్రుండును. 82

తే. గౌతమున కామె నర్పించి కౌతుకమున, గాధిజాదిమునీంద్ర సంఘమ్ముతోడ
కొంత దూరము గడచి తత్ప్రాంతమందు, గంగ రంగత్తరంగనుఁ గనియె నెదుట.

వ. అద్దాని దాఁట నుద్యమించి గాధిజాదులు నావపై నెక్కినపిదపఁ దాను నెక్కుట
కుద్యమించు రాముని నివారించి నావికుం డి ట్లనియె. 84

చ. కడిగెద నీపదాబ్జములు కల్గకు జాలి కదెంతవాసి నీ
యడుగుల ధూళి జాతి నొకయింగనగా నొనరించె నంచు ని
ప్పుడె యొక గాథ వింటి నిఁక భూవర! నీపదరేణు యుక్తి నా
పడవ పడంతి యైన నుపవాసముతే గతి మాకు నీపయిన్. 85

తే. కలుగు నింకొక్కబాధ యోకంజనేత్ర, యున్న నొకయాలియింట మఱొక్కయాలి
యైన నిద్దఱి భరియింప నలవి యగునే?, జాతి కలవాఁడఁ గాను నీపుణ్యమాయె.

తే. అనఁగ రాముఁడు మందస్మితాభిరాముఁ, డగుచుఁ దత్పూజితాంఘ్రిద్వయంబుమీఁఱ
నావపై నెక్కి యపుడె జాహ్నవిని దాఁటి, మిథిల దరిఁ జేరె మౌనిసన్నుతుఁ డగుచు.

చ. జనకుఁడు పిల్వ రాజులును సంఘముగా బహుకోటిసంఖ్య నా
తని నగరంబు చేరిన విశేషంబును రావణుఁ డాలకించుచున్
ఘనతరపుష్పకంబున నఖండనిశాచరసైన్యయుక్తుఁడై
చనియెను పిల్వ కుండినను జయ్యన నప్పురి మైథిలీస్పృహన్. 88

తే. రామలక్ష్మణు లమ్ముని రాజుతోడ, నేగియుండుటఁ బుత్రవియోగమునను
జెందమం దెంతయో కుందుచెందు కతన, దశరథుం డొక్కఁడే రాక తక్కెనటకు.

మత్తకోకిల. గాధిజాతుఁడు వచ్చె నంచును గౌతుకం బలరారఁగా
మైథిలుం డతనిం గన న్నిజకర్మమంత్రిమండలితోఁ దదా
రాధనాదరబద్ధభక్తిభరప్రపూర్ణత నుండ నా
గాధిజాతుని ముఖ్యశిష్యుఁ డొకండు వచ్చి రయమ్మునన్. 90

వ. ఏను కౌశికశిష్యుండ మాగురువరుఁ డేకాంతమ్మున నీతో నొకవార్త నుడివి రమ్మని పంచె నని యాతఁడు జనకకరం బాత్మకరంబుచేఁ గీలించి యేకాంతమ్ముఁ జేరి యి ట్లనియె. 91

చ. కుశికతనూజుఁ డీగతిని గూరిమిఁ జెప్పుమనె న్నృపాలకా!
దశరథసూను లిద్దఱను ధ్వర్గృహసీమకుఁ దోడి తెచ్చితిం
బశుపతిచాప మెక్కిడ సమర్థుఁడు రాముఁడు సీత నూర్మిళ
న్వశముగఁ జేసి వారికి వివాహము సేయఁగ నెంచుమా మదిన్. 92

ఉ. మానవనాథ! యీమఱుఁగుమాట మనమ్మున నుంచి యిప్పు డీ
మానవనాథసూనులను మానుగఁ బెండ్లికుమారు లట్టులే
యేనుఁగుజంటపైన నగరేగునటు ల్గొనిపొ మ్మటంచు నీ
తోఁ ననుఁ బంపెఁ జాపమును ద్రుంచెడు నంతకు గోప్యమం చనెన్. 93

వ. ఇట్లు వచియించి కౌశికశిష్యుండు గురుసన్నిధి కేగునంత జనకుండు నెఱుంగనివాఁడ పోలెఁ బ్రోలలంకరింపఁ బంచి భద్రగజద్వయంబును సైసేసి మంగళవాద్యపురస్సరం బుగా నాటబోటుల యాటలు చెలంగ మహారాజోపచారార్హమంగళవస్తుప్రకరా న్వితదాసీదాసజనమ్ములతో సుమేధాదిరాజయువతీసముదయంబుతోఁ గూడి విశ్వా మిత్రునిచెంత కేగినఁ గౌశికుండు వాత్సల్యసర్వస్వమ్ములైన శాంతిమధురవీక్షణమ్ముల నాక్షమాధీశు నాదరించి కుశలప్రశ్నాదుల సంభావితుం జేసిన. 94

చ. అనఘుఁడు మైథిలుండు సచివాన్వితుఁడై కుశికాత్మజాతునిం
గని నతుల న్సపర్యల నఖండవిధిం బచరించి స్వాగతం
బనుచు నెఱుంగనట్టులె యజాత్మజసూనుల రాము లక్ష్మణుం
గనుఁగొని గౌరవించుచు వివేకస్వరసుస్వర మొప్ప ని ట్లనెన్. 95

కం. వీ రెవ్వరయ్య గాధిజ?, సారసనేత్రులును జానుసమ్మితబాహుల్
మారద్వయమో? యశ్వికుమారులొ? యేపుణ్యరాట్కుమారులొ? చెపుమా.

తే. అనఁగ విని గాధిజాతుఁ డిట్లనియె జనక!, వీరు దశరథపుత్రు లుదారబలులు
పూతమౌ సూర్యకులమునఁ బుట్టినారు, రామలక్ష్మణనామకుల్ భూరియశులు.

వ. అన విని జనకుండు రామలక్ష్మణులను జీనీచీనాంబరాభరణంబులచే నలంకరించి గజారూఢులం గావించి మునిబృందసహితంబుగా మంగళకాహళాదిరవంబు లలర స్వయంవరరంగంబునకుఁ గొంపోవుతఱిని పౌరసుందరీమణు లెల్ల సౌధోపరితలంబుల దేవకామిను లంబరంబున నున్నగతి నిల్చి గజారూఢులై యూరేగుచు వచ్చుచున్న రామలక్ష్మణులఁ గాంచి యందు రామచంద్రునిం గూర్చి యి ట్లనుకొనిరి.

సీ. ఈతఁడా? తాటక నీక్షించి యొకకోలఁ, జంపియున్నట్టి యాజానుభుజుఁడు
ఈతఁడా? యాగాధిజాతుని జన్నంబుఁ, గాపాడి వెలసిన భూపసుతుఁడు
ఈతఁడా? మారీచు వాతాంబకముచేత, నబ్ధి వైచిన సుమహాబలుండు
ఈతఁడా? పదధూళిచేతఁ జత్రాతిని, నాతిగాఁ జేసిన పూతచరితుఁ
తే. డింతులార! విచిత్రంబు లితనిచరిత, లమితతేజోయుతుం డీతఁ డమ్మలార!
కన్ను లున్నందులకు సార్థకంబు గాఁగఁ, జూడఁదగు సుందరాంగునిఁ జూడఁగలిగె.

ఉ. కన్నులు చూడు మమ్మ! యటఁ గర్ణము లద్దుగ నుండెఁ గాని లే
కున్న శిరంబుఁ జుట్టఁ జనునో యనునట్టులు సోగలై తగం
బున్నమచందురుం దెగడు మోముఁ గనుంగొను మమ్మ! పీని నో
యన్నువమిన్నలార! కవులైనను బన్నగ నెన్న లే రహా! 100

ఉ. మనసీతమ్మను బెండ్లియాడఁదగు నీరామాన్వ్యాగ్రణుం డామె చే
సిన పున్నెం బది యెట్టు లుండెనొ కదా శ్రీనాథునిం గూర్చి వం
దనము ల్జేయుద మమ్మలార! మనసీతకా రాముఁడే పెండ్లియా
డను మత్కాంక్షితసిద్ధి నీయఁగను లేదా? యిట్లు ప్రార్థించినన్. 101

ఆ. సీత కూర్మిళకును శ్రీరామలక్ష్మణుల్, తగిన మగలు సుండి తరుణులార!
పూర్వజన్మసుకృతమున నట్టు లే యగుఁ, గాక శ్రీహరికృప గలుగుఁ గాక. 102

సీ. చానరో! యీరామచంద్రునిఁ గన్న యా, కౌసల్య యేనోముఁ జేసె నమ్మ!
ఈమోహనాంగు నిరీక్షింప సాకేత,పురనారు లెంత చేసిరొ తపమ్ము
పావనం బగు రామపదసంగతిఁ గనంగ, సాకేతపుర మేమి సలిపెఁ దపము
ఈరామచంద్రుతోఁ బోరాములఁ జరింప, నాపౌరు లొందు పుణ్యాం బదెంతొ?
తే. మనము నిచ్చట నీసుకుమార దేహుఁ, గాంచి యుంటిమి కన్నులకఱవు దీఱఁ
గడు ముదం బయ్యె శ్రీనాథుఁ గాంచినట్లు, జన్మము తరించె మనకు నోసకియలార!

వ. ఇట్లా కాంతలెల్ల సౌధాగ్రమ్ములనుండి పూలు జల్లుచు నానందించుచుండ రామలక్ష్మణులు మహావైభవమ్ముతో నూరేగి జనకసభాగృహద్వారంబుచెంగట నేనుం

గులనుండి భటకరావలంబనులై డిగి మంగళవాద్యపురస్సరంబుగా లోని కేగి రంత
తక్కిన రాజన్యు లందఱు నుచితకాంచనపీఠసమంచితమంచంబుల నుండి జనకుం
డొనర్చిన రామలక్ష్మణసత్కారవైభవప్రకారం బుపలక్షించి యసూయాన్వితులై
తమలోఁ దా మిట్లనుకొనిరి. 104

చ. జనకుఁడు రామలక్ష్మణుల సంతస మొప్పఁగ నుత్సవమ్ముతో
ఘనతరమంగళధ్వనులు గౌతుక మొప్పఁగ మ్రోయఁ దెచ్చెఁగా
మన కిటు చేసెనే? నృపతిమండలిఁ గొందఱ గౌరవించుటల్
మనమున నెంచి చూడ నవమానము గాదొకొ తక్కువారికిన్. 105

తే. మనకుఁ దెలియఁగనీయక మైథిలుండు, సీత రామున కర్పించునో తలంప
మనల రమ్మనుటేల యీమాత్రమునకు, శివధనుర్భంగపణ మిందు చేయనేల ?

తే. అనెడు రాజన్యవరుల వాక్యముల నెల్ల, దాశరథులును జనకుండుఁ గౌశికుండు
వినిరి పిమ్మట రాజులు ధనువు జూడ, వేడ్కఁగొన జనకుండు దెప్పించె ధనువు.

వ. అనిన దాక్షాయణి యను నాథా! భవదీయప్రభావయుక్తంబగు నచ్చాపం బచ్చటి
కెట్లు చేరెనో దాని సారం బెంతయో వినఁ గుతూహలం బయ్యెడు నుడువు మన
నీశుం డిట్లనియె. 108

తే. పరశురాముఁడు నాకడ భక్తి మున్ను, సాంగముగఁ జాపవిద్య దాఁ జదివియుండ
వాని కిచ్చితి నాధనుర్వరము నంత, భార్గవుఁడు దానిఁ గొంచు దోర్బలము కలిమి.

మ. తనతండ్రి న్వధియించుకారణమునం దచ్చాపముం బూని వే
చని మాహిష్మతినాథునిం దునిమి విస్తారక్రుధం జెంది నెం
టనె ముయ్యేడగుసారు లెల్ల ధరణీనాథావళిం ద్రుంచి యా
ధనువు న్మైథిలునింటిలో నిడి ప్రశాంతస్వాంతుఁడై యుండఁగా. 110

ఉ. సీత యొకప్డు డాధనువుఁ జేకొని చెంగటి తోఁటలో సఖీ
వ్రాతముఁ గూడి యావిలుఁ దురంగమముంబలె నెక్కి యాడ నా
సీతకుఁ గల్గు లక్షణవిశేషము లన్నియుఁ జూచి యా జగ
న్మాతృపరావతార మని తాఁ దలపోయుచు భార్గవుం డటన్. 111

చ. జనకునిఁ జూచి యీగిరిశచాపము నెక్కిడ నెవ్వఁ డోపు నా
తనికె ధరాజ నీయ శపథమ్మొనరింపుము నేఁడె భేరికా
నినదముతోడ నెల్లధరణీవరపాళికిఁ జాటఁ బంపుమం
చని చనె మౌనిరాజు నృపుఁ డట్ల యొనర్చెఁ గ్రమక్రమమ్ముగాన్. 112

వ. కావున నాజనకుం డొనరించు స్వయంవరరంగమందు రాజన్యు లెల్లరుఁ జేరి ధను
ర్ద్విధృక్షాయత్తులై యుండుతఱి జనకుండును. 113

ఉ. పంచశత్రప్రమత్తవృషభంబులచే వహియింపఁ జేసి త
న్మంచగతావనీపతిసమాజము ముందట రంగభూమిలో
నుంచిన రాజులు న్మునులు నుత్సవ మొప్పఁగ రామలక్ష్మణుల్
మించిన భక్తిఁ జూచిరి యమేయసురూపము నీశచాపమున్. 114

ఆ. జనకుఁ డిట్లు ధనువు సభలోనఁ బెట్టించి, లేచి నృపుల నెల్లఁ జూచి యనియె
నీధనుర్వరంబు నెక్కిడువానికి, సీత నిచ్చి పెండ్లి సేయుదు నని. 115

వ. అంత రాజన్యు లందఱుఁ దమశక్తిసమర్థతలఁ బరస్పరంబు నుడివికొనఁ బుట్టిన
రవంబు కోలాహలంబుగా సముద్రరవంబు ననుకరించుచుంటఁ గొందఱది దుర్భరం
బనువారును, దానిచెంత కెక్కిడ నేగి యెక్కిడలేకున్నఁ బరాభవం బనువారును,
దత్ప్రయత్నమే మాని యూదలలు వంచుకొనియున్నవారును, వచ్చితిమి కదా
యెక్కిడి చూడక యేగుటమాత్రము లజ్జాకరంబు గాదా? యనువారునై, యనేక
విధమ్ముల నుండి రందు. 116

## రావణాదులు చాప మెత్తఁబోయి పరాభవ మొందుట

తే. నడుము బిగియించి యెత్తలేనా యటంచు, ధనువు దరిఁజేరి కదులుపఁ దరముగాక
విన్ననై కాలుజాఱి భూవిభులు నవ్వఁ, బుడమిఁబడియెను సిగ్గరియొడయఁడొకఁడు.

ఉ. ఒక్కఁడు లేచి మీసముల నొప్పుగ దువ్వుచు మల్లఁ గొట్టి యీ
తక్కుడువిల్లు నెత్త నరుదా? యని చేరియుఁ బ్రాణ మెల్లఁ దా
నుక్కఁగఁ బట్టి కేలుగవ నున్నని యెత్తఁగఁబోయి యెత్తలే
కుక్కిరిబిక్కిరిం గొనుచు నుర్విఁ బడె న్నరివారు నవ్వఁగన్. 118

ఉ. భూతలనాథుఁ డొక్కఁడు ప్రభూతతరయంబునఁ బోయి చాపముం
జేతుల నెత్తి నారిఁ గొనఁ జేరుపలేక తటాలునం గటా!
సీతఁ గొనంగ వచ్చితిని సీ! యవమానముఁ గల్గె నంచుఁ దా
భూతలమందు విల్విడిచి పోయెను సిగ్గున గ్రుగ్గి యూర్పుతోన్. 119

మ. ఇటు లాచాపము నెత్త నెక్కిడఁగ వారెవ్వారలుం జాలకే
పటుదోస్సారముఁ గాల్పనే యనుచు గర్వం బేది పేరాసచే

నిట కేతెంచుటె తప్పు దుర్యశము మా § కిట్లయ్యెనం చెంచి పి
మ్మట రాజుల్ తలవంచి యుండిరి కడున్ § మందాక్షమందాక్షులై. 120

ఉ. అంతట రావణుండును ద్వి§రాస్యతుఁడై నృపులు స్వదేహభూ
కాంతుఁడును స్వినం బ్రబల § గర్వము మీఱఁగ నవ్వుచున్ ధనుః
ప్రాంతముఁ జేరి యిట్లనియె § బాహుబలాఢ్యులు గానివారి కా
వంతయు నెత్త శక్య మగు§నా ? యిఁక నాదగు శక్తిఁ జూడుఁడీ. 121

మ. జనకా ! విన్ము సురాసురవ్రజము నే § సంగ్రామరంగంబునన్
ఘనబాహాబల మొప్ప గెల్చితిఁ ద్రిలో§కఖ్యాతి నార్జించితిన్
మును కైలాసముఁ బాతునం గదిపి యేఁ § బూబంతి యట్లెత్తితిన్
ధను వేపాటిది నాకుఁ జూడుఁడు ప్రసూ§నం బట్టు లాడించెదన్. 122

చ. అని మదమొప్ప వామ మగు§హస్తముతో నెగయింపఁ బోయి యా
ధనువుఁ గదల్పలేక మఱి § దక్షిణహస్తము సాచి పట్టియున్
గొనయుఁ గదల్పలేక మఱి§కొన్ని కరంబులఁ బట్టి యెత్తఁబో
యినఁ జలియింపమిం గని బళా ! యని యచ్చెరు వాత్మఁ దోఁపఁగన్. 123

ఉ. రావణుఁ డంత నిర్వదిక§రంబులఁ బట్టి పెనంగి వాయువున్
శీవిగ బిగ్గవట్టుచుఁ బ§లిష్ఠభుజాబల మెల్లఁ దోఁపఁగాఁ
జేవ చలంబు గర్వమును § జిత్తములోఁ గడు సందడింపఁగా
నీవిలు నెత్తకున్న హసి§యింపరె జెండ్లని సాహసమ్మునన్. 124

మ. ఒకకోణం బిల నూతఁ జేసి వడిఁ బె§ల్లార్పుల్ చెలంగం గర
ప్రకరంబుం బఁరగించి విల్పు ధనువుం § బ్రస్విన్నసర్వాంగుఁడై
యొకకే లుర్వికి సాచె నారిఁ గొనఁగా § నూహించి యాలోన నే
సకలాంగంబు చలింప విల్లెదఁ బడ § న్సర్వంసహన్ దాఁ బడెన్. 125

చ. ఉరమునఁ బడ్డ చాపము మ§హోజ్జ్వలదీర్ఘసుపీవరంబులా
యిరువదిబాహులం బుడమి § కేపునఁ ద్రోయఁగ లేక భీతుఁడై
యఱచుచు నార్తుఁడై చెమట § లంగము నింపఁగ లాల గాఱ గ్ర
చ్చర ముకుటాళి పేడ సుర§శత్రువు కచ్చయుఁ జాఱ దీనుఁడై. 126

తే. నెలికిఁ బడి నోరు విప్పి తా§ వెఱ్ఱిచూపుఁ, జూచు చేమియుఁ దోఁచక § స్రుక్కుచున్న
రావణునిఁ జూచి సభలోని § రాజులెల్లఁ, గరము నవ్వుచుఁ జప్పటల్ § జఱచి రంత.

తే. పంక్తిముఖ మంత్రిముఖ పరివారమెల్ల, నేకమై పట్టి చాపంబు నెత్తలేక
దోసమేసేయుదు మక్కటా! యుంకటించు, మూర్ఛబోయఁగ నలసటనొందె నపుడు.

చ. జనకుఁడు లేచి భూమిపతిసంఘముఁ గాంచి వచించె నిట్టు లో
జనపతులార! రావణుఁడు చాపమున నుంచిన నూరకుంటిరే
పని తగు నయ్య? బాహుబలగర్వులు గల్గిన నీసభాస్థలిఁ
ధనువును దీసి రావణుని దప్పక ప్రాణము నిల్పి కావరే! 129

చ. అన నసమర్థులౌట వసుధాధిపు లూరక యుండ రాముఁ డా
మునిపతిఁ గన్బొమ న్నిలచి మున్నగు రీతినిఁ జూచెఁ దోడనే
మునియును రామ! నీవు మృతిఁ బొందుటఁ జూచెదె? వేగ నేగి యా
ధను వెకలించి ప్రాణములఁ దప్పక నిల్పి యనుగ్రహింపుమా. 130

సీ. అనుటయు రాఘవుం డపరిమితోత్సాహ, హర్ష విస్ఫురితాననాబ్జుఁ డగుచు
నంగీకరించి తా నమ్మునివరు మ్రొక్కి, కంఠహారాదులఁ గట్టిపెట్టి
కటిచేలముకుటముల్ గట్టిగా బిగియించి, గజగామియై సభాంగణముఁ జేర
నవనీశు లెల్లరు నత్యంత విస్మయచకితాక్షులై చూచి సంభ్రమమున
తే. పలుకఁ జొచ్చిరి వారిలో వార లిట్లు, మనకె సాధ్యము గాదని మానుకొనఁగ
నీతఁ డేగెడు నేలొకో యింతమూర్ఖుఁ, డేమి తలఁచెనో శివచాప మెత్తుటనఁగ.

ఉ. కుందెడి రావణుం గన నొకో! చనుచుండెను కాదు కానహా
కందువ గాన నాటలకుఁ గాఁ జనుచుండెనొ? కాదు హారముల్
క్రిందుగ వ్రేలకుండఁగ బిగించుచునుండెను హాని గాధిజుం
డిందుధరాఢ్యకార్ముకము నెక్కిడఁ బంపె నిదేమిచిత్రమో! 132

తే. దశముఖుండును సకలభూధవులు నిచట, విముఖులై యుండ నిప్పని యేని కగునె?
మూఢబాలున కింతటి పొగరు తగునె?, బళిర తానేడ? పెన్విల్లు బట్టుటేడ?
కం. అని రాజులు తమలోఁ దమ,రనుకొనుచు న్వింత గదుర నౌరా! యనుచున్
మనమున సంశయ మొందుచుఁ, గనుదమ్ముల రామచంద్రుఁ గనుఁగొనుచుండన్.

ఉ. అంతట మైథిలుండు గుశికాత్మజుతో ననె రాము నీసభా
భ్యంతరసీమ కేల యిటు పంపితి మౌనివరేణ్యా! సర్వభూ
కాంతులు రావణుండు శివకార్ముక మెక్కిడ నోడియుండి రీ
ప్రాంతముఁ జేరి బాలుఁ డగు రాముఁడు చేయున దేమి గాధిజా! 136

కం. పుడిసెఁడు జలముం ద్రావినఁ, గడుతృప్తిం గనెడు చాతకము తృష గొన్న
న్వడివడిఁ జేరిన సాగర, జల మంతయుఁ జీల్పఁ గలదె? ॥ సంయమివర్యా! 137

తే. అనుచు జనకుండు నృపులును ॥ మనములందు,సందియంబును వింతయుఁ॥జెందుచుండ
రాముఁ డాకేతి నామునిని॥ రాజు నాజ్ఞ, నొందల నహించి యట కేగు ॥ నవసరమున.

వ. సుకుమారుండు, నభినవమారుండును, సువర్ణప్రభాపటలపరికలితతేజుండును, భక్త
కల్పభూజుండును, బద్మరాగచరణతలుండును, నిస్తులదోర్బలుండును, శుభలక్షణాం
చితగుల్ఫజానూరుజఘనోదరుండును, నాశ్రితాదరుండును, మహోన్నతపీవరసార
విశాలవక్షుండును, త్రిదశపక్షుండును, నున్నతాంసశోభితత్రివళీవిరాజమానకంబుకంధ
రుండును, గరుణాబంధురుండును, సహజస్మేరసుందరాస్యుండును, సుజనోపాస్యుం
డును, బింబోష్ఠలసద్దంతరుచివినిర్జితకుందకుట్మలుండును, నిర్మలుండును, తిలకుసుమ
సదృక్షనాసికాభిరాముండును, మునిజనమనోవిశ్రమారాముండును, వినిర్మలముకుర
కపోలద్వయుండు, నద్వయుండును,. ప్రభాకరకరవికస్వరనవపుండరీకవిశాలలోచనుం
డును, భవబంధమోచనుండును, సుభ్రూసుందరార్థేందునిభలలాటుండును, జితనిశా
టుండును, సుస్నిగ్ధనీలకుంచితాలకుండును, సవనపాలకుండును, నానారత్నాలంకార
హారముక్తాహారమణిమంజీరకంకణనూపురకేయూరకిరీటముద్రికాభిరాముండును, సు
గుణధాముండును, బీతాంబరకలితుండును, లలితుండును, సభారంగన్యస్తస్వాకో
దండుండు నగు రామచంద్రుని నిజసౌధాగ్రమ్ములనుండి సుమేధాదిరాజకాంత
లానందంబుగా గవాక్షరంధ్రమ్ములఁ గన్నులపండువుగఁ జూచుచు రామచంద్రుఁడే
నారాయణుం డని యెఱుంగక యీతనికన్న వేఱుంగ నెచ్చటనో యున్నఁ డున్నవాఁ
డని భగవదాభిముఖ్యం బెంచి యమ్మదవతులు లిట్లనిరి. 139

చ. హరిహరధాతలార! జనకానంతరమం దగు మాతపమ్ముచే
వరగుణుఁ డీరఘూత్తముఁడె ॥ శైవము చాపము నెత్తెఁ గాక మా
ధరణిజ యీని కంఠమున ॥ దామము నుంచెడుఁ గాక మీర లం
దఱుఁ గృప జానకీసతికి ॥ నాథునిగా నొనరింపుఁ డీతనిన్. 140

ఉ. ఈతనిఁ జూపఁ బూర్తి యగునే? ముద మోసురలార! యీతఁ డా
సీతను బెండ్లియాడఁ దలఁచెని ॥ సేసలు జల్లెడు వేడ్కఁ జూప మా
చేతము పూర్ణసంమదముఁ ॥ జెందును జన్మము సార్థకం బగుం
జోతలు మీకుఁ బెట్టెదము ॥ సొంపుగ నట్లొనరించి ప్రోవుఁడీ. 141

వ. ఇట్లు లోకాంతలాదరమ్ముగా రామచంద్రు నీక్షించుచుం దమలోఁ దమ రిట్లను
కొనుచుండ. 142

ఉ. అంతట సీత తోడిజన ॱ కాంత్రను గూడియు మేడనుండి యా
గ్రంతల రామచంద్రుఁ గని ॱ కౌతుకభావరసౌఖ్యసాగరా
భ్యంతరమగ్నయుక్ బులకి ॱ తాంగియు స్వేదముఖప్రసాత్వికా
క్రాంతముఖాబ్జయుక్ విపుల ॱ రాగయుతాత్మయు నయ్యె నయ్యెడన్. 143

తే. మెలసి యనుపేర నొప్పు నె ॱ చ్చెలిగళంబు, నందుఁ దన కేలు గీలించి ॱ మందగమన
సుందరంబుగఁ దిరుగుచు ॱ నెందమం ద, మంద ముదమొంది యిట్లనె ॱ మందఫణితి.

తే. చెలియరో! తండ్రి శత్రుని ॱ చెలువుగాఁగఁ, గఠినతరమైన పణము ని ॱ ర్ణ్కరణిఁ బెట్టెఁ
జూడ మిది యేడ ప్రోల్లస ॱ త్సౌకుమార్య, భవ్యశుభమూర్తి యీముద్దు ॱ బాలుఁ డేడ?

ఉ. ఓ విధి! యేమిసేయఁ దలఁ ॱ పొందితొ నీమదిఁ గానరాదుగా
నావరుఁ డంచు రాముని మ ॱ నమ్మున నెంచితి వీని గాక యే
భూవరుఁ గూర్చితేని మృతిఁ ॱ బొందెద నిచ్చటనుండి కూలియో
పావకశస్త్రపాశవిష ॱ వారిముఖమ్ముల నాశ్రయించియో. 146

సీ. హరిహరచతురాస్యులార! దుర్గామహా,దేవి! సావిత్ర్యాది ॱ దేవులార!
భాస్కరదేవేంద్ర ॱ వైవస్వతాంబుప, యక్షరాడగ్నులార! సరోజ
వాసిని! ఖగనాథ ॱ ఫణిరాజకుముదాప్త, సకలదేవతలార! ॱ సదయులార!
మీరందఱును గూడి ॱ సేదురదయమీఱ, శివచాపమును బూల ॱ చెండురీతి

తే. రాముఁ డెత్తెడు నట్లుగాఁ ॱ బ్రేమ దనరఁ, జేసి నాకోర్కె సఫలంబుఁ ॱ జేయరయ్య
యిదె నమస్కారశతము మీ ॱ కేనొనర్చు,చున్నదానను మిము నమ్మి ॱ యున్నదాన.

తే. ఇటులు మీరొనరించితి ॱ రేని ఘోర, దండకాటవిలోఁ జతుర్దశసమంబు
లితనితోఁ గూడి చరియించి ॱ సతతతపముఁ, జేసి మీకర్పణంబు నేఁ ॱ జేయుదాన.

వ. అని యిట్లనేకవిధమ్ముల సీతాదేవి దేవతలఁ బ్రార్థించుచున్నంత రామచంద్రుండు
వింటిచెంతకుఁ జేరి. 149

## శ్రీరాముఁడు శివచాపము విఱుచుట

ఉ. చాపము చుట్టునుం దిరిగి ॱ శర్వుఁ దలంచి నమస్కరించి మా
తాపితృదేశికాదుల నెడఁద స్మరియించి విలాసవైఖరిన్

దాపల కేల నెత్తి వెస దక్షిణహస్తముచేత నారినిం
గోపునఁ జేర్చి మీటుచు నకుంఠితశక్తి ధనుస్సు వంచినన్. 150

మత్తకోకిల. ఎత్త శక్యముగాని చాపము నేన్గు తూటినిఁ బోలె న
ల్లెత్తి పట్టిన రాముఁ గన్గొని యెల్లవా రితఁ డౌర! లో
కోత్తముం డని మెచ్చి రంతట నూర్జితంబుగ వాద్యముల్
మొత్తమై చెలఁగంగ వందులు మోద మంది నుతింపఁగాన్. 151

మ. ఇటు లారాముఁడు భీమచాపమును దా హేలాగతిం బట్టుచుఁ
బటుదోస్సారగుణాతికర్షణభవక్వాణంబుగా మీటినం
జటులధ్వానముతోడ ముత్తునియలై చండాశనిం బోలి ది
క్తటముల్ బ్రద్దలు గాఁగ మిన్నునఁ బ్రతిధ్వానమ్ముగాఁ గూలినన్. 152

మ. ధరణీచక్రము సంచలించె రవిచంద్రప్రక్రమం బాఁగె ది
క్కరులున్ మ్రొగ్గెను సంద్రము ల్గలఁగె రిక్కల్ రాలె లోకమ్ము లా
తురతం జెందె సరోజసంజనితుఁ డెంతో భీతిచేఁ దూగె ని
ర్జరకాంతాళి కవుంగిలించెఁ బతులన్ సంభ్రాంతమై యత్తఱిన్. 153

ఉ. రామకరప్రఖండితవిరాజితకార్ముకపాతజాతవి
స్సీమకఠోరరావవివశీకృతచంచలభీతచిత్తవై
హైమవతీ! ననుం గదిసి హస్తయుగంబునఁ గౌఁగిలింపవో
భామిని! యీసభం గలుగువారలు భీతు లనంగఁ జిత్రమే? 154

ఉ. అంతట దేవదుందుభి విహాయససీమను మ్రోగెఁ బూలు నం
తంతను రాలె నచ్చరలు నాడిరి వేడుక రంగభూమిలో
వింతగ వాద్యఘోషములు వేశ్యలనాట్యము మీఱె మాగధుల్
ప్రాంతముఁ జేరి రామవిజయమ్ము నుతించి రమందవైఖరిన్. 155

తే. ప్రమదలెల్ల గవాక్షరంధ్రములనుండి, రాముపైఁ బూలు జల్లిరి ప్రమద మొంది
జయజయధ్వానములతోడ సౌధపాళి, నవిరళమ్ముగఁ గరతాళరవము చెలఁగె.

తే. ముకుటములు వీడి కచ్చఁ బెట్టకయె సిగ్గు, వదనముల మీఱ విహ్వలభావ మమర
రావణుం డప్పుడే వెన్కక్రేవఁ గనక, దీనుఁడై లంకఁ జేరె విమాన మెక్కి. 157

మ. అనిమేషేక్షణయై ధరాత్మజ మహాహర్షోత్థరోమాంచయై
ఘనబాహుద్వయసారకర్షణవిధాఖండీభవచ్చాపు రా

ముని సోత్కంఠతఁ జూచి డెందమున నాఽమోదంబు దీపింప సో
ముని దర్శించు కుముద్వతీసతివిధంఽబుం బొందె దాక్షాయణీ! 158

ఉ. అంతట మైథిలుండు సచిఽవాగ్రణులం గని మంత్రులార! మీ
రంతిపురమ్మునం గల ధఽరాత్మజనుం గరిణీస్థఁ జేసి యం
తంత సమస్తసైన్యములు ఽ సాయుధపాణులు వెంటనంటిరా
వింతగ వాద్యము ల్దనర ఽ వేఁ గొని రండని యాన వెట్టినన్. 159

తే. అంతిపురి కేగి సచివులు ఽ నచట సీతఁ, గాంచి కేల్మోడ్పు లాదల ఽ నుంచి మధుర
ఫణితి గదురంగ నామెతోఁ ఽ బల్కి రిట్లు, మానసమ్మున మోదసంఽభ్రమము లమర.

మ. ధరణీజా! రఘురాముఁ డీశధనుఽర్దండప్రభావాఢ్యుఁడై
విఱిచెం జుమ్మి కృతార్థ వైతివి సుమా ఽ విష్ణుం రమాదేవియ
ట్లురభీముండగు రాముని బడయు మాఽత్మాధీశుఁగా లెమ్ము త
ద్వరకంఠంబునఁ బుష్పమాల నిడు ముఽత్సాహంబు దీపింపఁగా. 161

## —* సీత రామునికంఠమునఁ బూలదండ నిడుట *—

వ. ఇట్లు నుడివిన మంత్రుల మధురవాఙ్మధుధారాసారంబు శ్రోత్రాంజలులచే నాపోశనమ్ముగఁ గ్రోలి నిర్భరానందసాంద్రపులకితదేహయై తల్లికి వందనం బిడి తులసి మున్నగు స్వసఖీజనమ్ముతోఁ గూడి మంత్రిసమానీతాలంకృతభద్రకరిణీసమారూఢయై యుండఁ బూర్వాభ్యస్తస్వగమనకళాపునఃపఠనార్థసమాగతగోపాధ్యాయాని యనందగు నక్కరిణి మందగమనసుందరంబుగ బయల్వెడల వెన్కముందు గేవల మంగళవాద్యంబులు కర్ణానందంబుగ మ్రోయఁ జిత్రకంచుకోష్ణీషస్వర్ణచలద్వేత్రధారులై భటులు నిశ్వాసాయాసంబుతో ముందుఁ బర్విడుచు జనసంఘంబు నదల్చి బరాబరు లొనర్ప వారవనితాజనతాఘనతాళలయాంచితదైశికాదినృత్యవిశేషంబు లలర, వందిమాగధసందోహజయజయవాక్యపూర్వకంబులగు కైవారంబులు దైవార, గాయకతానమానానూనగానంబు దనర, మంగళద్రవ్యపరికరకరలై దాసీయువతులు భద్రగజంబు జుట్టువాఱి నడువ, దివ్యాలంకారశోభితలై యుపమాతలు శకటారూఢలై వెంటరా, జరఠదాసీజనంబులు బుడుసాకృతులం దాల్చి బంగరుబెత్తములం గరిణీప్రాంతమ్మున బరాబరు లొనర్పఁ దరుణదాసీకాంతలు శస్త్రాస్త్రధారిణులై తురగారూఢలై యనుసరింప నల్పవస్త్రగోపితాననలై కంచుకినులు నడువ, దూరమ్మున మంత్రిజనమ్ము లనేకవాహనారూఢులై రథగజాదిచాతురంగికసైన్యసమేతు

లై హర్షాన్వితులై సంభ్రమింప, గజారూఢదాసికాజనంబులు ఛత్రంబుఁ బట్టి చామరంబులచే వీచుచుండ, సౌధాగ్రసంస్థితరాజదారలు బూలు జల్లుచుండ నవరత్నసంకలితనవకుసుమదామసంఘటితదక్షిణకరయై జానకి చని చని సభారంగమున గజావరోహణ మొనర్చి, వినిర్మలమండలాకారరంగసరోవరమధ్యమ్మున రామప్రభాకరకరగ్రహణకుతూహలకించిదున్మీలితనేత్రపత్త్రయై యపత్రపాముకుళితశేషాంగియై వికసనాభిముఖమైన సరోజంబుపోల్కి నిల్చి కొంతవడి కటు నిటు గ్రేఁగంటఁ జూచి రామచంద్రు నీక్షించి నేత్రచకోరంబులకుఁ దద్దర్శనసుధాప్యాయనం బొనర్చి సుజనానీతయై మందగమనంబున రాముం జేరి తత్కంఠసీమను రత్నకుసుమదామం బర్పించి దరస్మితపరిష్కృతాననయై రామపాదారవిందమ్ములపై స్వకైశ్యభ్రమరాళిం జేర్చుపగిది సాగిలి మ్రొక్కి నిల్చి రంగవిలాసదర్శనకైతవమ్మున రామచంద్రసుందరదేహవిలాసంబుఁ బలుమాఱు వీక్షించి యంతరంగనిగూఢానందసందోహయై లజ్జావనతయై రమాకాంతం బోలి సభారంగసరోజమధ్యమ్మున నిల్చె నంత. 162

ఉ. రాముఁ డురస్థహారనికరద్యుతి విస్ఫురణాభిరాముఁడై
కామసుసంధితాస్త్ర మనఁగాఁ దగి రంగభువి న్వసించు నా
భూమిజఁ గాంచి డెందమున మోదముఁ జాలఁగఁ జెంది సత్తపో
ధామునిఁ గౌశికుం గని పదంబులకు న్నతిఁ జేసె భక్తితోన్. 163

తే. గాధిజుండును రాముని గౌఁగిలించి, యంకమునఁ జేర్చి శిరము ముద్దాడి కేల
నతని దేహంబు నిమిరి బ్రహ్మావలోక,నంబునంబలె మిగుల ముదంబుఁ జెందె. 164

వ. అంత. 165

ఉ. మున్యధినాథునంకమున భూమిసుతం జనకుండు నిల్పినన్
ధన్యుఁడ నంచు గాధిజుఁ డెదం దలఁచెం జనకుండు నిట్లనెన్
ధన్యతఁ జెందె మత్కులముఁ దల్లియుఁ దండ్రియు నాదు జన్మమున్
మాన్యుఁడు రామచంద్రునకు మామ యటంచును బేరుఁ జెందుటన్. 166

కం. ఇది యంతయు గాధిజ! నీ, సదమలదయఁ గల్గె రామచంద్రునికతన
న్మదసాధ్యమైన ప్రతినయుఁ, దుదిఁ జెందెను కుశికవంశతోయధిచంద్రా! 167

తే. అనుచు జనకుండు రామగాధ్యాత్మజులను, హరిహరోపములనుభావమాత్మఁ జెంది
వందనమ్ము లొనర్చి నిర్భరత మీఱ, హాయిగా నుండె నత్యంతహర్షమునను.

మ. చపలాభర్త శుభ నేత్ర బింబసదృశోత్కృష్ట ప్రాభవ జ్ఞానకి
న్నృపు లెల్లం గని తత్కటాక్షశరఖండీభూతచిత్తాబ్జులై
విపులార్తి న్విధి దూఱి దూఱి నిరతోద్విగ్నాంతరంగమ్ముల
న్విపరీతంపుఫలంబు గల్గె ననుచు న్విభ్రాంతులై యుండఁగా. 169

చ. జనకుఁడు రాజవర్యులఁ బ్రశాంతులఁ జేసి బహూకరించి యి
ట్లనియె నృపాలులార ! శ్రమమందఁగఁ జేసితి మిమ్ము నాపయి
ఘనకృప నుంచి నాసుతకుఁ గాఁగల పెండిలిఁ బూర్తి చేసి చం
దనముఖమత్సపర్యల ముదమ్మునఁ గైకొని యాదరింపుఁడీ. 170

వ. అనిన జనకవాక్యంబు లారాజన్యు లసూయాగ్రస్తులై విని మంత్రాలోచనంబులకుం జొచ్చి రందు శ్రీరాముఁ డస్మదీయమానభంగ మొనర్చెం గాని ధనుర్భంగంబు గాదనువారును, బలాధికుం డగుట దుర్ఘటకార్యం బొనర్చెఁ గాని మన కేమి యపకృతిఁ జేసె ననువారును, రామునివలన మన కవమాన మగుట మనమందఱ మాతనితో యుద్ధ మొనర్చి జయలక్ష్మినైనఁ జేకొని పోవుద మనువారును, దైవబలం బిపుడు మన కననుకూలంబు గాన రామునితోఁ గలహించిన జయం బాతనికే యగుఁ గాని మనకుఁ గా దనువారును, దుర్ముహూర్తమ్మున బయల్వెడలితిమి గాఁబోలు నిట్టియవమాన మయ్యె ననువారు, నిప్పటి కాత్మపురమ్ముల కేగి శుభముహూర్తమ్మున ససైన్యముగా వచ్చి రాముని జయించిన సమంజసంబుగా నుండు ననువారును, జయించుటయే గాదు రామభగ్నశివధనుఃఖండంబులఁ జూచున ట్లస్మదీయ శాతశిలీముఖఖండితరామశరీరఖండమ్ములఁ గాంచినం గాని యీయవమాన దుఃఖం బడంగునే యనువారు, నిప్పు డీవిరోధభావం బీరాజన్యులతో వెల్లడించు టేల ? సీతావివాహంబుఁ జూచి పోద మనువారునై పలుదెఱంగుల నాలోచించి తుదకుఁ దమయంగీకారంబు జనకునితో వెల్లడించిన జనకుండును సపరివారంబుగా సీత నంతిపురి కనిచి యారాజన్యులకును మునిజనంబులకు నుపకార్య లేర్పఱచి వారలకు వలయు భోజనమజ్జనాదిసత్కారార్హవస్తుజాతం బనల్పంబుగా విడిదలఁ జేర్పించి రాజమర్యాదలం దీర్చుచుండె నంత. 171

చ. కుశికసుతుం డనె న్జనక ! కూరిమిబిడ్డఁడు రాముఁ డిచ్చటం
గుశలముగా సహోదరునిఁ గూడి వసించుటయుం దదీయమౌ
పశుపతిచాపభంగము వివాహమును న్వినునట్లు చేసి యా
దశరథు నాప్తయుక్తముగఁ దక్షణముం బిలిపింపు మిమ్మెయిన్. 172

చ. అన విని మైథిలుండు సచివాగ్రణులన్ రఘురాజధానికిం
బనిచిన వార లెల్లను జవంబున నేగి నృపాలుఁ గాంచి వం
దన మిడి రాజవర్య ! శుభదంబగు వార్తను దెచ్చినాము నీ
తనయుఁడు రాముఁ డెక్కిడి ద్విధా యొనరించెను శైవచాపమున్. 173

ఉ. రాముఁడు చాప మెక్కిడఁ దరం బనురాగముఁ జెంది నాఁడె మా
భూమిధవుండు మైథిలుఁడు భూసుత రామున కూర్మిళాసతిం
బ్రేముడి లక్ష్మణాఖ్యునకుఁ బెండిలి సేయఁగ నిశ్చయించె మి
మ్మోమహినాథ ! యీశుభమహోత్సవముం గనఁ దోడి తెమ్మనెన్. 174

తే. కాన మీ రింక వేగంబుగా సుతాప్త, మంత్రిపరివారబంధుసామంతరాజ
కులపురోహితసహితులై కుంజరాది, వాహములతోడ రండు వివాహమునకు.

తే. అనఁగ శుభవార్త దశరథుఁ డాలకించి, యెంచమితి లేనిముదముఁ దాఁ గాంచి యప్పుడె
పెండ్లి కేగుటఁ జాటఁ బంపించి వేడ్క, భార్యలకుఁ జెప్పి మిథిలకుఁ బయన మయ్యె.

సీ. హితులతోడను బురోహితులతో సుతులతో, నతులసామంతభూపతులతోడ
కరులతో నసమానహరులతో మురిపెంపుఁ, దరుణులౌ వారసుందరులతోడ
బుధులతో వందిమాగధులతోఁ బటుమహా, రథులతో నిపుణసారథులతోడ
సకులతోఁ బ్రౌఢవాంశికులతోడను పకార,జికులతోడను విదూషకులతోడ

తే. కవులతోడను మంత్రిపుంగవులతోడ, ఋషులతోడను బుణ్యపురుషులతోడ
భటులతోడను మంగళోద్భటులతోడఁ, దరలెఁ బెండ్లికి మిథిలకు దశరథుండు.

వ. ఇట్లు తరలి దశరథక్షోణినాథుండు కొన్ని దివసంబులకు మిథిలాపురికిం జని మంగళ
కాహళరవపూర్వకంబుగాఁ బురోపవనంబుఁ జేరి యున్నంత. 178

చ. ఉపవనమందు నిల్చిన రఘూత్తముఁ జూడఁగ మైథిలుండు రా
డ్ద్విపము పురస్కరించుచు వరిష్ఠసచివాదులు ప్రాజ్ఞియుక్తులై
యుపచితవస్తువుల్ గొని రయమ్మున రా శుభవాద్యము ల్లగ
న్విపులతరోత్సవమ్మునఁ జనె న్మదిఁ గౌతుక మొంది తోటకున్. 179

వ. ఇట్లేగి యచ్చట నావిదేహరాజచంద్రుండు. 180

ఉ. ఆజికి వందనం బిడి నమ్రపార్ష్ణకృత్యముఁ దీర్చి యోమహా
రాజవరేణ్యా ! సేమమె ? తిరంబుగ నీదగు బాంధవమ్మునన్
భాజన మైతి మీదయకుఁ బావన మయ్యె మదీయవంశము
న్నాజనియుం గృతార్థ మజనందన ! ధన్యుఁడ నైతి నన్నిటన్. 181

వ. ఇట్లు పరస్పరంబుఁ గుశలం బడిగి సంభ్రమసంతోషమ్ము లాత్మ నుప్పొంగుచుండ జనకుండు మున్నుఁగువారును దశరథాదులును యథోచితంబుగా వసిష్ఠశతానందాది భూసురులు వివాహార్థునసూచక వేదమంత్రంబులు నుడువుచుండ నొకరిపై నొకరు హరిద్రాక్షతంబులఁ బరిహాసానుకూలంబుగాఁ జల్లుకొనిన పిదప వారల సింహాసన రత్నకంబళాదుల సుఖాసీనులం గావించి వసిష్ఠాదిమునిజనంబులకుఁ దనపురోహితుం డగు శతానందునిచేతను దశరథాదిబంధుమహారాజులకుఁ దానును గౌసల్యాదిదశరథపట్టమహిషీసంఘమ్మునకుఁ దనదేవేరియగు సుమేధచేతను మఱియుం దక్కిన దాసీదాసులకు దాసీదాసులచేత నిట్లు కులాచారపద్ధతులు దప్పకుండ రాజమర్యాదలం దీర్పించి జనకుండు దానును. 182

చ. కపురపుపీడె మత్తమువు । గంధముఁ గ్రప్పుదండ చేసుమా
ల్యపులసుగంధధూపమును । వీజనముల్ సుచిపానకంబునుం
దపసులకు న్నృపాలురకుఁ । దత్పరివారజనాళి కిచ్చి యా
నృపతి మనంబు మోదమున బరిహంపఁగఁ జేసె విదేహుఁ డింపుగన్. 183

తే. అంత జనకుండు దశరథు। చెంత నున్న, భరతశత్రుఘ్నులను జూచి । భ్రాంతిఁ జెంది
వారి దేహవిలాసము। ల్బాఱఁ జూచి, వింతదోఁపఁగఁ దలఁచె ని। శ్చింతముగాఁగ. 184

తే. రామలక్ష్మణు లీదశ। రథుని చెంత, కెటులు వచ్చిరి బళిర ! మా। సింద్రుకడను
మహితమూర్తులు రామల। క్ష్మణులు కలరు, పరమచిత్రమొ యిదియని। భూమిధవుఁడు.

వ. విశ్వామిత్రునితో ని ట్లనియె. 186

ఉ. ఏమిది చిత్రమయ్యెడు ముని। నీశ్వర ! యిచ్చట నిద్ద రిద్దరై
రాముఁడు లక్ష్మణుండును ని। రంతరంబుగ నీకడఁ దండ్రిచెంగటన్
మామది విభ్రమంబు ననుమానము నిండఁగ నిల్చి యుండె నో
స్వామి ! వచింపవే నిజము । వారలు వీరలొ ! ఏరు వారలో ! 187

వ. అన విని గాధిజుం డను జనకా ! రామలక్ష్మణజననప్రకారంబు వినవే మున్ను కౌసల్యాసుమిత్రులకు దశరథుం డొసంగిన పరమాన్నభాగంబులలోఁ గొంత కొంత భాగమును గైకకు వారిచ్చిరి కాదే ? యందుఁ గౌసల్య యిడిన భాగమువలన భరతుండును సుమిత్ర యిడిన భాగమువలన శత్రుఘ్నుండును గైకకుఁ బుట్టిరి కావున నేమను భగవదంశాంశసంభవులు యమళులు దాశరథులు రామలక్ష్మణులకు సరి వచ్చువారు. 188

సీ. అనుమాట జనకుండు నానందముగ విని, యెల్లవారలు విన నిట్టు లనియె
రామున కవనిజ సౌమిత్రికి మదీయ, తనుజాత నూర్మిళా వనజనేత్ర
మాతమ్ము కొమరితల్ మాండవీశ్రుతకీర్తు, లనువారు నాచేతఁ జెనుపఁబడిరి
వారల నిద్దఱఁ వరుసగా భరతశత్రుఘ్నుల కిచ్చి సంతోషమునను
తే. పెండ్లి సేయుదు నిట్లు కోడండ్ర నల్వురను గ్రహింపఁగ దశరథా! యనుమతించి
నన్ను ధన్యుని నొనరింపు నరవరేణ్య!, పావనుఁడ నౌదు నీదు సంబంధమునను.

చ. అన మునులెల్లరు న్విని "తథా" స్తని రాయజనందనుండునున్
ఘనముద మొంది యొప్పికొనెఁ గౌశికుఁడుం బరితోష మొంది యా
యినకులముఖ్యుఁ జూచి ధరణీశ్వర! నీసుకృతంబు పెంపునం
దనయుల కొక్కసారి యిటు దారపరిగ్రహ మబ్బె బాపురే! 190

తే. అనఁగ విని యాజి కౌశికమునినిఁ జూచి, గాధిసంభవ! నీకటాక్షంబువలనఁ
బ్రాప్తమయ్యెను శుభపరంపర మహాత్మ!, మీదు దయఁజూడ దొరకని మేలుగలదె?

వ. ఇట్లందఱు నామోదించుచుండ దశరథుండు జనకపురోహితుండును సహాల్యానంద
నుండును నగు శతానందుం జూచి భూసురేంద్రా! సీత భూమిలో నెట్లుద్భవించె
జనకున కెట్లు లభియించెనో యని తత్కథాశుశ్రూషానిబద్ధచిత్తుండ నగు నాకు
సీతాజన్మ వృత్తాంత మామూలాగ్రమ్ముగా నుడువు మన దశరథునితో శతానందుం
డి ట్లనియె. 192

## సీతా పూర్వజన్మ చరిత్రము

మ. మును పద్మాక్షనృపుండు లక్ష్మిని జనంబుల్ నిచ్చలుం గోరుటం
గని డెందమ్మున నిట్టు లెంచెఁ గమలాకాంత న్నిజాంకమ్మునం
దనయంగా నొనరించెదం దపముచేతన్ సిద్ధి యౌనంచుఁ దా
వనజావాసినిఁ గూర్చి చేసెఁ దపమున్ భాస్వత్సమాధిస్థుఁడై. 193

వ. ఇట్లు చిరకాలము గడచినంత నొక్కనాఁ డాపద్మాక్షనృపాలుండు. 194

తే. మ్రోలఁ గన్పడు లక్ష్మిని బోలఁ జూచి, తల్లిరో! నీవు నాకిఁకఁ దనయ వగు మ
టన్నఁ బరవశ నీకు నన్వాన్నుఁ డీయఁ, దనయ నగుదును వానికై తప మొనర్పు.

చ. అన విని విష్ణు గూర్చి తప మట్టులె చేసి ప్రసన్నుఁడౌ రమే
శుని గని దేవ! నన్నసుతుఁ జూచి రమన్ సుతగా నొసంగుమా

యన నొక మాతులుంగఫల । మాన్నృపుచేతి కొసంగి యప్పుడే
ఘనుఁడు తిరోహితత్వమును । గాంచె నృపాలుఁడు వింతఁ జెందఁగన్. 196

శా. అమ్రాదీఫలముం బగిల్చి యట స్వర్ణాకారసందీప్తయా
కొమ్మం జూచి నృపుండు సంతసిలి నాకుం గూఁతురం చెంచె లో
కమ్మెల్లన్ సతి జూచి పద్మ యను నాఖ్యం బిల్చె నాకన్యకో
నమ్రాదీఫలఖండమం దొకఫలం । బట్టిదే పుట్టినన్. 197

తే. దానిఁ గేల ధరించి యాధారుణీశ, తనయ శీతాంశుగతి వృద్ధిఁ దనరుచుండెఁ
దెలివి దళుకొత్తఁ బ్రజల రంజించుచుండె, దివ్యలక్షణయుక్తయై । తేజరిల్లె. 198

మ. వరుఁ డెవ్వాఁడు లభించుఁ బట్టి కని భూపాలుండు నాలోచనా
పరుఁడై నిశ్చయ మొందలేక సచివశ్రేణియుం దా స్వయం
వరముం జన్నముఁ జేయఁ బత్రికల భూపాలాళికిం దెల్పఁగా
నరగంధర్వసురాసురాళిగరుడుల్ । నాగాదు లెల్ల న్వడిన్. 199

తే. యక్షకిన్నరఖగముఖ్యు । లాదరమున, హారభూషణచేలశృంగారకలితు
లగుచు వచ్చిరి వచ్చె దశాననుండుఁ, బరిజనావృతుఁడై స్వయంవరముఁ జూడ.

తే. వచ్చి యున్నట్టివారల । వరుసఁ గాంచి, పలికెఁ బద్మాక్షుఁ డీరీతి । భవ్యులార!
మింటి కగు నల్పుడా త్వేశినేమియందు, నలముకొను వాని కిచ్చెద । నాత్మసుతను.

చ. అన నటు లుంట దుర్ఘట మటంచు నృపుల్ సురపాళిఁ గూడి రా
ట్తనయ హరింపఁ గోరి నృపతిల్లజుతో నని సేసి వార లె
ల్లను జయ మొందలేక దిశలం బరుగెత్తిన రావణాదిదు
ర్జనులు తదర్థ మాన్నృపు దురమ్మునఁ జంపిరి ఘోరకర్ములై. 202

ఉ. చంపి తదీయపుత్రికను । సాహస మొప్ప హరింపఁ బోవ నా
చంపకగంధి తాఁ దెలిసి । చయ్యన నగ్ని నదృశ్యయై పడెం
దెం పిటు సేయు దానిఁ గన । దేవరిపుల్ పనిబట్టి పోవఁ గా
వింపఁగ దగ్ధవన్యయున । వీడు దగెన్ గృహదాళి గూలుటన్. 203

కం. పద్మాక్షనృపతి యీగతిఁ, బద్మాయోగమ్ము వలనఁ । బ్రాణధనస్త్రీ
సద్మాదిరహితుఁ డౌటం, బద్మం గోరుచు భజింపఁ । బరమమునీంద్రుల్. 204

తే. ఇటులు పద్మాక్షనరపతి । మృతుఁడు గాగ, నావియోగంబు నోర్వక । యతనిసతులు
వాని చితిమధ్యమునఁ గూలి । ప్రాణములను, వీడి పతిఁ గూడఁ దెఱఁగంటి । వీడు చనిరి.

తే. పద్మఁ గానమిఁ బిదప రావణుఁడు మిగుల, విసివి వేసారి పరిజనాన్వితుఁడు నగుచుఁ
బుష్పకారూఢుఁడై దీనముఖముతోడ, లంకకే పోయెఁ దా నిరాతంకగతిని. 206

ఉ. ధాకుణి నొక్కనాఁ డరివధమ్మునకై సురయానవాసియై
సారణుతో దశాస్యుఁడు ప్రచారముఁ జేయుచు నుండఁ బద్మ యిం
పారఁగ నగ్ని చెంగటఁ దదర్చివిధమ్మునఁ గూరుచుండఁగా
సారణుఁ డామెఁ గాంచి తనసామికిఁ జూపి యను న్ముదమ్మునన్. 207

తే. నాఁడు భూపాలముఖ్యు లీనాఁటికొఱకు, సకలబాధలఁ జెందిరి సామి ! మనము
గూడఁ బురినెల్ల వెదకినఁ జూడఁబడక, నేఁడు గనఁబడెఁ బద్మను జూడు ఱేఁడ.

చ. అనఁగ విమానముం డిగి తదంతికసీమకుఁ జేరఁ బద్మయుం
గని వడి నగ్నిఁ జొచ్చె దశకంధరుఁ డింతిరో ! నీవు మాయ నా
కనులకు గోచరించె నినుఁ గైకొనెదం గను మంచు నీట న
గ్నిని వడి నార్పి భస్మమునఁ గేల్గమితో నెమకంగఁ జొచ్చినన్. 209

తే. ఎంత నెమకిన దానిలో నింతి లేదు, తడుముఁగా నందు నైదు రత్నములు దొరకె
బురికిఁ జేరియు రత్నము ల్బరిణె నుంచి, నింట దేవగృహమ్మున నిడియె దాని.

తే. రేయి బొన్నన మండోదరియును దాను, నుండి యను నింతి ! నీకొఱకుంచినాఁడ
మంచిరతనాలఁ దేవతామందిరమునఁ, జూచి విడుతువె వాని నోసుందరాంగి !

వ. అని రాక్షసాధీశుండు సమీపస్థుఁడగు నొక భటునిం బిలిచి. 212

తే. వానిఁ దెమ్మన్న నేగి యబ్బరిణె నెత్తఁ, జాలకయె సిబ్బితిని జెంది బేల యగుచుఁ
బతికిఁ దెలుపఁగ నవ్వి రావణుఁడు నేగి, కేలఁ గదుపఁగనైనను జాల కపుడు.

చ. ఇరువదిచేతులం బరిణె నెత్తఁగ లేక భయంబుఁ జెంది య
బ్బరిణెకు గప్పుఁ దీసి యొక బాలిక నయ్యెడఁ గాంచి భానుభా
స్వరశుభదేహకాంతిఁ గనఁ జాలక యెల్లరుఁ గన్ను మూయ దే
వెరెఁ గని దాని జన్మమును వృత్తముఁ జెప్పె సురారి వింతగన్. 214

తే. అట్లు చిత్రంబుగాఁ బుట్టినట్టి యింతిఁ, జూచి రెల్లరు బందుగుల్ సుతులు సుతలు
పిదప మండోదరియుఁ బద్మవిధముఁ దెలిసి, భర్తతోననె మది రోషభయములొంది.

శా. ఈకాంతం బురి కేల తెచ్చితివి ప్రాణేశా ! కులధ్వంసినిన్
నాకద్వేషియుతమ్ముగా నగరము న్నాశమ్ము నొందించు నీ
పాకప్రాయమునందె దుర్భర కదా ప్రాయమ్మునన్ దీనిదా
డాకన్ సైపఁగలారమే యెఱిఁగి తేఁడా ! యేల యీ తెచ్చుటల్. 216

తే. ఇచ్చటనె యుంచితేని ప్రాణేశ! నీకు, మృత్యు వగుఁ జుమ్మి! నామాట। సత్యమగును
గాన దీనిని దూరమ్ము। గాఁ ద్యజించి, కులముఁ బ్రాణము రక్షించు। కొనుము నాథ !

చ. అన విని సత్య మంచు నతఁ। డారసి మంత్రుల మంత్రనిశ్చయ
మ్మున భటకోటిఁ బిల్చి యనుఁ। బొల్పుగ నీబరిణె న్విమానమం
దు నిడుచు నిర్భయమ్మునగ సుదూరముగాఁ గొనిపోయి ఘోరమా
వనమున డించి రం డనఁగ। వారు హసా దని గుంపు గుంపులై. 218

తే. చెలఁగి రక్కసులెల్ల దో।ర్బలము కలిమి, నబ్బరిణె నెత్తి పుష్పక।మందు నునిచి
పోవ నూహింప రావణు।పొలఁతి వారిఁ, గాంచి యిట్లనె బహుభీతి।కలిత యగుచు.

తే. అడవిలో నైనఁ బుడమిపై। విడువఁ దగదు, చూచు వారినె చంపు నీ।సుదతి గాన
విజన మైనట్టి ఘోరమా। విపినమందుఁ, బాతి పెట్టుఁడు లేకున్న। భంగ మగును.

తే. జగతి విజితేంద్రియత్వమ్ముఁ। దగ వహించి, యాత్మఁగా నెవ్వఁడుండుఁ జ।రాచరాళి
నట్టి గృహిగేహసీమ నీ।యతివ వృద్ధిఁ, బొంది చిరకాల ముండును। బొంకు గాదు.

తే. అనఁగ మండోదరీవాక్య। మాలకించి, బరిణెలో నున్న కన్య యి।ప్పగిదిఁ బలికెఁ
దిరిగి వచ్చెద లంకకు। సురవిరోధి, సహితముగ నీదుభర్తను। సంహరింప. 222

తే. మూఁడవది యగు సారి యీ।పురికి వచ్చి, పౌండ్రకుని కుంభజాతు న।ప్పటికి నేఁజు
తలలచే నొప్పు నీదు భ।ర్తను హరింతు, మఱియు నపు డేగి నాల్గవ।మాఱు వచ్చి.

తే. కుంభకర్ణాత్మజుని మూల।కుని హరింతు, ననిన నుడి విని రావణుం।డదరి పడియె
నచట నున్నట్టి రాత్రించ।రౌఘమెల్ల, గడగడ వడంకె నెడఁదల। నడలు దోఁప.

వ. పిదప వారు జాగరూకులై బయల్వెడలి బహుఘోరకాంతారమ్ము లతిక్రమించి తుదకు మామిథిలేశుని భూమికిం జేరి యొక్కచో నబ్బరిణెం బాతిపెట్టి లంకఁ జేరి రంత. 225

## ❖ బ్రాహ్మణునకు పాతు దొరకుట ❖

తే. ఆజిభూపతి! మావిదే।హప్రభుం డొకపుడు సూర్యోపరాగంబు।నందు నొక్క
ధరణిసురునకు నొకభూమి।దాన మొసఁగ, నాతఁడును సేద్యమునకు నా।యత్తుఁడగుచు.

మ. చిరకాలమ్మున కొక్కమూర్తమున నా।క్షేత్రమ్ము దున్నింప నా
దర మొప్పన్ హాల మిచ్చి శూద్రు నొకనిం। దద్భూమికిం బంప నా
ధరణిం దున్నుచు వాఁడు తద్దలముఖో।ద్ధం బైన యాపేటికన్
ధరణీదేవున కిచ్చెఁ బా మ్మతని స।ద్ధర్మమ్ము నూహింపుమా. 227

కం. ధరలోనఁ గూలివాఁడును, దిరిపరియును హీనుఁడైన దేబెయు నైనన్
బరదారలఁ బరధనములఁ, బరమార్థముఁ గోరువాఁడు పట్టఁడు గాదే? 228

సీ. అతఁ డాకరండంబు నవ్విప్రున కొసంగి, భూసురోత్తమ! మంచి మూర్త మహహా!
ధరణి దున్నెడుచో నిధానంబు లభియించె, బహుధనం బుండె నీభాగ్య మయ్య!
బరువుగా నున్నను బట్టి తెచ్చితి నయ్య!, గూఢమ్ముగా దాచికొను మటన్న
నాసంపుటముఁ దెచ్చి యాద్విజన్ముఁడు విదేహప్రభుసభలోన నపుడె పెట్టి

తే. అనెను మైథిల! నాకిచ్చినట్టి నేల, దున్నుచుండఁగ దొరకె నిక్షేపనిధాన
మిదిగో కైకొమ్మనంగఁ బృథ్వీశ్వరుండు, బ్రాహ్మణోత్తముఁ గని భక్తిఁ బలికె నిట్లు.

వ. భూసురోత్తమా! నీకీభూమిని ధారాపూర్వకమ్ముగా దాన మిచ్చియుంటి నందు లభించు నిధినిక్షేపాదులైన ఫలంబులు నీకుఁ గాక నాకుం గ్రహింప నగునే? దత్తాపహారదోషంబు గాదే? యని భూపతియును, రాజోత్తమా! సస్యఫలానుభవమ్ములకో నద్ధరణి నా కధీనమ్ముఁ జేసితివి కాని యందు లభించు నిధినిక్షేపములకు భూపతి యధికారి యని శాస్త్రంబు నుడువుచుండెఁ గాన నన్నర్థమ్ము గ్రహించిన నాకుమాత్రముఁ దస్కరదోషమ్ము గాదా? యని విప్రుండును నిట్లిద్దఱుఁ గొంతసేపు నీయది నీయది యని సహేతుకాపూర్వాభూతాదృష్టాశ్రుతవివాద మందిరని చెప్పి శతానందుండు దశరథుం జూచి. 230

ఉ. దాన మొసంగ నెంచిన పదార్థము నిర్మలభక్తి యాచకా
ధీనముఁ జేసి తజ్జమును దేని గ్రహించిన యట్టి వ్యాజమా
దానము దానమా? యఘనిధానము శాశ్వతఘోరదుష్ప్రధా
ధానము నిత్యనారకవిధానము దంభవదాన్యకోటికిన్ 231

ఉ. పానముఖాఖిలవ్యసనభావులఁ దస్కరులన్ ద్విజఘ్నులన్
బోనము నమ్మువారలును బుంశ్చలి మున్నగువార లిచ్చు నా
దానము దానమా? యఘనిధానము శాశ్వతఘోరదుష్ప్రధా
ధానము ఘోరనారకవిధానము కైకొను నర్థికోటికిన్. 232

వ. అనుచుం జెప్పి శతానందుండు మఱియు నిట్లను దశరథా! యట్లు భవిష్యత్కాలికదంభదాతృయాచకజననీతిబోధకం బగు నబ్భూపతిభూసురవివాదంబు విని విస్మయానందంబులు వెల్లివిరియ నవ్వికొనుచు మైథిలునితో సభ్యు లిట్లనిరి. 233

ఉ. ఏల వివాద మిందుఁ గల దెయ్యదియో మును జూడుఁడీ యన
న్నేలని మూతఁ దీసి యట మిన్నులమొత్త మనంగ నొప్పుచున్

శ్రీలలనాసమానశుభచిహ్నసమంచితదివ్యదేహయౌ
బాలిక నొక్కతెం గనిరి పార్థివుఁ డాదిగ నాసభాసదుల్. 234

తే. అట్టు లర్పించి బ్రాహ్మణుం డరిగె నపుడు, బాలికను దీసి సంతోషభరితుఁడగుచు
శ్రీనివాసుఁ డొసంగు సంతాన మిద్ది, యనుచుఁ బెనుచుచు నుండె మాజనకరాజు.

వ. ఇట్లు జనకుం డాబాలికను సుతగా గ్రహించుతఱి నింటినుండి జేజేలు బూలు గురిపించి రచ్చరల యాటలు గంధర్వుల పాటలు దుందుభిరావంబులునుం జెలంగె నంత నాబాలకు జాతకర్మసంస్కారం బొనర్చి భూసురుల కపారదానంబు లొసంగి సీత యని నామకరణం బొనర్చె. మఱియు మాతులుంగఫలోద్భవ యగుట మాతులుంగి యనియు నగ్ని నుండుట నగ్నిగర్భ యనియు రత్నముల నుండుట రత్నవతి యనియు ధరణివలనఁ బుట్టుట ధరణిజ యనియు జనకపోషితాపత్యం బగుట జానకి యనియు నాఁగటిచాలునం బుట్టుట సీత యనియుఁ బద్మాక్షరాజన్యునకుఁ గూఁతు రగుటఁ బద్మ యనియు నిట్లీసీత కనంతనామంబులు గల, వాకాశనీలవర్ణదేహుండును నీయగ్రసుతుండును నగు రామచంద్రునిచే నీకఁ బెండ్లి యాడఁబడును గాన నాఁటి పద్మాక్షమహారాజప్రతిజ్ఞయు వర్తమానకాలికజనకమహారాజప్రతిజ్ఞయు నెఱవేఱెఁ గాన నోదశరథా! నీవు పుణ్యాత్ముండవు నలువురు కోడండ్రను గ్రహించి సంతసింపుము రాజా! సీతావృత్తాంత మంతయు యథామతి నుడివితినని చెప్పిన శతానందుని వాక్యంబులకు దశరథుం డానందించి యుండె నంత. 236

తే. దశరథుఁడు పిల్లవరుల మాతామహులగు, మగధకోసలకేకయక్ష్మారమణులు
నాత్మదౌహిత్రపాణిగ్రహణములఁ గన,వచ్చి రప్పుడు మిథిలకుఁ బ్రమద మెసఁగ.

తే. మహితభక్తిని రామలక్ష్మణులు చెంత, కరిగి తలిదండ్రులకు జోత లాచరింప
వారిఁ గౌఁగిట గదియించి ప్రమదమునను, దల్లులును దండ్రియును మది నుల్లసిల్లిరి.

ఉ. వచ్చిన బంధురాజుల సపర్యలచేత బహూకరించి తా
నచ్చపుఁ బ్రేమతోడ మిథిలాధిపుఁ డెంతయు నుత్సవంబుతో
ముచ్చట లాడుచుం దనదు ప్రోలికిఁ జేరి యలంకృతమ్ము లై
పచ్చనితోరణాళి గల భవ్యగృహంబుల నుంచె వేడుకన్. 239

వ. ఇట్లు జనకుండుం బెండ్లివారి నుపకార్యలం బ్రవేశింపఁ జేసి వారికి వలయు వస్తువులును శయనాసనయోగ్యపదార్థంబులును భోజనపదార్థములును దాసీదాసజనంబులును నేర్పఱచి దశరథానుమతిం దనగృహంబున కేగె నంత. 240

సీ. అంతట దశరథుం డాచార్యననుమతిఁ, బుత్రచతుష్టయంబునకు వేడ్క
స్నాతకాదు లొనర్చి శాస్త్రక్రమమ్ముగా, వేదవ్రతాళి గావించి యపుడు
ధరణీసురాళి గోదానభూకనకాంబ, రాదిదానములచే నలరఁ జేసి
మునులయాశీర్వాదములఁ జెంది పిమ్మటఁ, గపురంపుటారతుల్ కాంత లీయ
తే. పూనిసుతబంధుమంత్రిసామంతసహితుఁ, డగుచు షడ్రసభక్ష్యభోజ్యములతోడ
బహుళరాజాన్నములఁ బసాపడి వివాహ, వేళ కువ్విళులూరుచు వేచియుండె.

సీ. బంగారు జలతా స్తరంగలించు హారంగు, సింగార మగు నిల్వుటంగి వెలయ
నిల్వుటంగీపైన నిగనిగ ల్దనరారు, హొంబట్టుశాలువ డంబు మీఱఁ
దలపైఁ గిరీటసౌందర్యరేఖకుఁ దోడు, రతనంపుఁబనులతురాయి దనరఁ
గమ్మపుసరులు ముక్తాహారకర్పూర, హారాళి గళమునం దమరియుండ
తే. ఉంగరమ్ములు నేలైన రంగు లీను, కుండలమ్ములు ముంజేతి కొప్పునట్టి
పతకమును మున్నుగా నవాభరణతతుల, రాము భూషించి రజ్వలధాము నంత.

సీ. ఒకనీలవేణి తా నొయ్యారముగ వచ్చి, మోమునఁ గస్తూరి బొట్టుఁ బెట్టె
నొకయింతి కన్ను మూయకు రామ యని పక, పక నవ్వి కనులఁ గాటుక నొసంగె
నొకయింతి పుడమిఁ బెండ్లికుమారులకు నిల్లె, యని బుగ్గలకు బొట్టుగలను లిఖించె
నొకచాన రామ! నీ వికఁ జూచుకొమ్మంచు, ముకురంబు నొక్కటి ముం దమర్చె
తే. తరుణి యొక్కతె దివ్యగంధమ్ముఁ బూసెఁ, గలికి యొక్కతె పాదుకల్ కాళ్ళఁదొడిగె
సకలసౌభాగ్యముల రామచంద్రుఁ డిట్లు, మహితుఁడై యపు పెండ్లికుమారుఁడయ్యె.

వ. తక్కిన లక్ష్మణాదులకుఁ గ్రమమ్మున నలంకరించి పెండ్లికొమరులుగాఁ జేసి రంత
జనకరాజాంతఃపురమ్మున సుమేధావిరాజకాంతలు పరిచారికాజనమ్ములతోఁ గూడి
కృతమంగళాభ్యంగ యగు సీతం గనకమణిమయాసనంబునం దుంచి. 244

ఉ. సంపెగనూనెతో నెఱులు జక్కఁగ దువ్వియు వేణి నల్లగాఁ
జంపకగంధి యొక్కతె ప్రశస్తసువర్ణవిభూషణావళుల్
సంపెగ మల్లె మొల్ల విరజాజులు వేనలిఁ గూర్చె సీత ని
ట్లింపుగఁ బెండ్లికూఁతురుగ నెల్లపురంధ్రులు లలంకరించుచున్. 145

ఉ. కాటుకఁ గన్నులం దిడి మొగమ్మునఁ గస్తురి బొట్టుఁ బెట్టి య
ప్పాటనె మేన గంద మిడి పాదయుగమ్మున నంగరాగపుం
బాటలు దీర్చి బంగరుసుమమ్ములు గల్గిన పట్టుచీర రా
బోటులు నీటుకుచ్చెలలు ముద్దులుగుల్కఁగఁ గట్టి రిమ్ముగన్. 246

తే. లలితశృంగారములచే నలంకరించి, కాంత లెల్లరు సీతాదికన్యకలను
పెండ్లికూఁతులుగాఁ జేసి పీఠములను, గూర్చుచుండఁగఁ బెట్టిరి కోర్కె లలర.
వ. అంత నక్కడ నుపకారికాగృహప్రాంతమ్మున. 248

## రాముఁడూరేగి వచ్చుట

సీ. చోదంతికోలమున సంభవించినయట్టి, చోదంతులను మొగసాల నిల్పి
స్వర్ణభూషలచేత వాని సింగారింప, మహాగాంచనాద్రములమాద్రి దనరు
నామతంగజముల రామాదివరు లెల్ల, భటకరాధారులై పై వసింప
ఛత్రంబులం బట్టి చామరంబుల భటుల్, సూరెల నిల్చి వీచుచుఁ జెలంగ
తే. జయమహేంద్ర! జయ రామచంద్ర! యనుచు, వందిమాగధజయజయధ్వనులు సె
లఁగ, వేదనాదమ్ములు ముని బృంద మమరఁ, బెండ్లికూరేగ సాగి రప్పెండ్లివారు.
వ. మఱియు హస్తిపకానుమతమందసుందరగమనసమయశుండాగ్రఫూత్కారనిర్గతశీకరవర్షోదయకాలశంకాకలితలలితఘీంకారగర్జాడంబరభూషారమణీయమణీఘృణితళత్త్రళకాంతితటిల్లతోన్నతదేహజలదభ్రాంతిజనకచరద్గిరు లనం దగు కరులును, ఆశ్వికప్రేరణానుకూల గమనావసరసంభూతరింఖాఘట్టనోద్ధూత ధరాపరాగ పటలీసమాచ్ఛాదితాంబరభూషాఘంటికాఘుళఘుళారవమిళితహేషాఘోషావసరవిన్యుతతాలుమూలగళత్త్రాణకణంబు లగు గంఘాణగణంబులును, రథికమనోరథపూరణగరుడానిలాఖర్వగర్వసర్వస్వహరణకార్యనిర్వహణార్వసార్వాంగీణాలంకరణమణికిరణప్రతిఫలితప్రసాధితభూషావిశేషభాసురవాతపోతజాతసమాధూతశ్వేతపటకేతనాన్వితనూతనభానురథసమానరథవ్రాతంబును, ముదన్వితసాయుధపంచశాఖద్విత యశోభితజయజయనాదముఖరీకృతాశాసముదయసముద్భూతప్రతిరావకలితాంబరారాతినిరాకరణచాతురీధురీణహేతు లగు బదాతులును, దృగంచలసకృత్ప్రేంచిత్ప్రసరణమాత్రసంభవన్మనోభవవివిధాంబకప్రయోగత్రుటత్స్ఫుటవిటమనస్సరోజప్రాంతంబు లగు వారాంగనాసంఘాతమ్ములును, స్తుతిపాఠచణజనగణజోఘృష్యమాణజయవాదమిళితగానకళానిధులగు మాగధులును, మంగళవేదపఠనభాసురభూసురనివహంబును, వైవాహికమంగళద్రవ్యపరిపూర్ణాచ్ఛకాయచ్ఛాయాలలితనవమదోద్ధతఘుళఘుళారవగళఘంటికాకలితవృషభోహ్యమానవిమానసమానప్రకటశకటంబులును, వీజనభోజసభాజనవిరాజమానరాజమాన్యవాసీజనంబులును, వీణాపణవమర్దళపటహదుందుభివంశకాహళశంఖనినాదబధిరీకృతదశదిశావకాశప్రతిరవకలితశబ్దగుణంబు లగు వివిధ

వాద్యశబ్దగణంబులును, జెలంగ రామాదివరు లలంకృతభద్రగజోపరిస్థితిభాసురులై యూరేగుచున్నంత. 250

తే. చందురునితోడ సకలనక్షత్రసమితి, కూడి వచ్చుచు నున్నదో యనఁ దనంగఁ
జంచలాశక్తినిర్మితాకాశవహ్నిప్రభాభి, భాసురంబుగ మణిదీపపటలి వెలిఁగె. 251

చ. హరికరచక్రవిస్ఫురణమా యిది? లేక దినాధినాథవి
స్ఫురదురుమండలాంతరసుశోభితతీక్ష్ణమరీచిజాలమా?
సురపతిహస్తబంభ్రమణశోభితవజ్రులరూపప్రజ్వల
త్స్ఫురశతకాంతియా? యనఁగఁ జక్రపుగొట్టములెల్ల భాసిలెన్. 252

శా. చంద్రజ్యోతులు తివ్వు టీ వ్వనుచు నక్షత్రస్థలిం జేరియుక్
సాంద్రం బౌగతి ఫట్ఫటాధ్వనులు నిస్సాణం బనం బేలఁగా
మంద్రప్రక్రియ వానినుండి పడు నమ్లానాభ్యవజ్రాళి నీ
రంధ్రస్యూతసుహారము ల్బలె సరుల్ రాలెక్ జను ల్మెలనన్. 253

వ. మఱియుం బంచవర్ణంబులగు నగ్నికణంబులు రాల్చు చక్రకాయ లెగురు గాయలు ముప్పేలు జువ్వలు నక్షత్రములు ముత్తియంపు మతాబులు మున్నగు పలుతెఱంగుల బాణాసంచుల నప్పనివార లానందమ్మున వినియోగింప నిట్లు బహువిధవినోదమ్ముల సకలసన్నాహయుక్తులై మందసుందరగమనులై పెండ్లివా రూరేగుచుండఁ దత్పౌరయువతీమణులు గుతూహలమ్మున నిజసౌధాగ్రమ్ముల నుండి గజారూఢులై వచ్చుచున్న పెండ్లికొమరులం గాంచి సంతసించి వారిలో రామచంద్రవిలాసంబుఁ గాంచి యచ్చెరు వొందుచు. 254

సీ. దరహాసవదనసుందరులైన తరుణులం, దఱు రామచంద్రసౌందర్య మరసి
పంచబాణుఁడు వీని కించుమించును గాఁడు, చంచదంగవిలాస మెంచిచూడ
సీత యీతనికిఁ దాఁ నాతియౌటకు మున్ను, నేతపం బొనరించెనో తలంప
ఖ్యాతిగా నీతని నాతియైనంతనే, సీత తప్పక జగన్మాత యగును

తే. కోటిమన్మథలావణ్య కూటమైన, బోటిరో! వీని డాకాలి గోటికైన
సాటి కాదమ్మ! మాటల కోటు లేల, విమలతరదివ్యమంగళవిగ్రహుండు. 255

తే. ఘనవివాహపదాగతశీకలితరామ, చంద్రసుశుభోదయాధికోత్సవముఁ జూడ
సకలజీవాళి సంతోషరసహిత మైన, జనకపతి పొంగిపోవు టాశ్చర్య మేమి. 256

తే. కవిబుధులతోడ నిత్యసంగతుఁడు గాన, ఘనపదస్థితి నున్నతిఁ గాంచుఁ గానఁ
గువలయానందసంధానగుణుఁడు గాన, రామచంద్రుఁ డనందగె రమణి! యితఁడు.

వ. అనుచుం గాంతలు ముచ్చటించుకొనుచు రామాదులపైఁ బూలు చల్లి నివాళు లిచ్చుచుండ నప్పెండ్లివారు రాజవీథులకుం జని చని యతివినోదమ్మున నూరేగి జనకరాజగృహద్వారంబుకడ నేనుంగులనుండి డిగ్గి నిల్చియున్న రామాదివరులకు నంతఃపురపరిచారికలు బంగరుపళ్లెరంబులఁ గర్పూరంపుటారతులు బట్టి తెచ్చి పాదప్రక్షాళనంబు లొనరింపఁ జేసి దృష్టిదోషపరిహారకృత్యం బొనర్చి నివాళు లిచ్చి సిగ్గున దిగ్గున న్మాలి ముసిముసినగవులు నెమ్మొగములందు మొలకలెత్త సీతకుఁ దగినయాతఁ డని డెందమ్ముల మెచ్చుకొనుచుం జననపిదప వసిష్ఠాదులుఁ గన్యాగృహప్రవేశార్హమంగళశ్రుతులఁ జతురమతిం బల్కుచుండ రామాదులుఁ గ్రమక్రమమ్మున నాకల్యాణవేదికాప్రాంతప్రసారితధవళాంబరమార్గమ్మున నడచి పోయి కల్యాణమంటపాభ్యాశమ్మున భద్రాసనమ్ములఁ బ్రాఙ్ముఖులై కూర్చుండి రంత.

## సీతాకల్యాణము

చ. జనకుఁడు నంతఁ బుత్రికల సన్నిధిఁ జేరిచి గౌరి నిఁక సురే
శుని సతి యాశచిం దుహితృ శోభనలబ్ధికిఁ బూజ సేసి యా
తనయలుగూడ వారల కరాతంద్రమతిఁ బ్రణుతింప భక్తితో
మన మలర న్వివాహశుభమండపసన్నిధిఁ జేరి పిమ్మటన్. 259

మ. మును విఘ్నేశ్వరపూజ సల్పి పిదపం బుణ్యాహముం బల్కి నా
తనపాత్రమ్ముల నంకురార్పణము వేదప్రోక్తపథా మాతృకా
ర్చన మాత్మాన్వయదేవతార్చనము నాచారక్రమం బొప్పఁగా
జనకుం డావిధు లెల్లఁ దీర్చి వరపూజం జేయఁగా నెంచుచున్.  260

తే. వరుల కభిముఖుఁడై ధర్మపత్నితోడ, నిల్చి లేతెంచి యున్న లక్ష్మీశతుల్యు
లైన వరులను బూజింతుననుచు మున్ను, ఘనమునీంద్రులయాజ్ఞ సంకల్ప మొంది.

చ. వరులకు విష్టరంబు లిడి బంగరుపళ్లెరమందు రామస
చ్చరణసరోజయుగ్మ మిడి జాయ సుమేధ జలమ్ము నోయఁగాఁ
గర మనురక్తిచేఁ గడిగి గాంగజలం బని తజ్జలంబుఁ దా
శిరమునఁ దాల్చి పావనతఁ జెందితి నంచుఁ దలంచె నాత్మలోన్.  262

తే. అర్ఘ్య మాచమనోదక మధుపర్కము, పరమపావనమహిమ మధుపర్క మొసఁగి
దివ్యవస్త్రాదు లిచ్చి వరదేహుఁ డిట్లు, పూజ గావించె మదిలోన ముదము గదుర.

శా. ధన్యాత్ముండ నటంచు నాజనకుఁ డుత్సాహమ్మునన్ జానకీ
కన్యాహస్తముఁ బట్టి యెత్తి యురుసంకల్పమ్ముతో "భూమిజా
కన్యాం తే ప్రదదామి రామ" యనుచుం గౌతూహలప్రక్రియం
గన్యాదానముఁ జేసె సీతను జగన్మాత న్యశఃఖ్యాతనున్. 264

వ. మఱియుం దక్కిన లక్ష్మణభరతశత్రుఘ్నులకు వరపూజాపూర్వకమ్ముగా నూర్మిళా మాండవీశ్రుతకీర్తులను యథాక్రమమ్మున నుదకధారాసహితమ్ముగాఁ గన్యాదానము లొసంగి జనకుండు రామాదివరులం గాంచి యిట్లనియె. 265

తే. అఖిలధర్మార్థకామకార్యమ్ములందు, నాదుతనుజాతలను విడనాడకుఁ డన
నతనివాక్యంబు వినుచు రామాదివరులు, పేడ మని రెల్లసభ్యులు వినెదురేతి.

వ. ఇటులు జనకుం డేకవింశతిసంఖ్యాకపూర్వోత్తరవంశీయశాశ్వతపరమపురుషార్థప్రాప్తిహేతుభూతంబులును బహువిధపుణ్యఫలాధానంబులును నగు గన్యాదానంబు లొసంగి తత్కాలంబునఁ గృతకన్యాదానసాద్గుణ్యఫలనిదానమ్ములగు గోభూకనకాంబరాదిదానమ్ములు బ్రాహ్మణోత్తముల కొసంగి వారి యాశీర్వాదంబు లొంది తానొకటఁ గూర్చుండి తత్కల్యాణదిదృక్షాపరుండై యుండె నంత. 267

ఉ. ఇందుముఖుల్ ధరాత్మజ నిరీక్షణముం బచరింపఁగా శతా
నందవసిష్ఠముఖ్యులు ఘనమ్ముగ మంత్రము లుచ్చరింపఁగాఁ
గ్రందుగ వాద్యము ల్దనర గాయకవైణికగాన మొప్ప వా
రేందుముఖుల్ నటింపఁగ నకేహానజయధ్వను లుల్లసిల్లఁగాన్. 268

తే. మనములో విశ్వనాథసంస్మరణ మున్న, నదియె లగ్నంబు సుదినంబు నదియె యదియె
తారలబలంబు నదియె పురద్మారిబలము, నదియె దేవబలంబు విద్యాబలంబు. 269

సీ. అనుచు వసిష్ఠుండు నాదంపతుల మధ్య, మునఁ దిరస్కరణిని బొందుపఱచి
కార్తాంతికోక్తముహూర్తకాలముఁ జూచి, మంగళసూక్తముల్ మంగళాష్ట
కాశీస్సు నుడివి గుడాన్వితజీరకం,బుల వధూవరశిరంబుల ధరింపఁ
గాఁ జేసి రామ! యీభూజాతముఖమును, జూడు మంచును బ్రేమతోడఁ బల్క
తే. దానికిం దగు వేదసూక్తంబుఁ జదువ, భూమిజాననవీక్షణంబునను రాముఁ
డతిముదం బందె సీతయు నందె ముదము, సభ్యులెల్లరు సేసలఁ జల్లి రపుడు.

శా. శ్రీరంజిల్ల గజాశ్వధేనురథధాత్రీసార్వభౌమత్వసా
ధారామాత్మజపౌత్రనప్తృముఖసంతానంతవృద్ధిస్ఫుర

తత్పారంపర్యసుఖానుభూతినిరతిన్ సోత్సాహంబుతో నుండి సీ
తారామాదికదంపతుల్ జలధిజాతావిష్ణుల ట్లొప్పెడిన్. 271

వ. అని దంపతుల దీవించి యరుంధతీజాని శతానందాదిమునీంద్రులం గూడి తత్తచ్ఛ్రుతిసూక్తంబు లుచ్చరించుచుఁ గన్యాభిషేకమంగళసూత్రధారణాదిసూత్రోక్తవివాహవిధానంబుల నెఱవేర్చి మఱియు. 272

చ. గురుఁడు వధూవరాంజలులకుం బరిశుద్ధి నొనర్చి సేసలం
గరపుటపూర్తి యట్లిడి మఱి నక్ప్రియ మట్లు పరస్పరంబు మీ
శిరములఁ జల్లుకొండనఁగ శ్రీరఘురాముఁడు సీతయుం బర
స్పరముఖవీక్షణార్థముగఁ బల్మరు సేసలు జల్లి రొండొరుల్. 273

వ. అంత సుమేధాదిజనకరాజయువతులుఁ గౌసల్యాదిదశరథభార్యలు మున్నగు యువతీమణులకు నరుంధతీప్రముఖద్విజపురంధ్రీజనపూర్వకమ్ముగా హరిద్రాకుంకుమాంగరాగచందనతాంబూలాగరుధూపకళికాసుగంధతైలకర్పూరమాలికాచీనీచీనాంబరాభరణకంచుకంబు లొసంగి వరబంధుమర్యాదలం దీర్చిన నవ్వనితాజనంబులుఁ బరస్పరపరిహాసానుకూలవచనరచనాధురీణలై సంతసించుచు వధూవరులపై దీవెనప్రాలు చల్లి మంగళగీతమ్ములతో నివాళు లిచ్చి యానందించుచుండిరి మఱియును.

శా. శ్రీనారాయణతుల్యదంపతులపై జేజేలు నంతంత న
మ్లానామోదసుమాళి డించిరి సురీలాస్యంబు గంధర్వస
ద్గానంబున్ జయనాదదుందుభిమృదుక్వాణమ్ములు న్మీఱఁగా
నానందించిరి భూజనంబులు వివాహాలోకనాధీనులై. 275

వ. అంత జనకుండు దశరథాదిమహారాజబంధుసముదయంబునకును స్వయంవరాగతమహారాజబృందమ్మునకును దక్కుంగలవారికిని వసిష్ఠగాధిజవల్మీకభవాదిమునిజనపూర్వకమ్ముగాఁ జందనతాంబూలాదిసత్కారమ్ము లొనర్చి సంతసింపఁ జేసి యపరిమితానందసందోహకందళితాంతరంగుండై దశరథుం గాంచి సవినయమ్ముగా నిట్లనియె. 276

ఉ. ఈవు కరంబుఁ బ్రేమమున నిట్టులు వియ్యము చెందుటం దప
శ్శ్రీవిలసిల్లు మత్కుల మక్షేమముగాఁ బరిపూతమాయెఁ బ్రియం
భావుక! నీకుమారులకు మామ యనంగను నాకుఁ జాలదే?
భావుక! కోసలేశ్వర! శుభంబు లభించెను నాకు నీకృపన్. 277

వ. అనుచుఁ బరస్పరానందసంభాషణంబుల జనకదశరథు లభినందించుచుండ. 278

చ. గురుఁడును వీతిహోత్రవిధికోవిదుఁడై బహుబర్హిరాస్తృత
స్ఫురదురువేదికన్ జ్వలనమున్ శ్రుతిధాయ్యను గీలుకొల్పి సం
స్కరణము సృక్స్రువాజ్యచమసంబులకు న్నెఱవేర్చి యవ్వధూ
వరులను వెంటఁ గొంచుఁ జని వహ్నికి మ్రోల వసింపఁ జేసియున్. 279

చ. అనలజ్వాలల సృక్స్రువమ్ముల ముఖాజ్యాహుత్యనేకప్రధా
ననవాజ్యాహుతు లగ్నిలో నిడి ప్రధానంబైన లాజాహుతిన్
ఘనపూర్ణాహుతి నిచ్చి యగ్నికి నమస్కారమ్ముఁ జేయించి రా
తిని ద్రొక్కించి ప్రదక్షిణత్రితయముం దీర్పించె వధ్వాళిచేన్. 280

చ. అనలము వేల్చి రాముఁడు ధరాత్మజకుం గల మేనిసోయగం
బును గన హోమధూమమిష మోము నుదగ్దిశకు న్మఱల్చి సీ
తను గనె సీతయు న్మొగము దక్షిణదిక్కుగఁ ద్రిప్పి రామునిం
గనె ముద మొందుచుండి రిటు కాంక్షితలబ్ధికి నవ్వధూవరుల్. 281

శా. శిష్టాచారముఁ దప్పకుండఁగను వాసిష్ఠోక్తిమై సృక్స్రువో
త్సృష్టాజ్యాహుతులం బ్రవర్ధితశిఖాదేదీప్యమానాగ్నినిం
బుష్టిం జెందఁగఁ జేసి రాముఁ డిటు భూపుత్రీయుతుండై మన
స్తుష్టిం జెందుచు భక్తియుక్తుఁ డగుచుం జోతల్ సమర్పించుచున్. 282

శా. స్వాహాకారము లుల్లసిల్లఁగఁ గులాచార్యుండు మౌనీంద్రసం
దోహంబున్ శ్రుతు లుచ్చరింపఁగను సంతోషించి రాముండు నై
దేహీయుక్తుఁడు సర్వదేవతలుఁ దృప్తిం జెందఁగా భక్తితో
నాహోమమ్మును బూర్తి చేసె మదిలో నానంద ముప్పొంగఁగన్. 283

ఉ. మాతలచెంత నానృపకుమారులు భార్యలతోడ నుండి యా
మాతలకుం బురంధ్రులకు మానితభక్తిఁ బదమ్ములం దలల్
చేతులఁ జేర్చి వందనముఁ జేయఁగ వారును వేఱువేఱుగా
నాతఱి దీవన ల్బలికి రాదరపూర్ణపవిత్రచిత్తలై. 284

చ. మఱియును జవ్వనుల్ నృపకుమారుల వేడ్కకుఁ బెండ్లికూఁతులం
గరములఁ జంక దాల్పుఁ డనఁగా నిజవాధ్వపదాంగరాగసుం
దరతరచిహ్నితాంకు లయి తాల్చిరి దారల సస్మితాస్యలై
తరుణులు జూచి సంతసిల దాశరథుల్ సుగుణాళినీరథుల్. 285

వ. మఱియు దీక్షాకృత్యమ్ములను సౌభాగ్యవృద్ధికరంబులగు వంశపాత్రనీరాజనాదిసకల వివాహవిధులం బరిసమాప్తి నొందించి యాదంపతులచే నామ్రరసాభిషేకాదికృత్యముల సర్వదేవతల సంతుష్టులం జేయించిరి పదపడి షడ్రసోపేతమంజులమధుర వ్యంజనమ్ములతో సకలతరుణీమణులు బరిహాసగీతాదివినోదమ్ము లొనర్చుచుఁ దమ్ము బరివేష్టింప ముదమ్మున నవ్వధూవరులుం భుజించిరి మఱియును. 286

ఉ. రాముఁడు సద్దయాగుణవిరాజితుఁడున్ సకలాత్ముఁడుం బరం
ధాముఁడు సుందరాంగుఁడు స్ఫురణద్యుతిభాసురచేలుఁడుం ద్రిలో
కీమహిమాధికుం డతులకీర్తియు మౌక్తికహారకంఠుఁడున్
భూమిజఁ బెండ్లియై యతులపూర్ణవిభాయుతుఁ డయ్యె నయ్యెడన్. 287

వ. అంత రామాదివరులు పరిగృహీతనవోఢామృదుకరాంగుళులై మంగళవాద్యపురస్సరంబుగా గజారూఢులై యుపకార్యలం బ్రవేశించిన నక్కుమారవర్గమ్ముతో దశరథుండు జనకప్రార్థితుండై మిథిలాపురమ్మున నొక్కమాస మ్ముండి పిదప నయోధ్యాపురమ్మునకుం బోవ నిశ్చయించినంత. 288

## సీత యత్తవారింటి కేగుట

తే. జనకభార్య సుమేధ భూతనయఁ జూచి, తక్కువారలు విన నీతిదాయకంబు
లైన వాక్యమ్ములను బ్రేమ మలర నిట్లు, చెప్పఁదొడఁగెను జానకీచిత్తమలర. 289

తే. అమ్మ సీతమ్మ! సకలధర్మమ్ము లీవె, తెలిసికొనియుంటి వైన నే దెలుపవలయుఁ
దల్లినై యుంటఁ గాంతామతల్లి తల్లి, వరతనూజాతకనకవల్లి! వినుము. 290

వ. ఉత్తమాభిజాత్యాదివిశిష్టసహజసుగుణయుక్త వగుట నీకు నీతిబోధము సేయఁ బనిలే దైనను లోకసామాన్యమాతృజనకృత్య మగుట నీకంటె నవరజాత లగు నూర్మిళాదులకును దక్కుంగల కాంతాలోకమునకును నీతిబోధకమ్ముగా నే నుడువు నీతులు వినుమని యిట్లనియె. 291

శా. అమ్మా! నాథుని నెల్లకాలము ముదాయత్తంపుఁ జిత్తమ్ముతో
నమ్మా నాథసమమ్ముగాఁ దలఁచి పాదాబ్జంబు లర్చించుచుం
డెమ్మా! పూజ్యపతివ్రతాయశము పృథ్విం దల్లిరో! యిట్లు సీ
తమ్మా! నాదు సదుక్తిచే మెలఁగు మమ్మా! నెమ్మదిన్ సమ్మతిన్. 292

తే. అత్తమామల కెప్పుడు నబ్బత్తిఁ గూడ, సేవఁ జేయంగ వలయును జిత్తమలర
వారియెడ నాత్మలోఁ బితృభావ మొంది, మెలఁగవలయును కులసతుల్ మేలనంగ.

తే. యాతల ననాందలను సహజాత లట్లు, చూడవలయును బ్రీతి మాటాడవలయు
మఱఁదులను బుత్రులం బెంచి మసలవలయు, నమ్మ! సతుల కిదియె ధర్మమమ్మ! సీత!

కం. సురలంచుఁ దలఁచి భూమీ, సురులం గని భక్తిభావశోభితమతితోఁ
గరముల మోడిచియు నమస్కరణము లెప్పుడును జేయఁగా వలయుఁ జుమీ!

తే. ఆశ్రితులు గారె యంచు బ్రాహ్మణులఁ జూచి, భక్తిచే మ్రొక్కకుంట శాస్త్రోక్తి
యగునె?, యనవరతపోషితలు నైనయట్టి యాలఁ, బూజ లొనరించి మ్రొక్కమే?
భూమిజాత! 296

సీ. పతికంటె మును బసాపడుట కూడదు వాని, కంటె మున్నగ నిద్రఁ గాంచఁ దగదు
పతిచెంత నవ్వఁగావలసినఁ జిఱునవ్వు, నవ్వ నౌఁ బకపక నవ్వఁ దగదు
పరగేహముల కేగఁ బాడిగా దెప్పుడు, పరపూరుషులతోడఁ బల్కు తగదు
పరుల శయ్యలపైనఁ బవళింపఁగా రాదు, భాగ్య మున్నను మిట్టిపాటు దగదు

తే. చెడిపివెలఁదుల చెల్మిని జేయరాదు, దీనులను బ్రోవ మదిని జింతింపవలయు
నంగహీనులఁ జూచి నవ్వంగరాదు, పరుల నిందింపఁ దగదు సూ! పట్టి! వినుము.

ఆ. పతికి మఱియు నాండ్రు పదివేవు రున్నను, వారి ననుజ లనెడు భావమునను
గాంచవలయుఁ గాని కడు నసూయ నహించి, సవతితనముఁ బూనఁ జనదు తల్లి!

ఆ. సిరుల కోర్చి యుంట సిరి నిల్చు నాయింటఁ, గల్మి గల్గినట్టి బల్మిఁ బట్టి
బడుగు లైనవారి బాధించు నాదారిఁ, బోక యుంట యశము రాక యంట.

చ. పతి పరదేశ మేగుతఱి భూషాద్యలంకృతిఁ జెందఁగూడ దా
పతి గృహమందు నుండుతఱి భవ్యముదమ్మున నుండనొప్పు నా
పతి యొకవేళఁ దిట్టినను వానిని దిట్టఁగఁగూడ దమ్మ! యా
పతి గతభాగ్యుఁ డైనతఱి భక్తిఁ ద్యజింపఁగఁగూడ దింతికిన్. 300

చ. పతిపదపద్మసేవనము భార్య యొనర్పక చేయునట్టి స
ద్వ్రతములు దానముల్ జపము ధర్మము సర్వము నిష్ఫలం బగున్
సతులకు భర్తృసేవనమె సద్వ్రతముల్ బహుదానధర్మముల్
పతిభజనంబు లేనిసతి భవ్యగతిం జన దెన్ని చేసినన్. 301

చ. పతిసేవ న్విడనాడి శ్రీపతిపదద్వంద్వంబు సేవింప శ్రీ
పతి దానిం గని సంతసింపఁడు సుమా! పాపస్థలిం ద్రోయు నా
పతియే శ్రీపతి యంచు సేవ లిడు నా పద్మాక్షినిం జూచి శ్రీ
పతి యాత్మస్థలిఁ జేర్చి సాకుఁ గరుణాపాంగంబు దీపింపఁగా. 302

తే. పతిని గొలిచి యరుంధతి–పడసె యశము, బతిని సేవించి యనసూయ–పడసె యశము
పతిని సేవించి సావిత్రి – పడసె యశము, బతిని సేవించు సతియెల్లఁ – బడయు యశము.

ఉ. ఉల్లము రంజిల న్బహుసుఖోన్నతితోడుత ముద్దు లొల్కఁ మేల్
పిల్లలఁ గాంచి వారలను – బెంచుచు దేవెరి వయ్యు నీగతిన్
దల్లివి తల్లితల్లులకుఁ – దల్లివిగాఁ గడు వంశవృద్ధి వ
ర్ధిల్లుము తల్లిరో! యెపుడు – స్త్రీసముదాయసతీమతల్లివై. 304

ఉ. పల్లవపాణి! పుత్రిక సెబా సనునట్టులు మంచి దైనచోఁ
దల్లికి వచ్చుఁ గీర్తి యది – తప్పినఁ దల్లిదె దోష మండ్రు నీ
విల్లలితోక్తి నమ్మి జనియించిన యింటికి మెట్టినింటికిన్
దల్లిరో! కీర్తిఁ దెమ్మతిముదమ్మున నిమ్ముగఁ బోయి రమ్మికన్. 305

వ. ఇట్లు సుమేధ సీతాదిపుత్రికల కుపదేశించి యంతర్బాష్పకలితయై కొమరితల దీవించి యత్తవారింటి కరుగ ననుజ్ఞ నిడి తా నంతఃపురమ్ముఁ జేరి యున్నంత. 306

తే. కంట నీరొల్కఁ గద్గదకంఠుఁ డగుచు, జనకభూపతి దశరథుఁ – గనుచుఁ బలికె
ఆత్మజల నత్తవారింటి – కనుపువేళ, పలుకశక్యమె పితరులు – పడునవస్థ. 307

తే. పిల్లలను నింతకాలంబుఁ – బెంచి నీ కుమారులకు నిచ్చినాఁడ నో ధారుణీశ!
కరుణతోడుత వారలఁ – గావు మింక, రవిమహస్సాంద్ర! దశరథ – రాజచంద్ర!

వ. ఇట్లు జనకుండు సకరుణమ్ముగాఁ బల్కి దుహితృజామాతృసముదయమ్మున కనంత రథగజాశ్వదాసీదాసజనచీనాంబరరమణీయమణిభూషావిశేషామూల్యపల్యంకాస్తరణరత్నకంబళాదిపదార్థసముదాయంబు ముదాయత్తుండై సుదాయంబుగా నొసంగి వధూవరులకు దీవనలు బల్కి చని రం డని యనుజ్ఞ నిడి దశరథునకు వందనమ్ము లొసంగి తదనుజ్ఞాతుండై నిజగృహంబున కేగినంత దశరథుండును రామాదిసుతులతో సీతాదిస్నుషాసముదయమ్ముతోఁ దక్కిన పరివారమ్ములతో బయల్వెడలి పోవుచు మిథిలాపురికి మూఁడామడల దూరమ్ము జనునంత నమ్మార్గమ్మున. 309

## శ్రీరామునకు భార్గవరాముఁ డడ్డుపడుట

చ. ఖగము లపస్వరంబులుగఁ – గర్ణకఠోరముగాఁగఁ గూయుచున్
ఖగతిని జెంది మండలముఁ – గట్టుచు నుండెఁ బ్రదక్షిణమ్ముగా
మృగములుమాత్ర మత్తఱిని – మేలును దెల్పుచు సంచరింపఁగా
దిగు లొదవ న్వసిష్ఠుఁ గని – దీనముఖుండయి యాజి యిట్లనున్. 310

చ. గురువర! యేమికర్మ మిది ఘోరనిమిత్తము లుప్పతిల్లెడుం
గరము భయంబు గల్గెఁ బ్రతీకారము లేమియొనర్చువారమో
యరయు మటన్న భూవర! శుభాంతభయం బిటఁ గల్గుఁ జుమ్ము వి
ష్కిరరవమార్గసంచరణచిహ్నములం గను మోయజాత్మజా. 311

వ. అని వసిష్ఠుం డాగామిఫలంబు నుడివి తాను దుశ్శకునదోషపరిహారసూక్తంబు
లుచ్చరించుచుండునంత. 312

సీ. అవ్వ అవ్వ మటంచు నవ్వారిగాలిచేఁ, గడల రోదసి ధూళి గప్పుచుండఁ
బెనువేళ్లగమి యెల్లఁ బెకలి వ్రాకులు గంప, గాలిచే నేలపైఁ గూలుచుండ
నెల్లవారలు గుండె జల్లు జల్లు మనంగఁ, దల్లడపాటుతోఁ బుల్లవడఁగ
గాలిచేఁ జెలరేగు ధూళి దూలుచు లోక,జాలము జీకులఁ బోలి యుండ

తే. దశరథుండును మిగులఁ దత్తఱముఁ జెంద, సైన్యములమానసంబులు దైన్యమొంద
నండజంబులు మెకము లఖండభీతి, నురక యట్టిటుఁ బర్విడుచుండునంత. 313

సీ. ఝంఝానిలోద్భవస్థానంబు లన దోలి, కాయితబహుజటాకాండ మమరఁ
గపులపై కెగురంగ గిరినుండి పరతెంచు, హరిమాడ్కి చరణసంచరణ మమర
హుంకారభవనాసికోచ్ఛ్వాసవాతావ, ధూతమై మేఘసంఘాత మమరఁ
గోపారుణాభదృగ్రూపాగ్నిచే నాజి, భూపాలజనపాళి తాప మొంద

తే. ఒక్కకేలఁ బరశ్వథ మొప్పుచుండ, నొక్కకేలను హరిచాప మొప్పియుండఁ
బండ్లు గొఱుకుచు సింగంబుపగిది యటకుఁ, బరశురాముండు చనుదెంచెఁ భయదకేళి.

మ. ద్విజసింహంబును జూచి సైన్యగజముల్ విభ్రాంతిమై భీతిమై
నిజహస్తాళిఁ గదల్ప కింతకును మున్నె తెక్కు నమ్మత్తునుం
ద్యజియించె న్వని బావురుం గనిన దుఃఖావేశనిశ్చేష్టమా
ద్విజసంఘమ్ముగతిఁ సమస్తజనముల్ దీనాత్ములై రత్తఱిన్. 315

ఉ. కట్టుపకాసులే యతనిఁ గాంచి కకావికలై భయమ్ముతోఁ
జెట్టులచాటు కేగిరి వజీరులుఁ గొందఱు నేల నిల్చి జేఁ
బెట్టుచు నుండి రుర్విపయిఁ బెట్టిరి యాయుధపాళి నెల్లరుం
దిట్టతనంబు లేక పరిదేవన మొందిరి రాజసైనికుల్. 316

కం. వచ్చిన భార్గవుఁ గనుఁగొని, పచ్చరుఁడై దశరథుండు భయకంపితుఁడై
యచ్చపుభక్తిని మ్రొక్కిడి, విచ్చవడుచు నతనిఁ బలుకరించెం దుదకున్. 317

చ. చిఱుతలు సుమ్ము నాసుతులు । చిత్తములోఁ గృపఁజూడు మయ్య ! యా
చిఱుతల ప్రాణముల్ నిలిపి । సేవకుఁడ న్నను గావు మయ్య ! నిన్
శరణముఁ జెందినాఁడ నిఁక । శాంతిని జెందుము సన్మునీశ్వరా !
పరమదయాగుణాంబునిధి ! । భార్గవవంశసుధాబ్ధిచంద్రమా ! 318

తే. అనుచు వేఁడెడి దశరథు । నవధరించి, రాముఁ డనువాఁ డదెక్కడ । రా? యటంచుఁ
జరచరను బోయి శ్రీరామ । చంద్రుఁ గాంచి, నుడివెఁ గనలుచుఁ గన్బొమ । ల్ముడివడంగ.

శా. ఏరా ! బాలిశవృత్తి ! నీమదిని నొ । క్కింతైన జంకొందకే
దూరాజన్యదురంతగర్వవనసం । దోహాగ్నియై భార్గవుం
డో రాముం డొకఁ డీధరం దిరుగఁగా । నయ్యారె ! యాకార ! నే
నే రాముండ నటంచుఁ బల్క మతి లే । దే మూర్ఖరాజార్భకా ! 320

సీ. గండ్రగొడ్డలిచేతఁ । గార్తవీర్యార్జును, సైన్యసమేతునిఁ । జంపినాఁడ
ముయ్యేడుమాఱు లీ । భూమిపైఁ బెచ్చు గ, ర్వించు రాజులను ఖం । డించినాఁడ
బాహుసారమున భూ । వరుల నందఱఁ జంపి, మించి యీధర నా । క్రమించినాఁడ
జన్న మొక్కటి చేసి । జన్నంపు దక్షిణ, కిలఁ గశ్యపునకు నే । నిచ్చినాఁడ
తే. అట్టి వీరాధివీరుఁడ । నైన నన్ను, మించి శూరుఁడ నంచు గ । ర్వించి యుంటి
వింపుగల నాదు చరిత నా । లింప లేదె ?, నీచరిత్రము విన నట్టె । రాచపట్టి ? 321

తే. ఈశు చాపంబు విఱుచుట । కేమి కతమొ ?, విఱిచినంతనె నీవు గ । ర్వించు టేల ?
శివునిచాపంబు విఱువ భా । ర్గవుని చేత, నేమి చేటగునో యని । యెంచ వాక్కొ ?

చ. చివికిన యీశచాపమును । జేకొని ఖండముఁ జేసినంతనే
భువి బలశాలి నైతి నని । పొంగెద వేలొకొ ! యిద్ది విష్ణుర
శ్రవసునివిల్లు దీనిఁ గొని । చక్కఁగ నెక్కిడితేని బాలకా !
బవర మొనర్తు నప్పుడు భ । వద్బలముం గనుఁగొందు ముంగటన్. 323

ఉ. ఎక్కిడితేని శూరుఁ డని । యెంచెద నిన్ను దురమ్మునందు నీ
మిక్కిలి నిక్కు దూల్చెదను । మీపరివారము నెల్లఁ జీల్చెద
న్ముక్కలు సేసెదం గనుము । భూపకుమారక ! భార్గవుండుఁ జు
మ్మొక్కడి కేగువాఁడ నిఁక । నీధను వెక్కిడు మక్కజమ్ముగాన్. 324

తే. అనిన నారాముఁ డాతని । మంచు భక్తి, భావ మమరంగ వినతుఁడై । ప్రణతిఁ జేసి
రాముఁడను మ్రొక్కుచుంటి మా । ర్తండధామ!, పరమపావనతరనామ! । పరశురామ.

వ. అనుచు వినయమ్మున నమస్కరించిన శ్రీరామచంద్రునిం గాంచి తనసర్వస్వ మూరక యపహరించినవానిం గని కోపించునట్లు కోపారుణాక్షుండై నిటలాక్ష శిష్యుం డన నొప్పి కౌశికదూర్వాసు లితనికి శిష్యు లనం దగి వసోర్ధారాజ్వాలజ్వాల నంబుపోలిక మండిపడుచుఁ గటముఁ లదర బొమలు ముడివడఁ బండ్లు పటపటఁ గొఱుకుచు రాచకూనా! నీవెడఁగుజోతలకు శాంతింపను సుమా! యనిన భార్గవుం గని రామచంద్రుండు మందహాససుందరవదనారవిందుండై యి ట్లనియె. 326

తే. పెండ్లియై భార్యతో వచ్చు ✽ చుండి నీకు, ధరణిసురుఁ డని భక్తి వం ✽ దన మొనర్ప
దీవనలు లేవు పోనిమ్ము ✽ తివిరి నన్ను, నాలమున కేల పురికొల్ప ✽ నేల వేల్ప? 327

శా. వీరంమన్యనృపాలు రాజికి నొగిఁ ✽ బిల్వంగ మే మప్పుడే
వారిం బోర నిశాతబాణములచే ✽ బాహాబలం బొప్ప సం
హారంబుం బొనరింతు మయ్య! యిది మా ✽ యాచార మో భార్గవా?
పాఱు ల్పోరికిఁ బిల్చినం జనుదుమే? ✽ వారిం గనన్ మ్రొక్కమే? 328

తే. దేవభూదేవమానినీ ✽ గోవులందు, వీరధర్మంబుఁ బూనక ✽ వినయ మొంది
ప్రణతిఁ జేయుటె కాక విఱ్ఱవీగ నేము, రాఘవుల ధర్మ మిది వీడ ✽ రాదు రామ!

తే. అనఁగ నతికోపనుఁడు ముని ✽ యనియె నప్పు
డోరి? యీయనుమానమా ✽ యాత్మయందుఁ
జెంది మాతోడ యుద్ధంబుఁ ✽ జేయ నంటి
వహహా! తెలిసెను నీయాశ ✽ యంబు రామ! 330

ఉ. పాఱు లశక్తు లంచు నొక ✽ భావము లోనఁ దలంచి పైపయిం
బాఱులయందు భక్తి యని ✽ పల్కుచు వారిని వీడి తొక్కె? మా
పాఱులు శాపచాపములఁ ✽ బార్థివగర్వము నప్పు డప్పుడుం
దీరుపకున్న నేం డ్లిటు మ ✽ దిం దలపోయుట యుక్తమే సుమా. 331

తే. చాపవశముననో కాక ✽ శాపముననొ, భూపమద మణఁగించుట ✽ లోప మైనఁ
బాలకీలను నహుషుని ✽ పగిది మీరు, రామ! మాచేత మోయింప ✽ రా! మదించి.

తే. అట్టివారౌటచేఁ గాదె ✽ యవనిపతుల, మ్రందఁ జేసితి ముయ్యేడు ✽ మార్లు వెదకి
దొంగదండంబులకు నేను ✽ లొంగఁ జుమ్మి?, దురముఁ జేయక పోను నీ ✽ తోడ నేఁడు.

కం. పాఱులు వీరులె కారా?, పో రొనరింపఁగను లేర? ✽ భూరమణులె యీ
ధారుణిలో వీరు లొకో?, యాహా! నీ వింతవాఁడ ✽ వైతివె రామా! 334

వ. అనినం బరశురామునితో శ్రీరాముం డి ట్లనియె. 335

తే. చంపఁ దలఁచితి వేని నన్ । జంపు మయ్య, చాపమే పట్ట నన్న చో । సమర మెట్లు
పోరి కేనోడి కాదు జోహారు లిడుట, యని తలంపుము భూమిదేవా! మహాత్మ!

తే. అడుఁగులకు వందనం బిడఁ । బుడమివేల్ప!, చెడుఁగులగు ఱేండ్ల నిప్పుడు । తడవ నేల?
బడుగు లగువారిఁ జంపిన । గొడవ లేల?, దీవన లొసంగి సెలవిమ్ము । దివ్యతేజ!

ఉ. పాఱుల నింద తప్పు సుర । భావముతో భజియించు టొప్పు దు
ష్కాములు నైన వేనహుష । ప్రభుముఖ్యులఁ దిట్టఁ బాడియా
పాఱులయందు భక్తి గల । వారలు ధారుణి లేరె? పార్థివుల్
వారును వీరు నం చొకవి । భాగము లేకయె తిట్టవచ్చునే? 338

తే. ఐన భృగురామ! నిన్నొకఁ । డడుగవలయుఁ, గార్తవీర్యుఁడె నీ కపకారి యైన
రాజు లందఱిఁ జంప ధర్మంబె నీకు, నీవు ధర్మాత్ముఁడవె కావె? । నేలవేల్ప!

ఉ. వింటిని నీప్రతాప మతి । వీరమె కాని జగాన నాఁడు నా
వంటి నృపాలుఁ డొక్కఁడును । బాహుబలాఢ్యుఁడు లేమి నెల్లరం
బంటుదనాన చంపితివి । పాఱుఁడ! దాని నటుండనిమ్ము నా
బంటుదనంబుఁ జూచెదవె? । వైష్ణవచాప మిటిమ్ము నా కనన్. 340

ఉ. అంతట రాముఁ డాదశర । థాత్మజుతో నను రామ! దీన భూ
కాంతుల నెల్లఁ జంపితిని । గావునఁ జేవల వీఱ వీనినిం
బంతముతోడ నెక్కిడుము । ద్వంద్వరణం బొనరింతు విప్రభూ
కాంతుల తారతమ్యములు । గానఁగనౌ నని యిచ్చెఁ జాపమున్. 341

## పరశురామ గర్వభంగము

వ. ఓ దాక్షాయణీ! శ్రీరామచంద్రుం డాదినారాయణుండు గాన దద్భార్గవరామనిష్ఠం బగు స్వాంశతేజంబు నాచాపంబుతోఁ గూడ నాకర్షించి తనయం దుంచుకొనె నప్పుడు శ్రీరాముఁ డనుపమానతేజోభిరాముఁ డయ్యె భార్గవుండు సహజవైష్ణవ సత్వం బంతరింప మధ్యోద్భూతరాజసతామసగుణసన్నిపాతవికారంబు తేజోహరణ రసాయనసేవనమ్మున వోయి యంతరితసహజసత్వగుణాభియోగమ్మున శాంతి నొంది యుండె. 342

తే. మధ్యకాలపు సిరి నమ్మి । మనుజుఁ డకట!, మత్తునం గ్రిందుమీఁదు మైమఱచియుండు
నట్టి సిరి వోవ రాజసం । బఱఁగి మరలఁ, దరలిపోయిన పూర్వసత్త్వంబుఁ గొనఁడె?

వ. ఇట్టులు గుట్టుచెడి దిట్టతనంబు లేక వట్టి జన్నిగట్టై యిట్టట్టు చూచుచు భీతి దొట్టి కొనఁ దన్నుఁ గొట్టఁ బట్టిన విల్లట్టనుమ మిర్మిట్టులఁ బుట్టించునట్టులు సాన బట్టిన రామబాణంబు నట్టె కనుంగొనుచున్న భృగురామున కట్టెదుట నాకర్షితహరిశరాసనుండు నారోపితశరుండును లస్తకన్యస్తవామహస్తుండు నాకర్ణగుణాకర్షణప్రశస్తదక్షిణహస్తుండును నైన శ్రీరామచంద్రుం డాభృగురామునిం గాంచి యిట్లనియె.

ఉ. భూసుర ! యెక్కు వెట్టితి నమోఘము రామశరంబు దీనిచే
భూసురుఁ డౌటఁ జంప నినుఁ బుణ్యఫలంబొ భవత్పదమ్ములోఁ
జేసెద దీనికిం బలిగఁ జెప్పుము రెంటను దేని నిచ్చెదో
భాసురతేజ ! రామ ! యన భార్గవరాముఁడు పల్కె నీగతిన్. 345

## పరశురామస్తవము

శా. "ఆయుష్యం భవతే దదాతు విధి రత్యైశ్వర్య మార్యాపతి
ర్ద్రేయా త్స్వాదువచోవిశేష మిహ వాగ్దేవీ రమేశ శ్శ్రియం
భూయా త్తే సకలం మనోరథఫలం భూపాల" యంచు న్మని
ధ్యేయుఁ డా రాముని దీవనల్ బలికె భూదేవార్హసత్వాఢ్యుఁడై. 346

వ. ఇట్లు లోకన్యాయమ్ముగా దీవించి పరశురాముఁడు శ్రీరామునిఁ బరంధామునిగాఁ దనకుం గల సాత్త్వికశక్తిచే నెఱింగి యిట్లను రామచంద్రా ! యిప్పటికి నిన్నప్పంకజనాభుం డని తెలిసికొంటి మున్ను నే గోమతీతీర్థమ్మునఁ దపం బొనర్చుచుండఁ బురాణపురుషుండగు నారాయణుండు ప్రత్యక్షంబై నన్నుం గాంచి భార్గవా ! నీకోర్కి నాకుం గోచరించినది నాయంశమ్మునఁ గొంతభాగం బిపుడు నీ కిచ్చెద దానం జేసి నిరుపమానబాహుబలసారుండవై భవత్పితృఘ్నుఁ డగు కార్తవీర్యార్జునుం బొలియించి పదంపడి ముద్యోదుమాన్లు దౌర్జన్యయుక్తులై సౌజన్యమాన్యుల బాధించు రాజన్యులఁ గడతేర్చి భూభారమ్ము హరించి జన్నంబొం డొనర్చి భూమి నెల్లఁ గశ్యపున కిచ్చి శాంతుండవై యుండఁ ద్రేతాయుగమ్మున రావణాదిరాక్షససంహారమ్మునకై నే నినవంశమ్మున దాశరథినై శ్రీరామనామమ్మున నవతరించి నీయందుంచిన యంశభాగంబు గ్రహించెదఁ బిదప నీవుఁ దపోనిష్ఠుండవై యుండఁ గలవని చెప్పి తిరోహితుం డయ్యె నయ్యాదినారాయణుండ వీవె యని గ్రహించితిఁ గృతార్థుండ నైతి నని మఱియును, 347

మ. ఇనవంశాంబుధిపూర్ణచంద్ర! జనకాక్షోణీశాత్మజానాయకా!
ఘనయోగీంద్రమనస్సరోజరవిసంకాశాంఘ్రిసంచారకా!
మునినాథార్చితపాదపద్మయుగళా! ముక్తావళీసేవితా!
మనుజాకారరమాధినాథ! రఘురామా! భక్తకల్పద్రుమా! 348

మ. నినుఁ గన్నంత విరోధభావమున నేనిందించితిం దప్పెయై
నను నీచావళిమైత్రికన్నను మహాన్నత్యప్రభావాశ్యస
జ్జనసైర మ్మది మేలె నాదయిన దోషం బేగె సుజ్ఞానము
న్మనమందుం జనియించె ధన్యుఁడను రామా! భక్తకల్పద్రుమా! 349

మ. ఘనపాషాణము నంఘ్రిపంకజపరాగప్రాప్తిచే నాతిగా
నొనరింపన్ భువి నేరి కైనఁ దరమా? యోహో! భవత్పాదసం
జనితంబైన పరాగరేణువునకున్ సామ్యంబు లే దన్నచో
ననుమానం బిసుమంత లేదు సుమి రామా! భక్తకల్పద్రుమా! 350

మ. జనకక్ష్మాపతి శైవచాపము నొగిన్ సజ్జంబు నెవ్వాఁడు చే
సిన నవ్వానికి సీత నిచ్చెద నసం జేయంగ లే కందఱుం
జన శక్తుండవు గానఁ జేసితివి సజ్జం బంతటన్ సీత నె
మ్మనమందు న్మద మొందఁ దెచ్చితివి రామా! భక్తకల్పద్రుమా! 351

మ. ఘనసంసారసముద్భవాఖిలవిపద్గాఢాంధకారార్కకాం
తినిఁ బోల్పం దగు నీదు తారకము భక్తిం జెంది యెవ్వాఁడు నె
మ్మనమందున్ జపియించు వాని యఘముల్ మాయమ్ములౌ నట్టి స
న్మనుజుం డున్నతమోదముం బడయు రామా! భక్తకల్పద్రుమా! 352

మ. ధరఁ దీర్థమ్ముల కేగ నేల బహుమంత్రధ్యాన మేలా మహా
ధ్వరదీక్షానియమమ్ము లేల జగదాధారా! భవత్పాదప
ద్మరుహంబుల్ శరణంబు లంచు మది సంకల్పించి "రామా" యటం
చరయ న్నీస్మరణమ్మె చాలదొకో? రామా! భక్తకల్పద్రుమా! 353

మ. భవకాంతారదవంబు పాపపటలీవర్షాబ్దవాతంబు నీ
దు వరాంఘ్రిద్వయసేవన మ్మదియె కాదో మోక్షసంధాయి హా
నివహుల్ చేయు తపం బదేమొకో హరీ! నీపాదసంసేవయే
యవని న్ముక్తిన కిద్దియే తపము రామా! భక్తకల్పద్రుమా! 354

మ. భవసాహస్రపరంపర న్మను నిరుక్తి భావించి నీపాద మెం
తవిశేషం బగుభక్తిఁ గొల్చితినొ ? మోహద్రప్రక్రియన్ రాఘవా !
భవదత్యద్భుతసుందరాకృతిని దేవా ! చూడఁగా నయ్యె నే
నవనిన్ ధన్యుఁడ నైతి నీవలన రామా ! భక్తకల్పద్రుమా ? 355

—: దండకము. :—

శ్రీమానినీచిత్తచోరా ! సమద్భక్తనైర్మల్యయుక్చిత్తకంజప్రచారా ! నవాంభోదబృందోపమానాంగదీప్తిప్రపూరా ! సువర్ణాద్రిధీరా ! సరస్వద్గభీరా ! మహావీర ! లీలానృపాలావతారా ! మహావిస్మయానాదశక్త్యాఖ్యదోష్యగ్రసారా ! సరోజాప్తవంశాబ్ధిసంపూర్ణచంద్రా ! దయాసాంద్ర ! శ్రీరామచంద్రా ! చిదానందరూపుండవై నిర్గుణబ్రహ్మమై కల్పవేళం జగత్సంఘ మాత్మం బ్రవేశింపఁగాఁ జేసి యేకార్ణవం బౌతటిన్నీటిపై నుండి నారాయణాభిఖ్యనుం జెంది భాసిల్లియుం జీవసంఘమ్ములన్ వేండియున్ లీల సృష్టింపఁగాఁ గోర్కి జన్మింప నాత్మేచ్ఛచేత న్మహాన్ముఖ్యతత్త్వమ్ముల న్మొందుగాఁ జేసి యవ్వానిచే నెల్ల జీవావళీసృష్టిఁ గల్పించి తత్త్వస్వరూపుండవై సాక్షిభూతుండవై యుండి బ్రహ్మాండము న్నిండి జీవాఖ్యచే దారువం దగ్నిరీతి న్నిగూఢుండవై జీవసంఘమ్మునం దెల్ల భాసిల్లు విష్ణుండ వీవే కదా ! లోక మెల్ల న్భవద్రూపమే గాక వేఱున్న దే ? విశ్వమూర్తీ ! మహామాయచే గూఢవై యుండు నిన్నుం గనంగా వనంగారిముఖ్యామరుల్ జాలఁగా లే రనంగా ధరన్ నాతరంబా ! నరాకారదేవా ! భవత్సృష్టసుత్ కామరోషాదిషడ్వైరివర్గంబునుం గూల్పలే కజ్ఞులై యుండి సుజ్ఞానపారీణులన్ దుఃఖ మొందింపు పాపాత్ములం గూల్ప శిష్టాళి రక్షింపఁగా యుక్తరూపమ్ములో జన్మముం గొందు వీ వంతియే కాక జన్మంబు నంతంబు నీ కున్న దే ! యాదిమధ్యాంతహీనుండవే కావె ! లోకప్రవృత్త్యర్థమై యీశ్వరాజాచ్యుతాకారముల్ దాల్తు కాదా ! భవచ్ఛక్తులున్ రూపముల్ స్తోత్రముం జేయ నెన్నంగ గణింపం గణాధీశశేషాదులుం జాల రారీతి జన్మప్రకారంబు నీ కుండుటం జేసి కాదే ! హయగ్రీవదైత్యున్ హరింప న్మహామత్స్యరూపమ్మునుం దాల్చి తీవంతటన్ దేవదేవారినిర్మథ్యమానాబ్ధినిర్మగ్నమంథానముం దాల్పఁ గూర్మాకృతిం జెంది భర్మాక్షు నిర్జింపఁ గ్రోడాకృతిం దాల్చి యాపిమ్మట న్భక్తుఁ డైనట్టి ప్రహ్లాదు రక్షింప నవ్వానితండ్రి న్హరింప న్నృసింహావతారమ్మునుం జెంది బల్యర్థమై వామనాకారమున్ జెంది యాపిమ్మటన్ దుష్టరాజన్యులం జంప నారూపుగాఁ బుట్టి తత్కృత్యముం దీర్చి యీవర్తమానమ్మునన్ రావణాదిత్రియా

మాచరాత్యంతదుష్టాత్ములం ద్రుంపఁగాఁ బూతయశా సూర్యవంశమ్మునన్ రామచంద్రా-హ్వాయం బొంది యున్నట్టి నారాయణస్వామి వీవే కదా! యింక రాఁబోవు కాలమ్మునం గూడ సీరాయుధాకారమున్ బుద్ధకల్కి-స్వరూపమ్ముల న్భాసమానుండవై యుండు వీవే కదా! యోగవాధారి! నీమాయ నన్నుంపఁగా మున్ను నిన్నుం గనన్ లేక నే గర్వముం జెంది సామాన్యరాజన్యుఁగా నెంచి నీతో విరోధంబు నేఁ జెందితి న్నేరముం జేసితిం గాన నన్నింక దాసుం డటంచున్ దయాదృష్టి నీక్షించి నానేరము ల్గాచి రక్షింపు మో జానకీజాని! నిన్నింక సాక్షాత్పరబ్రహ్మ మంచు న్మది న్భక్తి సేవించి నీ తారకాఖ్యాకసన్మంత్రరాజంబుఁ జిత్తాబ్జమం దుంచెదన్ దోషపుంజమ్ములం ద్రుంచెద న్మోక్షముం గాంచెదన్ దేవదేవా! బళీ! మానికంబుల్ మహాశాణసంఘర్షణం బొంది తా దే మెఱుం గెక్కుడై యుండు నాకీతి నీతో వివాదమ్మున న్నాదు మాలిన్యముం బోయి శుద్ధాంతరంగుండనై మంగళప్రాపకంబౌ భవత్పాదయుగ్మమ్ము లోఁగొంచు మోక్షప్రధానుండవై మించు నీయందు నిర్నిద్రభక్తి న్మదిం జెందఁగా నయ్యె దేవాదిదేవా! రఘూత్తంస! సీతాపతీ! యిట్టి నిన్ను న్మహాస్తోత్రముం జేసి కీర్తింపఁగాఁ జాడియే కాని నే నల్పసంవిద్యుతుండ న్బళీ! నీవు వేదాంతవేద్యుండ వౌట న్నినున్ స్తోత్రముం జేయఁగా నాతరంబా! కరం బాస్థచే నామవీసాగతిం దోఁచిన ట్లీగతిన్ స్తోత్రముం జేసితిం గాని శ్రీరామదేవా! కరద్వంద్వము న్మాత్రము న్నా కధీనమ్ముగా నుండుట న్నీ కనంతమ్ములౌ వందనమ్ము ల్ఘటింతుం జుమా పూతగోత్రా! భవవ్యాధివీరుల్లవిత్రా! మహాస్తోత్రపాత్రా! నమద్భక్తహృత్కంజమిత్రా! విచిత్రాత్మభాస్వచ్చరిత్రా! పతంగాధిరాడ్దివ్యపత్రా! దళత్పద్మపత్రాతిసౌందర్యజైత్రాతిభాస్వత్సునేత్రా! దశస్యందనక్ష్మాతలాధీశపుత్రా! దయాక్షేత్ర! సీతాకళత్రా! నమస్తే నమస్తే నమస్తే నమః. 356

చ. అని నుతియించి యిట్లను మహాదంహ్రఘులఁ ద్రుంచిన నింద్రశైల నే
యనువునఁ జేయువాఁడ నిఁక నస్మదనూనతపఃఫలంబె కై
కొనుము భవచ్ఛరమ్మునకుఁ గోసలరాజతనూజ! యన్న దా
నిసిఁ గొని బాణముం దివిచి నేర్పున నారఘురాముఁ డిట్లనున్. 357

తే. ఇష్టమైనట్టి వరము నీ కిచ్చువాఁడ, కోరు మన వాని నీభక్తకోటిసేవ
నీదు సేవ నొసఁగు మహానిష నిమ్ము, రామ! యన నిచ్చె నట్టె శ్రీరాముఁ డపుడు.

తే. వరదుఁడగు రామవిభునకుఁ గరము మోడ్చి, వందనమ్మిడి సంతోషభరితుఁ డగుచు
ననుమతిని జెంది యమ్మహేంద్రాద్రి కేగెఁ, బరశురాముఁడు శాంతభావమ్ముతోడ.

సీ. కైలాస మెత్తి లోకములనెల్ల జయించె, నిద్ధతేజుండు లంకేశ్వరుండు
అట్టిరావణుఁ గట్టి యవలీలఁగాఁ జెఱ,యందుంచెఁ గార్తవీర్యార్జునుండు
కార్తవీర్యార్జును గండ్రగొడ్డలిచేత, బడఁగొట్టి చంపె నీభార్గవుండు
పరశురాముని గర్వభంగంబుఁ గావించి, జయ మొందె శ్రీరామచంద్రుఁ డహహ!

తే. రామబాహుబలంబు వర్ణన మొనర్పఁ, దరమె! యెవ్వారికైన దాశరథి యింత
శక్తిమంతుఁ డటన్నఁ దద్భక్తశక్తి, యనుపమము గాదె భువనత్రయంబునందు.

వ. ఇట్లు పరశురాముఁ డేగిన దశరథసైనికు లెల్లరుఁ గాలుసేతులు గదల్చుచు ననిమీలితలోచనులై నల్దిక్కుల నిర్భయమ్మునఁ జూచుచు భార్గవుం డేగిన తెన్ను నంక బెదురు గదురు చూపులం జూచుచుఁ బునర్జీవితుల మైతి మని యెంచుచు మెలంగుచుండి రంత దశరథుండును రామచంద్రునిఁ గౌఁగిలించి మృత్యుముఖాగతునిగాఁ దలంచి యానందించుచున్నంత. 361

ఉ. జాఱినకైదువు ల్గొనుచు సైనికు లెల్లరుఁ జాటునుండియున్
భూరుహపాళినుండి నృపపుంగవుచెంతకుఁ జేరి రాఘవా!
పాఱుఁడు నాలసింప మనపద్ధతి కడ్డము వచ్చు నేమొ? వే
యూరికిఁ జేరు టొప్పు నన నూకొని రాజును సంభ్రమించుచున్. 362

వ. సకలపరివారముతో బయలుదేరి యలంకృతంబగు నిజపురంబుఁ జేరి రాజమార్గమ్మున గజారూఢులైన రామాదివరులతోఁ గూడి మంగళవాద్యమ్ము లలర వారనారీలాస్యంబు లాలోకించుచు మహోత్సవమ్మున శుభగృహప్రవేశ మొనరించి దంపతులచే లక్ష్మీపూజనమ్ము గావింపఁజేసి వసిష్ఠాదులకు మహాదానమ్ము లొసఁగి యున్నంత దశరథబహూకృతులై బంధురాజు లాత్మనగరమ్ముల కేగిరి. భరత మాతులుండగు యుధాజిత్తుఁడు గతిపయదినమ్ము లాయయోధ్యాపురమ్మున నిలిచి తనపురంబున కరిగె నంత రామాదులుఁ దమతమజాయలతో సకలవైభవమ్ముల రాజభోగమ్ము లనుభవించుచు జననీజనకుల కానందదాయకులై యుండి రనిన విని దాక్షాయణి యిట్లనియె. 363

మ. పరమేశా! భృగురాముఁ డాహరికళాభాగమ్మునం బుట్టె నం
చు రహిం జెప్పితి వీవు రాముఁడును నా చొప్పెంది జన్మించెనే?
నరుఁడై భూతలమందు దుర్జనతతి న్నాశమ్ము నొందింపఁగా
హరిచారిత్రము జెప్పుమా యన విరూపాక్షుండుఁ దా నిట్లనెన్. 364

తే. ఇనుఁడెన్నిని రూపముల్ । హరి ధరించె, రామకృష్ణులు పూర్ణాంశ । రూపము లందు
నాద్యుఁడగు రాముఁడు విశిష్టుఁ । డయ్యె రాము, నకు సమానుఁడు లేఁడు సూ । నగకుమారి!

తే. వాసుదేవుండు మేచక । వర్ణుఁ డబల!, రాముఁ డట్టిఁడె యక్కృష్ణ । నామయుతుఁడు
జానకీరామకల్యాణ । సహితగాథ, నాలకించిన మంగళ । ప్రాప్తి కలుగు. 366

వ. అని చెప్పిన పరమేశ్వరు వచనమ్ములు విని దాక్షాయణి తారకరామచంద్రకథా శ్రవణోత్సాహ యగుటం బరమానందకందళితహృదయారవింద యై యుండె. 367

మాలిని. హృతనతపరితాపా ! । హస్తసక్తాద్రిచాపా !
దితిజవిపినకీలీ ! । దీవ్యమానత్రిశూలీ !
నతజనపరిపోషా ! । నాగభాస్వద్విభూషా !
శ్రితసమవనభావా ! । శ్రీభవానీశ దేవా ! 358

ఇది శ్రీ గుండు లక్ష్మణశాస్త్రి విరచితం బైన
ఆంధ్రానందరామాయణమ్మునందు
ద్వితీయాశ్వాసము
సమాప్తము.



శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# ఆంధ్రానందరామాయణము

## సారకాండము

### తృతీయాశ్వాసము



మ త్తారకమంత్రచింతనరతా ! చిద్రూప ! భక్తావళి
క్షేమప్రాపణశక్తపాదయుగళా ! శ్వేతాంగరుగ్భాస్వరా !
వామాంగీకృతశైలరాజతనయా ! వందారుబృందారకా !
సోమాలంకృతమౌళి ! యోగిజనసంస్తుత్యా ! భవానీశ్వరా ! 1

వ. అవధరింపుము.

చం. అనువుగఁ బ్రాణనాథుఁ గని యంబిక పల్కె దృఢానురాగయై
ఘనతరమైన రాఘవుని గాథ పదంపడి యెట్లు చెల్లెనో?
విన నభిలాష మయ్యెడు సవిస్తరము న్వచియింపుమా యన
న్విను మని శంభుఁ డిట్లనె నవీనసుధామధురోక్తు లొప్పఁగాన్. 2

ఉ. రాముఁ డయోధ్యలో నిటు ధరాతనయాన్వితుఁడై యనంతకో
భామహితుండునై సకలభాగ్యసుఖానుభవమ్ము నొంది తా
నేమము భక్తి మీఱ జననీజనకాంఘ్రులసేవఁ జేయు చు
ద్దామయశంబుఁ జెందుచు ముదమ్మున నుండెను సానుజన్ముఁడై. 3

## దీపావళిక రామాదులు మిథిల కేగుట

ఉ. అంతట మైథిలుండు శరదాశ్వినదర్శ నొనర్చు దీపికా
త్యంతమహోత్సవమ్మునకు నాజిని బుత్రసమన్వితమ్ముగాఁ
గాంతలతోడఁ దెం డనుచుఁ గౌతుక మొప్పఁగఁ బంప మంత్రు ల
త్యంతరయమ్మునం దశరథాధిపుప్రోలికిఁ జేరి రిమ్ముగన్. 4

వ. దశరథుండును స్వాగతసంభాషణపూర్వకముగా వారల సంభావించి యాగమన
కారణం బెఱిఁగి సముచితంబగు తదాహ్వానంబు మన్నించి ప్రయాణసన్నద్ధుండై. 5
సీ. ఒకనాఁడు మేలుముహూర్తమ్మున న్మంత్రి, సామంతపరిజనసహితుఁ డగుచు
కొమరులు నల్గురు రేన్గుల నెక్కి చనుదేర, వింతులుఁ గరిణుల నెక్కి రాఁగఁ
గోపేంద్రుతోఁ గూడి కోసలాధిపుఁ డెల్ల, సైన్యంబులను గూడి సంతసమున
మిథిలాపురికిఁ జేర మిథిలేశుఁ డాలించి, పరివారయుతముగా వారి కప్పుడు
తే. ఎదురుగాఁ బోయి పూజల నెల్లఁ దీర్చి, మంగళారావములను వారాంగనాళి
నాట్యసంరంభములును గానంబు లలర, నుత్సవంబున వారల నూరఁ జేర్చె. 6
తే. వారు వచ్చెడు నారాచబాటలందు, సౌధగతకాంత లమితపుష్పములఁ జల్లఁ
గోసలేంద్రుఁడు పరిజనభాసమానుఁ, డగుచు జనకునియింటికి నరిగె వేడ్క. 7
మ. ఇటు లేతెంచినవారి మైథిలుఁడు నెంతే మోదముం జెందు చు
త్కటభక్తిం గొని మంగళస్నపనభక్ష్యవ్యంజనాన్నాదులం
గటకాద్యాభరణాంబరమ్ములఁ గడు న్మర్యాదఁ గావించి యం
తట దీపావళివేడుకల్ సలిపి యానందించెఁ జిత్తమ్మునన్. 8
మ. జనకుం డల్లురనుం గొమారితల సుస్వర్ణాంబరాలంక్రియా
ఘనశయ్యాసనగోరథాశ్వగజసంఘాతమ్మునన్ గౌరవిం
చిన నాజిప్రభుఁడున్ స్నుషాతనయదాసీదాససైన్యాళితోఁ
దన ప్రోల్ జేరఁగ నుద్యమించి చనె మందప్రక్రమం బొప్పఁగన్. 9
తే. జనకుఁడును గొంతదూరము సాగనంపె, నతనితోఁ గూడి దశరథుఁ డాత్మబలము
వెంటఁ గొంచుఁ జనంగ నవ్వేళ కనతి, దూరమునఁ గానలో నొక్కత్రోవయందు.

## రాముఁడు రాజులతో యుద్ధము చేయుట

మ. మును ఖండీకృతభీమకార్ముకుని రాముం జూచి తా మోర్వమి
న్మనమం దాపగఁ జెంది భూపతులు దుర్మానమ్మున న్మించి దు
ర్జనవృత్తిన్ జతురంగసైన్యములతో రామున్ జయింపంగ నేఁ
డనువౌ నంచును ముట్టడించి రట సైన్యం బెల్ల నొక్కుమ్మడిన్. 11
తే. ఆవిధం బెంచి దశరథక్ష్మావిభుండు, వింతయును వంతయును జెందె స్వాంతమందు
జనకుఁడును సైనికావళి సాధ్వసమున, నకట! యిది యేమికర్మ మం చటమటించె.

తే. అజసుతుం డంత బహుళదుఃఖాబ్ధి మునిఁగి
యేమి సేయుదు నలనాఁడు ƒ భూమిసురుఁడు
దారి నరికట్టి నయ్యది ƒ తప్పెఁ గాని
యిపుడు రాఁబోవు గండంబు ƒ నీకు టెట్లొ ? 13

చం. అని వెతఁ జెందు తండ్రికడ ƒ కప్పుడె రాముఁడు లక్ష్మణుండునుం
జని రట రామచంద్రుఁడు విచారముఁ జెందెడు తండ్రిఁ జూచి యో
యనఘ ! వృథావిచార మిది ƒ యర్హమె ! నే నొకరుండ దుష్టులా
జనపతుల న్నిమేషమునఁ ƒ జంపెద నందఱ నూఱడిల్లుమా. 14

తే. అనఁగ రాముని జూచి యి ƒ ట్లనియె నాజి
రామ ! నీ కిప్పు డల్పపుఁ ƒ బ్రాయ మకట !
బాలుఁడగు నీకు యుద్ధమా ! ƒ చాలుఁ జాలు
బవర మేఁ జేయుదును నీకు ƒ వలదు తండ్రి ! 15

తే. అనిన జనకునిమాటఁ దా ƒ నాలకించి, రాముఁ డిట్లనుఁ దండ్రి! యీ ƒ రాజగణము
తో దురం బొనరింతు నేఁ ƒ దూలునపుడు, సాయపడు మీవు సైన్యరక్షకుఁడవగుచు.

చం. అని తనతండ్రి జెందు దిగు ƒ లంతయు మానిచి రాముఁ డుగ్రహా
ధనువు ధరించి తమ్ములును ƒ దాను రథమ్ముల నెక్కి వైరులా
జనపతు లున్న తావునకుఁ ƒ జయ్యనఁ గట్టుపకాసులై వడిం
జని రజసూనుఁడుం బ్రకటసైనికులం బదివేల నంపఁగాన్. 17

వ. అని పరమేశ్వరుండు మఱియు ని ట్లనియె. 18

చం. జనకునియాత్మయందలి విచారము మానిచి సర్వశక్తులం
గొని యశముగ్ గడించి జనకుగ్ సుఖవంతునిఁ జేయునట్టి యా
తనయుఁడె సత్తనూజుఁడు నితాంతసుఖాత్ముఁడుఁ బుణ్యశాలి యా
త్తనయుఁడు నై పితౄణమును ƒ దప్పక తీర్చును జుమ్ము పార్వతీ ! 19

ఉ. రాముని జూచి వైరులు పరస్పర మాతనిఁ జూపుకొంచు శ్రీ
రామవిభుండె యల్లడుగొ ƒ రంజిలు నీతఁడు శ్రీకుజం బనం
జామరికధ్వజంబు బహుశస్త్రములుం గల తండ్రితేరిపైఁ
దా ముదమార నుండి పటుధైర్యముతో నిటు వచ్చెఁ జూడుఁడీ. 20

తే. అనుచు జనపతు లైకమత్యంబు మీఱ, భేరులరవంబు కడలెల్ల ƒ బోరుకొలువ
నఖిలసన్నాహములతోడ ƒ నని యొనర్ప, రాము నెదిరించి రథికధైర్యంబు గదుర.

శా. ఆకర్ణాంతవికృష్టచాపకరులై యస్త్రమ్ముల న్వేయఁగా
నాకాశమ్మున నవ్వి పంజరములై యన్యోన్యభిన్నమ్ములై
వీఁక న్భూమితలమ్మునన్ వడిఁ బడ న్వీర్వీద్దైలు న్మెఱ నా
త్మాకాంతుల్ బవరంబు సల్పిరి మహా గర్వోక్తిసంరంభులై. 22

శా. హుంకారమ్ములతోఁ బదాతిపటుబాహాస్ఫాలనప్రక్రియా
హంకారమ్ములతోఁ దురంగకృతహేషానంతహస్త్యుల్లస
ద్ఘీంకారమ్ములతో మహారథసమాకృష్టోజ్జ్వలచ్ఛింజినీ
టంకారమ్ములతో దుర మ్మెసఁగె నిరాతంకమ్ముగాఁ జెల్లఁగాన్. 23

ఉ. రాముఁడు వారి యస్త్రశరరాసుల వమ్ముగఁ జేయుచున్ ధను
స్తోమము ద్రుంచు చమ్ములపోరదుల్ శకలమ్ములుగా నొనర్చి యు
ద్దామపరాక్రమస్ఫురణతామహిమోజ్జ్వలచాపపాండితీ
ధాముఁడు దుర్విపక్షబలదర్ప మణంచుచుఁ బోరుచున్నెడన్. 24

ఉ. అన్నను ముట్టడించిన నరాధిపులం గని రోషభీషణా
భ్యున్నతరక్తలోచనయుగోజ్జ్వలులై ధనురాదివస్తుసం
పన్నరథమ్ము లెక్కి శరభాస్వరకక్షనిషంగయుక్తులై
క్రన్నన లక్ష్మణాదులు తరగన్ జనుదెంచిరి తత్సహాయులై. 25

ఉ. ఓహరిసాహరిం బెనఁగి యుగ్రమయూఖసమానబాణసం
దోహము దేహలగ్న మయి తోఁపఁగ భీకరహుంకృదుక్తికా
తూహలులై పరస్పరము దోర్యుగశక్తుల రామముఖ్యు లా
బాహుజు లిట్లు తారకవిరోధావసుజాతులకేతి నెంతయున్. 26

మ. సుకరం బాగతి వారు పోరు సమరక్షోణిన్ ధనుఃపాండితీ
ప్రకటప్రక్రియఁ బోరఁగా రిపుమహీపాలాగ్రణుల్ స్వీయసై
నికవర్గంబులఁ గూడి యొక్కభరతు న్వేగంబ నొక్కుమ్మడిన్
సకలాంగమ్ముల బాణము ల్గొనుప మూర్ఛం జెందె నాతం డొగిన్. 27

చం. భరతుని మూర్ఛఁ బుచ్చి నరపాలకు లాతనితమ్ముగుజ్జ న
ట్లరిముచి నేలఁ గూల్చి మఱి యట్టులె లక్ష్మణు సోలఁజేసి పెన్
గరువముతోడ రాముపయిఁ గాండపరంపర లట్లె వీడు చం
దఱు నొకపై చెలంగి విదితంబుగ జన్యముఁ జేయుచుండఁగాన్. 28

సీ. రాముఁ డప్పుడు వైరి రాజుల నెదిరించి, యాలీఢపాదుఁడై యట్టె నిలిచి
మండలీభూతకోదండుఁడై పుంఖాను, పుంఖంబుగా బాణపుంజ మమర
వైరిచాపాంబకావళి నెల్ల ఖండించి, వాయవ్యాస్త్రమున శత్రువర్గములను
గారాకులవిధాన మారవస్థలిఁ జేర్చి, మోహనమ్మున శేషభూమిపతుల

తే. బమ్మరిల్లఁగఁ జేసి యవ్వైరిసైన్య,మెల్ల ఖండించె దోర్బలం బెసక మెసఁగ
నెల్లవారలుఁ గని జగదేకవీరుఁ, డనఁగ శ్రీరాముఁ డలరె నాఁ డద్భుతముగ.

తే. సొమ్మసిల్లినపుత్రులఁ జూచి కైక, కరిణి దిగి వచ్చి సుతుల నంకమున నిల్పి
యకట! మీ కెట్టికష్టంబు లయ్యె ననుచుఁ, గంట నీ రొల్క మిగుల దుఃఖమ్ముఁ జెందె.

వ. అంత దశరథుండును గౌసల్యాదిరాజదారలును భరతునికై విచారించుచుండ శత్రు
జయం బంది మూర్ఛఁ దేరినలక్ష్మణుం గూడి రాముఁ డాభరతశత్రుఘ్నులచెంత
కరిగి దుఃఖించుచు వారల నోదార్చి లక్ష్మణుం గాంచి యిట్లనియె. 31

తే. అనతిదూరమ్మునను ముద్గలాశ్రమంబు, గలదు నీ వేగి సంజీవకరణి మున్నుఁ
గాఁగ శుభవల్లులం గొంచుఁ గడురయమున, రమ్ము లక్ష్మణ! తమ్ములసొమ్ముఁ దీర్ప.

ఆ. వె. అమ్మునీశుశక్తి నాశ్రమమ్మున నిట్టి, తీవ లెన్నొ కలవు తెమ్ము నంగ
నరద మెక్కి యపుడె యాశ్రమస్థలి కేగి, లతల సంగ్రహించు లక్ష్మణునకు.

చం. వటువులు కొంద అడ్డపడి వల్లులఁ దీయఁగ రాదు మాగురుఁ
బటుతరనిష్ఠ దీరునెడఁ బ్రార్థనఁ జేసి లతాళిఁ గొమ్మనం
జటుకునఁ గాలసంక్రమణసంశయ మొందుచు నన్నఁ జేరి యా
వటువులమాటఁ దెల్పఁగను వానికి నిట్లనె రాముఁ డాదృతిన్. 34

తే. వటువులను నాయుధంబులవలనఁ గాక, బెదురుగొల్పి నివారించి యదలకించి
వల్లులను దెమ్ము లక్ష్మణా! వైళముగను,మునిభయం బేమియును నీవు పొందవలదు.

తే. అనఁగ సౌమిత్రి యాశ్రమంబునకుఁ జేరి, వటుల వారించి బల్మిచే వల్లులఁ గొని
రాముఁ జేరి యొసంగినఁ బ్రేమ నతఁడు, నమ్మహౌషధిఁ దమ్ముల సొమ్ముఁ దీర్ప.

తే. లేచియున్నట్టిసుతులను జూచి కైక, కడునుదం బంది వారలఁ గౌఁగిలించె
రామచంద్రునిఁ గని దశరథుఁడు ముదముఁ,జెంది వాత్సల్యమున నక్కఁ జేర్చి యలరె.

తే. అట్లు ముద మొంది దశరథుఁ డచట నున్న
మునులతోఁ గూడి యుత్సవంబుల నొనర్చె
సకలపరివారజనములు సంతసింపఁ
బుత్రసౌఖ్యంబుఁ గనఁ దండ్రి ముదముఁ గొనఁడె? 38

తే. అచట వటుగులు మదిలోన ॽ నార్తిఁ జెంది
యమ్మునీశునికడకు హా ॽ హారవమ్ము
లెసఁగఁ జని లక్ష్మణునికృత్య ॽ మెల్లఁ జెప్ప
సమయమును వేచియుండె రా ॽ సవిధమందు. 39

ఉ. నేమముఁ దీర్చియున్న గురు ॽ నిం గని యందఱు బ్రహ్మచారు లా
హా! మునివర్య! లక్ష్మణుఁ డ ॽ హంకృతితో మము ధిక్కరించి యీ
ధామమహౌషధు ల్గొని ద్రు ॽ తమ్మునఁ బోయె నసాధ్యుఁ డాట నే
మేమియుఁ జేయలేక వచి ॽ యింపఁగ వచ్చితిమయ్య! చయ్యనన్. 40

ఉ. అవ్వటుగు ల్వచింప విని ॽ యమ్ముని రోషపరీతచిత్తుఁడై
యెవ్వఁడు లక్ష్మణుం డనఁగ ॽ నెవ్వఁడు పంపఁగ వచ్చె మి మ్మిటం
గొవ్వున గెంటి యోషధులఁ ॽ గొంటకుఁ గారణ మెద్ది యివ్వనం
బెవ్వరి దంచు నెంచె నట ॽ కేగనొ వేగ గ్రహించి రండనన్. 41

ఆ. వె. ఛాత్రులును మహాప్ర ॽ సాదం బటంచును, వేగ నేగి యాజి ॽ విభునిఁ గాంచి
గురునియాజ్ఞ లేక ॽ కుజ్జల మము గెంటె, లతలఁ దేఁ బనేమి? ॽ లక్ష్మణునకు.

తే. అడిగి రం డంచు మాగురుఁ ॽ డంపె నిటకు
నొడయఁ డగువాని కిట్టియా ॽ గడము తగునె?
రాజులే యిట్టు లైనచోఁ ॽ బ్రజల కేడు
గడ యెవం డింకఁ జోరశి ॽ క్షకుఁ డెవండొ? 43

తే. అనఁగ దశరథుఁ డాత్మలో ॽ నడలుసెంది, బ్రహ్మవిత్తాపహారణంబుఁ ॽ బరఁగుఁ గాని
బ్రహ్మవిత్తాపహరణంబు ॽ పాపమునకె, తప్పుఁ జేసితి నేమని ॽ చెప్పవాఁడ. 44

వ. అనుచుఁ జిరము చింతించి వినయవినమితాంగుండై యంజలి వట్టి యావటులతో
నిట్లనియె. 45

సీ. రవివంశజుఁడ దశ ॽ రథనామధేయుండ, రామాదిసుతులతో ॽ నేము వచ్చు
దారిలో వైరియు ॽ ద్ధంబు గల్గెను మాకుఁ, దూలిరి భరతశ ॽ త్రుఘ్ను లవని
వారిమూర్ఛలఁ దీర్ప ॽ భవదీయవనలతల్, తెప్పించితి మునీంద్ర! ॽ తప్పు కలదు
కొమరుల బ్రతికించు ॽ కొఱకుఁ దెచ్చితి మయ్య!, భవదీయకృపచేత ॽ బ్రతికినారు
తే. కారణం బిది యన్యంబు ॽ గా దటంచుఁ, బ్రణతు లెన్నో నొనర్చె నా ॽ రాజటంచు
మీగురూత్తముతోఁ జెప్ప ॽ నేగరయ్య!, నేను నిప్పుడె వచ్చెద ॽ హానిఁ జూడ.

వ. అని ప్రార్థింప నవ్వటువులు తిరిగి యాశ్రమంబున కేగి తమగురూత్తమునకు సర్వము నివేదించిన నతండును తత్త్వజ్ఞుం డగుట రామశబ్దశ్రవణమాత్రపులకితదేహుండై యీబాలకులతో నిట్లనియె. 47

ఉ. రాముఁ డటం చెఱుంగక పఽరాకునఁ గోపముఁ జెంది మిమ్ము నా
భూమివరాంతికమ్మునకుఁ ఽ బొమ్మని చెప్పితి మీర లేగి యా
రాముని వానితండ్రిని నిరాకృతిఁ జూపుచుఁ దిట్ట లేదుగా
దా? మనయాశ్రమావనిలఽ తెల్ కద రాముని జూడ హేతువుల్. 48

## దశరథుఁడు ముద్గలాశ్రమమున కేగుట

ఉ. బాలకులార! రాముఁ డలఽ పంకజనాభుఁడు నుండి యీగతిన్
లీల నరాకృతిం గొనె ధరించె మదీయతపంబు వానినిం
బోలఁగఁ జూడఁగా వలయుఁ ఽ బొవ్వద మం చనుచుండ నంతలో
ప్రోలఁ గనంగవచ్చి రజఽపుత్రుఁడు రాముఁడు నెల్లవారలున్. 49

ఉ. వచ్చి యజాత్మజుండు మునివల్లభపాదయుగంబుపై శిరం
బచ్చుగ నిల్పి ముద్గల! మహాత్మ! త్వదాజ్ఞను జెందకుండి యే
యిచ్చటి యౌషధిగ్రహణ ఽ మే నొనరించితి నేర మెంచ కో
సచ్చరితా! కళత్రసుతఽసైన్యసమేతుని నన్నుఁ బ్రోవుమా. 50

తే. అనఁగ ముద్గలుఁ డాజిని ఽ నట్టి కేలఁ, బట్టి లేవంగఁదీసి భూఽపాలవర్య!
నేరమా? యిది మాపుణ్యఽసారమయ్య!, మీరటం చేము తెలియమి ఽ నేర మయ్యె.

తే. చిరవివర్థితపూ లతాఽశ్రేశవలనఁ, జూడఁగల్గితి మయ్య! సీఽసుతుని నిచట
యజకుమారక! ధన్యుఁడ ఽ నైతి నధిక, పుణ్యతముఁడవు నినుఁ జూడ ఽ మోద మయ్యె.

వ. అనుచు ముద్గలుం డాదశరథరామలక్ష్మణభరతశత్రుఘ్నాదుల కర్ఘ్యపాద్యాదు లొసంగి గౌరవించినపిదప రామాదులు రిపువిదారణలబ్ధకీర్త్యుదారులై సదారులై మునికి వందనమ్ము లిడ వారల నాశీర్వదించి సముచితానందసంభాషణమ్ముల సంభావించుచుండ నంత ముద్గలభార్య యగు సుమతి సుమతియై కౌసల్యాదిరాజమహిషీపురస్సరమ్ముగా సీతాప్రముఖయువతీజనమ్ములకు హరిద్రాంగరాగకుంకుమచందనాదిసత్కారమ్ము లొనర్చి యవ్వారిని జెంత నిడుకొని సల్లాపానందంబు నొందుచున్నంత దశరథుండు ముద్గలుం జూచి యి ట్లనియె. 53

తే. ఆర్య! మిమ్ముల నొక్కటి యడుగనుంటి, ననిన హాని గ్రహించి యాతనికరంబుఁ
గొనుచుఁ దులసీవనాంతరమ్మున వసించి, యడుగుమనఁ బంక్తిరథుఁ డిట్టులనియెనపుడు.

ఉ. మీరు మహానుభావులరు మీకు నగోచర మెద్ది లేదు మా
శ్రీరఘురాముఁ డీపయినిఁ జెందెడు కష్టసుఖంబు లెవ్వియో
కారుణికాగ్రగణ్యా! వినఁగా మది వేడుక గల్గె గాన మీ
రారసి సర్వముం దెలుపరా! స్థిరమానసవృత్తులై యనన్. 55

చం. వినుచు నిమేషమాత్రమున విశ్రుతభూతభవిష్యదర్థముల్
మనమునఁ దోఁప నానృపతిమాన్యునితో సకుతూహలంబుగా
ఘనతరరామభావిశుభగాథ యిదే వివరింతు నంచు నా
ముని వచియించె నావిజనభూమిని మందతరోక్తివైఖరిన్. 56

## ముద్గలుఁడు శ్రీరాముని భావిచరిత్రముఁ దెల్పుట

శా. శ్రీరాముం డలపంకజాక్షుఁడె భవచ్ఛ్రేయోర్థియై మానవా
కార మ్మొందె భవత్సుతుం డయి జగత్కల్యాణరూపమ్ముతో
దూరక్షోహరణార్థమై పొడమె నిద్ధూతాఘుఁ డైనట్టి యా
శ్రీరాముం గనుఁగొన్నమానవుఁడు ధాత్రిన్ ధన్యజన్ముం డగున్. 57

మ. మును నీ కిచ్చినకోర్కె దీర్చుటకు నీ భూభారమున్ డింప స
జ్జనరక్షార్థము దుష్టశిక్ష సలుపన్ సత్యంబు ధర్మంబుఁ బెం
పొనరింపం బనిపూని భూతలమునం దుత్పన్నుఁ డయ్యెన్ భవ
త్తనయుండై నృపపాళి నీసుకృతవిస్తారం బదెంతో కదే! 58

మ. విశదానంతయశస్సుధారసముఁ బృథ్వీపాత్రమం దుంచి త
ద్దశదిగ్భిత్తులకు న్విలేపనకళాధావళ్యముం గూర్చుచుం
దశసాహస్రసమాళిపై దశశతాబ్దప్రాజ్యకాల మ్మిల
న్వశముం జేయుచు సార్వభౌముఁ డగుచుం బాలించు రాముం డొగిన్. 59

సీ. ఈరామచంద్రున కిద్ద ఆత్మజులును, నలుగురు కొడండ్రు నరవరేణ్యా!
పౌత్రు లితనికి సర్వదినల్వు రౌదు రీ, రాముదౌహిత్రిక లగుదురయ్య!
యటుపయి లెక్కలేనట్టిప్రపౌత్రాళిఁ, గూడియుండును నీదుకొడుకు బృంద
యను దాని శాపంబు ననుభవింపఁగఁ గొంత, కాలమ్మునకు దండకవని కేగు

తే. మరలఁ బురిఁ జేరి సర్వసామ్రాజ్య మేలు
ననఁగ విని యాజి యిట్లనె । మునివరేణ్యా!
బృంద యెవ్వతె? యెవ్వని । వెలఁది? యేల
హరిని శపియించెఁ జెప్పుమా । యనఁగఁ దపసి. 60

## హరికి బృందాశాపము గల్గుట

తే. బృంద యనునామె హరిని శపించినట్టి, చరిత మెల్లను జెప్ప వా । చంయమీంద్రుఁ
డిట్టు లనె దశరథుఁ గని । యింపుతోడ, నతనిమనమున సంతోష । మగ్గలింప. 61

తే. మును జలంధరుఁ డను నొక । పొలసుదిండి, శితిగళునితోడ యుద్ధంబుఁ । జేయుచుండ
వానియిల్లాలు బృంద య । న్నప్పడఁతి తనదు, భర్త చెడకుండఁ దనసతీ । త్వమునఁ బ్రోచె.

చం. హరునకు వాఁడు లొంగమి న । గాత్మజ చెప్పఁగ నాలకించి శ్రీ
హరి యపు డాజలంధరుని । యాలిసతీత్వముఁ బాడొనర్పఁ ద
త్పురమున కేగి యామె యొక । తూరి నిశి న్నిదురించుచుండ దు
ర్భరమగు నొక్కపాడుకల । వచ్చునటు ల్పొనరింప నామెయున్. 63

చం. తనపతి తైలసిక్తుఁ డయి । దక్షిణదిక్కునకున్ ఖరమ్ముపై
ననువుగ నుండి ముండఁడు ది । గంబరుఁడై చనుచున్నయట్లుగాఁ
గని వడి మేలుకాంచి యధి । కవ్యథతో నిజసౌధపాళి నె
ట్లును సుఖయింపఁజాలక క । లమంగడు తత్తర మంది యుత్తఱిన్. 64

తే. ఉపవనమ్మున కేగిన । నుపశమించుఁ, దాప మని చెల్మికత్తె లి । ద్దఱను గొంచు
నొకవనమ్మున నుండి వే । ఱొక్కవనము, నిటులు తిరుగుచు నొకవని । కేగియుండ.

వ. అంత నవ్వనమ్మునం గరాళదంతరక్తాక్షులై భీకరసింహారావులగు నిద్దఱరక్కసులం గని భయం బంది సంత్రస్తయై సఖీద్వయమ్ముతోఁ బర్విడుచు నొక్కచో మౌనముద్రితుండును, శిష్యయుతుండు నగు నొక్కముని నధిపతితుండు దీవిం గనునట్టులు కని ప్రాణార్తయై తనబాహులతచే నమ్మునికంఠమ్ము వట్టికొని యోతాపసోత్తమా! నిన్ను శరణ మొందితిఁ గావు మని ప్రార్థింప నమ్మునియుఁ దద్వాక్యమ్ములు విని మౌనంబు విడిచి కనులు దెఱచి చూచి యోబృందా! యిట నీ కేభయంబుఁ గల్గ దూఱడిలు మని చెప్పి యెదురనున్న రక్కసులం గని కోపమున హుంకరించుచుఁ దర్జనభర్జనమ్ము లొనర్ప నారక్కసులు భయంపడి ప్రాణభీతిమై వెనుకకు

మజలి పలాయన మొంది రంత నమ్మునిశ_క్తికచ్చెరు వొంది వందన మ్మిడి బృంద యి ట్లనియె. 66

చం. మునివర ! నన్నుఁ బ్రోచితివి ♦ మోదముఁ జెందితిఁ బ్రశ్న మొక్కఁడే
మనవి నొనర్చికొందు నని ♦ మానిని పల్కె మునీశుతోడ నా
పెనిమిటి యీశుతో నిపుడు ♦ బీరముతో ననిఁ జేయుచుండె నా
తనిపని యే మగుం దెలియఁ ♦ దథ్యముగా దయచేసి పల్కుమా. 67

చం. అనఁ గృపఁ జెంది మౌని మును ♦ నట్టె కనుంగొన వానరద్వయం
బనువుగఁ జొతఁ బెట్టి మునిశయంతికమందు వసించె మౌనియుం
గనుబొమ సన్న జేయ గగశనమ్మునకుం గపు లేగి యప్పుడే
మునికడ కొక్కశీర్షమును ♦ మొండెమునుం గొనివచ్చి నిల్చినన్. 68

వ. బృందయుఁ దనభ_ర్తయగు జలంధరునిమ_స్తకకబంధమ్ములుగా వానిని గు_ర్తించి పతి మరణించెఁగా యని యెంచి దుఃఖితయై పుడమిపై మూర్ఛిల్లిన నమ్ముని కమండ లూదకమున బృందకు సేదఁ దీర్చినంత బృందయు మునిం జూచి మహాత్మా ! నీవు సర్వసమర్థుండవు గాన నాపతిం బ్రతికింపు మన నమ్మునియు శంకరహతుని బ్రతికిం చుట దుర్ఘటం బైన నీయందలి దయచే బ్రతికించెద నని చెప్పి యంతర్ధాన మొం దినఁ దత్క్షణంబ జలంధరుఁడు సజీవుండై లేచి బృందం గౌఁగిలించి వినోదమ్ముల నొందుచుండె నోదశరథా ! మునిరూపమును జలంధరరూపమునుంగూడ ధరించిన వాఁడు శ్రీమహావిష్ణువే సుమా ! లోకద్రోహులగు రక్కసుల హీనవేషకృత్యమ్ము లచేనైన మాయాశ_క్తిచేనైన సంహరించుట హరికి నైజధర్మమే సుమా ! పిదప బృందయుఁ దనభ_ర్తయే యనుభావమ్మున వవ్వనమునఁ జిరకాలము రతిసుఖం బనుభవించుచుండె నిట్లు శ్రీహరి బృందాపాతివ్రత్యభంగం బొనర్చినపిదపఁ బరమే శ్వరునిచే జలంధరాసురునకు హతుం డయ్యె మఱియును, 69

మ. సురతాంతమ్మున నొక్కనాఁ డతని విష్ణుం డంచు గు_ర్తించి యా
హరినిం జూచుచు బృంద యిట్లనియె రోషావేశముం బొంది చీ
పరకాంతారతిఁ గోరు నీదునుగు నైశ్వర్యమ్ము లీపాటివా ?
ధరలో ధర్మము నిల్పఁ బుట్టితట గాదా ? నిల్పెదో ? యీగతిన్. 70

ఆ. వె. పతుల సంహరించి ♦ భార్యలఁ జెఱఁబట్టు, రాక్షసాళికన్నఁ ♦ బక్షివాహ !
నీవి శేమ మేమి ? ♦ భావింప రక్కసుల్, మేలుగాదె ? సిగ్గ దేల గొనవు ?

వ. నాకు మునినై కానుపించి పిదప నాపతిరూప మొంది నాసతీత్వభంగ మొనర్చుటకు వచ్చిన హరి వని యిప్పు డెఱింగితి మున్ని చటఁ గన్పడినరక్కసులు నీదౌవారికు లగు జయవిజయులే. రాక్షసాకారముల నన్ను భయ మొందించిరి. నీ శిష్యులై నీకు రహస్యముగా వార్తఁ దెచ్చిన వానరరూపులును నీవారగు పుణ్యశీల సుశీలు లనువారే. నీచెంతనున్న శిష్యుఁడు గరుడుం డిట్లు నీమాయాబాహుళ్య మంతయు నాదగు సుస్థిరసతీత్వమున గ్రహించితిని. నాసతీత్వశక్తియును నీమాయాశక్తియును గాంచెదుగాక నీవు కొలఁదికాలములో రాజన్యుఁడవై పుట్టి రాజ్యభ్రష్టుఁడవై దండకారణ్యవాసివై యుండ నిద్దఱురక్కసులు నీభార్య నపహరింపఁ గారణం బగుదురు. నీ వావనమ్మున వానరసహాయుండవై యుండి సర్వేశ్వరుండవైనను స్వకృత మనుభవింపక తప్పదు గానఁ గొంతకాల మవ్వనమ్మున భార్యావియోగదుఃఖ మనుభవించెదుగాక యని శపించి యాబృంద యగ్నికుండంబునం బడి ప్రాణత్యాగ మొనర్చె. హరికి బృందాశాప మట్లు కలిగె నని చెప్పి ముద్గలుండు మఱియు నిట్లనియె. 72

తే. బృంద యనినట్టులే జయ । విజయు లిపుడు, రావణుఁడు కుంభకర్ణుఁ డన । రక్కసులుగఁ
బుట్టి లవణాంబునిధిమధ్య । మునఁ జెలంగు, లంకలోపల నుండిరి । శంక లేక. 73

ఉ. వారలె జానకీసతిని । బంచవటీస్థలినుండి లంకకుం
జేరిచి యాఱుమాసములు । సీతను డాపఁగలారు పిమ్మటన్
శ్రీరఘురాముఁ డత్తఱి హ । రిప్రవరుం డగు వాలిఁ గూల్చి యా
సూరసుతాదివానరులు । సూరెలఁ గొల్వఁగ నబ్ధిఁ జేరియున్. 74

తే. రాలచే సేతువుం గట్టి । రామచంద్రుఁ, డరిపురం బగు లంకకు । నరిగి యచట
రావణాదులఁ జంపి ధ । రాతనూజఁ, గొంచు సాకేతపురిఁ బ్రవే । శించి మఱియు.

తే. ఏడుదీవులతోఁగూడ । నిలను బ్రోచు, జన్నములు యాత్రలును విలా । సముగఁ జేసి
సీతతోఁ గూడి బంధుసం । ప్రీతిఁ దనరు, నిది రహస్యంబు చెప్పకు । మెవరికైన. 76

కం. అని రాముఁ డెప్ప డేవని, నొనరెంచునొ దాని నెల్ల । సుర్వీశునకు
న్మని చెప్పఁగ నాలించుచు, నినకులుఁ డతిమోద మొంది । యిట్లనె మఱియున్.

చం. మునుపటిబాములం దెపుడు । పుణ్య మదెంత యొనర్చినాఁడనో
ఘనుఁడగు విష్ణుఁ డాత్మజుఁడు । గా రమ కోడలు గా లభించుటన్
ఘనతరసత్తపఃఫలము । గల్గినఁ గాని లభించు నొక్కొ? యో
మునివర! మత్పురాతనపుఁ । బుణ్యవిశేష మదేమొ తెల్పుమా? 78

## ముద్గలుఁడు కైకేయీదశరథుల పూర్వజన్మకథఁ జెప్పుట

సీ. అనఁగ ముద్గలుఁ డిట్టు * లనియె నోరాజేంద్ర !, సహ్యాద్రిచెంత విశాలమైన
కరవీరపురమున * ధరణీసురుఁడు ధర్మ, దత్తనాముఁడు బహు * ధర్మవేత్త
విష్ణువ్రతార్చనా * విధిదీక్షితుఁడు ద్వాద, శాక్షరమంత్రజ * పాదరుండు
నతిథిసత్కారమ్ము * లాదరమ్మునఁ జేయు, ఘనుఁ డాతఁ డొకకా * ర్తికంబునందు
తే. ఒక్కహరివాసరమ్మున * నుపవసించి, జాగరణ మొంది వేకువ * జామునందు
హరిని బూజింతఁ బరికర * హస్తుఁ డగుచుఁ, గోవెలకుఁ బోవుచుండఁగఁ * ద్రోవలోన.

పంచచామరము. కరాళదీర్ఘదంత శుష్క * కాయ లంబజిహ్వ భీ
కరారవర్ దిగంబర స్ఫు * కారనేత్రయుగ్మ నొ
క్కరాక్షసిర్ ధరామరుండు * గాంచి లోనిభీతిచే
శరీర మంతయుం జలింప * సంభ్రమించి యంతటన్. 80

మ. కలఁకంబారుమనంబుతో ద్విజుఁడు రక్షః కాంతదేహమ్ముపై
జలజాక్షార్చకుఁ దెచ్చువస్తువుల రోషం బొప్పఁగా నైచి యో
జలజాక్షా ! మధుసూదనా ! భువనరక్షా ! శ్రీపతీ ! యంచుఁ దాఁ
దులసీమిశ్రితవారిపూర మటులే * తోరమ్ముగాఁ జల్లినన్. 81

తే. తులసికామిశ్రి తామల * జలమువలనఁ, బాపలయమైన సాత్త్విక * భావ మమర
శాంతయై యామె విప్రుని * చెంతఁ జేరి, వినతయై జోతలిడి యిట్టు * లనియె నపుడు.

తే. బ్రాహ్మణోత్తమ ! మీపుణ్య * వారివలన
నాదుపాపసమూహంబు * నాశ మొందెఁ
బూర్వజన్మస్మృతియు నాకుఁ * బొడమె దుష్ట
భావ మెటు వోయెనో సాధు * భావ మమరె. 83

ఉ. ఈపయి నేను బుణ్యగతి * కేగెదు సాధన మేమొ భూసురా !
నాపయి మిక్కుటంపుఁగరు * ణం గొని చెప్పు మటన్న భూసురుం
డాపలు కాలకించి మది * నక్కజ మొప్పఁగ నానిశాటితో
నీపగిది న్వచించె భయ * మేగినచిత్తముతోడ నత్తఱిన్. 84

మ. మును నీ వెవ్వనిభార్య వెవ్వతె విటన్ * భూతాకృతిం జెందఁగా
ఘనపాపం బెటు లాచరించితివొ న * న్గానంగ మున్నున్న భా
వన యేమయ్యెనొ ? నీచరిత్ర మెలమిం * బల్కంగ నాలించి నీ
కనువౌ పుణ్యగతిప్రకారమును దత్ప్రాప్తిం దగం దెల్పెదన్. 85

## ✽ కలహా చరిత్రము ✽

సీ. అనఁగ రక్కొస యిట్టు ✽ లనియె సౌరాష్ట్రమ, న్పురమున భిక్షునా✽ముఁడు ద్విజుండు
కలఁ డాతనికి నేను ✽ గాంతను గలహాఖ్య, గలదాన నత్యంత ✽ కఠినురాల
మగని నేనాఁడును ✽ మాటలచేనైన, మోద మొందింపఁగా ✽ లేదు సుమ్మి!
మృష్టాన్న మొకసారి✽యేని బెట్టఁగలేదు, నాథాజ్ఞఁ జేయు టే✽నాఁడు లేదు

తే. పాక మొనరించి యన్నాది✽వస్తువులను, మంచి నెంచుచు మును నే భు✽జించి పిదప
మగనికిని బెట్టుదును గాని ✽ మగఁడు తిన్న, వెనుక నెన్నఁడు దిన లేదు ✽ విప్రవర్య!

మ. ఒకనాఁ డింటికి నాదునాథునిసఖుం ✽ డొక్కఁడు రా వానిచెం
తకు నాపెన్మిటి చేరి లోని పెనువం✽తన్ దీనుఁడై వానితో
హితుఁడా! నాసతి నాదుమాట విన దిం ✽ కేసౌఖ్యము ల్లేవు నా
గతి యిట్లున్నది దీనికిం దగినమా✽ర్గం బేమియో తెల్పుమా? 87

తే. అనఁగ విని వానిమిత్రుఁ డి✽ట్లనియె సఖుఁడ!, యకట! నీ కింత కష్ట మే✽యయ్యె నొక్కొ?
లేమి గల్గిన గయ్యాళి✽లేమ యున్న, వానిసంసారదుఃఖంబుఁ ✽ బలుక వశమె?

కం. తనయాలియుఁ దనయాలియుఁ, దనయాజ్ఞన్ బద్ధులైనఁ ✽ దగుఁ గాఁపురముం
దనయాలి చెడ్డదైనన్, ఘనదుఃఖము కాఁపురమ్ము ✽ గడ తేరునొకో? 89

మ. సతమున్ భక్తిగఁ జూతు రాంధ్రు పతి వి✽స్తారాఢ్యుఁడై యున్నచో
పతి నిర్భాగ్యుఁడె యైన వానినిఁ దృణ✽ప్రాయమ్ముగాఁ జూతు రి
ట్టితఱిన్ బుద్ధిబలంబున న్ధవుఁడు బో✽రటి న్వశ్యఁగాఁ జేసి సం
సృతిపాథోధిఁ దరించి మోక్షమును దాఁ ✽ జేరం దగు న్మిత్రమా! 90

తే. అందులకు నీకు సదుపాయ ✽ మరసియుంటిఁ, జెప్పెదను విన్ము దీనిఁ ✽ దప్పియున్న
దాపురించును బూర్వవి✽రోధమ్ము నీకు, మఱవకుము దీని మంత్రంబు✽మాద్రి గాఁగ.

తే. ఏపనిని నీకుఁ జేయింప ✽ నిచ్చ కలదొ
దానిఁ జేయకు మంచు వ్య✽త్యయము గాఁగ
మాటలాడుము చూడు మీ ✽ మంత్రమహిమ
మిటులు సంసారసుఖముల ✽ నెల్లఁ గొనుము. 92

చం. అన విని నాదుభర్త యతఁ ✽ డాడినరీతిగ నన్నుఁ జేరి యి
ట్లనె సతి! మిత్రవర్యుఁ డొకఁ ✽ డాగతుఁ డయ్యెను దుష్టబుద్ధి, భో

జనమును బెట్టఁబోకు మనెఁ । జయ్యన లేచియు నేను నంతటన్
ఘనుఁ డతఁ డంచు భోజనము । గౌరవ మొప్పఁగఁ బెట్టితిన్ ద్విజా! 93

కం. అదిమొదలు నాదుపెన్మిటి, చెదరనిగుతితోడఁ బనులు । సేయించుచు నె
మ్మది సంతసించెఁ జక్కని, సదుపాయము దొరకె నింక । చాగు రె! యనుచున్.

ఉ. అంతటఁ గొంతకాలమున । నబ్బ గతించిన నాదినంబునం
గాంతుఁడు నన్నుఁ జూచుచును । గల్కిరొ! నేఁడు పితృక్రియార్థ మా
వంతయుఁ జేయ నన్నుఁ బశుకవా! యిది తప్పగుఁ గాదె? బందుగుల్
మంతనమందు నవ్వరొకొ? । మానిన ని న్వెలిఁ బెట్టకుందు రే? 95

తే. ఐనఁ బుడమినిఁ బుత్రకుఁ । డై జనించి, పితరులకుఁ బైతృకంబైనఁ । బెట్టకున్నఁ
బుత్రధర్మంబె? దుర్గతిఁ । బొందఁగలవె?, యిస్సిరో! నీకు దుర్బుద్ధి । యేల కలిగె?

తే. అనుచు ధిక్కార మొనరింప । నతఁడు నన్నుఁ
గాంచి యిట్లనెఁ జేయఁగా । నెంచియున్న
సూక్ష్మముగఁ జేయువాఁడను । సుందరాంగి!
అనిన నే నట్లు కాదని । యదలకించి. 97

తే. షడ్రసోపేతభక్ష్యభోజ్యంబు లెల్ల, విరివిగాఁ జేసియుండిన । విభుఁడు నొక్క
ద్విజునిఁ బిల్చెద శ్రాద్ధపువిధివి యేల?, యనఁగ భర్తను దిట్టి నే । నరిగి యపుడు.

మ. పదునెన్మండ్రధరాసురోత్తముల నేఁ । బ్రార్థించి రప్పింప న
య్యది తాఁ జూచి ధవుండు నిట్లనియె నో । యజ్ఞాక్షి! నాకోడుత
న్మొదట న్నీవు భుజించి శేషము నె యీ । భూదేవతాపాళికిం
బిదపం బెట్టు మటన్న సాపడక యే । విప్రాళికిం బెట్టితిన్. 99

తే. ఇటు నిషేధోక్తిచేత నా । యింటియతఁడు, పిండదానాంతమగు శ్రాద్ధ । విధముఁ దీర్చి
యేను దివ నన్నుఁ దప్పదం । చేను వానిఁ, దినునటులు చేసి పిదప నే । ననుభుజింప.

ఉ. అంతట నామగండు సఖుఁ । డాడినమాట పరాకుఁ జెంది యో
యింతిరో! పిండము ల్గొనుచు । నేగి జలమ్ముల నుంచి రమ్మనం
జెంతను గడ్డిగాదములఁ । చేఁ జెడుగా నొకగోతిలోపలం
బంతముకోడ వైచితిని । భర్త కనుంగొని లోనఁ గుందుచున్. 101

తే. మఱపుఁ జెందితి నాబుద్ధి । మాంద్యమునను, దాపురించెను బూర్వవి । ధమ్మ నాకు
నని మనమ్మునఁ దలపోసి । యనియె నిటులు, పిండములఁ దీయకుము నీట । విడువవలదు.

తే. అనఁగ వెంటనె పిండంబు।లను గ్రహించి, పావనంబైన జలములోఁ । బాఱవైచి
యిల్లుఁ జేరితి. నీగతి । నెన్నఁడైన, మఱచియును జేయకుండుదు । మగనిమాట.

ఉ. ఎప్పుడు చూచినం గలహ। నే యొనరించుచునుండ నాథుఁ డీ
చొప్పును గాంచియు న్విసువు।చు న్మది నోర్వక నన్ను వీడి నే
లొప్పినదాని నింకొక తె । నొప్పుగఁ బెండిలి యాడు నంచుఁ దా
నిప్పగిదిం దలంప విష । మేఁ దిని ప్రాణము వీడితిం జుమా! 104

తే. బల్మిఁ జచ్చిన నన్ యమ।భటులు కట్టి, యముని చెంతకుఁ గొనిపోయి । రంతయముఁ
డు, చిత్రగుప్తుని దీనిచా।రిత్ర మేమి?, దీని కీడగు ఫల మేమొ । తెల్పు మన్న.

తే. పత్రములు విప్పి నా పాప।పత్ర మొకటి, చిత్రగుప్తుఁడు చేఁబూని । చెప్పఁదొడఁగెఁ
బాపమే కల్గియున్న దీ।పత్రమందు, మనవి సేయుదు విను మోయ।మా! మహాత్మ!

సీ. పూని పాపమె కాని । పుణ్యం బెఱుంగదు, మృష్టాన్నమును భర్త । కిడక తినును
నాయఘమ్మున నల్గు।నీయోని జన్మించి, స్వీయాఘఫలము భు।జింపవలయు
కాంతుపై ద్వేషించి । కలహించుఁ గావునఁ, బందియై పుట్టఁగా । వలయుఁ బిదపఁ
బాకపాత్రమునందె । యేకతంబునఁ దింట, బిడ్డలఁ దినునట్టి । పిల్లి యగుచు

తే. పుట్టవలయును భర్తతో । రట్టుఁ జెంది, బల్మిఁ జచ్చెను గాన ని।ప్పుడఁతి నింకఁ
బ్రేతదేహంబుతో మరు।విషయమునకుఁ, బంపవలయు నటంచును । బలికె మఱియు.

తే. అచట బహుకాల మట్లుండి । యవల మూఁడు, జన్మముల నొందవలయు శి।క్షావిధాన
మిట్టు లుండె నటంచుఁ దా । నినజుమ్రోలఁ, జిత్రగుప్తుఁడు చదివె నా।పత్రమెల్ల.

వ. ఓ భూసురేంద్రా! పిదప యమాజ్ఞం గొని కింకరులు నన్నీమరుభూమి కీడ్చి తెచ్చి నా కీప్రేతరూపం బొసంగి చని రిట్లు పంచదశాబ్దంబులు గతించె నాఁకలిదప్పికలచే నార్తనై స్వకృతమ్మునకు దుఃఖించుచు నొకవైశ్యశరీరమునం దుండి దక్షిణదిక్కున నున్న కృష్ణవేణీసాగరసంగమస్థలంబున నుండ హరిహరదూతలు నన్నాశరీరమ్ము నుండి వెడలఁగొట్టిన నీవలకు వచ్చి యెప్పటిప్రేతరూపము నొంది యాఁకలిదప్పికలు నోవం దిరుగాడుచుఁ దుద కిక్కడ నిన్నుం గాంచి త్వదర్పితతులసీవారిసంపర్కమున గతపాపనై పూర్వజన్మస్మృతిం జెందితిం గాన నోమహాత్మా! దయాళూ! నీవు నాయందు దయఁ జెంది నాకు భావినీచజన్మములు నీప్రేతత్వముఁ బోనటులు చేసి సుగతి నొందింపఁజేసి నన్నుద్ధరింపుము నిన్ను శరణ మొందితి ననినఁ గలహావచనమ్ములు విని దానిపాపానుభవమ్మునకు దుఃఖించి దానిదీనత్వమునకుఁ గరుణ

నొంది శరణాగతరక్షణము ఫలదం బని యెంచి యెట్లు దీనిఁ గృతార్థఁ గాఁ జేయఁ
గల నంచుఁ జాలఁగ నాలోచించి దీనదయాళుం డౌట నాధర్మదత్తుం డిట్లనియె.

సీ. నాఁతిరో! తీర్థదానవ్రతాదులచేత, నాశ మొందును బాపరాశి యెల్ల
నేతదాచరణంబు ప్రేతవై యుంటచే, నర్హత లే దిసుమంత నీకు
నిన్నుఁ జూడఁగ మది ఖిన్నతఁ బొందెడు, నతివ! నీపాప మనంత మయ్యె
జన్మత్రయవిపాకసంధాయిగా నుండె, నీయఘం బసదు పున్నెములఁ బోదు

తే. నీదుప్రేతత్వముంగూడ నిందితంబు, గాన నాజన్మమత్కార్తికవ్రతార్థ
భాగఫలమెల్ల నీ కిచ్చువాఁడ దానఁ, బుణ్యగతు లొంది సుఖియింపు పొలతి! నీవు.

తే. యజ్ఞదానవ్రతాఖిలయాత్రలైనఁ, గార్తికవ్రతసత్పుణ్యకళకు నైన
సాటి గావంచు శ్రీహరిస్మరణ మొంది, చల్లె మంత్రోదకంబు లాచానమీఁద.

వ. అని చెప్పి ముద్గలుం డిట్లనియె నోదశరథా! యిట్లు ధర్మదత్తుండు విష్ణుద్వాదశాక్షరీమంత్రోచ్చారణపూర్వకమ్ముగాఁ దనకార్తికవ్రతఫలార్థభాగం బొసంగి తులసీమిళితజలముం జల్లిన నాక్షణంబ కలహ ప్రేతదేహంబు విడిచి దహనశిఖాసమాన దీప్యమానదివ్యదేహయై లావణ్యంబున నూర్వశి యనం దగి యాత్మీయపాపనిర్మోచనమ్మున నిర్మోకత్యాగమ్మున నాగాంగనావిధమ్మునఁ బ్రకాశించి సంతసించి యాబ్రాహ్మణోత్తమునకు సాష్టాంగనమస్కారమ్ము లాచరించి యానందబాష్పాంబుమిళితలలితలోచనయుఁ బులకితాంగియు నై హర్షగాద్గద్యంబు దనర నిట్లనియె.

ఉ. భూసురవర్య! నీదయను బొందుటఁ బాపపుఁబ్రేతరూపముం
బాసితి దివ్యరూప మిటు పొల్పడెఁ బాపసముద్రపాతసం
త్రాసితనైన నన్ దరివిధమ్మున నుద్ధరణంబుఁ జేసితౌ!
భాసురసత్సమాగతి శుభమ్ముల నిచ్చును గాదె? యేరికిన్. 113

తే. అనుచు ద్విజవర్యుతో మాట లాడుచుండ, దృష్టిగోచర మయ్యెను దేవయాన
మొకటి హరిదూతయుతము మహోజ్జ్వలమ్ము, నగుచు దరిఁ జేరఁగాఁ గని యలరెఁ గలహ.

చం. అటు గని ధర్మదత్తుఁ డెద నచ్చెరు వొందుచు జెంత కేగి యా
భటులకు వందనం బిడిన వారలు గారవ మొప్ప యుక్తవా
క్పటులు మృదూక్తు లాడుచు మహాత్మ! రమాధిపభక్తవర్య! నీ
పటుతరభక్తి నెన్న భగవంతుఁడు గా కితరుల్ సమర్థులే? 115

ఆ. కార్తికవ్రతములఁ గడునిష్ఠతోఁ జేసి, ఫలమునందు నర్ధభాగ మీమె
కొసఁగియుంట నీమె దోసఁగులు విడనాడి, పరమపదముఁ జేరు భాగ్య మొందె.

ఆ. ఈమె కిట్లు ఫలము నిచ్చియుండుటచేతఁ, దరుగు ఫల మటంచుఁ దలఁపవలదు
నీవు చేసియున్న నిఖిలపుణ్యము విప్ర!, యసలు చెడక ద్విగుణ మయ్యె నయ్య!

వ. ఓ విప్రవర్యా! హరివ్రతపరాయణుండును దీనజనరక్షకుండు నహింసాసత్యశమదమాదియుతుండును నగు నీవంటి భక్తవర్యుని పుణ్య మభివృద్ధి నొందుఁ గాని యల్పం బగునే? నీ విప్పుడు మహాపకృతి నొనర్చితి వట్లు కాకున్న బహుజన్మాంతరమ్ములదనుక నీమెపాపం బంతరించునే? యిక్కాంత నీ విచ్చిన పుణ్యఫలమ్ములలో హరివాసరజాగరణాదిపుణ్యమున విమాన మెక్కి సకలభోగానుభవనిధాన వైకుంఠలోకమునకుఁ బోవుచున్నది. దీపదానాదిపుణ్యమునఁ బ్రేతరూపము వీడి దివ్యతేజోరూప మొందినది. తులసీపూజాకార్తికవ్రతాదిపుణ్యమున విష్ణుసామీప్యముఁ జేరఁగలదు. నీ విచ్చిన పుణ్యముచే మహాఘోరపాపినిగా నున్న యీమె పాపనిర్ముక్త యయ్యె. స్వర్ణకారుఁడు వన్నెతక్కువబంగారును బుటమిడి పదియాఱ్వన్నెపసిండినిగా నొనర్చినరీతి నీమెను నిర్మలఁగాఁ జేసితి విట్టియీమె నీ విచ్చిన ఫలమ్మున వైకుంఠమున కేగుచున్న దన మహాత్మా! నీకు లోపం బగునే? యీ జన్మాంతమున నీవును భార్యలతోఁగూడ విమానమందుండి మావంటి హరిపరిచరులచేఁ బ్రార్థనాపూర్వకమ్ముగాఁ గొంపోఁబడి హరిసారూప్యాదిముక్తుల నందఁగలవు. భక్తాగ్రేసరా! లోకమున నెవ్వరు హరిభక్తియుతులమనంబు గలవారై హరినిఁ బూజింతురో వారందఱు నీవలె ధన్యాత్ము లగుట నిశ్చయం బని మఱియు విష్ణుదూత లిట్లనిరి. 118

మ. బహుసాహస్రసమమ్ము లీవు సతులన్ వైకుంఠధామమ్మునం
దు హరిం గొల్చుచు నుండి పుణ్యఫలసందోహమ్ము దీపింపఁగా
నిహమం దర్కకులమ్మునన్ దశరథోర్వీశాఖ్యచేఁ బుట్టి తత్
గృహిణీయుగ్మముతోడఁ బొల్చెదు సుమా! కేళీసుఖాఢ్యుండవై. 119

ఉ. అంతట నీకు నీకలహ యర్ధఫలంబును బొందియుంటచే
నింతి యగుం జుమీ! వఱలు నిమ్మహిఁ గైక యనంగ నీమె, శ్రీ
కాంతుఁడు నీకుఁ బుత్రుఁ డయి కౌతుక మిచ్చుచు రామనాముఁడై
యంతము నొందఁజేయును దశాస్యునిఁ, బిమ్మట రాజ్య మేలెడిన్. 120

ఉ. కావున నీవు సేయు వర। కంజదళాక్షునిసద్వ్రతమ్ముతోఁ
గావు సమమ్ము లిమ్మహి మ।ఖమ్ములుఁ దీర్థము లెల్లదానముల్
నీ విఁక నిచ్చ లీగతిని । నీరజనేత్రునిఁ గొల్చుచుండుమా
యేవపుదంభమత్సరము । లెప్పుడుఁ జెందక భూసురోత్తమా. 121

తే. మాఘమఘుమాధవోర్జస।న్న్యాసము లను, నాలుగింటను నీవుష।స్స్నాయి వగుము
చేయు మెప్పుడు నేకాద।శీవ్రతంబుఁ, దులసి నెప్పుడుఁ జెంచుము । జలము వోసి.

తే. బ్రాహ్మణుల గోవులను విష్ణు।భక్తవరుల, భక్తి సేవించుచుండుము । వారియెడల
ద్వేష మొందకు మెప్పుడు । విప్రవర్య!, సర్వసమదర్శనుండవై । శాంతిఁ గొనుము.

కం. చిఱుశెనగలుఁ దరనాణియు, నెరచియు వంకాయ మొదలు । నిట్టివి విడుమా
సురపితృగణమున కెయ్యవి, వరభోజ్యము లట్టివాని । వలయును దినఁగన్. 124

వ. ఓధర్మదత్తా! యిట్లు నియతప్రచారుండవై హరిం గొల్చుచుండిన నతనిం జేరఁ గలవు. జయవిజయుల మగు నేము హరిభక్తిచేతనే గదా! యిప్పుడు పుణ్యశీల సుశీలాహ్వయులమై హరిసన్నిధి ముక్తులమై యుంటిమి. కావున నోభూసురేంద్రా! నీవును ధన్యాత్ముఁడవు, హరివ్రతపరాయణుండవు. భవదర్జితపుణ్యార్థమున నిక్కలహ మాచేఁ గొంపోఁబడి హరిసాలోక్య మొందెడు నివియంతయు నీప్రభావమే కదా? యనిరి. ఓదశరథా! యిటులు హరిపరిచరు లాద్విజున కుపదేశించి విమానారూఢులై కలహాతో వైకుంఠమును జేరిరి. ధర్మదత్తుం డట్లు జీవితకాలమ్ముఁ గడపి దేహాంతమున భార్యాద్వయమ్ముతోఁ బరమపదమ్ముఁ జెంది యట ననేకాబ్దసహస్రంబు లుండి పిదప నినవంశమ్మున దేవకార్యచికీర్షచే జన్మింపఁగల భగవంతునకు జనకస్థానమ్ముగా నీరూపమ్మునఁ బుట్టి నీకును భార్యాత్రయం బయ్యె. శ్రీహరిభక్తుండగు ధర్మదత్తుండ వీవే సుమా! యానారాయణుండు నీకుఁ బుత్రుం డయ్యె. రామలక్ష్మణభరతశత్రుఘ్నరూపమున నానారాయణుం డిట్లవతరించె. ధన్యుండ వీవు నీయడిగినయర్థంబు నిట్లు నుడివితి నని ముద్గలుండు దశరథునితో హరిప్రభావముల రహస్యముగాఁ బల్కె నని చెప్పి యీశుండు పార్వతితో మఱియు నిట్లనియె. 125

తే. ఇట్లు ముద్గలుఁ డాకోస।లేంద్రుతోడఁ బలికి వారలఁ బూజించి । భవ్యుఁడైన
రాము నాలింగన మొనర్చి । రామచంద్ర!, తపము ఫలియించె నీదివ్య।దర్శనమున.

తే. అనుచు రాముననుజ్ఞచే । మునివరుండు, నాశ్రమముఁ జేరి ధన్యుఁడ । నైతి ననుచు
ముదముఁ గనె నంత దశరథ।భూవిభుండు, పుత్రులం గూడి సాకేత।పురముఁ జేరె.

ఉ. అచ్చటఁ బౌరమంత్రులు నృ । పాగతి విన్చుఁ బురంబునంతటం
బచ్చనితోరణమ్ములు సు । మనమ్ములు గేతనముల్ గృహంబులన్
రచ్చల రాజమార్గముల । రమ్యము గాఁగ నలంకరించినన్
వచ్చెను ఱేఁడు ప్రోలి కట । వందినుతుల్ శుభవాద్యము ల్దగన్. 128

సీ. రామచంద్రునిఁ బౌర । రామామణు ల్గూడ, బిడ్డలఁ జంకలఁ । బెట్టుకొనుచు
సౌధమ్ములన్ రాజ । సరణులఁ దగ నిల్చి, కుంభదీపాళులఁ । గూర్చి విరుల
నర్పించి రామున । కారతు లిచ్చిరి, వెలయాండ్రనాట్యము । ల్వోలసె మిగుల
గాయకవాంశిక । గానమ్ము లొప్పారె, బహువినోత్సవములఁ । బ్రజలు మించి
తే. రాజి యిట్టులు తనతన । యాళితోడ, నాండ్రతోడను మఱియుఁ గో । డండ్రతోడ
సంతసమ్మునఁ బరివార । సహితుఁ డగుచు, రాజగేహంబు సొచ్చె నో । రమ్యగాత్రి!

తే. జనకసచివులఁ గనకభూ । షణసుచేల, వాహనాదుల షడ్రస । భక్ష్యభోజ్య
కలితలలితాన్నములఁ దృప్తిఁ । గనఁగఁజేసి, సాగనంపెను మిథిలకు । సంతసమున.

తే. ఇట్లు పండుగలందు నేఁ । టేట రామ,చంద్రు జనకుండు మిథిలకు । సపరివార
ముగను దోడ్తెచ్చి యుత్సవ । మ్ముల నొనర్చి, కాన్క లొసఁగుచు నుండు వే । డ్కలు ఫలింప.

## సీతారాముల శోభనోత్సవము

సీ. అంత షణ్మాసమ్ము । లరుగ నయోధ్యలోఁ, బదునొకండవయేఁడు । పరఁగుచుండ
శుభదినమ్మున నొక్క । శుభముహూర్తమ్మున, నవనిజ పుష్పిణి । యైన నంత
నవ్వార్త మైథిలుం । డాలించి సతులతోఁ, బరివారయుతముగా । బయలుదేరి
సాకేతపురిఁ జేర । సంతసమ్మున నాజి, యెదురేగి మర్యాద । లెల్లఁ దీర్చి
తే. పురముఁ జేర్చిన జనకుఁడు । ముదముఁ జెంది, తరుణులను గూడి సీతకుఁ । దగిన శుభవి
ధాన మొనరింప మంగళ । స్నాన మెలమి, నువిద లెల్లరుఁ గావించి । రొప్పమీఱ.

తే. రాము నానాఁడు శోభన । రాముఁ జేసి, జానకీబాల మంగళ । స్నాతఁ జేసి
సకలభూషల దివ్యవ । స్త్రములచేత, మించు వేడుక సతులు భూ । షించి రెలమి. 133

ఉ. అంత గురుండు వారల శు । భాసనమందు వసింపఁజేసె సా
మంతనృపావనీసురస । మన్వితుఁడై యజపుత్రుఁ డాసభా
భ్యంతరమందు రామశుభ । మాదర మొప్పఁగఁ జూచుచుండఁగా
నంతట మంగళధ్వనులు । హాయిగ మ్రోఁగుచునుండ నత్తఱిన్. 134

కం. నిర్భరతేజుఁడు కాంచన, గర్భాభుఁడు గురుఁడు కర్మ ✽ కాండవిధాసం
దర్భము దనరఁగ నంతట, గర్భాధానాంగహోమ ✽ కర్మముఁ దీర్చెన్. 135

వ. ఇట్లు ప్రాతఃకాలమున వసిష్ఠుండు హోమాదికమ్ము నెఱవేర్చి యాశీర్వాద మొసంగిన నాసీతారాములతో సకలబంధుజనమ్ములతో నందఱు రాజాన్నము లారగించి రంత మధ్యాహ్నంబున వినోదమ్మునకై కేళీగృహాంగణమ్మునఁ బట్టుపరుపులపై నన్యోన్యాభిముఖమ్ముగా సీతారాముల నునిచి శాంత మున్నగుపడంతులు బంతులుగాఁ గూర్చుండి యాదంపతులచేఁ బూలబంతు లాడించుచుఁ బాటలం బాడుచుఁ జందనతాంబూలాదిసత్కారమ్ము లందికొని సంతసించి రంత నారాత్రిసమయమ్మున.

ఆ. వె. శుభముహూర్తమందు ✽ సుదతు లెల్లరుఁ గూడి, ముదముతోడ భూమి ✽ పుత్రి కెల్ల
భూషణాళి మేల్మి ✽ పుట్టంబు ధరియింపఁ, జేసి రాము చెంతఁ ✽ జేర్చి మఱియు.

వ. రతనంపుగోడలును, బవడంపుమవారంబులును, గప్పురాలతలుపులును, బూలసరులచే సొంపుగాఁ దీవలమాడ్కిఁ గూర్పంబడి యొప్పు చాందినీలును, గస్తురికలయంపులును, ముత్తియంపుముగ్గులును, దావిగల పొగలును, మానికంపుదివ్వెలునుం గలిగిన కేళీసౌధమ్మున భాసిల్లు విపులపాన్పుపై సీతారాముల నునిచి పుడమివేల్పులు మున్నదువుల నుడువుచుండ బోటు లెల్ల నీలైనపాటలఁ బాడుచు బంగరుపళ్లెరంబులఁ గపురంపుటారతులు పట్టి నివాళించి యాదంపతులచే నెల్లరకు దంపతితాంబూలఫలదానమ్ము లిప్పించి రంత శాంత పరిహాసమ్మునకై సీతా! మాతమ్మునకు గందమ్ముఁ బూయు మనఁ బూయక సిగ్గునఁ దల వాంచి యూరకున్న సీత నుద్దేశించి నవ్వుచు నిట్లనియె. 138

ఉ. పూనవుబంతులాడుతఱి ✽ సుందరు లెల్లరుఁ జూడ సిగ్గులోఁ
బూనక నాసహోదరునిఁ ✽ బువ్వులచెండునఁ గొట్టినప్పు డే
మైనను లేనిసిగ్గు నిజ ✽ మట్టులు గందముఁ బూయుమన్న లోఁ
బూనఁగ నయ్యెనే? యిపుడు ✽ భూసుత! యెంతటినంగనాచివే? 139

తే. విల్లుఁ బట్టుట యను సుంత ✽ వెలకుఁ బెచ్చు, విలువ గల్గిన మారామ ✽ విభునిఁ బెండ్లి
యాడియున్నట్టి జాణ వీ ✽ వైతి విపుడు. దొంగసిగ్గుల కేమిలే ✽ నంగనాచి! 140

వ. అని పరిహాసవచనమ్ము లాడుచు సీతారాముల నన్యోన్యవిలిప్తగంధదేహులఁగా నొనర్చి లక్ష్మీనారాయణుల ట్లన్యోన్యానురాగమ్మున సుఖం చెదరుగాక యని దీవించి యాకాంత లాకేళీగృహంబు విడిచి తమతమగృహంబులకుం జన నప్పు

డారామచంద్రుండును త్రపావనతాననయై తల్పంబు డిగి తత్ప్రాంతమ్మున నిల్చి యున్న సీతను రసాలంబు శాఖాహస్తములచే మాధవీలత నాకర్షించు తెఱంగునం దనమృదుకరతలమ్ములచే నంకతలమ్మునం జేర్చె, నిట్లాదంపతు లనంతవైభవోపేతులై రతీమన్మథులట్లు లక్ష్మీనారాయణులపోల్కి నన్యోన్యానురాగభాసురులై యవిచ్ఛిన్నానందానుభవమ్మునం జెలంగుచుండి రిట్లు లూర్మిళామాండవీశ్రుతకీర్తులును దత్తత్కాలమ్ములం బుష్పవతులై జనకకృతశోభనమహోత్సవలైనంత వారలతో లక్ష్మణభరతశత్రుఘ్నులును కేళీవినోదమ్ముల నొందుచు నవిచ్ఛిన్నసుఖానుభవమ్మున జననీజనకుల కానందదాయకులై యుండి రంత. 141

చం. జనకుఁడు నాజిచే సకల సత్కృతులం గొను చొక్కమాస మా
యినకులునింట నుండి మఱి యింటికిఁ బోవ ననుజ్ఞఁ జెంది త
త్తనయల నల్లురం గని ముదమ్మున నుండుఁ డటంచుఁ జెప్పి తాఁ
దనపరివారబంధుసహితమ్ముగఁ జేరె స్వకీయదేశముం. 142

వ. ఇట్లు జనకుం డాత్మపురమ్ముఁ జేరినపిదప రామచంద్రుండును సీతాకాంతతోఁ గూడి సుఖించుచు గార్హస్థ్యధర్మం బనుసరించుచుండి దేవభూసురపితృపూజాపరాయణుండై యుండుటఁ దత్పురమ్మునందు. 143

ఉ. లేములు లే వసూయలును లేవు వివాదులు లే రనాథలా
లేమలు లేరు పాపులు మలీమసవృత్తులు లేరు నాస్తికుల్
కాముకవృత్తితో మెలఁగు కాంతులుఁ గాంతలు లేనెలే రహా!
రాముఁడు ధర్మరక్షణవిరాజితుఁడై పురి నుంటఁ బార్వతీ! 144

## శ్రీరాముని దైనందినచర్య

సీ. ప్రత్యహంబును రామభద్రుండు వేకువ, యామిని లేచి కాల్యములఁ దీర్చి
యాందోళికారూఢుఁడై తాన మొనరింప, సరయూనదికిఁ జేరి స్నాతుఁ డగుచుఁ
దత్తీరపుళినపూతస్థలమ్ముననుండి, ద్విజులతో నైత్యికవిధులఁ దీర్చి
నిత్యదానమ్ములు నియతితో నొనరించి, పూలచే సరయువుఁ బూజచేసి

తే. బ్రాహ్మణుల నెల్లఁ బూజించి పసిఁడిత్రాళ్లు, పట్టుపసుపులుఁ గౌశేయపటము గలిగి
యురుమణీభాసురంబునై యొప్పియున్న, పూతరథ మెక్కి యింటికిఁ బోవుచుండు.

తే. భటులు గరదండముల బరాబకులు సేయ, సతులు బూవులుచల్లి యారతులొసంగ
రథవిభూషణఘంటికారవముతోడ, స్వగృహమే తెంచు నారామచంద్రుఁ డెపుడు.

వ. ఇట్లు లింటికిఁ జేరి రథమ్ము డిగ్గి చంద్రశాలాద్వారమ్ముకడఁ బాదుకలు వీడి సీతాదత్తపాద్యార్ఘ్యాచమనుండై సీతతో నగ్నిశరణంబున నుండి నిత్యోపాసనవిధానమ్మొనర్చి స్ఫాటికలింగమ్మున నోపార్వతీ! మనలసిద్ధుబ నావాహన మ్మొనర్చి సీతాసమానీతార్చాపకరమ్ములచే లింగార్చనావిధానపారీణుండై లోకరక్షణార్థము మనల షోడశోపచారమ్ములఁ బూజించి సీత వండి తెచ్చిన పవిత్రాన్నాదుల నివేదించి బ్రాహ్మణులకు దానమ్ము లొసంగి తదాశీర్వచనంబు లొంది తులసీగవాశ్వత్థాతసీపూజనమ్మును సూర్యోపాసనమ్మును బ్రహ్మయజ్ఞంబు నొనర్చి వసిష్ఠుని వలన సీతాయుతుండై సపరివారముగాఁ బురాణగాథలు విని సీతాప్రార్థితుండై నారికేళకపిత్థామ్రదాడిమపనసఖర్జూరాదిఫలభరిత మ్మగు నుపాహారంబుఁ గైకొని తాంబూలం బంగీకరించి పిదప దివ్యవస్త్రధారియై దర్పణమ్మున నాకృతిం జూచికొని తాత్కాలికసీతాకటాక్షప్రసారజనితస్మేరాంకురభాసురముఖారవిందుండై రథ మెక్కి పరిజనాన్వితుండై మంగళరవపూర్వకమ్ముగా మాతృగృహంబుఁ జేరి.

చం. జనములకు న్నమస్కృతుల సల్పి సభాగృహ మేగి భూవరా
సనగతుఁ డైనతండ్రిఁ గని సాగిలి మ్రొక్కి తదాజ్ఞఁ బౌరస
జ్జనఘనరాజకార్యముల సర్వముఁ బూర్తి నొనర్చి తండ్రిచే
ననుమతుఁడై స్వగేహమున కాగతుఁడై యలరారు నెంతయుఁ. 148

తే. తేరు డిగి సీత యిచ్చెడి వారిఁ దనదు, నడుఁగుఁదమ్ములఁ గడిగి తానాచమించి
యాసనమ్మునఁ గూర్చుండ నవనిజాత, చెంత నిలుచుండి విసరుచు సేవఁ జేయ.

తే. సీతతోఁ దాను సభలోనఁ జేసియున్న, కృత్యములఁ జెల్పి హాస్యసంగీతముఖ్య
బహువినోదమ్ములను రక్తి వడయఁ జేసి, ముదమునొందించు రాముఁ డా సామితనయ.

తే. అంత మాధ్యాహ్నికస్నానమాచరింప, సరయువున కేగి యచట సుస్నాతుఁ డగుచు
వచ్చి సంధ్యాదికృత్యము ల్వారుసఁ దీర్చి, చేరు రాముఁడు భోజనాగారమునకు.

తే. ఎచట రాముఁడు స్నానమ్ము నెపుడు సేయు, నట్టిసరయూనదీతీర్థ మఖిలజగతి
రామతీర్థ మటంచును బ్రథిత మయ్యె, నచట మఘమాసమున ఫల మధికమంద్రు.

శా. ఇష్టామాత్యగణమ్ముతోఁ గలిసి తా నిచ్ఛాప్రకారమ్ముగా
శిష్టుండైన వసిష్ఠుఁ డగ్రమున నాసీనుండు నైయుండఁగాఁ
జేష్టాసంచరణారణత్కటకమంజీరప్రకోష్ఠాంఘ్రియై
మృష్టాన్నమ్ములు జానకీసతి శుభస్మేరాస్య వడ్డింపఁగా. 153

తే. వింతముక్కాలురతనాలపీటమీఁదఁ, బసిఁడిహరివాణమందు నింపెసఁగ రాముఁ
డారగించును గోఘృతసారపక్వ, మధురభక్ష్యాన్వితాన్నంబు మంజుగతిని. 154

తే. భోజనముఁ జేసి మృదులతాంబూల మొంది, శతపదంబులు నడిచి తా శయ్యపైనఁ
బదము లొత్తుచు జానకి పరిచరింప, లీల నిసుమంత నిద్రించి లేచి మఱియు.

కం. నిస్తులవేషుఁడు రాముఁడు, శస్త్రాస్త్రనిషంగబాణచాపాదికవి
న్యస్తంబైన రథమ్మున్, ముస్తాబై యెక్కి చనును బూఁదోఁట కొగిన్. 156

వ. ఇట్లు పరివారయుతుండై లీలోపవనమ్మునఁ జేరు నెడఁ దెన్నున నిరుగడలనున్న యుభ్యున్నతావనీజసౌధమ్ములనుండి కొమ్మలను కొమ్మలు గిసలయకరమ్ములఁ బరిమళమ్ముఁ జిమ్ము సుమమ్ముల నమ్మహారాజకుమారుండగు రామునిపై నెదజిమ్ముచున్నటులు పయింబడి జాఱి నేలపయిం బడి పలుతెఱంగుల రంగులుగల నెత్తావి విరులతోఁ గూడు తావులు వసెజ్జ్రుప్రసారితబహువిధాకారారామూల్యమనోరమణీయాపణమ్ము లన నొప్పు నాఁచొప్పుఁ గనుంగొనుచు, రసికసుందరపురుషదర్శనజన్యతదాలింగనాభిలాషాగతమదవతీయువతీమృదుళబాహుద్వయా విచ్ఛిన్నాలింగనాభివ్యక్తసూచకాతిమృదులైలాలవంగగోస్తనీమాధవీమల్లికాపుష్పవద్వల్లీమతల్లికాక్రాంతశాఖాచయాలసత్కిసలయరాజివిరాజమానవిశాలబాలరసాలసాలజాలంబు నాలోకించుచుఁ, గేకీకేకాకారమంద్రారావానుకూలవిపంచీపంచమస్వరకించిదుదంచితక్రౌంచీముఖోద్గతమధ్యమశ్రుతిరవానుకూలానువాదక శుకశారికాదికవికచాననవినిర్గతతారకపథప్రతిరవజనకతారక శ్రుతి సమవాయాధికాతి మనుష్యజాతిగంభీరగంధర్వగానప్రతిరవశంకావకాశనవరసాలసాలకిసలయచర్వణాఖర్వమదమత్తశ్రోతృజనసర్వాంగీణపులకోద్గమకారణానందజనకజనకదంబపరిహృతతాపకోకిలాలాపరూపశ్రుతిసందోహప్రవర్ధమానారామరంగబాలరసాలసాలావళీ కిసలయసుమశాఖాచలనరూపవారవనితాసాంగుళీయకారుణతలమృదులహస్తవిన్యాసభాసురగిరిగహ్వరప్రవేశసమయసముద్భూతగంభీరవాయురవమృదంగధ్వనిసమంచితామ్రేడితహంసధ్వనినికరతాళభాసురంబై నాగవాసంపునాటపాటలవాటంబు నిరూపించు పలుతెఱంగులగు పులుగులనులివు లాకర్ణించుచుఁ జని చని వికచసరోజసంచరద్బహువిధపక్షిరవకలితలలితనిర్మలజలరమణీయమణీమయసోపానభాసురకాసారప్రాంత శీతకిరణమణిగణవినిర్మితమృద్వీకాకాయమానవిరాజమానశీతలతలసంగతవేదికయందు విశ్రమించి వీణాగానహాస్యప్రముఖమనోరంజకవినోదమ్ముల నానందించుచు శైత్యమాంద్యసౌరభ్యసమా

కలితమలయోద్భూతతసమాయాతవాతపోతజాతపాతమ్మునఁ బరిహృతలీలోద్యాన
విహారజనితదేహశ్రమస్వేదుం డై ప్రశాంతామోదుం డై యిట్లారాముం డారామ
విహారాభిరాముం డై యానందానుభవమున సాయంకాలమునకుఁ దిరిగి వచ్చి
స్వగేహమ్మునఁ బ్రవేశించు మఱియును, 157

తే. సాయమున రామచంద్రుఁడు సంధ్య వార్చి, సాయ ముపాసనమ్మును శ్రద్ధమీఱఁ
జేసి మఱియును సురలఁ బూజించి వేడ్క, నవనిజాయుక్తుఁడై యన్నమారగించు.

తే. హాస్యగీతవినోదమ్ము లాలకించి, జానకిం గూడి శ్రీరామచంద్రవిభుఁడు
కేళికాగేహచక్రాంగతూలతల్ప,మందుఁ బవళించి సుఖనిద్ర నందు నిశల. 159

కం. శ్రీరాముఁ డీవిధమ్మున, స్వారాట్టన సకలవిభవసంయుతుఁడై సీ
తారామను గూడియుఁ దా, నీరేఁడులు సుఖించె నెలమి నయోధ్యన్. 160

## శ్రీరాముఁడు తండ్రికి తత్త్వ ముపదేశించుట

మ. ఒకనాఁ డాజి మనంబులోపల ముదం బొప్పారఁగా ముద్దులో
క్తకథారీతిఁ దలంచి రామవిభుఁ డా దామోదరుం డంచు నెం
చి కడు న్భక్తిగ నేకతమ్మున సుఖాసీనుండు నై రాముఁ జెం
తకు రప్పించి యనెన్ సుధామధురవాగ్ధారాధురీణమ్ముగా. 161

కం. రామా ! రఘువంశాంబుధి, సోమా ! యోగీశవినుతశోభననామా !
ధీమాన్య ! మునిజనావన, కామా ! సీతామనోబ్జఖరకరధామా ! 162

తే. నీవు నారాయణుఁడ వంచు నిఖిలభూమి, భారహరణమ్మునకు నాకుమారుఁడ వయి
పుట్టితి వటంచుఁ గొందఱు బుధులె యందు, రనఘ! దీనినిజం బెఱుఁగ యానతిమ్ము.

ఉ. జ్ఞానవిహీనుఁడ న్భవరుజాభరితుండను విత్తదారసం
తానమమత్వయుక్తుఁడను దామసుఁడ న్మఱి నీదుమాయచేఁ
గానఁగలేను తత్త్వమును గావున జ్ఞానము నాకొసంగి య
జ్ఞానముఁ బో నణంచి నను సత్కృతిఁ బ్రోవుము పద్మలోచనా ! 164

తే. అనుచుఁ గోరినఁ దండ్రిపల్కాలకించి, రాముఁ డిట్లను యోగీశరంజనంబుఁ
దల్లి కౌసల్యయును వినఁ దగినయట్టి, దివ్యతత్త్వంబుఁ జెప్పెద దీని వినుము.

సీ. జగమెల్ల మాయచే జన్మించుఁ గావున, శాశ్వతం బిది కాదు నశ్వరంబు
పరమాత్మయందు నాభాసమై తోఁచును, భ్రాంతిచే నిజమట్లు పరఁగుచుండు

నదియెట్లనఁ శుక్తియందు వెండియుఁ గాచ, భూమిలో జలమును భూపవర్య!
యెండమావుల నీరుఁ గుండలి త్రాడునఁ, గలదంట భ్రాంతిచేఁ గాక నిజమె?

తే. అవ్విధమ్మున జగమెల్ల నాత్మభాస, మానమై యుండునంచును మానివరుల
కెఱుఁగనయ్యెడు నజ్ఞాను లెఱుఁగలేరు, తథ్య మిమ్మాట యని నమ్ము ధరణినాథ!

తే. ఆత్మశుద్ధుండు నిర్వ్యళీకాధికుండు, సచ్చిదానందలక్షణసహితుఁ డెపుడు
వానియంశమ్ముచేఁ జతురాననాదు, లైన మే మిలఁ బుట్టుదు మయ్య! యిట్లు.

వ. మఱియు జగదుత్పత్తిస్థితిసంహారకృత్యమ్ముల నెఱవేర్ప నైకరూపమ్ముల నొంది యుందుము. పరమాత్మ మాయారూపమ్ముల నంతరాత్మ మైయున్నను బద్మపత్రముల జలబిందువులట్లు వాని నంటక ప్రకాశించుచుఁ బరమానందస్వరూపుఁ డై యుండుఁ గాన నో రాజోత్తమా! నీ విజ్ఞానసారం బరసి దేహాగారాత్మజాంగనాదులయందు మమకారము విడిచి చిదాత్మకుఁడగు పరమాత్మయందు సర్వభారమ్ము నర్పించి దృష్టిగోచరపదార్థజాలంబెల్ల బ్రహ్మభావమ్మున నారాయణరూపముగా నెంచి యొక్కఁడైనను బరమాత్మ బహురూపములఁ బ్రకాశించునను నుపనిషదర్థమ్ము నమ్మియుండుము. సత్యంబు బ్రహ్మం బసత్యంబు జగ మ్మనునమ్మక మున్నచో నహంకారమమకారమ్ములకుఁ దా వుండునే? కావున నీ వల్లించితివేని యజ్ఞానము తొలఁగి జ్ఞాన మ్మొందెద వాజ్ఞానమ్మున మోక్షమ్ము నీకు సులభమైయుండు నని చెప్పి రామచంద్రుండు మఱియు నిట్లనియె. 168

ఉ. సత్యము శౌచముం దయయు శాంతియు దాంతియు నోర్పు నింద్రియా
ప్రత్యయవిష్ణుభక్తులును బ్రాణులఁ జంపమి వేదమార్గము
న్నిత్యముఁ జెందియుండు మివి నీరజనాభపదారవిందసాం
గత్యవివిక్తభక్తులకుఁ గౌతుకదమ్ములు మోక్షదమ్ములుం. 169

శా. చౌర్యద్యూతవివాదదంభములు మాత్సర్యంబు లోభమ్మునుం
గ్రౌర్యక్రోధభయమ్ములుం బిశునతాకార్యక్రియాలౌల్యముల్
వర్యామ్నాయయతిద్విజాదికపరీభావాన్యనిందాదికా
నార్యంబు ల్విడనాడు మియ్యవి మహాంహఃప్రాపకంబు ల్సుమా. 170

కం. మును నీవు తపముఁ జేయుచుఁ, దనయుఁడవగుమంచు నన్నుఁ దగఁ గోరుట నీ
తనయుఁడనై జన్మించితి, ననుమానము లేదు నేనె హరి నోజనకా! 171

ఆ. ఏను చెప్పినట్టి యీతత్త్వబోధంబు, భక్తిహీనులైనవారి కెపుడుఁ
జెప్పఁబోకుమయ్య చిత్తమం దిడు మిది, జ్ఞానదంబు మోక్షసాధనంబు. 172

చం. అన విని యాజి నిర్మలహృదబ్జుఁడునై హరిభావనాఢ్యుఁడై
కనుఁగవ మోదబాష్పములు గ్రమ్మఁగ మేనును బుల్కలొందఁగాఁ
దనయుఁడు గాఁడు విష్ణుఁ డని తత్పదపద్మయుగమ్ము నంటి వం
దనము లొనర్ప రాముఁ డటు తండ్రిని లేవఁగఁదీసి యిట్లనెన్. 173

తే. తండ్రి! తగునయ్య! బాలవందన మొనర్పఁ, బుత్త్రుఁడుగ నీకుఁ బుడమినిఁ బుట్టియుంటి
విష్ణుఁ డంచును నన్ను భావించితేని, డెందమునయందుఁ జేయుమా వందనములు.

కం. హరిభావనమ్ము నాపైఁ, దిరముగ నీవొంది నన్ను దినదినభక్తిం
బరమార్థబుద్ధిఁ గొని మ, త్పరము ల్గావింపు మెల్లభావమ్ములనున్. 175

కం. అని చెప్పి జనకపదస, ద్వనజమ్ముల కెరఁగి రామభద్రుం డంతం
దన కేలుజోడు మోడిచి, వినతుండై భక్తితోడ వినుతించె వెసన్. 176

తే. జనకుననుమతిఁ జెంది యాజానుభుజుఁడు, రాముఁ డంతటఁ దేరెక్కి ధామమునకుఁ
జనియె నచ్చట జానకీసతియుఁ దాను, మించు వేడుక భుక్తిఁ గావించి రపుడు.

వ. ఈరామచంద్రుండు సీతతోఁగూడి తల్లిదండ్రులచెంత నెప్పుడు భుజించునో? వారలఁ దనచెంత భుజించుట కెప్పుడు రమ్మనునో? తమ్ములచెంతఁ దాను దనచెంతఁ దమ్ములును భుజింప నెప్పుడు నియమించునో? భార్యాపుత్త్రజననీజనకసహోదరపౌరద్విజవర్గమ్ములతోఁ గలిసి యెప్పుడు భుజించునో? యట్టివినోదము మన కెప్పుడు చూడ నగునో యని ప్రజలచేఁ దలంపఁబడుచుండునంత శ్రీరామదర్శనార్థము మును లనేకులు వచ్చి దర్శించి రామునితో భోజనమ్ము లొనర్చి యచట నైదాఱుదినంబు లుండి పుణ్యకథాగోష్ఠులతో రాము నానందింపఁజేసి నిజాశ్రమమ్ముల కేగుచుం దురు మఱియును, 178

ఉ. ఎప్పుడు రాముఁ డేపనికి నిచ్చను జెందునొ యప్పుడప్పు డా
చొప్పుల నింగితమ్ములను జూచి గ్రహించి ధరాతనూజ తాఁ
జెప్పకయున్నఁ జేయుచును శ్రీరఘురాముఁడు సంతసింపఁగా
నప్పతిదేవతామణి నిరంతరభక్తి రహించు నెంతయున్. 179

తే. రాముఁ డీరీతిఁ బెండ్లియై రమణితోడఁ, గూడి సాకేతపురిలోనఁ గుతుకముననుఁ
గామకేళీవిలాససంగతుఁడు నగుచుఁ, బరమసుఖ మొందెఁ బండ్రెండువత్సరములు.

వ. కలియుగమ్మున సహస్రశతదశవత్సరపరిమితం బగు కాలంబు క్రమమ్మునఁ గృత త్రేతాద్వాపరయుగమ్ముల నొక్కొక్కవత్సరపరిమితం బగు కలియుగమ్మున ధర్మంబు త్రిపాదశూన్యంబు గావున నిట్టిభేదంబు సిద్ధించు నట్లు రాముండు ద్వాదశవత్సరమ్ములు సుఖభోగి యైయుండె. మఱియుఁ దత్తత్కాలమాత్రలభ్యములగు ఫలపుష్పాదికము లన్నియు నెల్లప్పుడు రామచంద్రప్రభావమ్మునఁ బ్రజలకు లభించుచుండె. లోకమ్మున క్షామడాంబరతస్కరరోగబాధ లెవ్వియు లేక ప్రజలు సుఖించుచుండి రంత నొక్కనాఁడు యుధాజిత్తు తనమేనల్లురగు భరతశత్రుఘ్నులను గైకేయీదశరథుల యనుమతి నొంది తనపురమ్మునకుఁ గొంపోయె నని చెప్పి శంకరుం డిట్లనియె.

ఉ. రామునిబాల్యగాథ వివరమ్ముగఁ దెల్పితి నెవ్వరేని ని
స్సీమనిసర్గభక్తియుతచిత్తము మీఱఁగ దీని విన్నచో
భూమశుభాళి వారి కగుఁ బోవును వారి యఘమ్ములెల్ల శ్రీ
రాముఁడు వారిఁ బ్రోచును చిరస్థిరసంపద లిచ్చి నిచ్చలున్. 182

## నారదుఁ డయోధ్య కేతెంచుట

వ. అంత నొక్కనాఁడు. 183

మ. నళినాక్షాంఘ్రిసరోజయుగ్మభజనానందుండు వీణారవా
కలనాభాసితుఁ డైననారదుఁ డెదం గౌతూహలం బొప్పఁగా
జలదద్వారపథాగతుం డగుచుఁ దా సాకేతముం జేరె ని
ర్మలభక్తిన్ సురవార్త రామునకు సర్వమ్ముం దగం జెప్పఁగాన్. 184

ఉ. వచ్చి రఘూత్తముం గని సభాజితుఁడై పలికె న్మహాత్మ! నా
వచ్చినకర్జము న్వినుము వార్తను దెచ్చితి నీకు రాఘవా!
యిచ్చటనుండి దండకకు నేగి దశాస్యునిఁ జంపి యీధరం
జెచ్చెర నేలుమా యని వచింపఁగఁ బంపిరి నన్ను వేలుపుల్. 185

తే. అనఁగ నారదవాక్యంబు నాలకించి, రాముఁ డంగీకరించె నారదుఁడు నంత
రామునాజ్ఞను జెంది బిరాన నపుడె, హరిని బాడుచు నరిగెఁ దా నమరపురికి.

వ. తదనంతరమున. 187

తే. జనకజను గాంచి శ్రీరామచంద్రుఁ డనియె, నాకు మాతండ్రి పట్టాభిషేక మెలమిఁ
జేయ నెంచును నే నంతరాయ మొందఁ, జేసి కానకుఁ బోదును సీత! యింక.

తే. అటకు సౌమిత్రితోఁ బోయి యచట నున్న, రావణాదులఁ జంపి యీరాన వత్తు
నాదుజనకుని జనని నానారతంబు, సేవ జేయుచు నుండుము నీవు పురిని. 189

వ. అనిన రామచంద్రునకు నమస్కరించి సీత మధురమ్ముగా నిట్లనియె. 190

సీ. నాథ ! నన్ను వనమ్మునకుఁ గొనిపోవుము, కారణంబులు మూఁడు గలవుసుమ్ము
బాల్యమ్మున మదీయపాణిరేఖలఁ జూచి, పాఱుఁ డొక్కఁడు సీత భర్తతోడ
వని కేగు ననియె నవ్వానివాక్యము సత్య, మగుఁగాక నాతోడ నరుగుమయ్య !
పదపడి మత్స్వయంవరమందుఁ బ్రాణేశ !, నీవు చాపము నెత్తఁ బోవునప్పు

తే. డమరవరులార ! రాము నీ సమయమందు, దీని నెక్కిడఁ జేసితి రేని నేను
బదియునాల్గేండ్లు దిరిగెద వని నటంచుఁ, బలికియుంటిని చెల్లింప వలదె దాని ?

తే. మఱియు నొక హేతువుండె రామాయణములఁ, జెక్కలాలించితిని సీతవిడిచి రాముఁ
డెన్నఁడేనియు వనమున కేగ నొక్కొ !, కానఁ గాననవాసంబు గలదు నాకు.

తే. కాన నోనాథ ! నాతోడఁ గలిసి యేగు, మనఁగ రాముఁడు సమ్మతి నంది యట్లు
సీత వచ్చెద నంటకుఁ జిత్తమందు, నలరెఁ బిమ్మట నాదాస్యందనుండు. 193

## పట్టాభిషేకప్రయత్నములు

మ. ఒకనాఁ డాత్మగురు న్వసిష్ఠుఁ గని తా నుత్సాహియై యిట్లనెన్
సకలోర్వీభర మింతకాలమును మచ్ఛక్తిప్రకారమ్ముగాఁ
బ్రకటప్రక్రియ నేలియుంటిఁగద శ్రీరాము న్యవాధీశుఁగా
నికఁ గావింపఁగ నెంచియుంటి భవదీయేచ్ఛానుకూలమ్ముగాన్. 194

చం. అన విని రామమాతృనిలయమ్మున మౌని వసిష్ఠుఁ డాతఁడో
ననియె సుమిత్ర కోసలునియాత్మజయు న్విన రాజవర్య ! నీ
తనయుఁడు లక్ష్మణుం గలిసి దండక కేగును రావణాదులం
దునుమఁగఁ గైకయీవరముల్ సఫలత్వ మొనర్పఁ గావునన్. 195

వ. నీ వెఱుంగనివాఁడవోలె నాభిషేచనికసంభారమ్ముల సిద్ధము చేయింపుము, సుమం
త్రాదులచే నెల్లరాజన్యులకు వార్త లంపుము. రాజా ! నీవు ప్రాణసమానరామ
వనవాసదుఃఖమ్మున మునిశాపానుసారమ్ముగా నచిరకాలమ్మున స్వర్లోక మొందె
దవు. పదంపడి రామచంద్రుఁ డొందెడి సామ్రాజ్యోత్సవంబుఁ గౌసల్య కాంచెడిని
నీవు దివి దేవయానమ్మువనుండి చూచి యానందించెదవు. రాజోత్తమా ! విధి

లిఖితఫలరేఖఁ దుడిచికొనుట కెవ్వరును సమర్థులు గారు సుమా! శుభాశుభఫలం
బనుభవింపక తప్ప దని చెప్పిన గురునివాక్యమ్ములు విని దశరథుండును. 196

చం. పనిఁగొని దూతలం బనిచెఁ బార్థివులం బిలువంగ, మంత్రులం
బనిచెఁ దదాభిషేచనికవస్తువుల న్సమకూర్ప రాజులు
న్మునులును వచ్చి రంతఁ బురము న్కటు లెల్లరు వేడ్కమీఱఁ గే
తనతతిఁ దోరణావళినతంద్రమతుల్ గయిసేసి రొప్పుగాన్. 197

వ. అంత వసిష్ఠుండు మంత్రివరుం జూచి యోసుమంత్రా! రేపటియుదయమున మధ్య
ద్వారమ్మునందు దివ్యాలంకారభూషిత లగు నెనమండ్రు కన్యకలును, బదియా
ఱేనుంగులు నొక చతుర్దంతదంతియు, నానాతీర్థోదకపూర్ణకుంభంబులును, వ్యాఘ్ర
చర్మత్రయమ్మును, శ్వేతచ్ఛత్రచామరదివ్యాభరణవస్త్రమాల్యాదులును, గుశపాణి
సర్వకర్మకుశలధరణిదేవులును, నటనర్తకగాయకవాంశికవైణికమార్దంగికవారయువ
తీజనంబులును, బహిర్ద్వారమ్మున హస్త్యశ్వరథపాదాతసంకులంబగు సర్వసైన్యం
బును నుండునటు లొనర్పుము. సర్వదేవాగారంబులఁ బూజ లొనర్పం జేయు మని
నియోగించి యాగురుండు రథ మెక్కి రామగృహంబుఁ జేరి తత్పూజితుండై
రామునితో నిట్లనియె. 198

ఉ. శ్రీరఘురామచంద్ర! యభిషేక మొనర్పఁ దలంచె రాజు, నీ
గారడవిం జరింపఁ జనఁగా నొనరించును గైక, యైనన్
భూరమణాజ్ఞఁ గైకొనుము భూసుతతో నుపవాస మొంది యీ
ధారుణిఁ బన్నిలింపు మిటు దాంతుఁడవై నియమమ్ముఁ జెందుమా. 199

తే. అడవికిం జని పదునాలు గబ్దములును, నట వసించియు దశముఖాద్యసురవరులఁ
జంపి వచ్చినయప్పుడు శాశ్వతముగఁ, బుడమి నేలెదు సీతతో భూపతనయ!

తే. అని వసిష్ఠుఁడు దశరథుఁ గనఁగఁ జనియె, భావియంతయు గురుఁ డటుపల్కియున్న
రామలక్ష్మణజనను లారాముసందు, స్నేహమున దేవపూజలు జేసి రపుడు. 201

## మంథర కైకకు దుర్బోధము సేయుట

ఉ. అంతటఁ గైకకు న్వరపుఁ దైతగు మంథర మేడనుండి యే
కాంతమునం బురీవిభవ మారసి నేఁడిది యేమొకో? పురం
బంత నలంకరించి రని యచ్చట నొక్కపడంతిచేఁ గతం
బంత నెఱింగి కైకదరి కప్పుడె వేగమ చేరి యిట్లనెన్. 202

తే. రాజు రాముని నీక యువరాజుఁ జేయు, నెంచెనఁట యెల్లి యభిషేకమే యఁటమ్మ!
శ్రీకరంబుగఁ బురిని భూషించినారు, దీనిఁ దెల్పంగవచ్చితి దేవి! నీకు. 203

కం. అని చెప్పి యూరకుండిన, విని కైక మహాముదమ్ము వేగొని యంతన్
ఘనభూషణమ్ము మంథర, కనువుగఁ గానుకగ నొసంగి యభినందింపన్. 204

వ. ఇట్లు సంతసించి తనకుఁ గానుక నొసంగిన సంతసింపక కైకతో మంథర యిట్లనియె.

ఉ. ఇంతటి మూఢవృత్తి తగునే? దరిలేని విపత్పయోనిధిన్
గొంతుకబంటిగా మునిఁగి కూలముఁ జేరఁగ లేక యుండియున్
సంతస మందుచుంటివో? చాలును చాలును మూర్ఖురాల! నీ
కాంతుఁడు ప్రేమఁ జూచు నను గర్వమెకాక యెఱుంగ వన్యమున్. 206

చం. కరుణగలండు నాపయినిఁ గాంతుఁ డటంచును విఱ్ఱవీగె దా
కరుణ కనంబడెం దుదకుఁ గాంచితె? నీసవతాలిబిడ్డనే
ధర కధినాథుఁ జేయునఁట తథ్యపుఁబ్రేమము రాముతల్లియం
దిరవుగ నుంచెనో? నృపతి యెంచుము నీపయి నుంచెనో చెలీ! 207

ఉ. పూతమెఱుంగుచాయగతిఁ బుక్కిటిప్రేమపుమాటలాడినం
జేతమునందుఁ బుట్టిన విశేషపుఁ బ్రేమమటంచు నమ్మి యీ
రీతిగ మోసపోయితివి ఱేండ్లను నమ్మిన మోసమే కదా!
వాతెరఁ దేనె డెంద మది వాడికటారియె కాదె? ఱేండ్లకున్. 208

సీ. సీతాపతియె భూమినేత యైనను వాని, మాత యీపయి రాజమాత కాదె?
కౌసల్యకడ నీవు కడుభక్తితో నిల్చి, వరవుడచే చేయవలయుఁ గాదె?
భరతుండు రామునిపదముల మ్రొక్కుచు, దాస్యంబుఁ జేయుచుండవలయుఁ గాదె?
సౌందర్యమదముచే సఖ! యెఱుంగవొకింత, గాని యియ్యది దుఃఖకరము గాదె?
తే. కాన నెట్లైన రాముఁడు కాననేగు, నటులు భరతుఁడె రాజగునటులు చేసి
కొని సుఖింపుము లేకున్నఁ గోమరులఁ గొని, యడవిఁ జేరుము ప్రాణముల్లైనఁదక్క.

వ. అని యిట్లు సమయానుకూలవచనమ్ములతో నామంథర బోధించినంత, 210

చం. పలుకువెలందినిన్ సురలుఁ బ్రార్థన సేయఁగ నామె కైకకున్
గలసుగుణంబు మార్చి వికృతంబు బొడఁగూర్చిన మంథరోక్తమున్
ఫలద మటంచు నాముదిత నమ్మి తదర్థము నిర్వహింపఁగా
వలయునుపాయ మెట్టు లని భావమునం దలపోయుచుండఁగా. 211

వ. అంత మంథర కైకేయీపూర్వగుణంబు మాఱె నని తదింగితమ్ములచే గ్రహించి యీమె మతంబు దృఢతర మ్మొనరింప నెంచి ఓ ప్రాణసఖీ! యని కైకేయిని సంబోధించి యిట్లనియె. 212

సీ. ఇది యెట్టులగునని - యెంచెదో నీమది, నందుల కొకయుపా - యంబు గలదు
నీ నేలుఁ గోరెడు - నెచ్చెలి నోటచే, నాయుపాయము మున్నె - యరసియుంటి
మును రెండువరముల - భూపతి నీకిచ్చె, నవి దాచియుంచితి - వాతనికడఁ
బదునాలుఁగేడులు - వనవాసిగా రాముఁ, బంపఁ గోరుము సఖి! - వరము నొకట

తే. ఒకట భరతుఁడె రాజుగా - నుంటఁ గోరు, మటులు కోరిన నిచ్చితీ - రుట నిజంబె
యాడితప్పఁడు నీమాట - కడుగుదాటఁ, డవనినాథుఁడు నమ్మమో - యబ్జనయన!

కం. ఊరక యడిగిన నిచ్చునొ, కో? రాజటుగాదు నేఁడు - క్రోధగృహంబుం
జేరి విరూపతఁ బండుము, గారాబుపడంతి వగుటఁ - గని కోర్కు లిడుఁగా. 214

ఉ. భూషలు దీసి ధూసరపుఁ - బుట్టముఁ గట్టి యనాస్తృతావనీ
రోషముమీఱ నూరకయె - రోజుచు "నన్ను" రటంచుఁ గోపనా
వేషము రాజువచ్చుతఱి - వేసి పరుండుము రాజు కామసం
తోషముతోడ వచ్చి కని - దుఃఖముఁ జెందుచు నిన్నుఁ జేరెడిన్. 215

సీ. అంబరమ్ములు భూష - ణంబు లిచ్చెద నన్న, మాటాడఁబోకుమీ - మఱచియైన
రత్నముల్ బంగారు - రాసు లిచ్చెద నన్న, మాటాడఁబోకుమీ - మఱచియైన
ధనధాన్యసంపదల్ - ధారవోసెద నన్న, మాటాడఁబోకుమీ - మఱచియైన
మరులొంది నిన్మఱి - మఱిబ్రతిమాలిన, మాటాడఁబోకుమీ - మఱచియైన

తే. మరులు గొన్నప్పుడే లొంగు - మగఁడు గాని, వానివైరాగ్యదశలోన - వశ్యుఁడగునె
యట్లు లొంగియు నీయిష్ట - మడుగుమన్న, నపుడు శపథంబుచేఁ గోర్కె - లడుగు మబల!

కం. అని మంథర బోధించిన, విని యట్లె పరుండెఁ గైక - విభుగేహములం
దున మంథరఁ బోలెడి దు,ర్వనితలు జేరంగఁ జేటు - వాటిలు గిరిజా! 217

గీ. రాఘవునియెడ నిరతాను - రాగభరిత, యయ్యు నాకైక దేవమా - యావిమోహి
తాత్మయై మంథరావచ - నానుసార, మపుడె శయనించెఁ గ్రోధవి - హ్వలత మీఱ.

ఉ. అంతట నాజి క్రోధగృహ - మం దిలఁ బండిన కైకఁ జూచి పె
న్వంతఁ గలంగి ఖిన్నుఁడయి - నాఁటిశరీరము నంటి యిట్లనుం

గాంత ! యిదేమి ? నీమృదులశరీరము గందఁ గఠోరభూమి న
త్యంతము దుఃఖకోపవశవై పడియుండఁగ నేల చెప్పుమా. 213

సీ. అంచనుస్థాదిపా । న్నమరి యుండఁగ నిట్లు, భూమిపైఁ బవళింపఁ । బోలు నొక్కొ
రుజ గల్గెనా ? నీకు । గజమందగామినీ !, వైద్యులఁ బిల్పింతు । బాగుసేయఁ
గలఘాతభూషణ । కొ శేయరత్నముల్, వలయునా ? నీకు నో । జలజనేత్ర !
ని న్నెవ్వ రేని నిందించి రే ? చెప్పు పిల్పింతు నవ్వాని శిక్షింతు నిపుడె
తే. నీదుకోరికఁ దెల్పుమా । నీదుమాట, కడుగుదాటితినా ? యెవ్వరైననేని
యేమికోరెదొ కోరుమా । యిత్తునిపుడె, యుర్విఁ బవళింప నినుఁజూచి యోర్వఁగలనె

## కైకవరములఁ గోరుట

చం. అన విని లేచి కైక నృపు । నట్టె కనుంగొని "యుస్స"టంచు ని
ట్లను నృప ! యాడితప్పని ప్రశస్తుఁడవేని వచింతుఁ గోర్కె మం
తనమునఁ బల్కువాక్యమును । దప్పిన సాకిరు లుండిరే ? యిట
న్మను శపథంబుఁ జేయు మిఁక । భూపతి ! పిమ్మట నేను కోరెదన్. 221

చం. అన విని యాజి యిట్లనెఁ గటా ! నను నమ్మవె ? యాడితప్పు టీ
యినకులమందుఁ గల్గునొకొ ! । యిప్పుడు నాపయి నీవు సంశయం
బునుగొన నాయమే ? హృదయమోహిని ! కోరినఁ బ్రాణమైన నీ
కనువుగ నిచ్చువాఁడ నటులైన నిదే శపథమ్ముఁ జేసెదన్. 222

ఉ. ఏమహనీయుఁ బ్రాణముగ । నెంచెదనో ? నిరతంబు నెవ్వఁ డు
ద్దామయశస్వియై యతిముదం బొడఁగూర్చునొ నాకు నెవ్వని
జామును జూడకుండినను । జా వొడఁగూడునొ నాకు నట్టి శ్రీ
రామునితోడ సుమ్మిఁక వరమ్ములఁ గోరుము నిశ్చయాత్మవై. 223

చం. అన విని కైక యిట్లనె సురాసురసంగరమందు నీవు నె
మ్మనమున సంతసంబుఁ గొని । మానుగ రెండువరంబు లీయ నా
కనువగునాఁడు కొందునని । న్యాసముగా నిడియుంటి నీకడ
న్మనమున సత్య మెంచి యిడుమా యిపు డావరయుగ్మ మక్కిలిన్. 224

తే. ప్రాణనాథ ! చతుర్దశాబ్దములు రాముఁ, డడవినుండుట యస్మదీయాత్మజునకుఁ
బట్టముం గట్టుటయుఁగాఁగ । వరయుగంబు, నిమ్ము సత్యంబు నెద నమ్మితేని యిపుడు.

చం. అన విని యాజి భూమిపయి నప్పుడె కూలి గతాసుకల్పుఁడై
వనటను గుంది నాకు నిది స్వప్నమొ? భ్రాంతియొ? యేమిమాయయో?
తనయుఁ జతుర్దశాబ్దములు దండక కంపుటయా? తలంప నీ
తనువునఁ బ్రాణము ల్జనవు దైవమ! యంచు నితాంతదీనుఁడై. 226

మ. స్ఖలదంగావళితోఁ జలన్నయనముతో స్రస్తోత్తరీయమ్ముతో
గళదంబూత్కరలోచనద్వయముతో గాద్గద్యకంఠమ్ముతోఁ
బలుసారుల్ రఘురామ! రామ! యని సంభాషించుచుం దుఃఖియై
యిలపై మూర్ఛిలి లేచుచుం దశరథోర్వీనాథుఁ డేడ్చెం గడున్. 227

వ. ఇట్లు పలువిధమ్ముల దుఃఖించి కైకయెడఁ గోపించి యనునయించి బ్రతిమాలి మతిమాలి దీనునివిధమ్మున నెన్నియోయుపాయమ్ముల నుపయోగించెఁ గాని యూషరక్షేత్రబీజన్యాయమ్మై యుపాయమ్ములు ఫలింపమిఁ గుంది దుఃఖజాగరణమ్మున నుండునంత నరుణోదయకాలమ్మునందు. 228

ఉ. అంత సుమంత్రుఁ డచ్చటికి నాగతుఁడై విభుఁ గాంచి కైక! భూ
కాంతుఁడు వంతఁ జెందుటకుఁ గారణ మేమనఁ గైకయుం ధరా
కాంతుఁడు రాముఁ జూచుటకుఁగా నిటు లుండెను వేగ రామునిం
జెంతకుఁ దెమ్మనె న్నప్పుఁడు చెప్పినఁ బోవుదు రాముఁ దెచ్చెదన్. 229

వ. అని మంత్రి పల్కినంత 230

తే. రామచంద్రునిఁ దెమ్ము బిరాన ననుచు, దశరథుఁడు చెప్ప మంత్రి సత్వరము వోయి
రామచంద్రునిఁ దెచ్చిన రాముఁ డపుడు, జనకుదుఃఖమ్ము గని చాల సంతపించి.

తే. కైకఁ గన్గొని యమ్మ! భూకాంతుఁ డిటులు, వనటఁ జెందంగ నేలొకో? పలుకు మన్న
నామె వచియించెఁ దనవరాభ్యర్థనంబుఁ, బిదప రాముఁడు పల్కె సమ్మదముమీఱ.

ఉ. అయ్య! విచార మేల కొనె దాడినమాటలు దప్పఁబోకు మే
నయ్యటవీచరుం డగుదు నన్నుఁ గనుంగవ నీవు గ్రమ్మ రా
మయ్య! ననుం ద్యజించి చన నర్హమె? నే నిఁకఁ బ్రాణయుక్తమై
యయ్యయొ! యెట్లు నిల్తుఁ గొడుకా! యని యాజి విచార మొందినన్. 233

శా. శ్రీరాముం డటు బల్కుటం గలఁగుచుం దండ్రిం జూచి యోయయ్య! నే
నీరేడేఁడు లరణ్యవాసి నయి యిం దేతెంచి త్వత్పాద్వయీ

నీరేజమ్ముల మ్రొక్కి భక్తిఁగొని ని న్సేవింతు నశ్రాంతమున్
ధీరత్వమ్మున నుండుమా యిఁక వృథా దీనత్వము న్వీడుమా. 234

కం. జననిని సీతను గని యీ, వనగమనము నుడివి వంతఁ బడకుండుఁడటం
చనునయ మొందించియు నే, జనకా! వని కేగువాఁడఁ జయ్యన నిపుడే. 235

కం. అని రాముఁడు వలఁగొని యా, జననికి జనకునకు మ్రొక్కి చయ్యన నపుడే
తనతల్లికడకుఁ దాఁ జని, వినతుండై మ్రొక్కి చెప్పె విభునాజ్ఞ నొగిన్. 236

ఉ. తల్లి విచారముం గొనిన ధైర్యముఁ జెప్పి నమస్కరించుచున్
సల్లలితంపుభక్తిఁ బలుసార్లు ప్రదక్షిణ మాచరించి సం
ఫల్లలితాత్మగేహమున భ్రాతయు సీతయుఁ గోర ప్రేమ రం
జిల్లఁగ వారితో వనముఁ జేరుట కియ్యకొనె న్ముదమ్మునన్. 237

చం. అనుమతి నొంది రాముఁ డఖిలాత్మధనమ్ముల భక్తి సత్తపో
ధనులగు విప్రవర్యులకు దానము లిచ్చి తదీయమైన దీ
వనఁ గొని సాగ్నికుం డగుచు భ్రాతను సీతను వెంటఁగొంచుఁ ద
జ్జనకునియాజ్ఞచేతఁ బదచారుఁడుగాఁ జనుచుండె నంతటన్. 238

ఉ. పౌరులు చూచి యేల యిటు పచ్చరుఁ డయ్యెను రాముఁ డక్కటా!
కారణ మేమొ? యంచు నధికవ్యథఁ జెందఁగ వామదేవుఁ డా
నారదవార్త రాముఁడు జనార్దనుఁ డాదశకంఠుఁ జంపఁగాఁ
జేరుచునుండెఁ గాన కని చెప్పఁగ రంజిలెఁ బౌరవర్గమున్. 239

చం. జనకునిఁ జేరి వందనము సల్పి రఘూత్తముఁ డంత భక్తిఁ గై
కను గని తల్లిగో! యిదిగో కానల కేగెద నాజ్ఞ నిమ్మనన్
గనుకని నామె ముప్వురకు నారల నిచ్చిన రామలక్ష్మణుల్
కొని ధరియింప భూతనయ కోక ధరింపఁగ లేకయుండఁగా. 240

తే. ఆలిఁ గని రాముఁ డిది యెన్నఁడైన నకట!
స్వయముగాఁ గట్ట నెఱుఁగునే? వస్త్రములను
నిపుడు గట్టంగ నేరక యిటులు చూచు
చున్న దని తానె కట్టుచునున్న తఱిని. 241

వ. అంతఁ గైక సీతకు నారచీర నిచ్చుటయు సీతకు రాముఁడు నారచీరం గట్టుటయుఁ జూచి సర్వజ్ఞుం డైనను వసిష్ఠుండు తనమనంబున దుఃఖక్రోధంబులు బెనఁగొన రోషకషాయితలోచనుండై కైకం జూచి యిట్లనియె. 242

ఉ. రాముఁ డరణ్యముం జన ధరాపరిపాలనకృత్యమెల్ల నీ
భూమిజ సేయు దాని కధరము వ్యాస నడ్డము వచ్చి రేని మ
ద్భూమతపోగ్ని కింధనసమూహముగా నొనరింతు వారల
న్నా మహిమంబుఁ జూడుఁ డనిన న్భయ మొందెను కైక యంతటన్. 243

తే. రాజు మంత్రిని గని సుమంత్రా ! రథమ్ము, పై వసింపఁగఁ జేసియే వనముఁ జేరు నటులు పేరినిఁగొని యేగుమనిన నతఁడు,నాయిత మొనర్చె నంత నారయరదమప్పుడు.

## సీతారామలక్ష్మణు లడవి కరుగుట

వ. సీతారామలక్ష్మణు లిట్లు నారలం గట్టి వసిష్ఠదశరథాదిపూజ్యవర్గంబునకును గైకకును గౌసల్యాసుమిత్రలకును గ్రమమ్మున పాదాభివందన మాచరించి దుఃఖవివశులగు వారి యాశిషమ్ములఁ గైకొని స్యందనారూఢులై రాజమార్గమ్మునఁ జనుచు దైవకల్పితమ్ములగు శుభశకునమ్ములఁ గని యానందించుచుఁ బయనించి నాఁటికి తమసానదీతీరముఁ జేరియుండి రోదాక్షాయణీ ! రాముని కష్టాదశవర్షమ్మున మాఘశుక్లపంచమిని వనవాసమ్మునకు మొదటిదిన మయ్యె నాతమసాతీరమ్మున నొక్కరాత్రి నివసించి వారు మఱునాఁడు శృంగిబేరపురంబుఁ జేరిరి. పిదప గుహునిచే బహూకృతులై గుహానీతవటక్షీరమ్ముల రామలక్ష్మణులు జడలు రచించికొనిరి, యారాత్రి నటఁ గడిపి ప్రభాతమ్మున గుహపరిజనానీతంబగు పోతంబున సీతారామలక్ష్మణు లెక్కి రథమ్ముతో సుమంత్రునిఁ బొమ్మని యయోధ్య కనిపి గంగానదిని దాటుచుండ మధ్యభాగమ్మున కొడ చనునప్పుడు సీతాదేవి గంగానదినిఁ జూచి సభక్తినమస్కారమ్ము లాచరించి యిట్లనియె. 245

## సీత గంగను నుతించుట

మ. హరిపాదమ్మునఁ బుట్టి దేవనగరప్రాంతమ్మునం బాఱి త
త్సురలోకమ్మున నంకి యాశునిజటాజూటమ్ములోఁ జేరి యీ
ధరకు న్వచ్చిన ని న్భజింప నఘవిధ్వంసం బగుం దల్లి ! నీ
పరమంబైన మహత్వ మిట్లు ధరలో భాసిల్లు భాగీరథీ ! 246

మ. ముల్లోకమ్ములవారి పాపతతులం బోఁకార్పఁగాఁ దల్లి! యీ
ముల్లోకమ్ముల నుండు వీ వహహా! సంపూర్ణాకృతి న్నైకసం
పల్లాభమ్ములు గల్గు నీమజలసంపర్కంబు ప్రాపించినం
దల్లీ! నీస్మరణమ్మె మోక్షకరమౌఁ దథ్యంబు భాగీరథీ! 247

మ. భవదీయాతిపవిత్రవారి నెపుడుం బానాదులం బొందు మా
నవులే ధన్యులు ముక్తు లౌదు రిఁక జన్మంబుం గొనంబో రహా!
భవముం బాసి విముక్తినొందుటకు నెవ్వాఁ డాత్మలో నెంచు వాఁ
డవని న్నిన్భజియింప ముక్తుఁ డగుఁ గాదా? తల్లి! భాగీరథీ! 248

మ. జననీ! యేయెడ నైన మానవుఁ డిలన్ సర్వంసహాభర్తయై
జననం బందుటకంటెఁ బుల్గయి భవత్సాన్నిధ్యముం జెందు చో
ఘనమౌ మోక్షముఁ జెందవచ్చు నఘసంఘాతమ్ము నాశంబు నొం
దును బుల్గైనను నేమి? నీమహిమ నిస్తుల్యంబు భాగీరథీ! 249

మ. భవసాహస్రపరంపరాగతమహాపాపాటవీకోటికిం
దవరూపంబఁట నీదుసంస్మరణమే తథ్యం బగుం దల్లిరో!
భవదీయాంబుకణంబుఁ గ్రోల నది దుర్వారాతిఘోరాజవం
జవరోగార్తున కౌషధం బఁట బళీ! సత్యంబె భాగీరథీ! 250

మ. ధరలో నెన్నినదుల్ మఱెన్నిపురతీర్థంబు ల్మఱెన్నో మహే
శ్వరరూపమ్ములు గల్గియున్న బళిరే! వారాణసి న్మిన్నఁగాఁ
గరుణాసాగరు విశ్వనాథుని జగత్కల్యాణదుం డందు రా
పురికిం జెంగట నీవు మంటగద యీ పుణ్యంబు భాగీరథీ! 251

మ. భవదీయోభయతీరభూములను నే ప్రాణ్యాళియైనం గుమా
నవుఁడైన న్మరణించిన న్మఱియు నవ్యస్థానికప్రేతమా
నవదేహాస్థియు నీజలమ్మునఁ బడ న్నారాయణస్థానముల్
రవివంశోద్భవసాగరు ల్బడసెను జేరన్వచ్చు భాగీరథీ! 252

మ నినువర్ణింపఁగ నాతరం బగునొకో? నీకేజభూముఖ్యులు
న్మునులుం జెప్పఁగలే రనంగ నిఁక మాకబ్బోఁ బెన్నఁగా శక్తులే?
ఘనకారుణ్యముతోడ మ మ్మిఁక జగత్కల్యాణి! రక్షింపు మో
జననీ! నీ కిదె చేయుచుంటిని నమస్కారమ్ము భాగీరథీ! 253

కం. నాపతి వనవాసవ్రత, మాపద లొండకయె గడచి యానందముతో
మాపురి కేగెడునప్పుడు, నీపాదమ్ములకు మ్రొక్కి నినుఁ బూజింతుర్. 254

తే. తిరిగివచ్చినయప్పు డోదేవి ! నీకు, మధురమాంసంబు మద్యకుంభములు నిచ్చి
పలురకంబుల బలులను భక్తి నొసఁగి, పూజన మొనర్చి పోదుము పురికిఁ దల్లి!

వ. అని సీత మ్రొక్కిన రామలక్ష్మణులుం గంగకు వందనం బిడి యావలియొడ్డున డిగి గుహుని విడిచి యట నొక రేయి వసించి త్రివేణీసంగమం బగుప్రయాగకుఁ జని యట భరద్వాజమునికి వందనమ్ము లిడి యాయనచేఁ బూజితులై యటనుండి బయల్వెడలి యమున దాటి వాల్మీక్యాశ్రమమ్ముఁ జేరి వానిచే నర్చితులై పోయి చిత్రకూటమ్ముఁ జేరి స్తంభదారుశాఖాపర్ణలతాదులచే శయనాసనపాకదేవాయతనంబులు వేర్వేఱ లక్ష్మణుండు నిర్మింప పవిత్రమృగమాంసములచే వాస్తుబలివిధానం బాచరించి శాలాప్రవిష్టులై స్వగృహమందుంబలె నిచ్చలు నచ్చటి మునులకు నతిథులకుఁ గందమూలఫలమాంసాదుల నాతిథ్య మిచ్చి పూజించుచు సుఖం బుండి రంత.

ఉ. రాముఁ డొకప్పు డచ్చట ధరాతనయాంకముపైనఁ బండ సు
త్రామజకాకదానవుఁడు దారుణతుండనఖాళిచేత నా
భూమిజకాలియంగుటము బుట్టిగ నెఱ్ఱగనుంటఁ జూచి వాఁ
డామిషకాంక్షఁ జీల్చిన సురారినిఁ దోలదు భర్తనిద్రకై. 257

ఉ. అంతట మేలుకాంచి జనకాత్మజవ్రేలిని రక్తతుండమై
స్వాంతభయమ్ముచేఁ జనెడు వాయసముం గని రాముఁ డైషికం
బంతట దానిపై విడువ నవ్వనువెంటనె యస్త్ర మేగ లో
కాంతరవాసు లెవ్వరుఁ దదస్త్రభయమ్మును దీర్పలేమనిర్. 258

ఉ. కాకము నంతటం దిరిగెఁ గాని ఫలం బిసుమంత లేక చీ
కాకున నారదోక్తిఁ గొని క్రమ్మఱ రామునిఁ జేరి వేఁడినం
గాకము కన్నొకండు బలి గాఁగ నిషీకముచేతఁ గొట్ట నా
కాకము నేకనేత్ర మయి ఖస్థలి కేగె ముదమ్ముఁ జెందుచున్. 259

తే. దాశరథి యంత బహువినోదములచేతఁ, గాలయాపన మొనరించు చాలి ననుజుఁ
బురవియోగవిచారమ్ముఁ బొందకుండఁ, గుతుక మొనరించు నాచిత్రకూటమందు.

వ. అని చెప్పిన పరమేశ్వరు వచనంబులు విని దాక్షాయణి తారకరామచంద్రకథాకర్ణనోత్సాహ యగుటఁ బరమానందకందళితహృదయారవిందయై యుండె నంత.

మాలిని. గిరివరతనుజాతా! కేళికాలోలచేతా!
కరధృతగిరిచాపా! ఖండితస్మారరూపా!
పురరిపువనకేళీ! పూతఖండేందుమౌళీ!
స్థిరతరశుభభావా! శ్రీభవానీశదేవా! 262

ఇది శ్రీ గుండు లక్ష్మణశాస్త్రి విరచితం బైన
ఆంధ్రానందరామాయణమ్మునందు
దృతీయాశ్వాసము
సమాప్తము.



శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# ఆంధ్రానందరామాయణము

## సారకాండము

### చతుర్థాశ్వాసము



మత్తారకమంత్రచింతనరతా! చిద్రూప! భక్తావళీ
క్షేమప్రాపణశక్తపాదయుగళా! శ్వేతాంగరుగ్భాస్వరా!
వామాంగీకృతశైలరాజతనయా! వందారుబృందారకా!
సోమాలంకృతమౌళి! యోగిజనసంస్తుత్యా! భవానీశ్వరా! 1

వ. అవధరింపుము. 2

చ. అనువుగఁ బ్రాణనాథుఁ గని యంబిక గాఢతరానురాగయై
ఘనతరమైన రాఘవుని గాథ పదంపడి యెట్లు చెల్లెనో
విన నభిలాష మయ్యెడి సవిస్తరముగ వినిపింపుమా యనన్
వినుమని శంభుఁ డిట్లనె నవీనసుధామధురోక్తు లొప్పఁగా. 3

వ. ఓపార్వతీ! విను మట్లు సీతారామలక్ష్మణులు చిత్రకూటమున నివసించి మునివ్రతపరాయణులై సాధుజనమునిబృందములతోఁ బుణ్యకథాగోష్ఠిఁ గాలముఁ గడపుచుండిరి. పదంపడి, 4

## దశరథుఁడు మరణించుట

కం. అంతట నక్కడ మంత్రియు, నంతర్దుఃఖమునఁ బురికి నరిగి ధరాధీ
శాంతికముఁ జేరి తద్వృత్తాంతము వచియించె గద్గదస్వనుఁ డగుచున్. 5

ఉ. మంతిరి చెప్పఁగాఁ దనకుమారుచరిత్రము నాలకించి భూ
కాంతుఁడు తద్వియోగమున గాఢవిచారముఁ జెంది రామ! ప్రా

శాంతముఁ జెందు నాకు భవదాననపద్మముఁ జూచు భాగ్య మా
వంతయు లేకపోయెఁ దనయా! వినయాత్తనయోధ్య! రాఘవా! 6

తే. ఎచటనుంటివో రామ! యఘహీనధామ!, కొడుకు కేల్పట్టి యసువులు విడుచుభాగ్య
మకట! నాకిఁక లేదు రామా! కుమార!, రామ! యనుచును విడిచెను ప్రాణములను.

చ. మృతుఁడగు భర్తఁ గాంచి పుడమిం బడి మూర్ఛిలి కోసలాధిరా
ట్సుతయు సుమిత్రయున్ బహుళశోకముఁ జెంద వసిష్ఠమౌని యా
కత విని వచ్చి భూరమణకాయము నప్పుడె తైలపాత్రసం
గత మొనరింపఁ జేసి ద్రుతగాముల దూతలఁ బిల్చి యిట్లనెన్. 8

ఉ. కేకయదేశ మేగి నృపగేహమున న్నివసించుచున్న యా
కైకకుమారు లిద్దఱను గాంచి గురుండు నయోధ్యలోన మీ
రాకను గోరియుండె నని రమ్యముగా వచియించి నేఁటిదా
ఏకథయేనియుం దెలుపకే గొనిరం డిఁక పోయి రండనన్. 9

చ. గురువరు నాజ్ఞ దూతలును గొబ్బునఁ గేకయదేశ మేగి యా
భరతునిఁ దత్సహోదరుని బ్రాంజలులై గురునాజ్ఞఁ దెల్పి త
త్తరమున వెంటఁగొంచుఁ బ్రమదమ్ము రహింప నయోధ్యఁ జేర్ప నా
భరతుఁడు మాతృకృత్యము నృపాలమృతిన్ విని దుఃఖితాత్ముఁడై. 10

ఉ. హా! యను నేడ్చి యేడ్చి జనకా! యను మమ్ముల వీడ నాయహా
నా! యను నేమిపాప మహహా! యను భాగ్యవిశేష మింక లే
దా! యను రామచంద్రునకు దాయను జేసితె కైక! మూర్ఖురా
లా! యను ప్రాణముల్ విడుతునా యను ఛీ! హతదైవమా యనున్. 11

చ. అని పలవించుచున్ భరతుఁ డజ్జననిం గనుఁ దిట్టి తిట్టి చెం
తనె కనవచ్చు మంథర నతంద్రత భీషణరోషయుక్తుఁడై
చను మొటకేని నీవు నృప సద్మములో నిఁక నెన్నఁడైన నా
కనులకుఁ గానుపించినను గంతముఁ గోయుదు పొమ్ము పొమ్మనెన్. 12

గీ. అంత భరతుండు జనకదేహమున కగ్ని, సంస్కృతి యొనర్చి పైతృక శ్రద్ధతోడఁ
బారలౌకికవిధిఁ దీర్చి పరఁగియుండ, నతనిఁ గని పౌరులెల్ల నిట్లనిరి భక్తి. 13

తే. రాజు మరణించె రాముఁ డరణ్యమునకుఁ, జనెను నీవిఁక రాజ్యపాలన మొనర్పు
మనఁగ నొల్లక మంత్రిపౌరాళితోడ, నన్నఁ గొనివత్తు నంచుఁ బ్రయాణమైన.

## భరతుఁ డరణ్యమున కరుగుట

చ. భరతునిఁ జూచి తల్లులు నరపత్యము గల్గినవార లౌటచే
మరణము భర్తతోఁ గానమి మానుగ రామునిఁ జూచు కోర్కితో
నరదము నెక్కి తామును బరయుల్వెడలంగను వారితోడ నా
భరతుఁడు వోయి తద్గుహసపర్యలఁ గైకొని గంగఁ దాటియున్. 15

ఉ. రాజితసత్తపోవిభవరాజ్యధురీణుఁడు పుణ్యుఁడౌ భర
ద్వాజునియాశ్రమమ్ముఁ బరివారముతోఁ జని రాఘవుండు నీ
రేజభవాభుఁడౌ మునివరేణ్యునిఁ జూచి నమస్కరింప న
వ్యాజిసుతుం దదాశ్రమమునందు వసింపఁగఁ జేసి మౌనియున్. 16

వ. సపరివారుండైన భరతున కాతిథ్య మొసంగ నెంచి తనతపోమహిమమ్మునఁ బర్వతో న్నతంబులగు నన్నరాశులును బహువిధపరిపక్వశాకాల్పగిరులును లేహ్యచోష్య పానీయహ్రదమ్ములును హైయంగవీనస్రవంతులును దధితటాకమ్ములును క్షీర నిపానమ్ములును బహువిధపరిమళమిళితమాంసమైరేయకటాహమ్ములును గజఖాద నార్థానీతపుండ్రేక్షుపూలకజాలమ్ములును తురంగమఖాదనసాధనపరిపక్వకుళుత్థరాశు లును రాజభోజనార్హకనకపాత్రసహస్రధారిణులగు పరిచారికలును నమరించి యెవ్వ రెవ్వ రేమేమి కావలయునని మనమ్మున నూహింతురో యాయా సకలపదార్థముల భోజనభాజనమ్ముల నయాచితమ్ముగాఁ గల్పించె నంత నెల్లరు వలయురుచులతో భోజ్యమ్ము లారగించి చాలుఁ జాలు నను నులివు లులియ నానందించుచు తృప్తులై యున్నంత భరద్వాజుం డానందించి యందఱ బహూకరించి చందనతాంబూలాది సత్కారమ్ము లాచరించి యొకపేరోలగమ్ముఁ గల్పించి యందు భరతుని సుఖాస నాసీనుం జేసి వారాంగనానృత్యమ్ములును వీణాగానమ్ములును బారిహాసిక వాంశిక వైతాళిక పౌరాణిక కవీశబృందమ్ములచే ననేకవిద్యావినోదమ్ము లొనరింపఁజేసిన భరతుం డానందించి యా రేయి నటఁ గడపి మఱునాఁడు భరద్వాజోపదిష్టమార్గాను యాయియై పోయి చిత్రకూటంబుఁ జేరె మఱియును, 17

## భరతుఁడు రామునిఁ బ్రార్థించుట

చ. భరతుఁడు పర్ణశాలకడ భార్యను లక్ష్మణుఁగూడి పెద్ద జటా
భరమును దాల్చి మౌనివలె భాసిలు రామునిఁ జూచి తత్పదాం

బురుహాయుగమ్ముపై శిరము మోపి నిరంతరబాష్పబిందువుల్
దొరలఁగ భూమిపైఁ బడియె దుఃఖభరాతినిరుద్ధకంఠుఁడై. 18

తే. అటులు దుఃఖించుభరతుని నక్కుఁ జేర్చి, రామచంద్రుఁడు నందఱి సేమమడుగ
నతఁడు నతికష్టమున లేచి యశ్రుజలముఁ, దుడిచికొని గద్గదోక్తుల నుడివె నిట్లు.

తే. అన్న! యేమందు నీవియోగార్తికతన, మనుజనాథుఁడు రామ! రామా! యటంచు
చిరము పలవించి పలవించి జీవితంబు, విడిచె మనభాగధేయముల్ గడచె నింక.

మ. అనినన్ రాముఁడు మ్రాన్పడెన్ ధరణికన్యారత్నముల్ లక్ష్మణుం
డును రోదించిరి, పిమ్మటన్ సకలబంధువ్రాతముల్ మంత్రులున్
మునులున్ బ్రేముడి నూఱడింప రఘురాముం డంతటన్ స్నాతుఁడై
జనకుం గూరిచి పారలౌకికవిధుల్ సాగించె శ్రద్ధాత్ముఁడై. 21

సీ. కృతకర్ము రాము నీక్షించి యాభరతుండు, కులగురుసహితుఁడై పలికె నిట్లు
రామ! నిన్నీడి నే రాజ్య మేలుట కంత, హీనధర్ముండనే? హీనబుద్ధి
నైక తప్పొనరింప నాకు శిక్షగ నీవు, రాజ్య మేలక యిట్లు రా హితంబె?
రామసోదరుఁడు దుష్కర్ముఁడన్నఁ గళంక, మరయఁగా నీకుఁ గాదా మహాత్మ!

తే. తావకీనపదారవిందములతోడ, నాదు తప్పేమియును లేమ నరవరేణ్య!
రమ్మయోధ్యకు, ధర నేలుకొమ్ము రామ!, పెద్ద వీవుండ రాజుగాఁ బిన్నతగునె?

చ. అన విని రాముఁ డిట్లనియె నట్టులొనర్చుట తప్పు నాయనా!
జనకుని యాజ్ఞ సేయుట ప్రశస్తము, నన్ను నరణ్యవాసమున్
నిను భువనాధిపత్యమును నేర్పునఁ జేయ విధించెఁ గాన నో
యనుజ! తదాజ్ఞఁ దప్పుట నిజాన్వయధర్మముఁ దప్పుటే కదా! 23

తే. బ్రతికియుండఁగఁ దండ్రికిఁ బ్రతినఁ జేసి, యతఁడు మరణింప దానివ్యత్యయముచేయ
ధర్మ మెట్లగు? జనకసత్యవ్రతంబు, నెటులు తీఱుఁ? బితౄణంబు నెట్లు తీఱు?

ఉ. కావున వీలు గాదు ననుఁ గాననవాసమునుండి రమ్మనన్
నీవు ధరాధిపత్యమును నేర్పునఁ జేయుము, నేను గోనకుం
బోవుదుఁ దప్ప దీనియతి భూమి యడంగిన మిన్ను కూలినన్
నీ విఁక నాలసింపక వినీతమతిన్ జనుమయ్య! తమ్ముఁడా! 25

వ. ఇట్లు రాజ్యపాలనానాదరుండై వనవాసాదరుండై పలికిన రామచంద్రుని వాక్యమ్ములు విని, 26

తే. భరతుఁ డప్పుడు దర్భలఁ బఱచి నీవు, వచ్చునందాక యిచటనే పవ్వళింతు
ననుచుఁ బ్రాయోపవేశదీక్షను వసింపఁ, దలఁప రాముఁడు మిగులఁ దత్తఱమునొంది.

చ. గురువరుఁ జూచి యిట్లనియె గూఢముగాఁ బరమార్థబోధనం
బరుదుగఁ జేయుమా గురువరా! సుకుమారుఁడు ముగ్ధచిత్తుఁ డీ
భరతుఁడు నాయెడం గలుగు భక్తియె కాని యెఱుంగఁ డన్యముల్
ఖరనియమమ్ముతోఁ గుశలఁ గాయముఁ గందఁ బఱుండె నావుడున్. 28

చ. గురుఁ డటు నోయి యాభరతుఁ గూర్చి మృదూక్తి ననెం గుమార! శ్రీ
హరియె సుమా యితండు భవదగ్రజుఁడై జనియించె రాముఁడై
ధరణిభరంబు మాన్ప బహుదానవయుక్తిగ రావణాసురుం
బోరిఁగొన నేగుచుండె వనభూమికి లోకహితార్థ మిత్తఱిన్. 29

## భరతుఁడు రామపాదుకలు గొని చనుట

తే. అనఁగ రాముని శ్రీహరియని తలంచి, భరతుఁ డప్పుడె యాతని కెఱఁగి రామ!
పాలనముఁ జేయఁజాలు నీ పావ లిమ్ము, వాని సేవించుచుందు నీ వచ్చుదనుక.

తే. నేను నీవలె నారలనే ధరించి, జటిలత వహించి యూరిచెంగట వసించి
కందమూలమ్ములను దినుచుందు నీదు, రాకకై వేచియుందు నో రామచంద్ర!

మ. పదునాల్గేండ్లు గతించు నాదినమునం బ్రత్యూషమం దీవు నా
యెదుటన్ దర్శన మీయవేని యనలం బేఁ జొచ్చెదం జుమ్మి! యి
య్యది సత్యం బన నట్లె వత్తు నని సీతాధీశుఁడున్ జిత్తమం
దు దయం జెంది యొసంగెఁ బాదుకల సాధుస్వాంతుఁడై వానికిన్. 32

చ. భరతుఁడు రామపాదుకల భక్తి శిరమ్మునఁ దాల్చి నమ్రుఁడై
హరియగు రామచంద్రునకు నచ్చటిలోకులు మెచ్చునట్లు కిం
కరుగతిఁ దాఁ బ్రదక్షిణపు కర్జముఁ దీర్చి నమస్కరించి యో
సరసిజలోచనా! సెల వొసంగు మటంచును వేడెఁ బిమ్మటన్. 33

ఉ. కైకయు రామచంద్రుఁ గని కారుణికాగ్రణి! పాపురాల నే
నీ కపకారమున్ ఖలమనీష నొనర్చితిఁ దప్పుఁ జేసితిన్
లోకశరణ్య! నీవు వనిలో నివసింపఁ బురంబు దాటఁగా
నాకు వివేక మబ్బె రఘునందన! దైవికమాయ యేమియో! 34

ఉ. ఎంతవివేక మబ్బిన నిఁ కేల, గతోదకసేతుబంధమే
కాంతలు వేనవేలు పురిఁ గల్గఁగ నే నపకీర్తిఁ జెంద జ
న్మాంతరపాప మేమొ తెలియ న్వశమే యెపుడైన నీవు భూ
కాంతుఁడ వౌదు శాశ్వతము గాదె మదీయకళంక మీధరన్. 35

సీ. అనఁగ రాముఁడు కైకఁ గని తల్లిరో! నీదు, తప్పేమియును లేదు దైవతంత్ర
మిది నాకుఁ బ్రాపింప నిచ్చచే మంథరా, ప్రేరణం బొండయ్యెఁ గారణంబు
వాణిచే నీ శుభభావంబు మార్పించి, రమరులు దాన మోహంబుఁ గొంటి
వమ్మ! నీయందు నా కాగ్రహమే లేదు, పోయి రమ్మావు నీపుత్రుతోడఁ
తే. బదియునాల్గేఁడు లే వనవాస మొంది, తిరిగి పురిఁ జేరి తల్లులందఱకు నపుడు
వందనమ్ములు చేయుదు భక్తితోడ, నిపుడు వని కేగ ననుమతి నిందు పొందు.

తే. నాఁగ భరతుండు సకలసైన్యములు గొల్వ, నిజపురికి నేగి యచ్చట నిఖిలజనుల
విడిచి పావలఁ గైకొని వేగ 'నంది', యనెడు గ్రామమ్మునం దుండె ననుజుతోడ.

వ. ఇట్లు భరతుండు రామభక్తుండై కందమూలఫలాశనుండై జటావల్కలధారియై రామపాదుకల నొకసింహాసనమ్మునం దిడి ఛత్రచామరాదిరాజోపచారమ్ములతోఁ ద్రిసంధ్యమ్ముఁ బూజించుచు మంత్రిజనప్రోక్తరాజకార్యముల నెల్ల స్వయముగాఁ బాదుకలచెంతఁ బ్రత్యహంబు నివేదించుచు రామవనవాసవాసరమ్ములు గణించుచుఁ దదాగమనమ్ముఁ గోరుచు నియతచిత్తుండై యుండె నంత నక్కడ. 38

ఉ. రాముఁడు చిత్రకూటగిరిరాజితగైరికధాతుసంభృతిన్
భూమితనూజకున్ నుదుటఁ బొట్టును గండములందుఁ బత్రముల్
ప్రేముడిఁ దీర్చుచున్ బరిమళించు సుమాళి నలంకరించుచున్
భామతరప్రమోదమునఁ బొల్చెను తమ్ముఁడు సేవఁ జేయఁగన్. 39

తే. ఇటులు సీతనుగూడి తా నెల్లసుఖము, లొందుచుండఁగఁ బురజను లొక్కరొకరు
తన్నుఁ జూడఁగవచ్చుసందడికి నోడి, చిత్రకూటంబు విడనాడి చేరె వనము.

ఉ. మిత్రకులోద్భవుండును నమేయగుణుండగు రాముఁ డిట్లు సౌ
మిత్రియు సీత తన్ననుగమింపఁగ నగ్గిరి నుంట మాని యా
యత్రిమునీశునాశ్రమగృహమ్మున కేగి వినమ్రదేహుఁడై
గోత్రము పేరుఁ జెప్పి మునికుంజరుఁ జూచి నమస్కరించినన్. 41

ఉ. పూనియు రామచంద్రుని స✽మంచితపూజల గౌరవించి యా
జానకి నాత్మజాయఁ గన ✽ సన్నిధి కంప గుహాగృహంబులోఁ
దా ననసూయఁ గాంచుచు ము✽దమ్మున మ్రొక్కిడి మ్రోల నిల్చు నా
జానకి నంకమం దిడి ప్ర✽సన్నత నమ్మునిపత్ని యిట్లనెన్. 42

తే. అమ్మ! సీతమ్మ! కుశలమా! ✽ యతివమిన్న, వమ్మ! నినుఁ జూచి లోకమ్ము ✽ నందుఁ గొమ్మ
లందఱుఁ బతివ్రతాత్వమ్ము ✽ నభ్యసింప, వలయుఁగాదొకో? భువి సతీ✽తిలకమీవె.

తే. కలుములెల్లను గలిగిన ✽ కాంతుఁడైన, నడుఁగులకు మడుగు లిడుచు న✽త్యధికమైన
సేవఁజేయుట కేమి? య✽శ్రీకుఁడైన, భర్త సేవించు టవి పతి✽వ్రతము సతికి. 44

ఉ. కాన జగాన నెచ్చటను ✽ గాంతల నీసరిదానిఁ గాన నో
జానకి! నీచరిత్రమున ✽ సంతస మందితి, విశ్వకర్మచే
మానుగ నిర్మితంబులగు ✽ మఙ్గులుఁ గుండలముల్ ధరింపు మ
మ్లానసుమాంగరాగముల ✽ మానిని! తాల్పు మటంచు నిచ్చియున్. 45

తే. అమ్మ! ధరియింపు మీభూష✽ణాంశుకముల, కాంతి కడిగినఁ బోదు సూ✽కంజనేత్ర!
ఘనతరప్రేమ నీయలం✽కరణ మొంది, ధవుని రంజించెదవుగాక ✽ తల్లి! నీవు. 46

కం. అని యత్రియు ననసూయయు, ననువుగ మువ్వురకు భోజ✽నాదుల నిడి మీ
వనవాసమైనఁ బదపడి, చని మీపురమందు రాజ్య✽సౌఖ్యముఁ గనుఁడీ. 47

తే. ఇటులు మూఁడుదినంబు ల✽చ్చట వసించి, యత్రికిని మ్రొక్కి వెడలి రో✽యద్రిజాత!
అప్పటికి వారి కొకయబ్ద ✽ మయ్యెఁ బిదప, జరిగియున్నట్టి కథ విన్మ ✽ సరసిజాక్షి!

## రాముఁడు విరాధునిఁ జంపుట

శా. సీతాలక్ష్మణయుక్తుఁడై కదలి యా✽శ్రీరామచంద్రుండు విల్
చేతం దాలిచి తాను ముందు నడచెన్ ✽ జేతోముదం బొప్పఁగా
సీతన్ మధ్యగఁ జేసి లక్ష్మణుఁడు స✽జ్జీభూతచాపుండు సు
స్ఫీతప్రజ్ఞుఁడు వెన్కఁ దమ్మిరువురన్ ✽ సేవింప శ్రద్ధాళుఁడై. 49

వ. ఇట్లు చని చని వారు దండకవనంబుఁ జేరి యొక్కెడఁ గాసారంబుఁ గాంచి తజ్జలంబులఁ గృతస్నానులై పరిపక్వఫలమ్ముల నారగించి విమలోదకమ్ములఁ గ్రోలి యొక వృక్షచ్ఛాయఁ గొంతసేపు విశ్రమించియున్న యవసరమ్మున. 50

ఉ. అంత విరాధనామకని✽శాటుఁ డొకం డతిభీకరుండు శూ
లాంతరలగ్నమానవశ✽వాళిగ తాంసుఁడు దున్న బెబ్బులిన్

దంతినిఁ గేలఁ దాల్చి ప్రమదమ్మున భక్షణముం బొనర్చుచుఁ
జెంతకు వచ్చుచుండఁ గని శ్రీరఘురాముఁడు చాపపాణియై. 51

వ. ఓ లక్ష్మణా! నీ విచ్చట సీతారక్షణతత్పరుండవై యుండు నే నీరక్కసుఁ జక్కడఁచి వచ్చెదనని లేచినంత విరాధుఁడు సీతారామలక్ష్మణులఁ గాంచి తన కభిముఖుండై వచ్చు రామునితో మీ రెవ్వ రివ్వనమ్మున కంగనాసహితులై రాఁ బనేమి? యని యడిగిన రామచంద్రుం డారక్కసునితో నిజకులనామధేయాదులను, గైకేయీకృత్యమ్మును నుడివె నంత రామునివచనమ్ములు విని యట్టహాసమ్ముతో న వ్విరాధుం డిట్లనియె. 52

ఉ. రాముఁడ! నన్నెఱుంగవు విరాధసమాఖ్యుఁడ విశ్రుతుండ నీ
ధామము మద్భయమ్ముననె తాపసు లెల్లరు వీడిపోయి రీ
భామిని వీడి మీరలును ప్రాణములందలి యాస యున్నచో
నేమహనైనఁ బాఱుఁ డటు లేగక యుండిన మిమ్ము మ్రింగెదన్. 53

కం. అని చెప్పి యవ్విరాధుఁడు, జనకజఁ గొనఁబోవ రామచంద్రుండును త
ద్ఘనబాహువు ఖండించినఁ, గనలుచుఁ దననోరు విప్పి క్రవ్యాదుండున్. 54

తే. రాము మ్రింగెడియూహ బిరాన రాఁగఁ, గాంచి పాదయుగంబు ఖండించినంతఁ
బాముపలెఁ బ్రాఁకివచ్చెడువాని నర్ధ, చంద్రశరహతుఁ జేసి దాశరథి యపుడు.

తే. భయదరాక్షసుఁ బరిమార్చి పరఁగుధవునిఁ, గౌఁగిటను జేర్చి ధరణిజ కడుముదంబుఁ
జెంది యుత్సాహమునఁ బ్రశంసించె నపుడు, దేవదుందుభినాదముల్ దివిఁ జెలంగె.

సీ. అంత విరాధదేహమ్మునుండి జనించి, దివ్యరూపుఁడు రామదేవుఁ గాంచి
శ్రీరామ! దూర్వాసు చేత శప్తుండనై, దానవరూపంబుఁ దాల్చియుంటి
విద్యాధరుండ నీవిధముగా నీదయా,దృష్టిచే శాపంబు దీఱె నాకు
నని రామునకు మ్రొక్కి యమరయానముతోడ, నమరలోకము నందె నపుడు రాముఁ

తే. డనుజుతోడను సీతతో నచలు విడిచి, చనియె శరభంగు నాశ్రమస్థలికి నచట
నమ్మునీశునిచేతఁ దా నర్చితుఁ డయి, యొక్కరాతిరి వసియించె నొప్పమీఱ.

కం. శరభంగుఁడు రామునకుం, జిరపుణ్యము ధారవోసి చితిలోఁ బడి తా
సురయానారూఢుండై, హరిలోకమ్మునకుఁ బోయె నమరులు పొగడన్. 58

వ. అంతట రామచంద్రుం డచ్చటినుండి కదలి సుతీక్ష్ణాశ్రమమ్ముఁ జేరి యున్నంతఁ దత్ప్రాంతనానాశ్రమనివాసులగు మహామునీంద్రులు వేనవేలేతెంచి రామునిం జూచి

ప్రార్థనాపూర్వకమ్ముగాఁ దమతమయాశ్రమమ్ములకుఁ గొంపోయి యాతిథ్య మిచ్చి సంతసింపఁ జేయుచుండి రిట్లు తత్తదాశ్రమమ్ముల నేకద్విత్రి పంచసప్తదినంబు లొక్కొక చోటునను బక్షైకమాసార్థమాసత్రిపంచషడష్టైకాదశమాసమ్ము లొక్కొకచోటు నను సంపూర్ణవత్సరం బొకచోటునను యథాభిలషితంబుగా నివసించుచు దండకా శ్రమమ్ముల జాయానుజసహితుండై నవవర్షంబులఁ గడపె, నట్లు సంచరించునప్పు డాయానివాసమ్ముల ననేకరాక్షసులం గడతేర్చుచు నానాశ్రమారామనదీనదతటాక సరోవర గిరిశిఖరకందరప్రస్థమ్ములను జంబ్వామ్రపనసఖర్జూరనారికేళ రంభాద్రాక్షాది వృక్షలతానికుంజమ్ముల శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో బహువినోదవిహారమ్ము లొందుచుండె నిట్లు బహుళప్రమోదభరితంబుగా దండకారణ్యమ్మునఁ గొంతకాల మరిగిన. 59

తే. అంత వార లగస్త్యానుజాశ్రమంబుఁ, జేర నాముని సుమతి యర్చించెఁ బ్రీతి
నపుడు కుంభజుఁడై యగస్త్యాశ్రమంబుఁ, జేరి రాముఁడు తనరాకఁ దెల్పె మునికి.

ఉ. వచ్చినవారికెల్ల మునివర్గముతో నెదురేగి కుంభజుం
డచ్చపుఁబ్రేమ రామవిభు నక్కునఁ జేరిచి యాదరించుచుం
దెచ్చి నిజాశ్రమమ్మునఁ గనేక సపర్య లొనర్చి స్వార్జితం
బిచ్చె నిమంగయుగ్మదివిజేశధనుర్వరఖడ్గరాజముల్. 61

తే. ఆయగస్త్యునిచెంత నాయనఘు లుండి, కొన్నిదినములకుం మునికుంజరాజ్ఞ
గౌతమికి నుత్తరంబునఁ గల్గు పంచ,వటికిఁ జేరఁగఁబోవు తత్పథమునందు. 62

చ. జనకసఖుం జటాయువును శైలసమున్నతదేహు నారుణిం
ఘను నటఁ జూచి మాకు నుపకారివి గమ్మని వేఁడి యచ్చటం
మునువలె నాకుటిల్లొకటి ముద్దుగఁ గట్టి మృగామిషమ్ములం
గొని బలియిచ్చి మువ్వురును గూరిమి మీఱ వసించి రాకుటిన్. 63

## శూర్పణఖ పర్ణశాల కేతెంచుట

వ. ఇట్లు సీతారామలక్ష్మణులు పర్ణశాలాప్రవేశ మొంది వలయునప్పుడు జటాయువు సీతాపరిరక్షణతత్పరుండై యుండ నచ్చట సుఖమ్ముగా నివసించువారలకు సార్థవత్సర త్రయకాలం బతిక్రమించె నప్పు డొక్కనాఁడు లక్ష్మణుండు విహారమ్మునకై చన నొక్కెడ శూర్పణఖాపుత్రుండగు సాంబుం డనువాఁ డొక తపుగుల్మమ్మున ఘోర

తప మొనర్చుచుండ నంతకుమున్నె చతురాననుం డాతనికొఱ కొక మహాఖడ్గం బటనుంచి పోవ నద్దాని నారాక్షసీపుత్రుండు జూడమి నచటనేయున్న యాఖడ్గమ్మును లక్ష్మణుండు గైకొని తద్ధారావిశేషంబుఁ బరీక్షింపఁదలఁచి యచ్చటి లతాతరుగుల్మమ్ముల నఱకుచుండుతఱి నాగుల్మముతోపాటు సాంబుండు గూడ ఖండింపఁబడుటఁ జూచి సౌమిత్రి దుఃఖించి బ్రహ్మఘ్నుండ నైతినని భయమ్ముతో రాము దరిఁ జేరి సహోదరా! బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తంబు నుడువు మన సర్వజ్ఞుండగు రాముం డనుజుం జూచి లక్ష్మణా! నీచేత నిహతుండైనవాఁడు సాంబుండను రక్కసుండు గాని తాపసుండు గాఁడన లక్ష్మణుండు సంతసించె నంత నీయుదంతముఁ దజ్జనని యగు శూర్పణఖ విని పుత్రునికై మిగుల దుఃఖించి కామరూపిణి యగుట నచ్చటచ్చట సంచరించుచు రామాదులపై పగఁదీర్చుకొన నెంచి యొకప్పుడు మనోహరరూపంబుఁ గైకొని కపటమ్మున రామలక్ష్మణులఁ జంపెడు తలంపునఁ బర్ణశాలకు వచ్చి రామచంద్రునిఁ గాంచి మధురవచనరచనాచతురమ్ముగా నిట్లనియె. 64

సీ. మీరలెవ్వరొ యీమెయీ కేమియగునొక్కొ?, యెటనుండి రాక? యెచ్చటికిఁ బోక?
యన రాముఁ డాత్మవృత్తాంతమ్ముఁ దెల్పనా, రక్కసి ప్రియుఁడ రారా! యటంచుఁ
గామించి ప్రేలిన రాముఁ డంతట వినో, దార్థంబు దరహాస మంకురింప
మదవతి! భార్యయున్నదినాకు, నాతమ్ముఁ, డటనుండె పొమ్ము నీకతఁడె తగును.
గీ. అనిన నువ్విళులూరుచు నానిశాటి, పరుగు పరుగున లక్ష్మణు పజ్జఁజేరి
ఔర! వగకాఁడ! రమ్ము మీయన్న చెప్పె, తగుదువట నాకు నెన్నాళ్లు దాగితివిర.

వ. అని యిట్లు మదవిహ్వలయై యొడ లెఱుంగక పఱతెంచు నారక్కసిం జూచి లక్ష్మణుండు సమయానుకూలవచనమ్ముల సుందరీ! యేను శ్రీరామచంద్రుని దాసుండ నిట్టియధమునిఁ బెండ్లాడిన నీవును దాసి వగుదుగాక యేమి సుఖింతు వన నామె యౌనౌ నని మరల సవేగగమనమ్మున శ్రీరాముని సమీపించి, రాజనందనా! సభార్యుఁడ వగు నిన్ను క్షణమాత్రమ్మున విగతభార్యు నొనరించి యవరోధమ్ముఁ దొలఁగింతు నిదె చూడుమని సీతాహననమ్మున కాయత్త మగుచుండ రాముఁ డామెను వారించి వెఱ్ఱిదానా! లక్ష్మణుండె నీకుఁ దగు నిదే నాసందేశరూపమ్ముగా నీబాణమ్ము నాతని కిచ్చిన నతండు నీకార్యము దప్పక తీర్చునని నిషంగమ్మునుండి యొక్కశర మూడఁదీసి యామె కొసఁగిన మోహోన్మాదిని యగు నామానవాదిని తచ్ఛరంబును లక్ష్మణున కిచ్చి వివిధకామాలాపప్రసంగనిరంతరయై బాధించుచుండ నాలక్ష్మణుండును, 66

ఉ. అక్కమలాభనేత్రుమత మట్టి గ్రహించి శరంబు వింటఁ దా
నెక్కిడి దానిపై విడువ నేగి తదీయ కుచౌష్ఠకర్ణముల్
ముక్కునుఁ గోసి యాశరము పోయెను రామునిచెంత, కంత నా
రక్కస యేడ్చుచుం జనె ఖరప్రముఖానుజవర్గముం గనన్. 67

## శ్రీరాముఁడు ఖరదూషణాదులఁ జంపుట

మ. వికృతాకారను సోదరిం గనుచు తద్వృత్తాంత మద్దానిచే
సకలంబున్ ఖరదూషణప్రముఖరక్షస్సంఘ మాలించి యం
తకసంకాశులనుం జతుర్దశసుధాంధశ్శత్రులం బంప నొ
క్కొక బాణమ్మున రాముఁ డాయసురల లీలోత్సాహియై చంపెఁ దాన్. 68

గీ. అసుర లారాముచేత గతాసు లగుచుఁ, బాపములఁ బాసి పరిశుద్ధభావు లగుచు
దివ్యదేహమ్ములను జెంది తేజరిల్లి, ముక్తికాంతను గైకొనఁ బోయి రపుడు.

చ. అటు తమవారు సచ్చుట ఖరాదులు కోపపరీతచిత్తులై
పటుతరశూలచాపశరపట్టిసయుక్తరథాళి నెక్కి యం
తటఁ బదునాల్గువేలు నిజదానవవీరులు గొల్వఁగా సము
త్కటరథచక్రచంక్రమణకంపితభూతలులై వడిం జనన్. 70

ఉ. రక్కసు లేగుదెంతు రని రాముఁడు సీతను దమ్మునిన్ గుహన్
జక్కఁగ నుండఁబంచి సునిశాతశరంబులు విల్లుఁ దాల్చి యా
రక్కసిమూకతోడ సుకరంబుగఁ బోరుచు నద్భుతంబుగా
నక్కడఁ దాఁ జతుర్దశసహస్రవిధాకృతిలక్ష్యమాణుఁడై. 71

ఉ. క్రూరతరాస్త్రపంక్తుల ఖరున్ మఱి దూషణునిం ద్రిశీర్షునిన్
ధారుణిఁ గూల్చె నిట్లు పదునాలుగు వేల నిశాటవీరులన్
శ్రీరఘురాముఁ డంతమును జెందఁగఁ జేసె ముహూర్తకాలమం
దారయ నామహాభుజుని యద్భుతశక్తి వచింప శక్యమే ? 72

తే. ఇట్లు కడతేర్చి వారల కిచ్చెఁ దనదు, పరమవైకుంఠపదము దుర్భావజనుల
మైత్రికన్నను ధరణిలో మహాత్ములైన, వారితో వైరమైనను వరము గాదె. 73

వ. గౌతమీతటమ్మున ఖరదూషణత్రిశిరులు ముగ్గురును లోకబాధాకరులై యుంట నచ్చోటు త్ర్యంబకక్షేత్రం బయ్యును త్రికంటకాఖ్యం దనరి రామపదసంచారపూతం బగుట నాఁటం గోలె పుణ్యక్షేత్రంబై ప్రసిద్ధి నొందె నట్లు జనస్థానము నిహతకంటకం

బాట రాముం డద్దానిఁ దత్రత్యమునులకు నివాసమ్ముగా నొసంగెఁ బిదప విజయ
లక్ష్మీసమాలింగితుండై వచ్చిన ప్రదక్షిణార్హుండగు ప్రాణనాథుని వలగొని భూజాత
ద్వితీయాధర్మమ్మున సమాలింగన మ్మొనరించి ధన్యయై ప్రశంసించె నంత రామ
చంద్రుం డేకాంతమ్మున సీతతో నిట్లనియె. 74

గీ. పడఁతి ! నీ విట మూఁడురూ♦పముల నొందు, మనలమందు రజోరూప♦మున వసించి
సత్వమున నాదుదాపల ♦ సతము నుండి, తామసికమూర్తి రావణా♦ర్థంబు గొనుము.

వ. అంత నాజానకి తదాజ్ఞానుసారమ్ముగాఁ ద్రివిధరూపమ్ముల నయ్యైచోట్ల నధివసించి
యుండెఁ— బిదప శూర్పణఖ యట్లు వికృతరూపమ్మున రోదించుచు ససంభ్రమ
గమనయై లంకాపురంబుఁ జేరి యాస్థానగతుండైన రావణుం గని శోకరోషమ్ములు
పెనఁగొన నుచ్చైస్స్వరమ్మున నిట్లనియె. 76

మ. నిను నీపాలనముల్ భవత్ప్రకటమా♦నిత్యమ్మునుం గాల్పనే ?
యనయం బెచ్చట నేమిపుట్టు నది చా♦రాక్షుండ వై చూడకే
వనితాపానవశంగతుం డయిన భూ♦పాలుండు వర్ధిల్లునే ?
మనవారిం బదునాల్గువేల రథులన్ ♦ ద్రుంచె రాముం డటన్. 77

గీ. మానవుఁడు వచ్చి నీయభి♦మాన మడఁగ, మన జనస్థాన మాక్రమిం♦చినది కాక
అక్కటా! రక్కసుల నెల్ల ♦ నుక్కడంచెఁ, దెలియదా నీకు మూర్ఖరా♦త్రించరేంద్ర!

గీ. దానవులఁ జంపి నీసహో♦దరిని నన్ను, దిక్కుమాలిన దని యెంచి ♦ ముక్కుచెవులు
గోసి రీతి మానిసి♦కుఱ్ఱ లకట !, నీదు త్రైలోక్యవిజయంబు ♦ నీటఁ గలిసె. 79

చ. అన విని రావణుండును నిజాంగము లెల్లఁ జలింపఁ గోపియై
యనుజను గాంచి యిట్లనియె ♦ నామనుజుం డెవఁ డేల వచ్చె ? నా
జనమును జంప నేల ? యిటు ♦ చావఁగ నాత్మఁ దలంచి యెవ్వఁ డీ
పని నొనరించె ? చెప్పు మన ♦ భామిని రావణుతోడ నిట్లనెన్. 80

సీ. రామలక్ష్మణులను ♦ రాజపుత్రకు లొక్క, రమణితో నుండి ర♦రణ్యమందు
ఆ లేమ మేనిసో♦యగ మెల్లఁ గనుఁగొని, నీ కది తగునంచు ♦ నేఁ దలంచి
దానిఁ దే దరికేగఁ ♦ దమ్మునిచే నిట్లు, చేయించె రాముండు ♦ చెనటి యగుచు
నాపుత్రు సాంబుని ♦ నఱకె నాసౌమిత్రి, ఖరదూషణాది రా♦క్షసులు నంత

గీ. దురము చేయంగ రాముండు ♦ ద్రుంచె నీకు, పౌరుషంబున్న సీతను ♦ బట్టి తెమ్ము
కానిచో లంకలో నాఁడు♦దానివోలె, నడఁగు మన రావణుండు ర♦క్షాక్షుఁ డగుచు.

గీ. అనుజ నోదార్చి యారాము ననుజుతోడఁ, జంపి తద్రక్తసిక్తహస్తమున నీదు
కనులఁ దుడిచెద శోకంబుఁ గొనకు మింక, ననుచు మారీచునింటికిఁ జనియె నపుడు.

చ. పరిచితయుక్తిశక్తి నిరపాయుఁడు మాతులుఁ డంచు వానిమం
దిరమున కేగి సర్వమును దేటపడ౯ వచియించి భూమిజా
హరణమునందుఁ దోడ్పడఁగఁ బ్రార్థనసేయఁగ భీతవృత్తి వాఁ
డరయుచు నల్లుతోడ నిటు లాడెను తత్ప్రతికూలవైఖరి౯. 83

మ. అరవాయింగొన వేమిబుద్ధి యిది? యారా! మున్ను నేఁ గౌశికా
ధ్వరమం దా రఘురాము సత్కరుణచేఁ బ్రాణావశిష్టుండనై
మహదస్త్రంబునఁ గూలినాఁడ నిట, రామా! యన్న రాద్యంబులై
న రథంబు౯ రజతంబు రత్నమని విన్న౯ భీతిచేఁ గ్రుంగెద౯. 84

గీ. అట్టిరామునితో వైర మందు టేల?, సిరులు నుసురులు నసురులు పురము చెడఁగ
నిట్టు లెవ్వఁడు బోధించె హీనబుద్ధి, మిత్రరూపంబుఁగొన్న యాశత్రుఁ డెవఁడు?

గీ. రాముకథ వీడుమా నీవు రాక్షసేంద్ర!, రాముఁ గనినను నీకు మరణము గలుగు
ననుచుఁ బల్కిన రక్తలోచనములొప్ప, వానితో నిట్టులనియె రావణుఁడు మఱియు.

కం. నా చెప్పుపనిని జేయక, వాచాటుఁడ వగుచు నిట్లు వదరెద వేలా?
నీచా! మాటాడిన మా,రీచా! నిన్నిపుడె సంహరించెదఁ గనుమా! 87

వ. రాజశాసనమ్ముగా నీ వొనరింపవలసిన పనిని జెప్పెద విను మీవు నాతోఁ గలిసి జనస్థానమ్మునకు వచ్చి మాయాకనకకురంగమరూపమ్మునఁ బర్ణశాలకడఁ దిరుగాడిన సీత నినుఁ గని తెమ్మని సాభిలాషమ్ముగా రామునిఁ బంపు నట్లు నీకొఱకు వచ్చు రాముని దూరమ్ముగాఁ గొంపోయి యటనుండి బిగ్గఱగా రామకంఠస్వరానుకారమ్ముగా "లక్ష్మణా!" యని యఱచితేని లక్ష్మణుండును రామభయశంకితుఁడై యరుగ నేకాకిని యగుసీత నేను లంకాపురికిఁ గొంపోవుదు నిట్లు కార్యసిద్ధి యొనర్చితివేని నీకు లంకారాజ్యార్ధభాగం బొసంగెద నన్న నంత మారీచుండు నిర్విణ్ణుండై యారా! యిట్లు చేయకున్న వీనిచేతను చేసిన రామునిచేతను మరణంబు తప్పదైన వీనిచేఁ జచ్చుటకన్న రామునిచేఁ జచ్చిన శ్రేయంబని మనమ్మున నిశ్చయించి మూర్ఖుని ఛందానువర్తనమ్మున వశ్యునిఁ జేయవలయునను నార్యోక్తి ననుసరించి మంచిదని యంగీకరించి రావణునితో రథారూఢుఁడై పంచవటిఁ జేరి యచ్చట తదాజ్ఞానుసారమ్ముగా క్షణమాత్రమ్మున నాతండు. 88

సీ. రంగారుబంగారు కరంగు మేనిసారంగు, చెంగుచెంగునను దుముకరంగలింప
మేన ఫుల్లితడెఁ గూర్పు • మానికంబు లనంగఁ, జాలినవెలిచుక్క • జాలు దనరఁ
దెలఁగంటిరాజాల • దెలుఁగు దోఁచెడి నూది, కొమ్ములనల్పవాల్ • గ్రుమ్మరిలఁగఁ
బచ్చికల్ మేయుచు • భయమందు గతిఁదోఁచు, చంచలాక్షి యుగప్రచార మమర
గీ. వింటి కెగురుచు నుఱుకుచు • మేతఁగొనుచు, చెంగుచెంగున దాటుచుఁజిత్రగతుల
లేడియై పోయి పోయి యకర్వ్యాఁకు పర్ణ, శాలకడ కేగి జానకిముంగలఁ దిరిగె. 89
వ. ఇట్లు తనకట్టెదుటఁ జిత్రగతులఁ దిరుగు సమ్మాయామాకురంగముం గాంచి జానకి యంతకుమున్నె భర్త్రాజ్ఞానుసారిమ్మగాఁ దమోగూప మొందియున్నది కావున నక్కురంగమ్మునందు సాభిలాషయై రాముం గాంచి ప్రాణనాథా! దీనిఁ బ్రాణమ్ములతోఁ బట్టితెమ్మటులైన నాకిది క్రీడాకురంగం బగు, నట్లు లభింపదేని చంపితెమ్ము, దీనిచర్మమ్ముచేఁ గంచుకంబు నిర్మించుకొనియెద నెట్లైన దీనిఁ గొనక తప్పదనిన రాముఁడు లక్ష్మణుం జూచి నేను వచ్చువఱకు సీతం గాపాడుచుండు మేమరకు మని చెప్పి లేడివెన్వెంట శరచాపపాణియై చని చని సజీవమృగగ్రహణాపేక్ష నామాయామృగమ్ముచే నతిదూరాకర్షితుఁడై తుదకు విసివి మృగంబు గాదు వీఁడు రక్కసుండు గావలయు వీని నుక్కడింపవలయు నని యెంచి. 90

## శ్రీరాముఁడు మారీచునిఁ గూల్చుట

ఉ. క్రచ్చఱ రాముఁ డొక్క ఖరకాండము నైచిన నద్ది వక్షముం
గ్రుచ్చికొనంగ వాఁ డవనిఁ • గూలి నిజాకృతిఁ దాలిచి విస్ఫుటంబుగా
"చచ్చితి లక్ష్మణా! జనకజా!" యని పెద్దగ రామునట్లు వా
క్రుచ్చుచుఁ జచ్చె నా రవము • గొబ్బున జానకి యాలకించుచున్. 91
గీ. అడవి లక్ష్మణుతోడ నిక్కలనియె నామె, యార్తుఁడై యందు మీయన్న యొక్కటొకట!
రమ్మనుచుఁ బిల్చె నన్న! బిరాన నేగి, యన్నఁ గావుము నాతండ్రి! యన్న నపుడు.
శా. సీతావాక్యము లాలకించి యతఁ డాశ్రీరామతత్త్వజ్ఞుఁడై
మాతా! రామునిపిల్పు గా దతఁడు సామాన్యుండె? వి స్మిజగ
ద్రావాతం బొక్కటిమై యెదిర్చినఁ బరత్రాణం బపేక్షించునే?
యేతద్రావము రాక్షసీయ మగుఁ దల్లీ! చింతిలంబోకుమా. 93
చ. అన విని కోప మొందుచు ధరాత్మజ లక్ష్మణుఁ జూచి కైకయీ
తనయునిగూఢబోధన మెరదంగొని రామునిచావుఁ గోరెదే

ననుఁ గొనువాంఛ నీదగుమనంబునఁ గల్గెనో? యటులైన నే
ననలముఁ జొత్తుఁ గాని నిను నంటను సిక్కము సుమ్ము దుర్మతీ! 94

ఉ. ఆరహిమాటలాడెడి ధరాత్మజఁ గన్గొని లక్ష్మణుం డనెన్
శ్రీరఘురామునాజ్ఞఁ గొని సేవకవృత్తిని నిన్నుఁ గాచుచోఁ
గ్రూరమనీషవాక్శరము గ్రుచ్చితి నాహృదయంబు నంబగా
నారయ నెంతకష్టతర మైనను బోయెద నింకఁ దల్లిరో! 95

గీ. ఏన నొకమాట చెప్పెద నాలకింపు. కొంతసేపున్నఁ గాని ప్రాణాంతమైనఁ
దల్లి! నే గీయు గీటును దాటఁబోకు, మిదియు నీమేలుకోఱకు నే నాచరింతు.

చ. అని తన వింటికొనను ధరాత్మజ యున్నయట్టి పర్ణశాలను
జుట్టును నొకగీఁత గీచి టక్కరి రాక్షసుల కిద్దియలంఘ్య మమ్మరో!
ఘనపవిఘోషణంబు సుఖకారి పరాకున నైన దాటినన్
జనని! మహార్తి నందెదవు సత్యము నమ్ముము పోయివచ్చెదన్. 97

కం. అని సీతకు వందన మిడి, చనియెను సౌమిత్రి రామచంద్రుని జాడన్
గనుకని దశముఖుఁ డంతటఁ, దనరూపము విడిచి భిక్షుకతనువు ధరించెన్. 98

## రావణుఁడు పర్ణశాల కేతెంచి సీతను గొనిపోవుట

తే. అటులు రావణుఁ డాపంచవటికిఁ జేరి, పర్ణశాలకు నా బహిర్ద్వారసీమఁ
గల్గు రేఖను దాటక కపటవృత్తి, నిలిచి నారాయణా! యంచుఁ బలికె నంత.

చ. అనఘుఁడు భిక్షుఁ డంచును ధరాత్మజ బిచ్చము చేతఁ బట్టి తాఁ
జని గెరదాటకే కరము సాచి గ్రహింపుము బిచ్చ మన్న వాఁ
డనియె నటేల కొందును గృహస్థవిధి న్నిజవేర్పు నెంచిన
వనజదళాక్షి! యీగెరను వైళమ దాటుము కొందు బిచ్చమున్. 100

గీ. ద్వారమైనను కుడ్యంబు వరణమైన, నడ్డు గల్గిన బిచ్చంబు నిడ్డఁ గొనిన
ఫలము లేదంచు రటుగానఁ బడఁతి! గీటు, దాటి యిడుమన్న విని ధరాతనయ మదిని.

గీ. తథ్య మని వానికపటంబుఁ దలఁపలేక, యాగెరను దాటి యొక్కకాలవలఁ బెట్ట
జానకిని బట్టి భిక్షువేషముఁ ద్యజించి, యరద మెక్కించి చనియె నయ్యసురవరుఁడు.

వ. అట్లు చనుచున్న నత్తెరువున జటాయు వడ్డుపడి రావణునితో ఘోరసంగ్రామ మొనర్చి నిజపాదతుండప్రహారమ్ముల తద్రథనిబద్ధమ్ములగు నెన్మిది వేసడంబులఁ దునిమి రథమ్ము వికల మ్మొనర్చి విల్లు విఱిచి దశకూటంబులఁ జూర్ణ మ్మొనరించి

వానియెడలెల్ల నల్లగాఱునఖ్లు చీల్చి మూర్ఛిల్లఁజేసి యా జటాయువు సీతాసహి-
తుండై కొంతదూర మరిగిన నంత రావణుండు మూర్ఛదేరి లేచి యుద్ధతపదప్రహా-
రమ్ముల నప్పుల్గుఁజేసి భీకరంబుగా మర్దించి యెట్టకేలకు నేలఁ గూల్చి మరల సీతం
గొని యాకాశమార్గమ్మునఁ బోవుచుండ నాసీతయు రామా! రామా! యని
పలవించుచు భూతలన్యస్తలోచనయై యొక్కగిరితటమ్మున వానరపంచకమ్ముం
బొడఁగని మీరు నాదుర్గతి రామునకు విన్నవింతురుగాక యని తనమేనితొడవులఁ
గొన్ని నిజోత్తరీయఖండమ్మున ముడిచి యవ్వానరమధ్యమ్మున విడిచె నంత
రావణుండు సీతను లంకం జేర్చి యశోకవనమ్మున నుంచి వశ్యవు గమ్మని యనేక
విధమ్ములఁ బ్రార్థించినను నామె నిరుత్తరయై రామగతమానస యైయుండ రక్క-
సుం డనేకరాక్షసీగణమ్ముల సీతకడఁ గా పుంచి యింటికిం జనియె నంత.

గీ. బ్రహ్మదేవునియాజ్ఞచే - వాసవుండు, వర్షతృప్తిగ దివ్యమౌ - పాయసంబుఁ
దెచ్చి గూఢంబుగాఁగ వై-దేహి కిచ్చెఁ, జేత నాపాయసముఁ గొని - సీత యపుడు.
తే. రామసౌమిత్రిసురఖేట-గోమునులకు, మును నివేదించి తనసేమ-మును దలంచు
హృదయసఖయైన త్రిజట కొ-కింత యిడుచు, భక్తిభావంబునను బసా-పడియెఁ బిదప.

ఉ. అంతట రావణుండు పది-యాస్యులరక్కసులన్ ధరాత్మజా
కాంతుని జంపి రం డనుచుఁ - గాననసీమకుఁ బంప వార ల
త్యంతరయమ్మునం జనుచు - నవ్వనమందుఁ గబంధబాహుయు
గ్మాంతరలగ్నులైనఁ బది-యాస్యుల మ్రింగెఁ గబంధుఁ డాఁకటన్. 106
కం. తా నొకటి తలఁప దైవము, తా నొకటి తలంచు ననుట - తథ్యము గాఁగన్
దానవదురూహ లాత్మ, ప్రాణమ్ములఁ దీసెఁ బాపఫల మెటు తప్పున్. 107
వ. ఓదాక్షాయణీ! గోదావరీతీరమ్మునఁ బంచవటీక్షేత్రమ్మునం గల్గు విశేషమ్ముల
నుడివెద విను మని శంకరుండు మఱియు నిట్లనియె. 108

సీ. శ్రీరామశరభీతిఁ జే మృగం బెచ్చటెచ్చట సంచరించె నా - స్థలములందు
బహుచిహ్నములు కొన్ని - పట్టణమ్ముల నుండెఁ, బ్రపలాయితకురంగ-పదమువలన
నేపట్టునం బడెఁ - నూపురం బచ్చటఁ, బురవరం బయ్యె నూ-పురసమాఖ్య
శరహతి మృగ మేడఁ - జపలాక్షమై కూలె, నయ్యెడఁ జపలాఖ్య - నమరె పురము.
గీ. శరసమాహతమృగచిహ్న - మరయ జాల, గౌతమీతీరభూమినిఁ - గానిపించు
నచట సౌమిత్రి గీచిన-యట్టిగీత, పంచవటిచుట్టు వాఁకగాఁ - బరఁగె మఱియు.

వ. గౌతమీతటమ్మున శిలలపై రావణపదమ్ము గర్తరూపమ్మునఁ గానుపించు. రామ ఖరయుద్ధకాలమ్మున సీత నివసించిన గుహ నేఁటికిని సీతావిగ్రహముతోఁ గన్పించు. జ్ఞానదృష్టులకుఁ బంచవటీక్షేత్రమ్మున రామలక్ష్మణు లిప్పటికిని నిజరూపమ్ముల సంచరించుచున్నటులు కానుపింతు రజ్ఞానదృష్టులకు శిలారూపమ్మునఁ గాన్పింతురు. తత్తీరమ్మున సీతారామలక్ష్మణకృతస్నానతీర్థము లాపేరుననె మహాతీర్థమ్ములై ప్రసిద్ధమ్ము లయ్యె, సీతారాములు శయనించిన పర్వతంబు రామశయ్యాగిరి యని ప్రసిద్ధి నొందియుండు, నచ్చట శయ్యాకృతమ్ములగు తృణమ్ములుం గానుపించు నని చెప్పి శంకరుండు మఱియు నిట్లనియె. 110

ఉ. రక్కసు డున్మి వేగమున । రాముఁడు వచ్చుచుఁ ద్రోవలోనఁ దా
నొక్కెడ లక్ష్మణుం గని సహోదర ! సీతను వీడి వచ్చితే ?
యక్కట ! యన్న సీత యని । యట్టినుడుల్ వచియించి యాతఁడుర్
వెక్కుమొగమ్ముతో నిలిచె । భీతివిషాదపరీతచిత్తుఁడై. 111

వ. అంత. 112

గీ. ఆరఘూద్వహుఁ డాత్మలో । నటమటించి, దుర్నిమిత్తంబు లెన్నియో । తోఁచుచుండ
బహువిధమ్ములఁ దలఁచుచుఁ । బర్ణశాల, కరిగి యట సీత లేకున్కి । నడలె నపుడు.

గీ. మనుజభావమ్ముఁ జెంది రామప్రభుండు, నిజ మటంచును సర్వభూప్రజలుఁ దలఁప
శోకమున సీత వెదకుచుఁ । జూచె నొకట, భూమిఁ బడియున్నవాని నప్పులుఁగుఱేని.

కం. అంత జటాయువు వృత్తం, బంతయు నెఱిఁగించి విడిచెఁ । బ్రాణము సీతా
కాంతుఁడు వానికి నగ్న్యా,ద్యంతిమకర్మంబుఁ జేసె । నధికశ్రద్ధన్. 115

గీ. ఇటులు కర్మ మొనర్చి సీతేశుఁ డంత, స్నాతుఁడై యటఁ గుశమయ । సీతతోడ
నగ్నికార్యంబు నెఱవేర్చి । యచటనుండి, వెడలె దక్షిణముగ సీత । వెదకికొనుచు.

## శివుఁడు పార్వతితో రామప్రభావముఁ జెప్పుట

వ. ఓ దాక్షాయణీ! అప్పుడు నీ వా రాముం జూచి కేవలమనుజుం డని యెంచి నాతో నిట్లంటివి వినుము. 117

ఉ. ఓనిటలాక్ష ! యెవ్వని మహోన్నతుఁ డాఢ్యుఁడు బ్రహ్మ మంచు సం
ధానితభక్తిమై సతముఁ । దత్పరతన్ జపియించుచుందువో
యానరనాథుఁ డాలికయి । యజ్ఞునిపోలిక దైన్యయుక్తుఁడై
కాననసీమలం దిరుగుఁ । గాంచితివే పరమేశ ! యంచనన్. 118

వ. నీవాక్యమ్ముల కప్పుడే నుత్తరం బిట్లు నుడివితి. 119

ఉ. రాముఁడు విష్ణుఁడే సుమి ధరాభరనిర్హరణక్రియార్థమై
భూమి మనుష్యరూపమునఁ బుట్టి జనాళికిఁ దెల్లమగానటుల్
భామలపై మమత్వమునఁ బాల్పడువారల కిట్టిదుఃఖముల్
భామ లవశ్యరూపమునఁ బ్రాప్తము లౌ నొకనాఁటికేనియున్. 120

మ. అని తా నీమణియుక్తమానవుల బోధార్థంబుగాఁ బార్వతీ!
వనిలో దీనత సంచరించెఁ ద్రిజగద్వ్యాప్తప్రభావాఢ్యుఁ డై
నను శ్రీరాముఁడు, కానిచోఁ బ్రవిమలానందాత్మకుండైన యా
తని కీమైహికతుచ్ఛభావవివశత్వం బగునే యెన్నఁడున్ ? 121

కం. అను నామపల్కు విని నీ, వనుమానముఁ జెంది ధరణిజాకృతిఁ జని రా
మునితో నిట్లంటివి నీ, మనమునఁ దలపోయు మిపుడు మఱచితివే సన్. 122

ఉ. జానకి నేను వచ్చితిని సారసనేత్ర ! పయోదగాత్ర ! యీ
కాననసీమ నన్ గలిసి కామసుఖంబుల నొందుమా యనన్
జానకి వీవు గావిఁక నిజంబుగ నెవ్వతెవో యెఱుంగుమన్
మానవతీ ! త్వదీయమగు మాయ నెఱుంగనె ? యంతవెఱ్ఱినే ? 123

ఉ. ఓతరుణీమణీ ! సరసిజోద్భవముఖ్యులు నాత్మమాయచే
వీతవివేకులై యొవని పెంపు గ్రహింపఁగలేరొ, యట్టి సు
స్థితచరిత్రు నన్ను మురిపింపఁగ వచ్చితి వేమనందు నా
రా ! తగునంచు నవ్వి పరిహాసము లాడఁడె రాఘవుం డటన్. 124

చ. అన విని నీవు రాముఁడు మహాత్ముఁడు విష్ణుఁడె యంచు నమ్మి నె
మ్మనమున సిగ్గు నొంది మఱుమాటల నాడక వంచనమ్ము లా
ఘనున కొనర్చి వచ్చి ననుఁ గాంచి త్వదుక్తమె నిక్క మంచు ము
న్ననవా కో ? యట్టిఁ డిప్పుడు నరాకృతిలీలలఁ జేయు నద్రిజా ! 125

గీ. ఎచట "నీవెవ్వతె" వని సీతేశుఁ డడిగె, "త్వంక" యనుదేవి నైతి వహ్వానిని నీవు
ఎచట సిగ్గొంది యుంటివో యచట పురము, సంభవం బయ్యె, పేరు లజ్జాపురంబు.

## కబంధసంహారము

మ. అటు లా రాముఁడు లక్ష్మణుండు వనిలో యామ్యాశకుం బోవుచో
నటవీచారుల యాతుధానుల ననేకాకారులన్ గూల్చి య

చ్చటఁ దా మిమ్మునుం గబంధభుజపాశద్వంద్వసంబద్ధులై
పటుహేతు ల్గాని తద్భుజద్వయముం గోపం బొప్ప ఖండించినన్. 127

వ. అంతఁ గబంధుండు వికృతరూపంబు వోవ దివ్యరూపధరుండై యిట్లనియె. రామా! మున్ను నే నొక గంధర్వుండను బ్రహ్మదత్తవరమ్మున నవధ్యత్వ మొంది గర్వినై యుష్ట్రిముఖుండగు నొకమునివరుం జూచి పరిహసించిన నతండు గోపించి వికృతరూపమ్మున రక్కసుండ వగు మని నన్ను శపించి మత్ప్రార్థితుండై త్రేతాయుగమ్మున రామలక్ష్మణులు వచ్చి యోజనాయతంబులగు నీబాహువుల ఖండింతు రప్పుడు శాపవిముక్తుండ వగుదు వనియెఁ, బిదప రక్కసుండనై నే నొక్కనాఁడు పురుహూతు నెదిరించిన నతండు వజ్రమ్ముచే నాపాదమ్ములు శిరమ్మునుంగూడఁ గుక్షిలో నడంగునట్లు కొట్టె నంత వరకారణమ్మునఁ జావకున్న నన్నుం జూచి నోరు లేకున్న వీఁ డెట్లాహారంబుఁ దిను నని కరుణించి యాయింద్రుఁడు మదీయ వక్షంబున నోరుండున ట్లనుగ్రహించి యోజనాయతబాహువు లొసంగి బాహుద్వయాంతరాళపతితసకలజీవసమాకర్షణశక్తి నొసఁగి సుఖమ్మున జీవింపు మని యరిగె నాఁటినుండియు భవదాగమనార్థినై యెట్టెటో జీవింపుచుఁ దుద కిట్లు మీవలనఁ గృతార్థుండ నైతి, నో రామచంద్రా! యిట కనతిదూరమ్మున మతంగాది మునిజనపరిచారిక యగు శబరి యను పడఁతి నీదర్శనమ్మునకై వేచియున్నయది యచటి కేగిన సీతావృత్తాంతంబెల్ల నీకుఁ బరిజ్ఞాతం బగు నని చెప్పి యాకబంధుండు విమానారూఢుండై నిజవాసమగు దివి కేగె ననంతరమ్మున. 128

## శ్రీరాముఁడు శబరికి ముక్తి నిచ్చుట

చ. అనఘులు రామలక్ష్మణులు నా శబరిం గనఁబోవ నామెయుం
మన మలరన్ రఘూద్వహుల మంజుపదమ్ముల భక్తి మ్రొక్కి పూ
జన మొనరించి వన్యఫలజాతులఁ దృప్తి నొనర్చి రామునిం
గనుఁగొని ధన్య నైతిని జగన్నుత! పంకజపత్రలోచనా! 129

మ. భవదీయాంఘ్రిసరోజదర్శనము నే వాంఛించి యెల్లప్డు మా
ధవ! నీనామజపమ్ముదక్క వెఱచింతల్ మాని యిట్లుంటి రా
ఘవ! యీనాఁటికిఁ దావకీనకృప సాఫల్యంబుగాఁ గొంటి నో
యవనీజాహృదయాంబుజార్క! రఘురామా! భక్తకల్పద్రుమా! 130

మ. నిను యోగీంద్రులె చూడలే రనినఁ దండ్రీ ! యెంత ధన్యాత్మునో
మును నే నేమితపంబుఁ జేసితినొ ? నీ పుణ్యాకృతిన్ జర్మపుం
గనులం జూచు నదృష్ట మబ్బెఁ ద్రిజగత్కల్యాణ ! దీనావనా !
మనుజాకారరమాసతీశ ! రఘురామా ! భక్తకల్పద్రుమా ! 131

వ. అని వినుతించి మఱియును, 132

మ. చితిలోఁ జేరి వికుంఠలోకమునకుం జేరంగఁ దా నెంచి, చెం
చెత రాముం గని ఋశ్యమూకగిరిపైఁ జెన్నారు సుగ్రీవుఁ డన్
మతిమన్మంత్రి సహాయుఁడైనకపి, తన్మైత్రిం గొనన్ భూమిజా
గతిఁ జెప్పన్ రఘురామ ! తద్గిరికి వేగం బోవఁగా నేగుమా. 133

గీ. రామ! నీ వేగఁ బోవుమార్గమునఁ బంప,యను సరస్సుండుఁ దత్తీరమునఁ జెలంగు
కుజములందలిఫలములఁ గోసి మెసవి, తజ్జలమ్ములఁ గ్రోలుము తనివిదీర.

చ. విలసితభక్తిభావసుపవిత్రిత యామె యిటులన్ వచించి యం
జని ఘటియించి రామునకు సాగిలి మ్రొక్కి లిప్రసన్నయై యటన్
జ్వలనము సొచ్చి దగ్ధ యయి భవ్యతనూవిభవాభిరామయై
జలజదళాక్షలోకమును జయ్యనఁ జేరె సురల్ నుతింపఁగా. 135

ఉ. చెంచెత కిట్లు ముక్తి నిడి శ్రీరఘురాముఁడు పంపఁ జేరియున్
మంచివియైన పండ్లు దిని మానుగఁ దద్విమలాంబుపాయియై
పంచశరార్తితో సతిని భావమునం దలపోసి ఋశ్యమూ
కాంచితవన్యచిత్రముల నారయుచుం జనెఁ గీశపుం గనన్. 136

చ. ఇటు లరుదెంచువారలఁ గపీంద్రుఁడు చూచి భయంబు నొంది య
చ్చట సచివాళిఁ గాంచి ననుఁ జంపఁగ వాలియె వీరిఁ బంపెనో !
పటుతరచాపబాణు లయి వచ్చుచునుండిరి చూడు మయ్యయో !
వటుసమరూప మొంది చని వారల నారయుమయ్య ! మారుతీ ! 137

చ. అరసియు వారసాధుహృదయంబులు గల్గినవారలేని నీ
కరమున సన్న జేయు మటుగాక సుసాధువు లైనచో విక
స్వరముఖసారసుండ వయి చక్కఁగ నవ్వుచుఁ జూడుమా యనన్
గరువలిపట్టియున్ వడుగుకైవడి రూపముఁ జెంది యంతటన్. 138

## సుగ్రీవసమాగమము

ఉ. దూరము నేగి తత్పదనకేతుం డయి రమ్యతఁ బల్కె నిట్టు లో
పూరుషముఖ్యులార ! యెటు బోయెద రెవ్వరు మీర లివ్వని
న్నారలు గట్టియుండు మునినాథుల కాయుధ మేల తాల్ప, మీ
పే రెవ రయ్య ! చెప్పఁ డనఁ బ్రీతిని లక్ష్మణుఁ డన్న యానతిన్. 139

ఉ. మారుతిఁ జూచి పల్కె జనమాన్యుఁడు రాముఁ డితం డుదారుఁడున్
గారుణికుండు తండ్రినుడిఁ గాననవాసముఁ జేయ వచ్చి తా
దారను గోలుపోయి మతిఁ దప్పి చరించుచునున్న వాఁ డిటన్
సూరతనూజుచెల్మిఁ గోనఁ జూచెడి చెంచెతపల్కుచొప్పునన్. 140

చ. అన విని వాయునందనుఁడు నర్కతనూజునిఁ జూచి నవ్వుతోఁ
దననిజరూప మొంది యను దాశరథుల్ ! వినుఁ డేను వాయునం
దనుఁడ మదంసపీఠవిహితస్థితులై మిము ఋశ్యమూకమం
దినజునిఁ బ్రోల కిప్పుడె వహించుచు నేగెద నంచు వారలన్. 141

గీ. అటులు గొంపోయి ఋశ్యమూకాద్రిపైనఁ, జెట్టునీడను గూర్చుండఁ జేసి యతఁడు
అర్కసూనున కెఱిఁగించి యతనిఁగూడ, రామపాదాంతికంబు బిరానఁ జేర్చె.

వ. అంత. 143

గీ. రామసుగ్రీవు లున్నతప్రేమ మలర, నగ్నిసాక్షికమౌ సఖ్య మవధరించి
కరముఁ గరమునఁ గీలించి కౌఁగిలించి, రతితరానందబాష్పసిక్తాంగు లగుదు.

గీ. అనిలపుత్రుఁడు సమయజ్ఞుఁ డగుచు నెదుట, నాకులం గొమ్మలను సమర్హాసనముల
నమరుపఁగ నర్కవంశజు లర్కసుతుఁడు, నధివసించిరి కౌతుక మతిశయింప.

ఉ. అంతట రామచంద్రు డనుపూర్వగానతిఁ దత్సహాజన్ముఁ డాత్మవృ
త్తాంతము నెల్లఁ జెప్ప విని యక్కపినాథుఁడుగూడ జానకీ
కాంతునితోడ వాలికృతకష్టము లెల్ల వచింప నెంచి సు
స్వాంతుఁడు ప్రీతి ధైర్యవినయమ్ములు మీఱఁగఁ బల్కె సీగతిన్. 146

సీ. వాలిదుష్కృత్యముల్ వచియింతు వినుమయ్య, మిత్రగోత్రపవిత్ర! మేఘగాత్ర !
మయపుత్రుఁ డైన దుర్మదనాముఁ డొకనాఁడు, కిష్కింధకును జేరి కెరలి వాలిఁ
బ్రధనమ్మునకుఁ బిల్వ వాలి వేగమ వచ్చి, పిడికిటఁ బొడువంగ నడలి వాఁడు
బహుభీతిచే నొక్కగుహఁ జేర మాయన్న, వాని వెన్నంటి పోవంగ నేను

గీ. సాయపడఁబోవ ననుఁజూచి । సాయమేల?, తమ్ముఁడా! నిల్వు మీగుహా । ద్వారమందు
ననుచు గుహఁజేరె నొకమాస । మైనపిదప, విపులరక్తంబు ప్రవహించె । బిలమువలన.

వ. అట్లు ప్రవహించు రక్తపూరముం గాంచి దుర్మదునిచే వాలి మరణించియుండు నని తలంచి దుర్మదుండు కిష్కింధ కేగుదెంచి యాక్రమించు ననుభీతిచే గుహాద్వారమ్ము నొకమహాశిలచే మూసి పురంబుఁ జేరితి నంత మంత్రిజనమ్ములు నాయనిష్టమ్ము గణింపక నన్నొడయునిం జేసి రిట్లు కొంతకాలమ్ము చనినవెనుక మాయన్న దుర్మదుం జంపి పురంబుఁ జేరి రాజ్యపదస్థితు నన్నుం గనుంగొని రోషతామ్రాక్షుండై పడఁదన్ని నలియఁగొట్టి ప్రోలు వెడలించి సర్వలోకమ్ములయందును సుగ్రీవుఁ గాపాడినవాఁడు నాకు వధ్యుం డని దుందుభిధ్వానపూర్వకమ్ముగాఁ జాటఁ బంచి నంత నేనును శతవిధమ్ముల నాయనపరాధిత్వంబు విన్నవించుకొనియుఁ దదనుగ్రహము వడయఁజాలమి సకలధరాతలమ్ముఁ దిరిగి తిరిగి యెచ్చటను వాలిబాధచే మనఁజాలక తుద కీమతంగాశ్రమస్థితంబగు ఋశ్యమూకంబున నిర్భయుండనై వసియించితి రామచంద్రా! యీమతంగాశ్రమమ్మున వాలిభయంబు లేకుండుటకుఁ గారణంబు గలదు విను మని మఱియు సుగ్రీవుం డిట్లనియె. 148

ఉ. సైరిభరూపదుందుభిని । శాచరుఁ డొక్కఁడు రేయి వచ్చి వా
లీ! రణకాంక్ష వచ్చితిఁ జ । లింపక రమ్మన వాలి యంతటన్
వీరత వచ్చి యాదనుజ । వీరునిఁ జంపి తదీయదేహమున్
ఘోరముగా మతంగముని । కుంజరు మ్రోలఁ బడంగఁ దన్నినన్. 149

గీ. రక్తసంసిక్తమైన యా । శ్రమముఁ జూచి, యమ్మతంగుండు వాలికృ । త్యం బటంచు
నెఱిఁగి వెంటనె శపియించె । నిచటి కెపుడు, వాలి వచ్చునో యపుడె । కూలు ననుచు.

వ. తచ్ఛాపభయంబునం జేసి యిటకు వాలి రానోడుఁ గావునఁ జిరమ్మునుండి యుపగతభయుండనై యిచ్చటఁ గృతనివాసుండ నైతి నని చెప్పి మఱియు నిట్లనియె.

ఉ. అన్నభయంబు లేకిచటఁ । బ్రాణముతో వసియించుచుంటి నా
పన్నశరణ్య! నీచెలిమి । బాల్పడె నేఁటికి ధన్యుఁ డైతి నేఁ
బన్నుగ మున్నుగాఁ బ్రతినఁ । బట్టి వచించెద సీతఁ దెత్తు నా
యన్నభయంబుఁ బోనడఁచి । యాశ్రితు నన్ను ననుగ్రహించినన్. 152

ఉ. రావణుఁ డంబరమ్మున ధ । రాతనయం గొనిపోవఁ జూచితిన్
దేవ! ధరాజ వస్త్రమున । దివ్యవిభూషల మూటఁ గట్టి యా

గ్రావముపైఁ ద్యజించె నది ✱ కాంచియు మూటను దాచినాఁడ నా
దేవియలంకృతుల్ గనినఁ ✱ దెల్ల మగుం గద నీకు రాఘవా! 153

మ. అనుచున్ మూటను దెచ్చి చూపెఁ గపిరా ✱ జావేగియై రాఘవుం
డనుజా! భూషల నానవాలు గనుమా ✱ యన్నన్ రఘూత్తంసుతో
ననె సౌమిత్రి తదంఘ్రివందనముచే ✱ నంఘ్రిస్థభూషాళి నేఁ
గనియుంటిన్ బెరవాని నే నెఱుఁగ ని✱క్కం బండె లాతల్లివే. 154

గీ. భూషణమ్ములఁ గని రఘు✱పుంగవుండు, కీశపతి చేయు ప్రతినచే ✱ నాశ జెంది
సీత దొరకినయట్లుగాఁ ✱ జిత్తమందు, నలరి సుగ్రీవునకుఁ బ్రత్య✱యంబు గాఁగ.

సీ. తనదుపాదాంగుష్ఠ✱మున దుందుభిశిరంబు, పదియామడలదవ్వు ✱ బాఱఁజిమ్మి
సర్వదేహముమీఁద ✱ సంజనితంబైన, చక్రరూపకతాళ✱సప్తకంబుఁ
గని వాని ఛేదింప✱గా నెంచి లక్ష్మణు, కాలియంగుటమును ✱ గాంచి యపుడు
తనకాలియంగుష్ఠ✱మున మర్దనముఁ జేయఁ, బాము దేహము బుజ✱భావ మందె

గీ. ఆదిశేషునియంశచే ✱ నైన పాము, శాపమును వీడి శ్రీరామ✱చంద్రుఁ జూచి
మ్రొక్కి కింకరురీతి నా✱చక్కి నిలిచె, రాముఁ డంతట తనధను✱ర్వరముఁ బట్టి.

చ. అనుపమవిక్రముం డొకఖ✱రాంబకముం గొని చక్రరూపమా
ఘనతరతాళసప్తకము ✱ ఖండితముం బొనరించె, వాలి తా
మును గుహ సప్తతాళఫల✱ముల్ గొని దాచిన వానినెల్ల శే
షునికళఁ బుట్టు బా మొకటి ✱ చోద్యముగా గ్రహియించి దాచినన్. 157

ఉ. వాలియు సర్పకృత్యమును ✱ భావములోనఁ గ్రహించి సర్పమా!
తాళము లేదు నీయొడలఁ ✱ దప్పక పుట్టెడు నన్న నంతటన్
"దాళము లేదు నెవ్వఁడు వి✱దారణముం బొనరించు నాతఁడే
కోలను నిన్నుఁ గూల్చు" నని ✱ ఘోషపదంబు శపించె వాలినిన్. 158

గీ. ఇట్లు ఖరబాణమున రాముఁ ✱ డేడుతాళ్ల, ఖండన మొనర్పఁగాఁ జూచి ✱ కపివరుండు
సంతసంపడి యారామ✱చంద్రుతోడ, వాలిశక్తిని దెలుపఁగఁ ✱ బలికె మఱియు.

సీ. రామచంద్రా! దేవ✱రాజు మున్నొక పూల, మాలికఁ బ్రీతిచే ✱ వాలి కొసఁగె
నామాలికను జూచి✱నంతనే రిపుశక్తి, వాలినే చెందును ✱ పార్థివేంద్ర!
ఘనతపమ్మున దానిఁ ✱ గశ్యపుఁ డీశుని, వరముచేఁ గొని యిచ్చె ✱ వాసవునకు
వాసవుం డద్దాని ✱ వాలి కిచ్చెను వాలి, కంఠమ్ముననె దాల్చుఁ ✱ గాన రామ!

సీ. వాలిఁ జంపఁగ నీ వేగి మాలికఁ గన, సత్త్వ మెల్లను బోలివోవు సత్య మిద్ది
అనఘ! దానికిఁ దగునుపాయమ్ము నరసి, వానిఁ బొలియింప యత్నంబుఁ బూనఁదగును.

సీ. శూలిఁ బోలిన భుజబలశాలి వాలి, వితతరాత్రించరాళి దుర్వ్యాపినకీలి
అసమసుమమాలి తేజోజితాంశుమాలి, పాలితాఖిలకపిపాళి భవ్యశీలి. 161

కం. కావున సదుపాయం బొకఁ, డీ వాలోచించి వాలి నెదురం జనుమా
యేవిధినైనను గుశలము,తో విజయముఁ గొనుట యొప్పు తోయజనేత్రా!

వ. అనిన రామచంద్రుండును దాళచ్ఛేదనమ్మున ముక్తశాపంబైన సర్పముం గాంచి
నావలన శాపవిముక్తి నొందితివి గాన నావచనప్రకారము నీ వీరేయిఁ గిష్కింధ
కేగి నిద్రించువానరాధీశుని గళసమాహితంబైన యాదివ్యమాలికఁ దెమ్మన నా
సర్పం బేగి తల్పమ్మున ననల్పప్రభావభాసురం బగు నాపుష్పదామమ్మును గూఢ
మ్ముగాఁ దెచ్చి రామానుమతి నొంది వాసవున కిచ్చెఁ బదపడి రామప్రేరణమ్మున
సుగ్రీవుఁడు వాలిని యుద్ధమ్మునకుఁ బిల్వ నాశ్చర్యసంభ్రమాన్వితుండై యతండు
చనుదెంచి యెదిరింప నిర్వురకు నతిఘోరంబగు సంగ్రామం బయ్యె నంత. 163

గీ. కలిసి యుద్ధంబుచేయు నక్కపియుగంబు, దివ్యరూపంబుతో నుంట ద్యుమణిసుతుఁడు
చచ్చునో యని రాముఁడు శరము విడువ, కూరకున్నంత నడలుచు సూరసుతుఁడు.

ఉ. కయ్యము మాని యూర్కుఁ డయి కాయము నెత్తుటఁ దోఁగ వచ్చి యే
మయ్య! యిదేమికర్మ మిటు లన్నను బిల్వుమటంచుఁ బంపి నేఁ
గయ్యము చేయ వానిపయిఁ గాండము వైచి వధింప కిట్లు రా
మయ్య! యుపేక్షఁ జేయఁ దగునయ్య! యిటేల యొనర్చి తయ్యయో! 165

ఉ. వాలిని జంపలేవొ? మృదుభావమునన్ గడు మోసగించి నన్
గూలుప నెంచినావొ? రఘుకుంజర! నన్ వధియింప నెంచుచో
నేల వృథాప్రయాస యిపు డే వధియింపుము నీవె, వైరిచేఁ
గూలఁగఁ జేయనెంచు టది కూడునొకో నినుఁ బోలువానికిన్. 166

గీ. ఔర! నిను నమ్మి వాలితోఁ బోరుఁ గొంటిఁ, గాని వాలిని గొట్టఁగాఁ గలిగితేని
ఇంతకాలంబు నీకష్ట మేల యిపుడు, నీనుసఖ్యం బిదేల, యీ బాధ యేల? 167

వ. అనిన విని రామచంద్రుండు కరుణాపూరితాంతరంగుండై సుగ్రీవుం జూచి యిట్లనియె.

కం. మీ రిద్దఱు యుద్ధమునన్, సారూప్యముఁ బొందియుంట శరమును వింటన్
సారించి విడువ నడలితి, నూరక మిత్రఘ్నుఁ డౌదునో యనుశంకన్. 169

సీ. ఆడితప్పుట మావంశ మందె లేదు, ఏమి చేయుదు నెంత యూహించి యేమి
ఫలము? విడిచినశరము నీప్రాణములను, బలిఁగొనిన సర్వకార్యము వ్యర్థముగద.

గీ. మించినది లేదటంచు సౌమిత్రిచేతఁ, బుష్పమాలిక గళమునఁ బొందుపఱుపఁ
జేసి యిఁకఁ బొమ్ము యుద్ధంబు జేయుమన్న, రాముపల్కాలకించి యర్కజుఁడు మఱియు.

ఉ. పోరెదఁగాని దేవ! రఘుపుంగవ! పూర్వవిధమ్మునన్ గటా!
సారతరాంబకమ్ముఁ గొని చంపక వాని నుపేక్షఁ జేయుచో
నారణసీమఁ జంపు నిఁక నన్ను ననుం గరుణింపఁబోనఁ డో
శ్రీరఘురామ! నమ్మితిని చెల్మిఁ దలంపుము నీకు మ్రొక్కెదన్. 172

చ. అన విని రాముఁ డిట్లనియె నర్కజ! సందియ మేల? యేగుమా
యన నతఁ డేగి వాలిని రణయమ్మునఁ బిల్వఁగ నాలకించి వీ
నినిఁ గడతేర్ప కట్లు కరుణించి త్యజించితి మున్ను దాన నేఁ
డనికయి పిల్చుచుండె నిఁకఁ బ్రాణముఁ దీసెద నంచు వాలియున్. 173

వ. ప్రాణవల్లభయగు తారం గాంచి కోమలీ! సుగ్రీవునితోఁ బోర నేగెద సుఖం
బుండుము. 174

చ. అన విని వాలిభార్య యను నంగదుఁ డిప్పుడె చెప్పె నాథ! యా
యినకులజుండు రామవిభుఁ డిమ్ముగ నీసహజన్ముచెల్మిఁ జే
కొనెనఁట! యేమికీడు సమకూరునొ! రాము సమాశ్రయించి నీ
యనుజుని యౌవరాజ్యపద మందు తిరంబుగ నిల్పుమా యనన్. 175

## వాలి తారనోదార్చుట

చ. సురపతిసూనుఁ డిట్లనియె సుందరి! యీరఘురామచంద్రుఁ డే
నరపతిరూపమందిన జనార్దనుఁ డంచు నెఱుంగుదుం జుమీ!
దురమున రామచంద్రుఁ డల తోయజనేత్రుఁడు నన్నుఁ జంపఁగా
హరిపద మేగెదన్ గడుఁ గృతార్థుఁడ నయ్యెద నమ్ము ప్రేయసీ! 176

చ. నిరుపమభక్తితత్పరమనీషులకంటెను వేమఱుంగు లా
హరిపయి వైరమున్ నెఱపునట్టిజనుల్ కడు ధన్యు లుగ్రసం
గరమునఁ దద్విఘాతులయి కాంతురు మోక్షము నమ్ము మిట్టిదా
తరుణము వచ్చునొక్కొ బహుధా ఫలవించిన నన్నుఁబోంట్లకున్. 177

ఉ. కావున నీవు సూర్యజునిఁ । గాంతునిగాఁ గొనుచున్ సుఖింపు మీ
పావనమైన నాహృదయ । భావము నూన్పఁదలంపఁబోకు మో
దేవి ! హరిన్ మహాత్ముని మ । దిన్ స్మరియింపుము బిడ్డ నంగదున్
బ్రోవుము మాలతో ముగిసి । పోయెను నా బ్రతుకెల్ల మానినీ ! 178

గీ. నాకు రామునిచే మర । ణంబు ధ్రువము, ధన్యమగు నాదు వంశవి । స్తార మనుచుఁ
దార నోదార్చి పౌరుషో । త్సాహ మలరఁ, జనియె సుగ్రీవుతోఁ బోరు । సల్పుటకును.

గీ. పోవు త్రోవ మహోత్పాత । ములను జూచి, సంతసించుచు నిర్భీతిఁ । జని దురంబు
సోదరునితోడఁ జేయఁగాఁ । జూచి రాముఁ, డచట నొకవృక్షపార్శ్వమ్ము । నధివసించి.

మత్తకోకిలము. వాలివక్షము గాఢఁగా నొక । బాణ మేసిన దాన న
వ్వాలి సోలుచు నేలఁ గూలెను । వానిభార్యయుఁ బుత్రుఁడున్
నేలపైఁ బడి యేడ్వఁగా మహ । నీయుఁడౌ రఘురాముఁ డా
వాలిచెంతకు రా నతం డన । వద్యవైఖరి నిట్లనెన్. 181

## వాలి రాముని నిందించుట

ఉ. అన్యునితోడ నే దొడరి । యాలముఁ జేయుచునుండ, సర్వస
న్మాన్యుఁడ వయ్యు నీపొదల । మాటున డాగి కిరాతులీల సౌ
జన్యము వీడి నన్నిటులు । చంపుట నీ కపకీర్తి గాని నే
ధన్యతముండ ముక్తుఁడను । దాశరథీ ! పదిమాట లేటికిన్. 182

ఉ. కారణ మేమి నన్నిటు ల । కల్మషుని న్వధియింప రాఘవా !
శూరులు నిన్ని దేమనఁగ । సుద్దులు నేమని వక్కణింతువో
వీరుఁడవే కదా, యెదుట । విల్లు ధరించి దురం బొనర్ప నీ
బీరము నాదుశక్తియును । విశ్రుత మౌనుగదోయి ! సర్వమున్. 183

గీ. లోటు గల్గినవారికిఁ । జాటు గాని, వీరధర్మంబు గల్గిన । వారి కేల ?
పొంచి కఱచెడి పామును । బోలి తీవు, ఏమనందును నిన్ను న । హీనచరిత ! 184

చ. పరవశమైనభార్య గలవాఁడవు నీవు, భవత్సమానుఁ డీ
ఖరకరసూతి, వహ్వారె ! ప్ర । కాశితసఖ్యము గల్గె మీకు - ని
ద్దఱు నసమర్థులే యరివ । ధమ్మును భూమిజఁ గొంట కీకు నీ
తరమునఁ గల్గునే ? ప్రథిత । దర్పుని రావణు మీరు గెల్తురే ? 185

ఉ. ఆతనిఁ జంపఁ బోవుచు సహాయత కేగద యల్పసారుఁడౌ
నీతనిఁ జెట్టపట్టితివి ? హీనుఁడు ఏనిపనేమి రాఘవా !
సీతను దెచ్చిపెట్టుమని చెప్పితివేని దశాస్యుఁ జంపి భూ
జాతను తావకీనపదసన్నిధి నుంచనె లిప్తమాత్రలో. 186

గీ. చేతఁగానట్టి సుగ్రీవు చెలిమిఁగోఱకు, పాప మొడిగట్టి ధర్మంబు పాడువఱచి
మాయురే ! రామ! రేపు ధర్మజ్ఞసభల, నెట్లు తల యెత్త నేర్తువో యియా ! మహాత్మ!

## శ్రీరాముఁడు వాలి కుత్తరము చెప్పుట

చ. అను హరిసూనుతో ననియె నారఘువీరుఁడు వానరేంద్ర ! యీ
యనుజుని దోషహీనుని మహాత్ము విధేయు బహిష్కరించి త
ద్వనితను జెట్టఁబట్టు దురితప్రథితు న్నిను శిక్షఁ జేయఁగాఁ
జనదొకో ? దండ్యదండనము క్షత్రియధర్మము నీ వెఱుంగవే ? 188

ఉ. చేసినకర్మకున్ ఫలము చేకుఱె నేఁటికి వ్యర్థభాషణా
యాసము శాంతిపూర్ణవిమలాత్మ లభించునుగాక నీకు నో
వాసవనందనా ! దురితపంకనిమగ్నుఁడ వయ్యు మచ్ఛర
శ్రీసముపాత్తమైన మృతిచేఁ గడు ధన్యుఁడ వైతి వియ్యెడన్. 189

గీ. అస్మదంబకనిహతుఁడ వైతి కాన, ద్వాపరమ్మునఁ గృష్ణావతార మొంది
నేఁ బ్రభాసంబునం దుండ నీవు పూర్వ, వైరమునఁ గొట్టి ముక్తిని జేరఁగలవు.

గీ. అనిన రాముని వచనమ్ము లాలకించి, వాలియను రామ ! విన్మ నా ప్రార్థనమ్ము
నాదుసుతుఁ డంగదుం డిట్లనాథుఁ డయ్యె, వానిఁ గావుము దేవదేవా! దయాళు!

చ. అని విడనాడె వాలి తన ప్రాణములన్ రఘురాముఁ డాతనిం
గని దిగులొందు నంగదునిఁ గాంచుచు ధైర్యము చెప్పి వాని నా
జనకున కంత్యకర్మమును సర్వముఁ జేయఁగఁ బంచి తోడనే
యినజునిఁ గూడి చేరెను మహీతలనాకము ఋశ్యమూకమున్. 192

ఉ. అర్కతనూజుఁ డాదశరథాత్మజుఁ జూచి నమస్కరించి కో
ట్యర్కసమానతేజ ! కరుణాకర ! రాఘవ ! రామచంద్ర ! యీ
మర్కటరాజ్య మేలుకొనుమా ! భవదీయపదారవిందసం
పర్కముఁ జెంది కింకరుని వైఖరి నే వసియింతు భక్తిమైఁ. 193

వ. అనిన రామచంద్రుండు లక్ష్మణుం జూచి నీ వీసుగ్రీవుని వెంటఁ గిష్కింధ కేగి పట్టా
భిషేకమహోత్సవంబు నిర్వర్తించి యాతని రాజుం జేసి యంగదుని యువరాజుఁ
గావించి రమ్మన నతం డటు లేగి సర్వంబు నిర్వర్తింప సుగ్రీవుండు రాజై తారా
రుమాసహితుండై సకలసుఖమ్ము లనుభవించుచుండె నిట రామలక్ష్మణులు వర్షా
కాల మాసన్న మగుటఁ బ్రవర్షణశైలశిఖరమ్మునఁ బత్రపుష్పలతాన్వితంబగు
స్ఫాటికగుహాంతరాళమ్మున సుఖం బుండి రంత. 194

## వర్షర్తు వర్ణనము

మ. హరినీలద్యుతిసాంద్రమేఘపటలీవ్యాప్తాంబరంబై లస
ద్ధరిదశ్వప్రతిభాతిరస్కరణతోద్యజ్జీవదుగ్రోధదు
స్తరగాఢాంధతమఃపిధానకలితాంచత్సర్వవిశ్వంభరా
హరిదాకారము గల్గి వర్షసమయం బావిర్భవించెన్ రహిన్. 195

మ. పటుకాలాంబుదవిస్ఫురత్క్షణవిభాభాస్వద్రుచుల్ మీఱఁగాఁ
జటులాబ్దధ్వనిభిన్నదిక్తటమునై సాంద్రాంబుధారావళీ
తటవిచ్ఛేదకవారిఘట్టనసముద్ఘాతత్రుటత్తీరస
త్కటమై యొప్పఁగ వానకా రలరెఁ గేకుల్ కేకచుం గూయఁగన్. 196

సీ. పటుమేఘనిస్వనప్రాకట్యవశమున, నుచ్ఛిలీంధ్రమ్ముగా నుర్వి దనర
సురసతీరతిగళచ్చ్యుతహారముక్తికాళినా, వారిధారావళుల్ వసుధఁ బడఁగఁ
బరిపక్వవనచూతఫలరాజి యలరంగ, నీపాదికుసుమంబు లేపుఁ జెందఁ
బద్మాలయాళులఁ బాపి చక్రాంగముల్, మానసాద్భుతి నుదజ్మహీకిఁ జేర
గీ. మహితశీతలవాయువుల్ మలయుచుండ, నవనియెల్లను జలమయమట్లు తనరఁ
గేకిసంఘము పురివిప్పి కేరలియాడ, భాసురంబుగఁ దనరారె వానకారు. 197

వ. ఇట్టివర్షాసమయమ్మున రామలక్ష్మణులు ప్రస్రవణగిరిగుహాంతరనివాసులై యెట్లో
కాలముఁ గడపుచున్నంత నొక్కనాఁడు. 198

ఉ. గౌతమి శ్రద్ధమీఱ నవగాహితుఁడై చనుదెంచి లక్ష్మణుం
డాతఱి సాత్త్వికాకృతి ధరాత్మజ నన్నసమీపసీమ సం
ప్రీతి వసించు దానిఁ గడువిస్మితుఁడై కని మ్రొక్కినంత నా
సీత యదృశ్య యయ్యె వెలసెన్ రఘువీరుఁడు పూర్వమట్లుగా. 199

వ. భ్రాతృదేవుండగు సౌమిత్రియు మాయాప్రభావమ్మున నిదమిత్థ మని నిర్ణయింపఁ జాలక ప్రాకృతుండు వోలె నపగతసంశయుండై యుండె, నా ప్రవర్షణశైలమ్మున రామలక్ష్మణులు నిత్యస్నానముఁ జేయు గోదావరీప్రదేశమ్ములు రామతీర్థంబు లక్ష్మణతీర్థం బనుపేరఁ బుణ్యస్థలంబులై యొప్పె, నిట్లు క్రమమ్మున వర్షాకాల మతిక్రమించి దండయాత్రార్హశరత్కాల మాసన్న మగుచున్నను గిష్కింధాపురమ్మున సుగ్రీవుండు. 200

గీ. రాజ్యసౌఖ్యప్రమత్తుఁడై రాత్రిఁబగలు, పానవనితాప్రసంగదుర్వ్యసనుఁ డగుచు
నంతిపురి నుండె రాజకార్యముల మఱచి, యంత హనుమంతుఁ డరిగి యిట్లనియె వాని.

గీ. వ్యసనివైయున్న రాజకార్యములు చెడవె, రామకార్యంబు మఱవ ధర్మంబె నీకు?
వానకారు గతించె నిప్పాటనైనఁ, గపులఁ బిల్పింపు వేగంబుగా మహాత్మ! 202

వ. ఇట్లు మారుతివాక్యంబులఁ బ్రబోధితుండై సుగ్రీవుఁడు నానాదేశనివాసులగు వానరులకు వార్త లంప నవ్వానరులును వేనవేలుగాఁ బ్రత్యహమ్మును గిష్కింధ కేగుదెంచుచుండి రంత శరత్కాల మరుదెంచుటయు సుగ్రీవుండు కామాంధుండై సీతాన్వేషణప్రయత్నము చేయక తన్ను స్మరింపకుండుటఁ దలఁచి కోపాన్వితుండై రాముఁడు సహోదరునితో నిట్లనియె. 203

## రాముఁడు సుగ్రీవునిపై కోపించుట

మ. ధర సస్యాన్విత యయ్యెఁ గాశసుమవిస్తారంబు రాజిల్లె భా
స్కరతిగ్మాంశువిశుష్కపంకసికతాంచత్తీరయుగ్వాహినుల్
పరఁగెన్ మందతరప్రభావవిమలాంభఃపద్మయుక్తంబులై
తరుజాతంబు చెలంగెఁ బల్లవసుగంధప్రాజ్యపుష్పాఢ్యమై. 204

వ. ఇట్లు శరత్కాలావిర్భావం బైనను. 105

మ. మదిరాపానవశంవదుండయి వధూమధ్యస్థుఁడై సంతతో
న్మదుఁడై యుండెఁ గపీంద్రుఁ డిప్పగిది నస్మద్దండయాత్రార్హమై
ముదిరావర్జితనిర్మలాంబరమునై ఫుల్లాబ్జకాసారమై
పొదలెన్ శారదకాల మిప్పుడును తద్భోగేచ్ఛ చల్లాఱదో ? 206

చ. అనుజా ! చూడుము వానరాధిపునియన్యాయస్థితిన్ స్వీయహా
పని దీఱెం గద యంచుపేక్షఁ గొనెఁ బో భార్యావియోగార్తిచే
తను నే నిచ్చట వేచియుండ, నిటు కాంతాపానలోలాత్ముఁడై
మనలన్ సుంత స్మరింపఁ డేయుపకృతిన్ మన్నింపఁ డొక్కింతయున్. 207

గీ. కాన నీ వేగి కోపవాక్యములచేత, మందలింపుము వాని నుగ్రస్మ్రత్తు నింత
అంతియేకాని ద్రోహ మాకవంతయేని, మదిని దలఁచుట మిత్రధర్మంబు గాదు.

గీ. అనఁగ సౌమిత్రి యన్నతో ✽ ననియె నిట్లు, వానిసాయంబు మన కెంత ? ✽ పాపియైన
వాలిఁ జంపితి ఏ వట్లు ✽ వానియనుజు, ద్రోహి సుగ్రీవహాతకుని ✽ ద్రుంచి వత్తు.

ఉ. వాలముచేతఁ గట్టి మును ✽ వార్ధిని ముంచి జయించె రావణున్
వాలి, యతండు నీశరమునన్ మరణించె నిమేషమాత్ర నా
వాలికి నోడు నీపిఱికి ✽ పంద సహాయము చేయు టెంత ? భూ
పాలవరేణ్య ! దీనజన ✽ పాలనవృత్తిని బ్రోచి తంతియే. 210

గీ. అల్పబుద్ధి కృతఘ్నుఁడు ✽ నైన రవిజు, నధిపుఁ జేసినఁ గాపేయ ✽ మడఁగు టెట్లు?
కుక్క సింహాసనమ్ముపైఁ ✽ గూరుచున్న, సహజగుణ మేల మాను నో ✽ సదయహృదయ!

గీ. దుష్టశిక్షయు సాధుసం ✽ తుష్టి నీకు, సహజధర్మంబు గాన భా ✽ స్కరతనూజుఁ
గొట్టి చంపితి సాయమే ✽ కోరియున్న, వాలినే కోరుదుము సుర ✽ వైరిఁ జంప. 212

చ. అన విని రాముఁ డిట్లనియె ✽ నాత్మసఖున్ శరణంబు వేఁడువా
నిని బగవానినైనఁ గడు ✽ నేర మొనర్చినఁ బుత్రురీతిగాఁ
గనుచును బ్రోవఁగావలయుఁ ✽ గాని వధింపఁ ద్యజింపఁ గూడునే ?
యనుజ ! స్వదోషముల్ తెలియ ✽ నాకపినాథు నదల్చి రమ్మనన్. 213

## ❖ లక్ష్మణుండు కిష్కింధ కేగుట ❖

గీ. అంత సౌమిత్రి కిష్కింధ ✽ కరిగి యచటఁ, గాపుగా నున్న కపులను ✽ గోపదృష్టిఁ
జూచుచుఁ గపీంద్రుఁ డున్న యా ✽ రాచనగరు, మోసలనునిల్చె స్త్రీలకు ✽ నోసరిలుచు.

వ. ఇట్లు సక్రోధుండై రామానుజుండు వచ్చెనని విని సుగ్రీవుండు మారుతిం గని మున్ను నీ వేగి యాభీషణాకారు శాంతునిగాఁ జేయు మన వాయునందనుండును సవినయమ్ముగా నెదు రేగి సముచితసంభాషణమ్ముల నాసౌమిత్రిని నెంటఁగొని మధ్యకక్ష్యకు వచ్చి యనూనయపూర్వకమ్ముగాఁ గోపోపశమనం బొనర్చుచున్నంత వానరపతి చతురభాషణచతురయగు తారం గని యిట్టిపటి కోపం బుడుప నీవంటి యువతులకుఁ దక్క యితరులకు శక్యంబు గాదు, కావున నీ వేగి మృదుమధుర వచనరచనల రామానుజమనంబు గరఁగింతువేని నేఁ గృతార్థుండ నగుదు లేకున్నఁ బ్రమాదం బగునని ప్రేరేపింప నామెయు సవిలాసగమనయై సౌమిత్రికడ కేగి స్మేరాంకూరవికాసభాసురవదనయై స్వభ్రూభంగకటాక్షమ్ముల నెఱపుచు నిట్లనియె.

## తార లక్ష్మణు ననునయించుట

ఉ. దేవర! కోపముం గొనఁగ దేవరకుం దగునయ్య? మీకు సు
గ్రీవుఁడు సోదరుండె కద కింకరుఁడు గావునఁ జంచలత్వసం
భావితుఁ డయ్యె, నైనఁ బిలుకవంబని చేర్ గపుల్ మహాత్మ! నీ
తావరభక్తుఁ డాతఁడు కృతజ్ఞుఁడు కాని కృతఘ్నుఁడే ప్రభూ! 216

గీ. వానరులఁ బిల్వఁబంపిన వార్తఁ దెల్పె, రామసందర్శనార్థమై తానితప్పు
కలదు దానికి హేతువు గలదు సుమ్ము, చిత్తగింపుము కరుణాప్రవృత్తిమీఱ.

మ. కలికిం బాయుటగాక సర్వజగతీఖండంబునం దెచ్చటన్
నిలువన్ నీడయు లేక యాశ్రమమున న్నిల్చెన్ జిరం బయ్యెడన్
లలి సామ్రాజ్యము మీకృపం గొని కడున్ లావణ్యసంయుక్తయౌ
కలికిం గూడెను వానరేంద్రుఁడు మహోత్కంఠాపరాధీనుఁడై. 218

ఆ. వె. చిరవియోగ మంది చిన్నారికలికితో, రతులఁ దేలువాఁడు రాత్రిఁ బవలు
నెఱుఁగఁడన్నఁ జిత్ర మేమి కల్గు శరీర, మెట్లు లెఱుఁగు నన్య మే మెఱుంగు?

చ. కుశికజునంతవాఁడు నొక కోమలిపై మది లొంది మోహియై
దశసమకాలముల్ వశము దప్పి చరించెనటన్నఁ గామినీ
వశుఁడయి నీసహోదరుఁడు వానరరా జిటు లుంట చిత్రమా?
దశరథనందనా! మదనధర్మము లిట్టివె సుమ్ము ధారుణిన్. 220

గీ. ఔనుగానీ, యిదేమి నీ యాగడంబు, యెవ్వ రడ్డం బటంచు నీ విచట నుందు
వనుచుఁ గేల్పట్టి లక్ష్మణు నంతిపురికి, వెంటఁ గొనిపోయెఁ బరిచితవిధము గాఁగ.

గీ. అట్లు మధురమ్ముగా మాట లాడి పిదపఁ, గరముఁ బట్టినఁ గోపంబు మఱచె నతఁడు
కఱకుఁదనమెల్ల వెన్నయై కరఁగె నార!, సాంత్వనం బెంతకైనను జాలుఁ గాదె?

ఉ. లోనికి నేగి రోషపరిలోహితభీషణవీక్షణాగ్ని చే
వానరరాజుఁ గాల్చుపరువమ్మునఁ జూచుచు లక్ష్మణుం డనన్
వానర! రాముని న్మఱతువా? మఱి వాలిని జంపుసాయకం
బేని దలంపు మింక వధియించెదఁ బంచెద వాలిచెంతకున్. 223

చ. అన విని వాయుజుం డనియె నయ్యయొ! కోపము మాను రాఘవా!
యినజుఁడు రామకార్యమున నేమఱలేదు రవంత వానరుల్

కనుఁగొనుమా యసంఖ్యములుగాఁ జనుదెంచి రనం గపీశుఁ డు
మనమలరంగ లక్ష్మణు సమంచితపూజల నాదరించెఁ దాన్. 224

గీ. శాంతభావుఁడు సౌమిత్రి సంతసింపఁ, గపులతోఁ గూడి ఋశ్యమూకమున కేగి
రామునకు మ్రొక్కి వానరరాజిఁ జూపి, వినయవినమితుఁడై కపివిభుఁడు పల్కె.

వ. రామచంద్రా ! భవన్నిదేశమ్మునంజేసి జగతీతలమ్మున నానావిధవిపినపర్వతపట్టణాది నివాసులగు వానరయూథపు లిచ్చటం గూడియున్నవారు, అష్టాదశపద్మసంఖ్యాకులగు నీయూథపులు గాక యసంఖ్యాకులగు వానరు లెల్లరు నిచ్చట సీతాన్వేషణతత్పరులై యున్నవారు, కావున భవన్నియోగమ్మున వీరలఁ గార్యోన్ముఖులఁ జేసెద నని తదనుజ్ఞాతుండై. 226

## సుగ్రీవుఁడు కపుల నలుదిక్కుల కంపుట

కం. తక్కినదిక్కుల కేగుట, కక్కపినాథుండు గపుల నంపి యమాశం
జక్కఁగ నెమకఁగఁ బంపెను, పెక్కుర బలశౌర్యభువనవిశ్రుతుల వడిన్. 227

సీ. వాయుజుండును జాంబవంతుఁ డంగదుఁడును, నలమైందశరభులు నలసుషేణు
లనువారి యామ్యాశ కనిపి యందఱిఁ జూచి, మాసంబు దాటించి మసలువారు
వధ్యు లౌదు రటంచు వారికి నియమింప, ఘనుఁడు రాముఁడు ముద్రికను సమీర
జాతున కిడి దీని సీతకుఁ జూపించి, యానవా లొకటి తె మ్మనె నడిగి
గీ. యనుచుఁ దనమంత్ర మొసఁగి శ్రద్ధాత్మ లక్ష, పరిమితిగ దీని జపియింప వ్రాయ దివ్య
శక్తి చేకూఱు, నవనవోత్సాహ మమరు, ననుచు దీవించి పంపె నా యధికసత్త్వు.

వ. ఇట్లుపదేశమంది పాదాభివందన మొనరించి యేగ నుద్యమించుహనుమంతు నుద్దేశించి మరల రామచంద్రుండు. 229

గీ. చిత్రకూటాద్రి మున్ను నే సీతనొసల, గైరికమ్మున బొట్టును గండములను
పంచవల్లుల లిఖియించువార్త నీవు, ప్రత్యయంబుగ నామెతోఁ బలుకు మనియె.

వ. పిదప వానరు లెల్ల నయ్యాదిక్కులకుఁ జని రనంతరమునఁ గొన్ని దినంబులకుఁ బ్రాక్పశ్చిమోత్తరగతులైన కపినాథులు తిరిగి కిష్కింధ కేతెంచి యాయాదిక్కుల సీతఁ గాన్పింపమి విన్నవించిరి. దక్షిణమ్మున కేగిన యంగదాదు లచ్చటచ్చట నెమకుచుఁ గన్పడిన రక్కసుల రావణుం డని యెంచి పోరఁగొనుచు నలసి దప్పికచేఁ దూఁగాడుచు విధివశమ్మున నొకగిరిగుహాప్రాంతమ్మున విశ్రమించి జలార్థులై యున్నంత.

చ. బిలమువనుండి యార్ద్రముఖపక్షిచయముల్ చను దేరఁ గాంచి యీ
బిలమున నీరు గల్గునని వేగము తద్గుహఁ జొచ్చి పోవఁగా
నెలమి దినమ్ము లేగెఁ బదునెన్మిది, చీఁకటి దాటి పిమ్మటన్
వెలుఁగున రత్నదేహమున వీరలు గాంచిరి భామ నొక్కతెన్. 232

గీ. వారు తమవృత్త మెఱిఁగించి పల్కి రిట్టు, లెవ్వతెవు నీవు పే రేమి యిట వసింప
నేమికారణ మనుచుఁ దద్వృత్త మడుగ, వారిఁ బూజించి పలికె నవ్వనిత యిట్లు.

వ. విశ్వకర్మసుతయగు హేమ యను పడంతి నాట్యమునఁ బరమేశు మెప్పించి తదను గ్రహమ్మున నీరత్నమయగృహమ్ము బడసి యిటఁ జిరకాల ముండి దివమ్మున కేగుచుఁ బరిచారికనగు నన్నుం గాంచి నీ విట రామాగమనమునదాక నివసించి యామహాత్ముం బూజించి యథాశక్తికమ్ముగాఁ దత్సాహాయ్య మొనరించి కృతార్థవై రమ్ము నేనా నారాయణస్థానమ్మున కేగెద నని చెప్పి పోయె నో వానరోత్తములారా! నేను స్వయంప్రభ యనుదాన రామకార్యార్థమై మీకు వలయు సాయమేమైన నావలనఁ గొనుఁ డన వార లిట్లనిరి. 234

తే. వెలువరింపుము గుహనుండి వెలఁది! మమ్ము
గడువు మీఱెను మారాజు కఠినుఁ డన్న
కనుల మూయించి కపుల నాక్షణమునందె
యావలకుఁ దెచ్చి యాకాంతి యిట్టు లనియె. 235

వ. కపివరులారా! రామకార్యమ్మునకుఁ గొంచెపుసాయ మొనర్చినను పరమార్థలాభంబగు నీవిధమ్మున నేఁటికి రాముఁ బూజించినదాన నైతి నిఁక నే నేగెద ననుచు నాస్వయంప్రభ దేహంబు విడిచి దివమ్మున కరిగె నంత వానరులును.

మ. బిలమందే గడు వేగ భూమితనయన్ వీక్షింపకే చన్న చో
బలిమిన్ గీశవిభుండు క్రోధవశుఁడై ప్రాణమ్ములం దీయు నీ
స్థలమందే మరణింప మే లనుచుఁ బూతస్వచ్ఛదర్భాళిపై
నెలమిం బండిరి వానరోత్తములు నీరతేశున్ మదిం గొల్చుచున్. 137

గీ. అచట ప్రాయోపవేశము నంది కపులు, 'రామకార్యార్థమై ము న్నరణ్యమందు
మనవలెనె యాజటాయువు మరణమందె, ననుచు భాషించుకొనుమాటలాలకించి.

ఉ. ఆతటి నాఁకటం గపుల నందఱ మ్రింగ సమీప మేగి సం
పాతి జటాయురంతమును వారికడన్ విని తర్పణాంజలుల్

భ్రాత కొసంగి వానరులపజ్జకుఁ జేరి ధరాజవార్తలన్
బ్రీతిగఁ జెప్పె నాఘనులు వింతఁ జెవుల్ నిగిడించుచు న్వినన్. 239

## సంపాతి వానరులకు సీతావృత్తాంతముఁ జెప్పుట

మ. లవణాంభోనిధిమధ్యమం దలరెడిన్ లంకాపురం, బాపురో
పవనం బొప్పు నశోకనామక మటన్ వైదేహి యుండెం జుఁడీ
ధవురాకన్ మదిఁ గోరుచుండె నను సీతాదేవియున్ సీత నేఁ
బ్రవిలోకించుచునుందు మయ్యెడకుఁ బోవంజాల నీ వృద్ధతన్. 240

గీ. గృధ్రమైయుంట దూరనిరీక్షణంబు, గలదు గావున సీతను గాంచుచుంటి
పక్షహీనుఁడ నగుట రావణునిఁ జంపి, సీతఁ దేకుంటె లంకకుఁ జేరి నేను. 241

మ. మును నేనున్ మఱి మాజటాయువు రవిన్ ముట్టం బణం బొడ్డి క్ర
న్నన దూరంబు జనంగ సోలు ననుజు న్నా ఱెక్కలం గప్పి నేఁ
జనఁగా ఱెక్కలు కాలె సూర్యఖరతేజస్సంగతిన్ దమ్ముఁ డా
వనమందుం బడె నేను నీగిరితటప్రాంతమ్మునం గూలితిన్. 242

ఉ. ఏ నిటఁ జంద్రనామకమునీంద్రునకుం బ్రణమిల్లి నాకథన్
మానుగఁ జెప్పినంత నతఁడు పూనియు రాఘవకార్యభారమున్
బూనిన వానరావళికి భూసుతవార్త వచించితేని నీ
వూనెదు ఱెక్క లంచును నహో! కనుఁ డయ్య! లభించెఁ బక్షముల్. 243

ఉ. భూసుతఁ గాంచు నేగు పదిమోములరక్కసుఁ గంటివం చిటన్
నాసుతుఁడే వచించెను, రణమ్మున రావణుఁ గూల్చి మూర్ఖుఁడా!
భూసుతఁ గొంచురాక కడుబుద్ధివిహీనుఁడ వైతి వన్న నా
యూసడ మోర్వ కాతఁ డెటు లేగెనొ? నేటికి రాఁడు నన్గనన్. 244

ఉ. ఓనగచారులార! శతయోజనసాగరసంప్లవంబు మీ
లో నెవఁ డొందు నాభుజబలుం డటు లేగి శుభప్రయాణుఁడై
జానకిఁ గాంచుఁగా కనుచు సంతస మొప్పు వచించి పుల్గుఱేఁ
డే నిదె పోవుచుంటి నని యేగె వియద్గతి నాత్మభూమికిన్. 245

ఉ. ఆతని వాక్యముల్ విని వనాటవరుల్ ప్రమదంబుమీఱ సం
పాతిమహాత్ముఁ డిచ్చె మనప్రాణము లంచును గ్రేళ్లువారుచున్

జాతివిచేష్ట లొందుచును § సాగరతీరముఁ జేరి యందఱుఁ
సీతను జూచువేడ్కఁ గొని § సింధువు దాఁట భయంబు జెందుచున్. 246

చ. జలనిధి దాటువారలు స్వ§శక్తుల నారసి చెప్పఁ డంచు వా
రలు తమలోనఁ దా మిటులు § ప్రాశ్నికు లౌతఱి నందు నెల్లరుఁ
జలనిధి దాటలేమి నుడి § సాగక యూరకయుండ వాయుజుం
డలవు జలంబు గల్గుఘనుఁ § డైన నశక్తునిరీతి నుండఁగాన్. 247

గీ. జాంబవంతుఁడు వానిని § సన్నుతించి, వైనతేయుఁడు నీవును § వాయు వొకఁడు
గాక నాల్గవవాఁ డేఁడి § కడలి దాటఁ, గాన నీబింకములు మాని § కదలి రమ్మ.

ఉ. సీతను జూచివచ్చినటు § చెప్పినఁగాని తిరంబు లౌనె సం
పాతి యొసంగుప్రాణములు ? § వాయుజ ! నీ విదు ప్రాణదానమే
ప్రీతి నొసంగు, శక్తుఁడవు § వేగమె దాటుము నీదురాకకై
చాతక మంబుదాగమము § చాడ్పునఁ జూచుచునుండు మియ్యెడన్. 249

చ. అన విని లేచి పొంగుచు మ§హాబలనందనుఁ డిట్లు పల్కె వా
ర్ధిని గపులార ! గోష్పదము§రీతిని దాటుదు నూఱుమార్లు యో
జనములు నూఱు లెక్కయె ని§జంబుగఁ గోటిసహస్రయోజన
మ్మును నెగురంగనేర్తు నిదె § పోయెద భూసుతఁ జూచివచ్చెదన్. 250

## హనుమంతుఁడు సముద్రము దాటుట

చ. ఇలపయి నిల్చి మింటి తెరు § వేగగ దూకెడి నాదు పద్ధతిఁ
జలనముఁ జెంది క్రుంగుచు రసా§తల మంటదె భూమి ? కాన నీ
బలరిపుశైల మెక్కి చను§వాఁడను మింటి కటంచు నల్లె ని
శ్చలతఁ బదద్వయి న్నిలిపి § చక్కఁగ నిక్కుచు మల్లఁ గొట్టుచున్. 251

సీ. పదఘట్టనమ్ముచేఁ § బర్వతం బిలఁ గ్రుంగ, నుర్వీజములగుంపు § లుర్విఁ గూల
గిరిచరమిథునముల్ § గిరి వీడి పరువెత్త, భూతజాలంబెల్ల § భీతిఁ జెంద
వాల మల్లార్చుచు § వంగి యూర్ధ్వాక్షుఁడై, వాయువుఁ బూరించి § భక్తిమీఱ
మదిలోన రామసం§స్మరణమ్ముఁ జేయుచు, నువ్వెత్తుగా దూకి § యూరు వేగ
గీ. జన్యవాయుసమాకృష్ట§శాఖి యగుచుఁ, బక్షయుతమైన గిరివోలెఁ § బటురయమున
రామబాణం బనంగఁ దా§రాపథంబుఁ, జేరె న వ్వాయుసూనుఁ డచ్చెరువు దోఁప.

గీ. వార్ధి దాటెడు హనుమంతు బలముఁ గనుట
కమరు లహిమాత యగు సుర సాఖ్యసుదతి
ననుప నామెయు మారుతి కభిముఖముగఁ
జని ప్రవేశింపుమా నోట ననఁగ నతఁడు. 253

గీ. రామకార్యంబుకొఱకు నో రమణి ! నేను, పోవుచున్నాఁడఁ దిరిగి రాఁ బోవునపుడు
చొత్తు నీనోట సీతను జూచివత్తు, నమ్ముమా నాదుమాట నిక్కమ్ముగాఁగ.

ఉ. ఆరఘురామకార్యమున కమ్మరొ ! సాయముఁ జేయు మిట్లనన్
గ్రూరత నామె యాఁకలిని గూడితి నిన్నిఁక వీడనం చనన్
మారుతి నేనుఁ బెంచె, నహి మాతయు నోరును బెంప నాఘనుం
డారసి యంత నంగుటము నంతటిరూపముఁ జెంది ప్రేల్మిడిన్. 255

గీ. ఆస్యగుహ సొచ్చి యీవల కపుడె వచ్చి, యాత్మరూపంబు నెప్పటి యట్ల తాల్చి
నతనిశక్తిఁ గనుంగొని యభినుతించి, సురస యేగిన ననుమ యంబరముఁ జేరె.

వ. అంత. 257

శా. పారావారవచఃప్రకారము జల ప్రాదుర్భవంబై మణీ
సారాంచచ్ఛిఖరమ్ములన్ మనుజభా షల్ మీఱ మైనాక మా
మారుత్యధ్వపరిశ్రమాపనుతికై మర్యాదగాఁ బల్కె నో
వీరాగ్రేసర ! స్వాదుపక్వఫలముల్ విశ్రాంతి భక్షింపుమా ! 258

వ. ఓ మరున్నందనా ! నీ కొఱకే నేగుదెంచితి నినుఁ బూజింపఁదలఁచి కోరుచుంటిని. మున్నింద్రునకుఁ బర్వతమ్ములకును యుద్ధము జరుగునప్పు డింద్రునివలన భయంబు రాకుండ దశరథుండు నన్నీసాగరంబున మనిచె, దాన నవిపక్షుండ నైతిఁ గాన నీ కవిపక్షుండనే జుమా ! తత్కృతప్రతికృతికై రామకార్యార్థ మేగు నినుఁ బూజించిన దశరథుండు పూజితుం డగుఁ గావున నిట విశ్రమించి స్వాదుఫలమ్ము లారగించి నన్ను మన్నించి యేగు మన వానిం జూచి మారుతి యను నశ్రమునకు విశ్రమ మేల ? రామకార్యంబు సమాప్తి నొందునంతవఱకు విశ్రమంబు ఫలాహారాదుల నొల్ల నన మైనాకుం డో పూజ్యుఁడా! భవత్కరస్పర్శనలాభంబైన నా కొడఁగూర్చి యనుగ్రహింపు మన నట్లొనర్చి యేగుచు. 259

శా. వాయుస్థానమునుండి వాయుజుఁడు పోవం జూచి తచ్ఛాయనున్
ఛాయాగ్రాహిణి పట్ట మారుతగతి స్తంభిత్వని శ్చేష్టుఁడై

యా యంభోధి వశంబుఁ దప్పి పడి భీతాత్ముండు నై సింహదై
తేయుఁ గ్రస్తశరీరుఁడై తలఁచెఁ దశత్సింహాసురిం జంపఁగాన్. 260

ఆ. వె. కడుపులోననుండి ఖరనఖరాళిచే, నాంత్రములను ద్రెంచి యధికరోష
మొంది పొట్టఁ జీల్చి యుసురులఁ బోఁగొట్టి, మింటి కెగసిపోయెఁ దొంటియట్లు.

## హనుమంతుఁడు లంకఁ జేరుట

ఉ. ఈపగిదిం బయోధిఁ దరియించియు నావలియొడ్డుఁ జేరి లం
కాపురిచెంత నిల్చి యటఁ గ్రొంచి యనంగ దశాస్యుఁ జెల్లెలన్
గోపముతోడఁ జంపి నిశిఁ గొంచెపురూపున నూరు సేర లం
కాపురనామరాక్షసి యఖండరుమం గపి నాఁగి యిట్లనెన్. 262

ఉ. ఎవ్వఁడ వీవు ప్రోలి కిటు లేఁగఁగనీ నటుపాటిపో మ్మనన్
నవ్వుచు వామముష్టిహతి నాఁతిని మూర్ఛిలఁ జేయ లేచి తా
నవ్విధివాక్యముల్ దలఁచి యశ్రులు రాల్చుచు నామె పల్కె న
న్నివ్విధి నీవు గెల్చుటఁ గపే! పురికెల్లను జేటు మూఁడెడిన్. 263

చ. నలువ యొకప్పు డిట్లనియె నాఁతిరో! నిన్నొకవానరుండు దా
బలిమి జయించు నంతటనె పట్టణమెల్ల నశించు రావణుం
డలరఘురాముచేఁ జెడు నటం చనె గెల్చితి వీ వశోకమం
దలధరణీజఁ జూడఁ జనుమా యనుమా! యనుమాన మేటికిన్. 264

ఉ. లంక వచించుపల్కు విని లాఘవ మొప్పఁగ వాయుజుండు ని
శ్శంకత వామపాదమును సాలముపై నిడి ప్రోలుఁ జేరి న
ల్వంకలఁ జూచి నెమ్మది సెబాసని మెచ్చుచ గాలికిన్ గడున్
జంకగు నీపురిం జొఱ నసాధ్యము దీని జయించు టెంతయున్. 265

శా. లంకాపట్టణ మింతయొప్పునొకొ హాలాపానమాద్యన్ని రా
తంకప్రాజ్యనిశాటపర్యటనయుక్తంబై ధరాస్వఃపురీ
శంకం గూర్చుచు సన్మణీమయమహాసౌధాన్వితంబై ధరా
లంకారాకృతి నొప్పి భాసిలె నహో! లక్ష్మీనివాసం బనన్. 266

ఉ. అంబరచుంబిగోపురగణాగ్రవిరాజితశాతకుంభకా
దంబమణీఘృణిప్రచురతాలలితంబయి దృష్టిరోధకా

లాంబుదతుల్యగాఢతిమిరాళితిరస్కృతిదక్షయామినీ
ద్బింబయుతాంబరంబువలెఁ బ్రీతి నొసంగు కరంబు బాపురే! 267

మ. కలధౌతామలసౌధజాలవిచరత్కాంతాళిసోపానమం
జులసంచారపదాబ్జనూపురయుగస్యూతాలసద్ఘంటికా
కలనాదమ్ములు శంఖదుందుభిమృదంగధ్వానముల్ మీఱ శ్రీ
లలనావాసమునై పురంబు కడు నుల్లాసప్రదంబై తగెన్. 268

## హనుమంతుఁడు సీత నన్వేషించుట

ఉ. ఆనగరీవిలాస మిటు లాతఁడు గాంచుచు దివ్యసౌధసం
తానములెల్ల సూక్ష్మతనుధారిగఁ దూఱుచు నొక్కచో గుహా
స్థానగతున్ ఘటశ్రవణదానవునిం గని వెన్క భక్తిసం
ధాను విభీషణుం గనియె దానవసద్గుణశూన్యు నొక్కెడన్. 269

గీ. ఒక్కయింట సులోచనాయుక్తుఁ డగుచు, నిదురఁ జెందెడి దేవతానేతృజేతఁ
గాంచి మారుతి యాదశకంఠగృహముఁ, జేరి నెమకుచు నుండె నాసీతకొఱకు.

గీ. వాయురూపముతోడ నవ్వాయుసుతుఁడు, అచటిదివ్వెల నన్నియు నార్పి నిదురఁ
జెందు నారావణాదుల చేలములను, బరియలుగఁ జించి దిసమొలవారిఁ జేసె.

సీ. కొఱవిచే రావణు కఱకుగడ్డము మీస,ములు గాల్చి రక్కసమూకనెల్ల
వెస దిగంబరలఁ గావించి మారుతి నీటి, కడవల రక్కసిగమికిఁ గట్టి
తోఁకఁ జుట్టఁగఁ బెట్టి దూతలఁ గొట్టిన, వార లొండొరు భీతిఁ బల్కి రిట్లు
కారణం బేమియుఁ గల్గకుండఁగ నిట్టి, విపరీతములు సంభవించు టేమొ

గీ. సీత మదిలోనఁ గోపంబుఁ జెందెనేమొ, మనకుఁ బ్రాణాంత మగునొ! భూతనయఁ
దెచ్చె, రక్కసులఱేఁడు సతుల నిరాకరింపఁ, జేటు లొందక సుఖములు జెందఁదరమె?

గీ. అనెడి వారలనుడులెల్ల నాలకించి, సీతఁ గానక పుష్పకస్థితుని నసుర
వల్లభునిఁ జూచి యాచెంతఁ బవ్వళించు, తత్సతిం గాంచి చకితుఁడై ధరణిజ యని.

చ. తలఁచుచు లక్ష్మణోక్తమగు తజ్జనకాత్మజనేనిలక్షణ
మ్ములు నట లేమి సంశయముఁ బొందియు సీతను బోలుటన్ మదిన్
గలవిలపాటుఁ జెంది యటుఁ గాంచుచు నుండె మరుత్సుతుం డనన్
బలికె మహేశుతో నపుడు పార్వతి సంశయమగ్నచిత్తయై. 274

గీ. రక్కసను జూచి సీత యట్ల । భ్రమ మదేల?, ధరణిజాంశాంశముల భువి । దరుణులెల్లఁ
బుట్టియుందురటంచుఁ జె । ప్పుదురు దాని,నిజము సెలవిమ్ము మృదుభాష । భుజగభూష!

## మందోదరీ జన్మవృత్తాంతము

గీ. అనఁగఁ బరమేశుఁ డిట్లనె । నద్రిజాత !, కలుగుకారణ మెల్లను । బలుకువాఁడ
వినుము మందోదరియు సీత । యును వికుంఠ,ధామనిర్మితలే సుమ్ము । తథ్యముగను.

ఉ. రావణమాత కైకసి క । రంబు వెతంగొని పుత్రుఁ జూచి యో
రావణ ! నాదులింగ మహి । రాణ్ముఖవాయువుచే నధోగతిన్
భూవివరంబుఁ జేరె శివుఁ । బూజలఁ దప్పి తదీయలింగముల్
నీవు గ్రహించి తెమ్మిటకు । నే ముదమందఁగ నన్న నత్తఱిన్. 277

ఉ. గానముచేత నన్నసుర । కౌతుక మందఁగఁజేసి భక్తిమై
మానుగ రెండుకోర్కు లిడు । మా శివ ! తల్లికి శైవలింగమున్
దానము సేయు మద్రిజను । దారగ నాకిడు మంచు వేఁడినన్
దానవనేత కిచ్చితిఁ బ । దంపడి నిన్నును నాత్మలింగమున్. 278

వ. ఇట్లిచ్చినఁ గైకొని యేగనున్న రావణుం గని యే నిట్లంటి. 279

శా. ఓ లంకేశ్వర ! నాదురూపమగు నీ । యుత్కృష్టపూ లింగముల్
నేలం బెట్టితివేని యచ్చటనె నే । నిల్తుం జుమా ! యన్న వాఁ
డాలింగమ్మును నిన్నుఁ గైకొని రయం । బారంగఁ దాఁ బోవుచో
శైలేంద్రాత్మజ ! నీవు విష్ణుని మదిన్ । సద్భక్తిఁ బ్రార్థించినన్. 280

చ. హరి ముదమందుచున్ మలయ । జాదికవస్తువిశేషశక్తిచే
సిరి యన నొప్పుసుందరిని । జేసి మయుం గని వాని కిచ్చె నా
సరసిజనేత్ర పుత్రి యని । సంతసమంది పరిగ్రహించి వాఁ
డరిగి రసాతలమ్మునకు । నామెను బెంచుచునుండెఁ బ్రేముడిన్. 281

చ. హరి యొకపాఱుఁడై సరణి । నద్దశకంఠుని జూచి యిట్లనెన్
బరమశివుండు కృత్రిమపుఁ । బార్వతి నీకిడె సత్యపార్వతిన్
సురనరలోకచారి వటఁ । జూడ వటంచు రసాతలంబునం
దరయఁగ దాచెఁ దా మయగృ । హంబున నచ్చటి కేగి చూడుమా. 282

చ. హరుఁ డిటు మోసగించెఁ జుమి । యాతని కిమ్మిఁకఁ గృత్రిమాద్రిజన్
సరసిజవాసినీసమను । సత్యగిరీంద్రజఁ దెచ్చి భార్యగా

నిరుపమసౌఖ్యముల్ గొనుము | నీ వన నిక్క మటంచు రావణుం
డరసి మదీయసన్నిధికి | నాగతుఁడై యిటు పల్కెఁ బార్వతీ! 283

చ. ననుఁ గని నవ్వి యీశ! తగునా యిటు మోసముఁ జేయ మాయఁబో
మ్మను సతి యంచు నా కిడియు | మంతనమందు యథార్థపార్వతిం
గొని బలిగేహమం దిడుట | కూడునె? చాలిఁక గుప్తపార్వతిం
గొనెద నటంచు ని న్విడిచి | గొబ్బున నేగె దశాస్యుఁ డత్తఱిన్. 284

వ. ఇట్లు నిన్ను నాకర్షించి రసాతలజిగమిషతోఁ జని చని మధ్యమార్గమ్మున మున్ను జూచిన నేలవేల్పుం గని యాతం డను నో ద్విజవర్యా! నీచెప్పినచొప్పున రసాతలంబున కేగెదఁ గాని యీలింగంబును ముహూర్తకాలమ్ముఁ గైకొను, మేను శుచినై కాల్యంబు నిర్వర్తించి కైకొందు నన నవ్విప్రుం డను నొక్కముహూర్తకాలంబె దీనిం దాల్తుఁ దత్కాల మతిక్రమించిన దీని నే భూమిం బెట్టి పోదు నన నంగీకరించి రావణుం డాలింగము నాతని కిచ్చి స్వకృత్యము నెఱవేర్చుకొన నేగిన నంత భగవన్మాయచే రావణుండు కొండొకసే పాలసించుట ముహూర్తకాల మతిక్రమింప నాద్విజరూపహరి యాలింగమును బశ్చిమసముద్రతీరమగు నప్పుడమి నిడి తన తావున కేగె. రావణుండును గృతశౌచుండై వచ్చి భూగతలింగముం జూచి కాల మతిక్రమించెఁగాఁబోలు నని యెంచి తల్లింగశిరోభాగంబును గరంబుచేఁ బట్టి కైకొననెంచి లాగినఁ గదలకుండుట కచ్చెరు వొందె, నాలింగశిరోభాగంబునఁ గర్ణరంధ్రసదృశరంధ్రం బయ్యెఁ, దాదృశలింగసహితభూమియగుట నయ్యది గోకర్ణక్షేత్రం బన నేఁటికిం బ్రసిద్ధి నొందియుండు, నంత రావణుండు దుఃఖించి లింగనిరాశుండై రసాతలంబుఁ జేరి మయునిఁ బ్రార్థింప మందోదరీనామకతనుజాత నాతని కిచ్చి వివాహం బొనర్చి మఱియును, 285

సీ. మయుఁ డల్లునకు బహుమానంబుగా శత్రు, ఘాతియు దృఢ మమోఘంబు నైన
శక్తి నిచ్చిన వాఁడు | సంతసం బెద నొంది, మందోదరిని గొం చమందగతిని
బురిఁ జేరి యున్న నా | పుత్రుని నొకనాఁడు, కైకసి నిందింపఁగా నతండు
తపముఁ జేసెద నంచుఁ | దక్షిణంబున నేగెఁ, గడుముదమ్మునను గోకర్ణమునకు
తే. తపముచే బ్రహ్మ మెప్పించి | దానవుండు, కామ్యముల నొంది పిదప లోకత్రయంబు
స్వవశముగఁ జేసి సర్వసంపదలతోడ, లంకఁ బాలించుఁ దా నిరాతంకగతిని. 286

చ. హరికృతమైన రావణునియాలియు సీతయు నొక్కరూపుగాఁ
బరఁగుట కిద్ది హేతు విటు | పావని రావణపత్నిఁ జూచి తా

ధరణిజ యంచు భ్రాంతిఁ గొనెఁ । దజ్జనకుండు మయుండు వానిసో
దరుఁడు గయుండు బ్రహ్మవర । దర్పితు లప్పురినుండి రిమ్ముగన్. 287

వ. ఇట్లు బ్రహ్మవరగర్వితులయిన సోదరులలో గయుండనువానికి రావణునివలన మరణం బను విధివాక్యంబు నెఱింగి హనుమంతుఁడు మున్ను దాను విప్పిన గయునివసనంబు రావణపర్యంకమున నిడి యిటులు కాపేయకృత్యముల నొనర్చుచు సీత నంతట నెమకి పిదప స్వప్రాసాదంబగు రమణీయాశోకోపవనంబుఁ జేరి శింశుపావృక్షమూలమ్మున రాక్షసీగణపరివృతయైన సీతం గాంచి తద్భూజపర్ణాంతరలీనుండై యుండి మఱియును. 288

## హనుమంతుఁడు సీతం గాంచుట

చ. మలినపటావృతం గృశను । మానసదుఃఖయుత న్నిశాచరీ
జలధరమాలికాంతరల । సచ్చపలాకృతి నున్న దాని భూ
తలగత నేకవేణిని నితాంతవియోగజదుఃఖమగ్నయై
సలలితరామనామమును । సంస్మృతిఁ జేసెడుసీతఁ గాంచుచున్. 289

ఉ. మారుతి యామె నంతట క్షమాసుత యంచుఁ దలంచె నాయలం
కారములందు మున్ను గిరిఁ । గాంచిన భూషలు లేవు గాన నీ
సారసనేత్ర రామవిభు । జాయయె సందియ మేమి? బాపురే!
మారుతి సీతఁ గాంచెనను । మాన్యయశంబు లభించె నా కిలన్. 290

వ. ఇట్లు తలంచుచు హనుమంతుం డసామాన్యతదీయదివ్యలక్షణంబుల నవలోకించుచు సీత యని నిశ్చయంబంది సంతసించుచుండునంత. 291

సీ. ఆరేయి నిద్రలో । నసురవల్లభుఁ డొక్క, కపి వచ్చి యాయశోకవనమందు
నవనిజఁ గని మాట । లాడినట్టులు కలఁ, గాంచి యప్పుడె లేచి । కౌసలేయు
వలన మృత్యువు నాకుఁ । గలుగు నిక్కము గాన, సీతను భీతిల్లఁ । జేయుదు నిపు
డట్టులైనను వార్త । నారాముఁ డాలించి, సత్వరమ్మున వచ్చి । చంపు నన్ను
తే. ఆరఘూత్తముచేత నే । హతుఁడ నగుచు, ముక్తికాంతను జేకొనఁ । బోదు నింత
కంటె నాకింకఁ బున్నెంబు । గల్గునొక్కొ, యనుచు నిశ్చయమొంది యా । యసురవరుఁడు.

చ. సరసిజలోచనల్ గొలువ । సంభ్రమ మొప్పఁగ దీపికావళిం
గరములఁ దాల్చి పార్శ్వములఁ । గాంతలు రాఁగఁ గిరీటభూషణాం

బరములఁ దాల్చి రావణుఁడు । భావములోపల మాతృభక్తి, పై
నరయఁగఁ గామము న్వొలయ । నాయవనీజను జూడ నేగుచోన్. 293

ఉ. కాంతలకాలియందెలని । కామఘుళంఘుళరావము న్వనా
క్రాంతతదీయపాదయుగ । ఘట్టనరావము నాలకించి లో
వంత జనింప రావణుఁడు । వచ్చెడు నంచును సీత సాధ్వసా
క్రాంతమనస్కయౌచు రఘు । రాముఁ దలంచుచు నుండె దీనతన్. 294

ఉ. బాలిశుఁడైన రావణుఁడు । పావనయౌ ధరణీజఁ గాంచి నీ
వేలొకొ సిగ్గు నొందెదవు । హీనుఁడు రాజ్యనిరస్తుఁ డాప్తబం
ధ్వాళిధనాదిహీనుఁడు వ।నాటుఁడు నీయెడఁ బ్రేమలేనిదు
శ్శీలుఁడు నైన రాముపయిఁ । జిత్తము వీడి నను న్వరింపుమా ! 295

తే. జడలు నారలు ధరియించు । జడుఁడు రాజ్య, భోగశూన్యుండు జనకుఁడు । పొమ్మనంగఁ
గాన కేగు నశక్తుఁ డే। కాకి యట్టి, హీను విడనాడి న న్భజి। యింపు మబల. 296

సీ. లోకముల్ నాయాజ్ఞ । లో నుండె మద్బాహు, బలముచే నెల్లరు । వశ్యులైరి
న న్జయించెడివాఁడు । నరసురామల లేఁడు, దేవవేశ్యలచేత । సేవఁగొందు
మందోదరీముఖ్య । సుందరు లెల్లరు, నిన్ను సేవింతురు । నీరజాక్షి !
నారాజ్యసంపదల్ । నాజీవితంబును, నీయధీనములుగాఁ । జేయువాఁడ

తే. నన్నుఁగూడుము త్రైలోక్య । నాయకుండ, సిరులుగలవాఁడ నినుఁజూచి । మరులుగొంటి
రాముఁ డెప్పుడైన నిచటికి । రాఁగలండె, యట్టియడియాస మానుమా । యనఁగ నంత.

ఉ. క్రిందికిఁ జూచుచుం దృణముఁ । గేలను నడ్డుగఁ బట్టి జానకీ
సుందరి యిట్లనెన్ ఖలుఁడ ! । చోరునిరీతిగ రామభీతి లో
నొందియె భిక్షువైఖరి స। హోదరు లిద్దఱు లేమి యాగస
న్మందిరహవ్యము న్సరమ । మాద్రిగఁ దెచ్చితి నన్ను దుర్మతీ ! 298

ఉ. ఆకపటంపుసేతకు ఫ । లానుభవం బికఁ నీచ ! వేగమే
నీకగు రామబాణములు । నీదగు కాయముఁ గండకండగాఁ
జోకడఁ బెట్టువేళ రఘు । భూపశిఖామణి రాముఁ డెట్టిఁడో
నాకవిరోధి ! నీమనము । న న్గ్రహియింతువులెమ్ము రావణా ! 299

సీ. జగములెల్లను గెల్చి । జగజెట్టి వైతేని, రామచంద్రునిఁ గొట్టి । రాదె నాఁడు
ఖరదూషణాదుల । ఖండించె ననువార్త, విన నీకుఁ జెవులు లే । వే దురాత్మ !

ఆపగఁ దీర్ప శూరాగ్రణి వైయున్న, రాముఁ మోలకు రా వదేమి మూర్ఖ!
సోదరు ల్లేకుంటఁ జూచి తస్కరవృత్తి, నిటకు నన్ దెచ్చి సిగ్గేలకొనవు

తే. కాల మాసన్నమైన యాకారణమున, నన్నుఁ దెచ్చితి దశకంఠ! నాశమొందు
నీదులంకాపురంబెల్ల నిశ్చయంబు, సతుల బాధించుఖలులకు బ్రతుకఁ దరమె?

చ. అని పరుషంబు లాడెడి ధరాత్మజఁ గ్రోధనిరీక్షణంబులం
గని తల లూచుచు న్నరులు గాదు సురాసురకిన్నరాదులున్
నను దురమందు గెల్తు రన నమ్మకుమా రఘురాముఁ డన్న నేఁ
గనియెద నొక్కకీటకము గా నతనిం గడ తేర్చు టబ్రమే! 301

శిఖరిణి. తిరంబై యీలంకన్ "ద్రి"దశవదనాతివ్యథ యగున్
హరుం డైనం గానీ "య"సుకరము న న్నాజి గెలువన్
విరాధద్విట్టుచ్చై"ర్వి"పదసుఖలబ్ధిం గొను జయో
త్కరం బారాముం డెం"ద"దు కొనెద నే తన్మద మిలన్. 302

చ. అన విని సీత యిట్లనియె నాసురవల్లభ! నీదుపద్యమం
దున నలుకాలులందు వెసఁ దోఁచెడు సప్తమమైనవర్ణముం
బనివడి వీడి శిష్టమగు పద్యముఁ బాఠము సేయ నర్థ మే
యనువునఁ దోఁచు నట్లగుఁ జుమా యనుమానము లేదు సుంతయున్. 303

చ. అని వచనాంబకంబుల ధరాత్మజచే హతుఁ డౌట రావణుం
డనుపమరోష మొంది భయదాకృతి ఖడ్గముఁ గేలఁ దాల్చి సీ
తను వధియింతు నంచును ద్రుతంబుగఁ బైఁ బడఁబోవునంత నా
తనిసతి యాఁగి తత్కరముఁ దాఁ గొని వీఁగనివీఁక నిట్లనెన్. 304

తే. నాథ! ననుఁబోలు చెలువంపునారు లుండ, దీనఁ గృశ దీని నేలొకో దేవురింప
నన్ను మించినయంద మీనాఁటి కున్నె, ఏల విభ్రాంతిఁ గొనఁగఁ బ్రాణేశ! రమ్ము.

చం. అనఁగ దశాస్యుఁ డంత నసురాంగనలం గని పల్కె మీరు సీ
తను బహుసాంత్వనమ్ములను దర్జనభర్జనసాధనంబుల
న్నను వరియించునట్టులు పొనర్పుఁడు మీ తగునేర్పు లేర్పడం
గనుఁ డిటు రెండుమాసములకాలము దా నటు లొప్పకుండినన్. 306

తే. గడువులోపల నాతోడఁ గలియకున్న, శయ్యపైఁ జేరకున్న నీచానఁ జంపి
క్రవ్యమును వండి భోజనకాలమునకుఁ, దెండు మీరలు తృప్తిమైఁ దినెద నపుడు.

సీ. అప్పుడు రావణుఁ జూచి యనె సీత మణిరూప, మున నున్న నన్నీవు పురికిఁ దేవె
బాలనై బరిణెలోపలనుండి పల్కితి, విస్మృతిఁ జెందితే వీరమాని
యిప్పుడేగి తిరిగి యే నేతెంతు నిచటికిఁ, బుత్రాదియుతు నిన్నుఁ బొలియఁజేయ
నని చెప్పియుంటి రామునిచేతఁ గూల్పించి, మాయయోధ్యకు నేను బోయి మరల
తే. వచ్చి మా తాతమహనునియింట వఱలువాని, పౌండ్రకుని కుంభజునిఁ జంపినవానికొఱకు
నరుగుదెంచినవాని శతాస్యరావ,ణాసురుంగూడఁ జంపెద నద్భుతముగ. 308

తే. పుష్పకారూఢనై వచ్చి పొలసుదిండి!, నాలుగవసారి సీదగు ప్రోలుఁ జేరి
కుంభకర్ణోద్భవుఁడు మూలకుండు నాఁగఁ, దనరువాని హరింతు శస్త్రములఁ గలన.
చం. మునుపటిబ్రహ్మవాక్యమును బొల్పుగ లోనఁ దలంపు మీవు రా
మునితలిదండ్రుల న్మొదటఁ బ్రోలికిఁ దెచ్చియుఁ బెట్టి నుంచి వా
రిని హరియింపఁజూడఁగ విరించి యదల్చిన మాని వారలం
బనుప వాకో యయోధ్య కటు వాక్పతివాగ్జనితాతిభీతిచేన్. 310

తే. చచ్చుటకె నీవు నన్నిటు తెచ్చియుంటి, వరుగు మింటికి భోగంబు లనుభవింప
శ్రీరఘుస్వామి నినుఁ జంపు శీఘ్రముగను, బారలౌకికసుకృతసంపాది వగుము.
తే. జనకజావాక్ఛరాహతసర్వమర్ముఁ, డగుచు రావణుఁ డేగె నిజాలయమున
కంత రాక్షసభామిను లధిపునాజ్ఞ, వివిధబాధలఁ బెట్టి రుర్వీతనూజ. 312

సీ. వికృతంబుగా నోరు విప్పుచు నొక్కతె, సీత మ్రింగెద నంచుఁ జెలఁగి యార్చెఁ
గరవాలమున సీతఁ గడతేర్తు నని యొక్క, రక్కసి చిందులు ద్రొక్కె నచట
రాక్షసేశుని కింక రాణివి కాకున్నఁ, జంపెద నిన్ను నే జాన యొకతె
రావణదారవై రాజ్య మేలఁగరాదె, హీనుఁడౌ భర్తకై యేడ్వ నేల
తే. వట్టియడియాస లేల జీవనము దూల, ముదిమి యగువేళ భోగము లొందనేల
తెలియ వినవేల యకట! నీ తెలివి గాల, యంచు వారలు సీత బాధించువేళ.
వ. వారల నివారించి విభీషణజాయాసహచారిణి యగు త్రిజట యా రాక్షసాంగనలతో
సాదరంబుగ నిట్లనియె. 314

## త్రిజటాస్వప్నవృత్తాంతము

మ. కలఁ గంటిన్ సతులార! సీతకు నమస్కారమ్ము లర్పింపుఁడీ
లలితాకారత వచ్చి రామవిభుఁ డీ లంకాపురిం గాల్చి యీ

పలలాశాధిపు రావణుం డనిమి దీవ్యత్పుష్పకారూఢుఁడై
కలకంఠిన్ ధరణీజఁ గూడి చనఁగాఁ గంటిన్ ధనేశాశకున్. 315

చం. భయములఁ బెట్టఁబోకుఁ డికఁ బ్రాణవిభు న్రఘురాము నాత్మ నెం
తయు విమలంపుభక్తిఁ గొని తత్పరయై తలపోయుసీతతో
జయ జయ రామచంద్ర యని సన్నుతిఁ జేసిన నామె మెచ్చు మీ
భయములు వోవు ముక్తిఁ గొనవచ్చును రాముని సంస్మరించినన్. 316

చం. మఱియును రావణుండు పలుమాటలు హాసించుచుఁ దైలసిక్తుఁ డం
బరరహితుండునై ఖరముపై వడి నెక్కి యమాశఁ బోవు చం
తరమున గోమయహ్రదమునం బడినట్టులు చూచితిం జుడీ!
పురమునకెల్లఁ జేటనుచుఁ బొల్పుగఁ దెల్పెడు స్వప్న మక్కటా! 317

తే. ఇట్లు కలఁ గాంచి యుంటి నో యింతులార! సీత సేవింపవలయును జెడ్డసేత
వలదు మనమీఁదఁ గృప నీమె కలిగియున్న, రామచంద్రునిచేఁ గీడు రాదుమనకు.

తే. తెలియఁజాలక సీత బాధించితేని, విభునితోఁ దెల్పి మనలఁ జంపించు మఱియు
సేవఁ జేయంగ మనల రక్షింపఁజేయుఁ, గాన సీతను గొల్వుఁడీ కాంతలార!

చం. అను త్రిజటోక్తి నమ్మి యసురాంగన లెల్లరు భీతచిత్తలై
వనరుచు సీత నంతఁ గడుభక్తి భజించుచుఁ దర్జనాదివ
ర్జనమతి నస్మదీయమగు ప్రాణము మానము దక్కె నెట్లొకో
యని మఱుమాటలాడకయె యచ్చట నుండిరి రావణాజ్ఞచేన్. 320

ఉ. ఆసురకాంతలెల్ల రిటు లాడినకర్ణకఠోరవాక్యముల్
భూసుత లోఁ దలంచుచును బొక్కుచుఁ గన్నవ నీరు గార ను
చ్ఛ్వాసపరంపరం గొనుచుఁ బ్రాణవిభుం దలపోసి పొక్కుచున్
దోసము లేమి చేసితినొ దుఃఖము లీగతిఁ గల్గె నక్కటా! 321

ఉ. భూమి జనించి మైథిలుని పుత్రికనై రఘురామభార్యనై
భూమయశంబు నొందియును భూపరిపాలన మాచరించు శ్రీ
రాముని రాజ్యపీఠమున రంజిలుపుణ్యఫలంబు బ్రహ్మ నా
మోమున వ్రాయఁడయ్యె వనభూముల కేగ విధించె నయ్యయో! 322

తే. అల్పపుణ్యం బొనర్చి మహాఫలంబుఁ, గోరుకొన్న లభించునే యెరికైనఁ
బాప మొనరించి సౌఖ్యము ల్వడయఁ దరమె, పాపఫల మేల తప్పు నెవ్వారికైన.

మ. కడుసౌఖ్యాన్వితు లైనదంపతుల కేకాలంబునం దేను ము
న్నెడఁబాటుల్ ఘటియించినానొ ఫల మిట్లీబామునం బ్రాప్తమై
యెడఁబా టీగతి సంభవించెఁ బతితో నీజన్మ మేలా యికన్
గడతేరం దగుఁగాక యెంతకని యీకష్టంబు లే నోర్చెదన్. 324

ఉ. నాథపదారవిందభజనం బది రాజ్యసుఖంబుకంటె మో
దాధిక మంచుఁ గానలకు నాతనితోఁ బయనించి వచ్చితిన్
నాథుని వీడి యీయసురనాథబలాహృతనై మహాశుగం
భోధి నిమగ్ననైతిఁ దటభూమికిఁ జేరఁగలేను దైవమా! 325

సీ. కైకేయి పురిఁ బాపి ఘనుని నానాథుని. వనవాస మొనరింపఁ బనుపు టేల
నాఁడు నే బంగారు లేఁడి దెమ్మని రామ,భద్రుని బలిమిమైఁ బంప నేల
నన్నుఁ గాచుటకుఁ దా నాథాజ్ఞఁ గొనిన రా,మానుజుఁ దిట్టి నే ననుచు టేల
గెర దాటరాదని మఱఁది చెప్పిన మేల్మి, మాట దానవమాయ దాట నేల
తే. పురుషనియమంబుఁ దప్పినపువ్వుఁబోండ్లు,మాయికులమాట నమ్మెడుమానవతులుఁ
జేటు లొందక సుఖములఁ జెందఁగలరె, నేనె సాక్షిని దీనికి నిక్క మకట!

మ. అకలంకాత్మ నగారబంధుహితదారార్థమ్ముల న్వీడి యూ
రక రాము న్ననుఁ గొల్వవచ్చినఘనున్ రామానుజుం దిట్టు నా
ప్రకటాఘ మ్మది ఘోరదానవసతీవారమ్మునం ద్రోచి న
న్నకటా! బాధలఁ బెట్టుచుండెఁ గృత మేలా పోవు వ్యర్థమ్ముగాన్. 327

శా. ఆనాఁ డాడినమాటలం దలఁచి నాయాత్మన్ వ్యథాభార మి
ట్లీనాఁ డెంతయుఁ జెందనయ్యెనుగదా? యేదోషము ల్లేనివాఁ
డానాఁ డెంతగఁ గుందెనో మఱఁది యాహా! సాధుసంతాపముల్
పో నాధారముఁ గల్గునే ఫల మిలన్ భోజ్యంబు గా కక్కటా! 328

శా. ప్రాణంబుల్ విడనాడుటే తగిన ప్రాయశ్చిత్తమా, లేదు సం
త్రాణం బన్యము, లేవు చత్తు నన నస్త్రంబుల్ విషాగ్న్యాదుల్
వేణిం గంఠముఁ గట్టి యీకుజమున న్వ్రేలాడుచున్ జచ్చెదన్
ప్రాణాంతమ్మునఁ గాని పోవు రుజలుం బ్రాపించుదుఃఖమ్ములున్. 329

వ. అని చిరము చింతించి పార్శ్వచారిణులగు రాక్షసాంగనలు నిద్రాముద్రితలై యుం
డుట గుఱుతించి యాభూజాత యశోకభూజశాఖాంతికమ్మున మరణమ్మున కుద్య
మించి. 330

ఉ. చాగురె! యెట్టిదాని కెటు సంభవ మయ్యె నవస్థ? భర్తృసం
యోగఫలంబు నొందు సుకృతోన్నతి లేదిఁక నెన్నఁడేని నీ
లాగున దుఃఖ మెట్టినవలాలకుఁ జేకురకుండుఁగాపుతన్
రాఁగలజన్మమందు రఘురాముఁడె నాథవుఁ డౌనుగావుతన్. 331

## హనుమంతుఁడు సీతతో మాటలాడుట

చం. అని మరణేచ్ఛనుండెడి ధరాత్మజఁ గాంచి మరుత్సుతుండు రా
మునిచరితంబు సర్వమును మోదకరమ్ముగ సీత లంకకుం
జనుదనుకం గ్రమమ్మునఁ బ్రశస్తవచోమధురార్థసంపద
న్వినిచిన సీత సంతసము వింత మది న్గొని వల్కె నీగతిన్. 332

చం. కల నిటు గంటినా? నిదురఁగానమి స్వప్న మదెట్లగు న్వియ
త్తలమున రామసత్కథ సుధామధురంబుగఁ బుట్టె వింటి నా
పలికినపుణ్యశాలి ప్రియవాది ననుం గరుణించి మ్రోలనే
నిలిచి వచించుఁగాక నవనీతసుధామృదుమాధురీగతిన్. 333

చం. అన విని యామరుత్తనయుఁ డక్షణమందె ధరాజచెంతకుం
జని జననీ! యటంచు నతి సల్పి గతించినగాథఁ దెల్పి రా
మునిరుచిరాంగుళీయకము మోదముమీఱ నొసంగె నంత వం
దనములతో గ్రహించి నిజనాథుని జూచినరీతిఁ బొంగుచున్. 334

చం. అతిముదమంది సీత మరుదాత్మజుతో నను వానరోత్తమా!
మృతిఁగొననున్న నా కిటులు మేలగువార్తను దెల్పి పుణ్యుఁడా!
బ్రతకఁగఁ జేసి తీవు నినుఁ బ్రస్తుతిఁ జేయఁగ నాతరంబె యే
గతి నీకఁ దీర్తు నీఋణముఁ? గైకొనుమయ్య నమస్కృతమ్ములన్. 335

ఉ. వింటివి కాదె? రావణుని వింతనుడుల్ గడువిచ్చి పోకయుం
గంటివి కాదె? రక్కసులు కాఱులు ప్రేలుచు బాధపెట్టు టే
నొంటిగ దీననై యిచట నుండుట గంటివి నాయవస్థలన్
బంటుతనంబు నిల్పికొన నైళమ రామునిఁ దెమ్ము మారుతీ! 336

వ. అన విని సీత నోదార్చి హనుమంతుం డిట్లనియె. 337

ఉ. అమ్మరో! "విన్నవింతు సకలార్థము రాముని కాతఁడున్ మదం
సమ్ములపై వసించి పటుసారభుజాఢ్యములైన కోఁతిమొ

త్తమ్ములతోడ వచ్చి తనతమ్ముఁడు చెంత వసింప నింక రే
ద్రిమ్మరియా దశాస్యుని వధించి నినుం గొనిపోవు నమ్ముమా ! 338

చం. అని “యితఁ డల్పదేహుఁడుగదా రఘురాముని మాయఁజాలునే
యని ధరణిజ సందియము నందు” నటం చతఁ డెంచి సీతకున్
ఘననిజరూప మచ్చటఁ గనంబడఁజేసి వచించెఁ దల్లి ! లం
కను బెకలించి యెత్తి దశకంఠయుతంబుగఁ గొంచు నేగెదన్. 339

సీ. అని భూమిజకుఁ బ్రత్యయార్థంబుగా రాముఁ, డానాఁడు చిత్రకూటాద్రియందు
మణిశిలచేఁ దాను మకరికాపత్రముల్, తిలకంబు బెట్టుటావెగ సమస్త
పూర్వవృత్తముఁ దెల్పి ముదమొందు సీతను, గాంచి యిట్లనెఁ దల్లి! కదలిపోదు
ననుమతి నిడ్న నాకు నానవా లిమ్మనఁ, జూడామణిని వాయుసుతున కిచ్చి

తే. చిత్రకూటాద్రిఁ గాకచారిత్ర మెల్లఁ, బలికి రామున కిది యానవాలు గాఁగఁ
దెల్పుమా యను రాముని దేవి కెఱఁగి, మదిని దలపోసె నట హనుమంతుఁడిట్లు.

తే. స్వామికార్యంబు సర్వంబు సలిపియుంటి, నేను వచ్చినవార్త యూదానవులకుఁ
బ్రకటనముగాఁగ వికృతంపుఁబని యొకండు,సల్పి దశకంఠుఁ గాంచియేఁచ నెదఁబిదప.

చం. అని మది నిశ్చయించి జనకాత్మజతో ననుఁ దల్లి ! యాఁకలిన్
గొని యిటు డస్సియుంటి నిటఁ గోరినచుట్టులు పండ్లు దిందు నీ
వనుమతి నిమ్మనంగ సతి హస్తగకంకణ మూడ్చిపట్టి దీ
నిని నెలఁబెట్టి యంగడిని నీకు హితంబగు పండ్లు మెక్కుమా. 342

తే. తనివిసనఁ బండ్లు దిని నీరుఁ ద్రావి చనుము, పరవనఫలాళి నిటఁ బసాపడఁగ నేల
యనఁగఁ దల్లిరో! పరకరప్రాప్తఫలము, లనుభవింపనివ్రతము నా కమరుఁజుమ్ము.

తే. కొని తినవ్వలయునొకో మాకోఁతులకును, కలవు తెన్నునఁ బండ్లు కంకణ మిదేల
తీయకుము కేలఁ దాల్పుము దేవి! యిదిగో, యేగెద నటన్న జానకియిట్టు లనియె.

శా. ఆ రామం బిది రావణాసురునియాజ్ఞాధీన మవ్వాఁడు దు
శ్చారిత్రుండు గదా తదీయఫలముల్ సాధ్యంబు లెట్లౌనన్
“శ్రీరామా” యనుమంత్ర మెవ్వఁడు మనం జింతించు నవ్వాని కే
దూరక్షస్సులు తుచ్ఛమాత్రణముతోఁ దుల్యంబు లోతల్లిరో ! 345

సీ. శ్రీరామమంత్రంబుఁ జింతించువానికి, సకలసౌభాగ్యముల్ సంభవించు
శ్రీరామమంత్రంబుఁ జింతించువానికి, దారుణాఘవనాళి దగ్ధమగును

శ్రీరామమంత్రంబుఁ జింతించువానికి, నపవర్గసత్ఫలావాప్తి గలుగు
శ్రీరామమంత్రంబుఁ జింతించువానికి, నపకారులగు వైరు లణఁగిపోదు
తే. అట్టిరామునిమంత్ర మే నను దినంబు, సంస్మరించెదు నాకు రాక్షసభయంబు
గలుగనేరదు తల్లి! యెక్కడకుఁ జనిన, రామదాసుఁడ నమ్మ! నా కేమిలోటు.

తే. అట్టిమంత్రంబు జపియించునట్టివాఁడఁ, గాన వచ్చితి లేకున్నఁ గడలి దాటి
లంకఁ జేరఁగ రక్కసులఁ జయింప, నావశంబొకొ రాముఁడే నాకుఁ దోడు.

## హనుమంతుఁ డశోకవనంబుఁ గూల్చుట

చం. అన విని యట్టులైనఁ దనయా! కపిబాలక! తోఁటలోనఁ గ్రిం
దునఁ బడియున్న పండ్లుగొని తుష్టిగ సాపడుమన్న నట్లనే
యని చని తోఁటలోఁ దరువు లల్లల నార్చుచుఁ బండ్లు రాల్చి వా
నినిఁ దిని తత్కుజంబులను నేలకుఁ గూల్చుచుఁ దత్కుజావళిన్. 348

ఉ. వాలముచేత నన్యతరువర్గముపై నిడి వానిపం డ్లిలన్
రాలిచి వానినెల్లఁ దిని రాజిలు నాకపిఁ జూచి తద్వనీ
పాలకులైన రక్కసులు వచ్చిన నాతఁడుఁ జెట్లచేతఁ ద
త్పాలకదేహముల్ చదియఁ బాదుచుఁ బాఱఁగఁ ద్రోలె నెల్లరన్. 349

ఉ. ఆతఱి వాయుజుం డతిరయమ్మున వృక్షములెల్లఁ గూల్చి యా
సీతవసించుశింశుపము శేషముగాఁగ వనంబునెల్ల నీ
రీతిగ వృక్షశూన్య మొనరించి పదంపడి చైత్యసౌధముల్
భూతలమందుఁ గూల్చె నటఁ బుణ్యజనావళితోడ వ్రేల్మిడిన్. 350

ఉ. అంతట రాక్షసాంగనలు నాయవనీజను జూచి సీత! నీ
చెంతను మాటలాడి యిటు చెట్లను బాడొనరించుకోఁతి యే
ప్రాంతమునుండి వచ్చె, నెవఁ డంపఁగ నీపురిఁ జొచ్చె వీనివృ
త్తాంతముఁ జెప్పుమన్న నసురాంగనలం గని సీత యిట్లనెన్. 351

కం. రక్కసులు కామరూపులె, యెక్కడ కెవఁ డేల పోవు నే నెఱుఁగుదునే?
యొక్కకులం బొటను మీ, రక్కసులకె మాయ గోచరంబగుఁ గాదే? 352

సీ. కపటసన్యాసియై వచ్చి కాననమున, మున్ను మీరక్కసులఱేఁడు నన్నుఁ దెచ్చె
నిప్పు డీభూమికను దాల్చె నేమొ మాట, లేమి యాడెనో యామాయ నెఱుఁగ నేను.

## లంకలో రావణచర్యలు

చం. అన విని భీతిఁ జెందుచు దశాస్యున కిద్ది వచింప రక్కసుల్
జను నెడ నంత నక్కడ నశోకవనమ్మున రావణుండు శ
య్యను గయువస్త్రముం గని గయాసురుఁ డాలినిఁ గూడె నంచుఁ గ
త్తినిఁ గొని యాత్మభార్యను వధింపఁగ సంభ్రమ మొంది యేగుచో. 354

గీ. వనిత లెల్లరు నడ్డుగా వచ్చి వలదు, వనితఁ జంపఁగఁ దగదని వలుకఁ గనలి
యేగి నిదురించుచుండు జంపి యింటి కేగె, సూనృతముఁ గందురే మద్యపానరతులు? 356

చం. మఱియు విభీషణుండు గని మంచముపై దశకంఠుచేలముక్
సరమ దశాస్యుఁ గూడె నని చంపఁగఁ బోవ సతుల్ మఱల్చి రా
సురపతి బాధ నారయుచుఁ జూచు విభీషణుఁ డన్నచావు నీ
కరణిఁ బరస్పరంబుఁ గపి కల్గఁగఁ జేసె విరోధ మప్పురిన్. 355

చం. కొలువునఁ గంట నీ రొలుకఁ గుందుచునుండు దశాస్యుచెంత కా
కలుకులు వచ్చి వానరుని కర్జముఁ జెప్పిన రోషమూర్తియై
పలికెను జంబుమాలిఁ గని వైశముగా నియుతంపుసైనికా
వళిఁ గొనిపోయి వానరుని బంధితుఁగాఁ గొనితెమ్ము పొమ్మనన్. 357

## హనుమంతుఁడు జంబుమాలిప్రముఖులఁ జంపుట

ఉ. వాఁడు 'హసా' దటంచుఁ బరివారముతోఁ జనె వాయుజుండుఁ దా
నోడక బొబ్బ వెట్టిన మహోగ్రులు రక్కసులెల్ల వానిపై
వాడిశరంబు లేయఁ గపి వారలఁ గంబముచేతఁ జంపియుం
దోడనె జంబుమాలితలఁ ద్రుంచెను దాళమహీరుహమ్మునన్. 358

గీ. అంత నవ్వార్త విని రావణాసురుండు, పంచసేనాధిపతులను బంచె లక్ష
సైన్యములతోడఁ దోరణస్తంభమున నె, వారినందఱఁ బోరిఁ గొనె వాయుజుండు.

తే. అదియు నాలించి రావణుఁ డాత్మసుతుని, 'నక్షుఁ' డనువానిఁ బంపె నాయనిలజుండు
గుదియఁ జేపట్టి వానినిఁ గూడఁ గూల్చె, సైన్యసహితంబుగా ఘోరజన్యమందు.

ఉ. అంతట నింద్రజిత్తును దశాస్యుఁడు బిల్చి కుమార! వానరుం
డంతము జేయుచుండె నెవ రడ్డము సొచ్చిన నేమివింతయో

వంత జనించె నాకు నిఁక ♦ వాసవజేతవు నీవు సైన్యముల్
జెంతలఁ గొల్వ నేగి కపిఁ ♦ జేకొని తెమ్మటుగామిఁ జంపుమా. 361

చ. అన విని యింద్రజిత్తు రథ ♦ మప్పుడె యెక్కి ధనుశ్శరాదిసా
ధనధరుఁడై బలిష్ఠమగు ♦ దానవసైన్యము కోటి కూడిరాఁ
జనియె శతాంగచంక్రమణ♦జన్యగభీరరవంబు మీఱఁగాఁ
గనుకని సైనికుల్ కపిని ♦ గట్టి వధింతు మటంచు నార్వఁగా. 362

శా. శంఖారావము లుప్పతిల్లఁ బఱుదో♦స్సాసకుల్ బదాతుల్ జనన్
రింఖాఘట్టనభూరజోన్వితరణో♦ర్వీవ్యాప్తహేషారణ
త్కంఖాణోపరిసాయుధస్థితరణో♦త్కంఠాశ్వికుల్ మీఱఁగా
ప్రేంఖత్పుష్కరఘూత్కృతాంబువిలస♦ద్బృంహద్గజాళు ల్దగన్. 363

ఉ. వాసవజేత యిట్లు చని ♦ వానరుతో నెదిరించి పోరె దే
వాసురసంగరోపమిత♦మై రణ మొప్పఁగ వాయుజుం డనా
యాసతఁ దోఁక సైనికుల ♦ కావరణమ్ముగఁ జుట్టి కోకటన్
వాసవజేత భీతిల న♦వారితుఁడై కడ తేర్చె నెల్లరన్. 364

గీ. పిదప మారుతి దృఢమైన ♦ వృక్ష మొకటి, చేతఁగొని చని యాయింద్ర♦జిత్తు మొత్త
నడలి భిన్నాంగుఁ డగుచు గు♦హాంతరంబుఁ, జేరి దాగెను వాసవ♦జేత యపుడు.

ఉ. తోయజయోని వచ్చి కపి♦తో వచియించె మదస్త్ర మేసినన్
బాయక బద్ధుఁడట్లు నిలు♦వంబడుమన్న హసించి యూకొనెన్
వాయుజుఁ డాయజుండు నట ♦ వాసవజిత్తును జూచి నీబలం
బేయెడ కేగెఁ గట్టు మిఁక ♦ నీతని నాదగు నస్త్ర మేయుచున్. 366

తే. కట్టి యాతని మీతండ్రి♦కడకుఁ గొనుచుఁ, జనుమటం చని పరమేష్ఠి ♦ చనినపిదప
నటులు కట్టియె యింద్రజి♦త్తతనిఁ గొనుచుఁ, దండ్రికడ కేగె విజయమో♦దంబుతోడ.

వ. ఇటు లస్త్రపాశంబునఁ గట్టి తెచ్చిన సుతునిం గని మెచ్చి బంధితుఁడై ప్రోల నున్న మారుతిం గాంచుచు రోషం బంది తనకు సమీపవర్తియగు ప్రహస్తుం గని, యోప్రహస్తా! యీవానరవృత్తాంతమ్ముఁ దెలిసికొమ్మని యాజ్ఞాపించె. 368

ఉ. అంతట రావణాజ్ఞను బ్ర♦హస్తుఁడు వాయుజుఁ జూచి పల్కె నే
ప్రాంతమువాఁడ వెవ్వ రిటు ♦ లంపఁగ వచ్చితి వన్న రామవృ
త్తాంతముఁ దెల్పి వాయుజుఁడ ♦ నారఘురాముని దాసుఁడన్ హనూ
మంతుఁడ నంచుఁ జెప్పి దశ♦మస్తకుఁ గాంచుచు నాతఁ డిట్లనున్. 369

## హనుమంతుఁడు రావణునితో భాషించుట

గీ. నీకు బుద్ధులు చెప్ప నో నిర్జరారి!, యేగుదెంచితి నిటకు నాహితము విన్న
సకలశుభసంపదలు నీకు సంభవించు, శ్రద్ధ వినుమంచు ననిలపుత్రకుఁడు వల్కె.

ఉ. వైరము, మౌఢ్యము న్విడిచి పంక్తిముఖా! యిఁక నాత్మజాప్తస
ద్వారముఁ గూడి జానకిని భక్తి సమర్పితఁ జేసి మ్రొక్కి త
చ్ఛ్రీరఘురామపాదములఁ సేవ నొనర్పుము నిర్భయుండవై
ధారుణి నుండు మాశ్రితహితంకరుఁ డాతఁడు విశ్వబంధుఁడున్. 371

చ. గిరిసమదేహు లుద్బలులుఁ గేసరితుల్యనఖద్విజాయుధుల్
గిరిచరు లాత్తవేగు లయి కేరుచు నీపురిఁ జేరి మిమ్ములం
బోరిఁ గొనఁ జేయు నప్పనికిఁ బూనకమున్నె ధరాజ నిచ్చుచున్
శరణము వేఁడు మాప్రభుని సౌఖ్యములం గొనునాస యున్నచో. 372

ఉ. దేవతలుం గిరీశుఁ డరుదెంచుచు ని న్నిటఁ గాచియుండినన్
దైవతనేతమృత్యువు ముఖంబున నిన్ దొడఁ జేర్చి దాచినన్
జేవ తొలంగి భోగవతిఁ జేరిన రామవిరోధి వోచు నో
రావణ! చావకుందువె దురమ్మున? నేలగుమార్గ మొందుమా! 373

గీ. అనుచు శుభహితపూతమై యలరునట్టి, వాక్య మకటపి పల్క రావణుఁడు దాని
గైకొనకయుండెఁ దా నవివేకుఁ డగుచుఁ, జావఁగలవాఁడు నెజ్జనౌషధముమాడ్కి.

వ. అంత నారావణుండు సక్రోధుండై యను నోవానరాధమా! యెవ్వని బాహుబలమ్మున ముల్లోకమ్ములును జేజేలును నిర్జింపఁబడిరో యట్టి నన్నల్పునిగా నెంచి ప్రలపించెదు నాప్రభావ మ్మొకింత నుడివెద నాలింపు మని యిట్లనియె. 375

సీ. పరమేష్ఠి పంచాంగపాఠకుండై యుండుఁ, బ్రతిహారుఁడై యుండు భాస్కరుండు
శశి ఛత్రధరుఁ డయ్యె జలవాహి వరుణుండు, గరువలి యిండ్లలోఁ గసవు నూడ్చు
నగ్ని చాకలి యయ్యె నమరేంద్రుఁ డిటఁ బూల,మాలిక లొనరించి మాకొసంగు
దండపాణి యముండు దాసికల్ సురసుతుల్, మార్తాండుఁడే మాకుమంగలి యిట

గీ. గణపతియె మాదుపశువులఁ గాంచుచుండు, కుజుఁడు మొద లేడుగాము లెక్కుటకు మెట్లు
దాది మా బాలకాళి కింద్రాణి యయ్యె, శ్రీదు గెల్చితి నెత్తితి శివునికొండ. 376

గీ. అట్టి నాచెంత కోతి! భయంబు లేక, ప్రేలెదవు రాముఁ డెవ్వఁడు విపినచరుఁడు
వానరాధిపయుతుఁడగు వానరాధిపతిని బోరిఁ గొందు, నిను నేఁడె మృతునొనర్తు.

చ. అని భయదోగ్రఖడ్గమున ƒ నక్కఱఁ ద్రుంపఁగ నేగుచున్న యా
తని మఱలించి రాజనయƒతత్పరుఁడైన విభీషణుం "డహో !
ఘనభుజ ! దూతఁ జంపుట యƒకార్య" మటంచును దెల్పఁ గోఁతితోఁ
కను మొదలంటఁ గోయ దశƒకంధరుఁ డాజ్ఞ యొనర్చె నంతటన్. 378

చ. అనుపమవిక్రముల్ సునిశƒతాసికుఠారముఖాయుధమ్ములన్
గొని చని వానివాలమును ƒ గోయఁగఁ బోయిన నాయుధాళి త
ద్ఘనతరవాయుఘాతమున ƒ ఖండితమై పొడి యయ్యెఁ గేశమై
నను దెగకుంట కాయసురƒనాథుఁడు మారుతిఁ గాంచి యిట్లనెన్. 379

ఉ. మారుతి ! మీకు లాత్మమృతిƒమాత్రము దాచరు నీదువాల మే
తీరున ఖండితం బగును ƒ తెల్పు మనన్ గపి యే నమర్త్యుఁడన్
గారణ మిద్ది యన్న నది ƒ కాదు నిజం బెఱిఁగింపు మంచు ర
క్షోరమణుండు వేఁడఁ గపిƒకుంజరుఁ డిట్లు తలంచె నాత్మలో. 380

ఉ. ఆరయ నగ్ని మత్పితృవƒయస్యుఁడు కాల్పఁడు నన్ను వానితోఁ
జేరిన తోఁకతోఁ బుర మƒశేషముఁ గాల్చెద నంచు నెంచి యా
మారుతి పల్కె నగ్నిశిఖƒమాత్రన నియ్యది ధ్వస్త మౌను మీ
వారినిఁ బంపి పుచ్ఛమును ƒ బావకుచే దహియింపఁజేయుమా ! 381

చ. అన విని రావణుం డపుడె ƒ యాతనితోఁకను దైలసిక్తమౌ
ఘనపటరాశిఁ జుట్టి యిఁకఁ ƒ గాల్పుఁ డనన్ బవమానసూతి తోఁ
కను మఱి పెంచె, గేహపటƒజాలము చాలమిఁ జేలహట్టముల్
గనుకని చేరి యందుఁ బటƒకాండముఁ దెచ్చిరి పూన్కిఁ దద్భటుల్. 382

గీ. అంతకంతకు వాల మత్యధికమైన, నూరిలోనున్న వసనంబు ƒ లూడఁబెఱికి
తెండటంచును ఱేఁడు విƒధింప భటులు, బల్మి బట్టలఁ గొని తేరఁ ƒ బరువులెత్తి.

వ. పురమ్మునంగల్గు నరనారీద్విజబాలకపరిచారకాదులవస్త్రంబు లూడ్చియుఁ గపిలాం
గూలమ్ముఁ బూరింపనేరమి మందోదర్యాదిరాజదారలనుంగూడ వివస్త్రలఁ జేసి
యు నకృతార్థులై తలపాగలం గేతనమ్ముల శయ్యాసభామందిరప్రసారిణీవసనమ్ములఁ
గంచుకంబుల మఱియుఁ బటమాత్రంబుల సూత్రమాత్రంబులఁ గాన్పించినవానినెల్ల
సంగ్రహించి తెచ్చియుఁ దుదకు సీతావసనంబుకొఱకుఁ బర్వెత్తుచుంట గ్రహించి
మారుతి తత్ప్రమాదంబు దప్పింపఁ దనవాలం బుపసంహరించుటయు రావణకింక

రులు కృతార్థులట్లు గర్వించుచు ఘృతతైలాదిస్నిగ్ధద్రవ్యమ్ములచేఁ దడిసిన వసనమ్ము లాతనివాలమ్మునకుఁ జుట్టి రంతఁ బ్రతిగృహమ్మునను దైలవసనార్థమ్ముగాఁ గోలాహలం బుప్పతిల్లెఁ, గౌపీనమాత్రమున కేని వసనమ్మును దీపమ్మునకుఁ దైలమ్మును లేక పురజనులందఱు దిగంబరు లయ్యు లజ్జారహితులై యుండిరి. కాని విభీషణాది మానధనులుమాత్ర మత్తఱి సిగ్గున గ్రుగ్గి యెటకైనఁ బోవలయుఁ గాని యీ దుశ్శాసనునికడ నుండరాదనుచు విచారించుచుండి రో పార్వతీ ! యిట్లు పురంబెల్ల సంక్షుభితంబై సాధుజనబాధానిరంతరం బై యుండె మఱియును. 384

ఉ. అంతఁ గపీంద్రపుచ్ఛమున • కగ్నినిఁ గూర్చి భటాళి భస్త్రికా
త్యంతవికంపనమ్ములఁ దరిదగ్ని రగుల్పఁగఁజాలమిఁ హనూ
మంతుఁడు వారితో ననె శ్రమంపడఁబోకుఁడు రావణుండె యీ
చెంతకు వచ్చి ఫూత్కృతులఁ • జేసిన మండును మీకు సాధ్యమే ? 385

చ. అన విని రక్కసుల్ దెలుప • నాదశకంఠుఁడు వచ్చి తద్దశా
ననములతోడ నూదిన ఘనమ్ముగ నుజ్జ్వలితాగ్ని చే దశా
ననములఁ గూర్చముల్ క్షణమునం దగులంబడఁ గ్రేల్లమిం దదా
ననముల మొత్తికొంచు దహనచ్ఛట లార్పుచు నార్చె నెంతయున్. 386

చ. కని తనబంధుమిత్రులె పరకాలున నవ్వఁగ వాయుజుం డిసీ !
యన నవమానఖిన్నుఁడు దశాననుఁడు మారుతిఁ జూచి యెంతయున్
గనలుచు వీనిఁ బౌరులకుఁ • గన్పడ వీథులఁ ద్రిప్పుఁ డన్న వా
రనుమను గట్టి పాశముల • నంతటఁ ద్రిప్పిరి వాడవాడలన్. 387

గీ. వాద్యములతోడ రక్కసుల్ • వానిఁ ద్రిప్ప, సంజ యగుదనక పురవిశేషమ్ము లరసి
వానరస్వామి సూక్ష్మరూపమ్ముతోడ, బంధనము లూడ్చి పశ్చిమద్వారము చని.

## హనుమంతుఁడు లంకం గాల్చుట

ఉ. అంతకు మున్నె వాగధిపునస్త్రము వీడి చనంగ స్వేచ్ఛ నా
ప్రాంతపులోహదండమున • ద్వారనివిష్టనిశాటకోటిఁ దా
నంతము నొందఁజేసి పుర • మగ్నికి భోజ్య మొనర్చి తృప్తిఁ గా
వింతు నటంచు లేచి చనె • వింతగ సర్వగృహాగ్రచారియై. 389

ఉ. చెచ్చెర సంచరించి దయచేత విభీషణునిల్లు వీడి తా
నచ్చటఁ గల్గు గేహముల • నన్నిట నగ్ని రగిల్చి దూరమం

మిచ్చతనొప్ప సాలమున నుండి పురంబటు కాలుచుంటకున్
మెచ్చుచుఁ బాణితాళముల నేలగుపాటలు పాడుచుండగన్. 390

సీ. లంకాపురంబు గాలఁగఁ జూచి భీతిమై, హాహారవంబుల నఱచువారు
నిద్రితబాలకనికరంబు విడనాడి, యిలు వీడి వీథుల కేగువారు
పావకపరిదగ్ధవస్త్రాలకాంగులై, హితసుతాదులఁ బిల్చి యేడ్చువారు
సౌధాగ్రములనుండి వీథికి రాలేక, చిచ్చులోఁ బడి కాలి చచ్చువారు
ఆ. దగ్ధనిజబంధుధనవస్తుతతిఁ దలంచి, యేడ్చి ప్రాణేచ్ఛ బయటికి నేగువారు
నై పురంబునఁ గల రాక్షసాళియెల్ల, దిక్కుమొక్కును లేక రోదించి రపుడు.

వ. మఱియు నంబరాంబుధరగర్జనవిజిగీష నేగు ప్రతిగజసంఘమ్ములమాడ్కి భుగభుగా రవంబులతోఁ బొగలు మింటి కెగయ ఖద్యోతప్రకరంబు లన మిణుంగురు లెగుర బహురూపపదార్థదహనసంక్రాంతబహువిధజ్వాలాజాలం బమరపతిధనూరుచి ననుకరించి యంబరచుంబియై బహుముఖప్రవర్ధమానమై యలర కనకరాజతమణికుడ్యస్తంభగోపురప్రాసాదసౌధాట్టాలకాదిరాజగృహమ్ములఁ గాల్చు సీతాశాపాగ్నియు, రాజబంధుగృహసౌధములఁ గాల్చు సీతాదుఃఖాగ్నియు, నిర్ధనుల పర్ణశాలాదులం గాల్చు రావణప్రాపితకపివాలాగ్నియు నపూర్వత్రేతాగ్నులై యో పార్వతీ! మున్ను మదీయలలాటాగ్నిదగ్ధపురత్రయమ్మునుం బోలి యేకజ్వాలగాఁ గాలుచున్న లంకాపురమ్మును గాంచి రావణుండును, 392

చ. చనెఁ బదికోట్లరాత్రిచరసైన్యము వెంబడి రాఁగ యుద్ధముం
గొని కడతేర్తు వీని నని కోపముతోఁ గపిఁ జేర వారలన్
ఘనతరమైన కంబమునఁ గాలెడివాలముచేతఁ గొట్టి చం
పెను బదికోట్లరక్కసుల వీరశిఖామణి మొత్తె రావణున్. 393

ఉ. వాలకృశానుఘాతమున వానిశరీరమునంతటన్ లతా
జాలములీల వాత నిడి చయ్యన మూర్ఛిలువాని రామభూ
పాలునికీర్తికై యపుడు పట్టి వధింపక వీడె నాయెడన్
సోలినతండ్రిఁ జచ్చిపడుశూరతతిం గని మేఘనాథుఁడున్. 394

ఆ. ఆత్మభయమంది వానరుం డరసెనేనిఁ, జంపు నని యెంచి ప్రాణరక్షణముకొఱకుఁ
బర్వె సౌమిత్రికిని కీర్తి పరిఢవిల్ల, వాని విడిచెను కనియు నవ్వాయుజుండు. 395

ఉ. లంక సమస్తమున్ గపి చలంబునఁ గాలిచి లబ్ధకీర్తితో
టెంకలఁ గోటిసంఖ్యగ బలిం గొని శ్రీరఘురామనాటకై

కాంకపుఁ గుత్తనంగ రిపు లందఱ కొక్కొకయంక ముంచి య
గ్న్యంకము వాల మార్పఁ జనె నంబుధితీరము నొక్క దాటునన్. 396

శా. ఆతీరమ్మున నిల్చి వాయుజుఁడు తద్వ్యాదోఽభిరక్షార్థమై
చేతం దజ్జలపూరముం గొనుచుఁ దత్స్నేకమ్మునన్ వాలమున్
శీతం బౌగతి నార్పి ధూమజనితశ్లేష్మమ్మునుం బాసి సు
స్ఫీతంబౌ తటమందుఁ బ్రీతిమెయిఁ దా విశ్రాంతిఁ జెందెన్ గడున్. 397

## హనుమంతుని విచారము

ఉ. అంతటఁ గొంతసేపటికి నాహనుమంతుఁడు సీతఁగూర్చి తా
నంతరమందు నెంచి తనహస్తముచే నెదఁ బాదికొంచు నే
నెంతవివేకశూన్యుఁడ నిఁకసే! పురి గాల్చెడివేళ నామె నే
ప్రాంతమునైనఁ జేర్చ కిటు వహ్నికి నాహుతిఁ జేసితిం గటా! 398

సీ. చపలుఁడ మూఢుఁడ స్వామ్యాజ్ఞ నిటు వచ్చి, వైదేహిఁ జంపితిఁ బాపి నగుచు
ఈజన్మమును గాల్పనే? కాలకుంతునే?, పురిలోనఁ గాలని భూమి లేదు
రామునికడకు నే నేమొగమ్మునఁ బోదు?, నీవార్తఁ జెప్పు టదెట్లు నాకు?
వాలబంధనముచేఁ బ్రాణమ్ము విడిచెద, నదియె ప్రాయశ్చిత్త మగునుగాక
గీ. నేను బోలేను రామసన్నిధికి నింక, కార్య మొనరించి తుది వివేకమ్ము లేక
జాతిచాంచల్య మొంది యీరీతి సీతఁ, జంపితిని నాకు తగుగతి చావొకండె. 399

వ. నే నేగినవెంటనే రామవిభుండు సీతావృత్తాంత మడిగి నావలనఁ దదవస్థను విని శోకాతిభరమ్మున హతాస్మరణ మొందు నది గాంచి క్రమమ్మున లక్ష్మణసుగ్రీవాంగదజాంబవదాదులును రుమాతారాదికవానరప్రమదలును సకలవానరకోట్లును మరణింతు రటఁ బంచదశాబ్దమ్మేగుదెంచినను రాముజాడఁ గానమిఁ దద్వియోగమ్మున భరతశత్రుఘ్నులును కౌసల్యాసుమిత్రలును బుత్రమరణఖిన్నయగు కైకేయియు నూర్మిళామాండవీశ్రుతకీర్తులును శ్రీరామభక్తితత్పరులగు సాకేతపౌరమంత్రిసామంతాదులును దండకారణ్యవాసులగు మునులును నరాజకులగు సర్వభూప్రజలును చరాచరజీవసంఘమ్ములును హవ్యకవ్యవిహీనులయి దేవతలును మరణింతు రిట్టి యకాలప్రళయమ్మునకుఁ గారణభూతుండనై నే నేగుటకన్న నిచటఁ జచ్చుట మేలు కాదే? యని కృతమరణనిశ్చయుం డైయున్న మారుతి నుద్దేశించి దైవప్రేరితమై యశరీరవాణి యిట్లు చెలంగె. 400

ఉ. ఏల విచార మొందఁగఁ గపీంద్ర ! ధరాత్మజకున్ శుభంబె సూ
కాలును గాదె సీత కపకారముఁ జేసిన వీతిహోత్రుఁడున్
నైశమ లేచి నీమదిని వంతఁ దొలంగి ధరాత్మజాతకున్
నేలుగ మ్రొక్కి రామునిసమీపముఁ జేరుము నీకు సేమగూ. 401

గీ. అనఁగ విని వాయుజాతుఁడు హర్ష మొంది, వేగముగ సీతఁ గానఁగా నేగుచుండి
పురముచుట్టును బంగరుప్రుడమిఁ జూచి, వింతఁ జెందుచు జానకిచెంత కేగె. 402

## గజేంద్ర మోక్షణ కథ

వ. అని చెప్పి శంకరుం డను నోపార్వతీ! లంకాపురంబుచెంత బంగారు గలుగుటకుఁ గారణంబు నుడివెద వినుము. క్షీరోదమధ్యమ్మున రౌప్యాయసస్వర్ణమయశిఖర త్రయంబుతో సార్థకనామధేయంబగు త్రికూటపర్వతంబు గలదు. తచ్ఛిఖరకాంతిచే సాగరదిగ్రోదసీభాగమ్ములు ప్రకాశితమ్ము లగుఁ దత్సాలదేశమ్మున సురనారీసంచరణయోగ్యమ్మును వరుణపాలితమ్మును నగు ఋతుమంతం బను లీలోద్యానంబు గల దందు వికచకాంచనకమలోత్పలప్రభావిరాజమానంబగు నొకసరోవరం బమరుఁ దద్దానిఁ గృతఘ్ననృశంసనాస్తికులు గనఁజాలరు, తదంతర్జలమ్మున దుష్టంబును గజమారకంబును వికృతంబును నగు నొకమకరంబు నివసించు నచ్చటి కొకనాఁడు.

మ. కరిణీయూథసమన్వితం బయి తృషాక్రాంతమ్ము నై మత్తమా
ద్విరదం బొక్కటి యేగుదెంచి జలము స్వీక్షించి పానార్థమై
కరిణీసంఘముతో సరోవరము పేఁకం జొచ్చి పేరాసతోఁ
గరమున్ ముంచి జలమ్ముఁ గ్రోలుచు మదిన్ కౌతూహలం బందఁగా. 404

చ. జలరుహలీన ముగ్రబలశాలియు నా మకరంబు మెల్లఁగా
జలమును గ్రోలుచున్న కపిచక్కిని జేరి పదంబుఁ బట్టినన్
వలఁగొని హస్తి దానిని జవమ్మున నొడ్డున కీడ్వ గ్రాహమున్
జలములలోనికిం గరిని సాహస మొప్పఁగ నీడ్చుచుండఁగాన్. 405

తే. తీర మొందిన కరిణు లాద్విపముఁ జూచి, యార్తనాదంబుతోడ భయంబుఁ జెంది
యంగలార్చుచుఁ జూచుచుండఁగఁ గరిని, గ్రాహమే బల్మి లాగె నగాధమునకు.

ఆ. వె. కాలిక్రిందికైనఁ జాలనిమకరంబు, కొండఁబోలు గజము గోడుఁ గూల్చె
మకర మనఁగ నెంత మత్తేభ మన నెంత?, స్థానబలము మిన్న సర్వమునకు.

చ. పరగజరాజి వచ్చి కని । పార్ష్ణితలంబును బట్టి పట్టి యా
కరి దరిఁ జేర్ప సాహసముఁ । గైకొని యాకున నెంతలాగియున్
దరికిని జేర్పలేక చనెఁ । దజ్జలచారి నెదిర్చి యోర్పుతోఁ
గరి సమరంబు ఘోరము న । ఖండముగా నొనరించుచుండఁగాన్. 408

మ. ఒకవేయేం డ్లిటు హస్తియు న్మకరమున్ । యుద్ధంబు గావించె మా
నక రాత్రిందివముం బరస్పరసమా । నప్రౌఢి దీపింప దీ
ర్ఘకఠోరద్విజపాదఘాతజనిర । క్తస్రావసిక్తాంగతం
బ్రకటాహంకృతితోఁ బరస్పరజయా । వాప్తి న్మదిం గోరుచున్. 409

సీ. తుండపూత్కృతివారి । తోఁ దోన నెగయుచు, మకరమీనంబు లం । బరముఁ జేరఁ
బదఘట్టనల గూఢ । పదకూర్మసంఘముల్, నిలువఁజాలక రసా । తలముఁ జేర
విపులాంగవిచ్ఛిన్న । బిసకాంక్ష విడనాడి, చక్రాంగములు మాన । సంబుఁ జేరఁ
బరివర్తనార్తిచేఁ । బద్మాదరరథాంగ,ములు విష్ణుపదమును । గొలువఁ జేర

తే. నైజగురుదేహసంఘర్ష । ణమ్ముకతనఁ, దత్తటాకంబు కల్లోలి । తంబు గాఁగఁ
దనకుఁగల శక్తి నంతయు । దారవోయు, గతిని మకరంబుతోఁ గూడ । గజము పోరె

సీ. వాలవిక్షేపణో । ద్భవవేగవిచలితాం,భఃపూర మావ । ర్తపటలిఁ దాల్పఁ
బరివర్తనక్రియా । పరిమర్దితకుశాది, కలితాంబుపూర మా । విలత నొంద
నుచ్ఛ్వాసబహుళవా । యూద్గమానుగములై, భుగభుగరావబు । ద్బుదము లెగయ
నిభరాట్పదాకర్ష । ణోత్తతశ్చల,త్ప్లుతభంగములు తీర । భూమి ముంపఁ

గీ. బదిము వీడక ప్రబలసం । పద హరించి, పిన్నయైనను గ్రమబల । వృద్ధిఁ జెంది
మత్తగజమును బాధించె । మకర మకట !, కాలగతి దాట భువి నశ । క్యంబు గాదె

వ. తదనంతరమున. 412

మ. మతి దప్పెం గతి దూలెఁ బ్రజ్ఞ చనె ను । న్మాదస్థితు ల్గూడె స
ర్పతతు ల్పాశములట్లు చుట్టుకొనెఁ దో । సం బయ్యె నూర్పు ల్గతా
గతవృత్తిం గొనెఁ బ్రాణము ల్చెమట లం । గంబందు నిండెన్ రణో
ద్ధతి డిందెం గరి భీతి శ్రీహరిపద । ధ్యానైకనిష్ఠాత్మయై. 413

చ. కరమునఁ గాంచనాబ్జమును । గైకొని మానసపూజచేత శ్రీ
హరికి నివేదనం బొసఁగి । యంబుజపూజ నొసంగి నిర్మద

ద్విరదవరుండు గ్రాహముఖవిద్ధపదుం డయి యావదబ్ధిని
స్తరణముఁ గోరి యాహరిని దత్పరుఁడై నుతియించె నీగతిన్. 414

సీ. ఇందిరాహృదయసన్మందిరావాసాయ !, భవనాశకాయ తుభ్యం నమోఽస్తు !
అరవిందనేత్రాయ ! గిరిజేశమిత్రాయ !, భక్తప్రియాయ తుభ్యం నమోఽస్తు!
నిజభక్తకల్పాయ! భుజగేంద్రతల్పాయ!, భవ్యరూపాయ తుభ్యం నమోఽస్తు!
యోగీంద్రమిత్రాయ ! భోగిభుక్పత్రాయ !, భార్గవీశాయ తుభ్యం నమోఽస్తు !

తే. భానుకోటిప్రభాయ తుభ్యం నమోఽస్తు !
పరమపురుషార్థదాయ తుభ్యం నమోఽస్తు !
ఆశ్రితజనాదరాయ తుభ్యం నమోఽస్తు !
భక్తమందార ! శుభహార ! భయవిదూర ! 415

చం. హరి ! పరమాత్మ ! కేశవ ! జనార్దన ! దీనజనావనవ్రతా
దరణ ! నతార్తిసంహరణ ! దానవభంజన ! యోగిరంజనా !
ఖరరిపుభీషణా ! సుభగకౌస్తుభభూషణ ! భక్తపోషణా !
సరసిజలోచనా ! దురితజాలవిమోచన ! ముక్తిసూచనా ! 416

మ. కరుణాసాగర ! దీనరక్షక ! ఖలగ్రాహమ్ముచే గ్రస్తుఁడం
దరుణీలోలత నాకు సంసృతిసుఖధ్యానమ్మునం గాలముల్
జరిగెన్ వ్యర్థముగా భవత్పదసరోజద్వంద్వముం గొల్తు నిన్
శరణం బందితిఁ గావు మార్తజనరక్షాదక్ష ! నారాయణా ! 417

చం. అని మొఱవెట్టు నగ్గజము నాదర మొప్పఁగఁ బ్రోవ నెంచుచున్
ఘనుఁడగు తార్క్ష్యవాహనుఁడు కాంచనచేలుఁడు నిందిరాసతీ
మునిసురసంఘయుక్తుఁ డతిమోదమునం గమలాకరంబుచెం
తను గననయ్యె నుజ్జ్వలసుదర్శనవిస్ఫురితాగ్రహస్తుఁడై. 418

తే. వచ్చి త్రుటిలోన నాభక్తవత్సలుండు
ధర్మలోలుఁడు తనచక్రధారచేత
గ్రాహమును జంపి కరిని రక్షణ మొనర్ప
నగ్గజంబును సంతోష మందె నపుడు. 419

వ. అని చెప్పి శంకరుండు దాక్షాయణీసంప్రార్థితుండై గజరాజపూర్వవృత్తాంతం బిట్లని వచియించె. 420

## గజరాజ పూర్వవృత్తాంతము

సీ. ధరణిఁ బాండ్యేశుఁ డింద్రద్యుమ్ననాముఁడౌ, భూపాలుఁ డొకనాఁడు | భూరినిష్ఠఁ
దపముఁ జేయుచు నుండి | ధ్యానతత్పరుఁడైన, సమయమ్మునకుఁ గుంభజన్ముఁ డటకు
వచ్చిన వానికిఁ | బాద్యాదు లొసఁగమిఁ, గనలి యగస్త్యుఁ డుగ్రంబుగాఁగ
దర్శింపక తపోమదమ్మున ననుఁగాంచి, లేవకుంటివి గాన | భూవరేణ్య!

గీ. ఘోరవనమున మదమత్తకుంజరంబ, వగుదు గాకని శపియింప | నతఁడు తెలిసి
మునిని బ్రార్థించె శాపవిముక్తికొఱకు, మునియు శాంతించి శాపవిముక్తిఁ దెలిపె.

ఉ. రాజవరేణ్య! నీవు గజరాజమవై యొకనాఁడు ప్రస్ఫుటాం
భోజసరోవరంబుఁ జొర | మున్నటఁ గల్గిన గ్రాహ మొండు ని
న్నే జితుఁ జేయఁ బట్టుకొని | విష్ణుఁడు దానిని సంహరించి త్వ
త్పూజితుఁడై ప్రసన్నుఁ డయి | ముక్తి నొసంగును నీకు భూవరా! 422

వ. ఇట్లు శాపవిముక్తిఁ దెల్పి ముని యథేచ్ఛం జనియె నంత భూపాలుండు గజరాజయ్యె, నాగజరాజుం బట్టినమకరముగూడ శాపగ్రస్తమే సుమా! తచ్చరితంబును నుడివెద నాలింపు మని శంకరుండు మఱియు నిట్లనియె. 423

మ. మును గంధర్వుఁడు "హూహూ" నాముఁ డతిసమ్మోదమ్ముతో నప్సరో
గనలం దోకొని యాసరస్సునను మున్గన్ వేడ్కన్ నేతెంచి యం
దు నఘాభావతకున్ జిరస్థితుని నిర్దోషాత్మకున్ దేవలున్
గని వాని న్వడలింపఁగా మకరమై | కాల్వట్టె హూహూవిభుఁడై. 424

మ. మకరంబై ననుఁ బట్టె వీఁ డని మహామర్షంబుతో హూనియున్
మకరంబై యిట నుండుగాకని శపింపన్ వాఁడు ప్రార్థింప న
య్యకలంకుండగు దేవలుం డనె ఖలా! | యజ్ఞాఖ్యుఁ డేతెంచి చ
క్రకరుండై నిను సంహరించునపుడే | కల్గుం జుమీ మోక్షమున్. 425

వ. అని శాపాంతమ్ము ననుగ్రహించె నిట్లు దేవలశాపంబున గంధర్వుఁడును, నగస్త్య శాపంబున నింద్రద్యుమ్నుండును తమ తమ పాపఫలమ్ము లనుభవించి రని మఱియు శంకరుఁ డిట్లనియె. 426

గీ. వారలిద్దఱు నీసరోవరమునందు, కరిమకరరూపముల నంది | కలహ మొంది
విష్ణుకృపచేత దేహముల్ | విడిచి యుందు, పుణ్యవశమున ముక్తిని బొంది రంత.

సీ. హరి గజేంద్రుని రక్షించి యరిగె నపుడు, నాగజగ్రాహదేహాయుగ్మాశ నేచ్ఛ
హరిని గోరి ఖగేశ్వరుండచటి కేగె, నంతకునుమున్న భ్రూభంగ మనెడిగ్రద్ద.

వ. వచ్చి తవసన్నిధి నున్నం గని గరుడుండు వానిం జంపి తచ్ఛరీరం బొకకాలను, గజ మకరదేహంబు లొకకాలను దాల్చి భక్షింప విశాలస్థలం బరయుచు క్షీరోద ప్రాంతమున శతయోజనోన్నతాయామంబగు నొకసువర్ణమయజంబూభూజంబుం గని దానిశాఖపై నిల్చిన నది పెళపెళమని విఱిగె, నందు షష్టిసహస్రసంఖ్యాకులగు వాలఖిల్యమును లధోముఖులై తచ్ఛాఖావలంబనులై యున్నం గని శాపభయమ్మున నాశాఖను నేలం బడకుండ తుండాగ్రమ్మునం బట్టి వియత్తలంబున కేగిరి యుచిత స్థలం బరయుచు నకృతార్థుండై తుదకు తండ్రియగు కశ్యపుని సమీపించి తనయవస్థ నివేదింప నతండు శతయోజనలవణసాగరాంతమ్మున లంకాప్రదేశమ్ము గలదు, తత్ప్రాంతవిశాలస్థలమ్మున భుజింపు మని చెప్పిన విని గరుడుం డట కేగి తనచెక్క లపైఁ దచ్ఛాఖఁ గుదురుపఱచి, తచ్ఛవంబుల భక్షించె, నట గరుడత్యక్తకీకసము లెల్ల ముత్తెఱంగులగు శిఖరంబు లయ్యె, తచ్ఛిఖరయుతం బౌట నటగల్గు శైలంబు త్రికూటం బయ్యెఁ దచ్ఛిఖరంబుల గరుడుండు మున్నాత్మపక్షాగ్రస్థాపితంబగు సువర్ణమయజంబూవృక్షశాఖను పదిలమ్ముగా నునిచి యథేచ్ఛం జనియె. తచ్ఛాఖావలంబనులగు మునులును గ్రమమ్మునఁ దపస్సిద్ధులై ముక్తులైరి. తత్కనక భూరుహశాఖయు గిరిశిఖరాంతరాళమున శిలారూపము నొంది శైవలాక్రాంతమై ప్రచ్ఛన్నముగా నుండె, మారుతదగ్ధలంకాగ్నిచేఁ దచ్ఛాఖాగతసువర్ణంబు కరఁగి ద్రవరూపంబై బహురాక్షససంహారకంబుగాఁ బ్రవహించిఁ లంకాపురంబుచుట్టును నలమియుండె, నద్దానిం గాంచి మారుతి యాశ్చర్యభరితుండై యశోకవని కేగి జానకిం గాంచి అపరిమితానందరససంసిక్తహృదయుండై పులకితాంగుండై యిట్లనియె.

ఉ. అమ్మరో! కాలయాపనము నందఁగ నేల మదీయపీవరాం
సమ్ముల నెక్కి రామవిభుసన్నిధిఁ జేరు మటన్న నామెయున్
సమ్మతి నందునే పతి! యసాధ్యభుజాబలుఁ డాఘనుండె రే
ద్రిమ్మరులన్ వధించి ననుఁ దెంపునఁ గైకొని యేగుఁ గావుతన్. 430

సీ. అనుచు భూజాత రాముని యంగులీయ,కమును మారుతి కిచ్చి రాఘవున కిమ్ము
టంచుఁబలికిన నద్దానిఁ గొంచు నామె,యంఘ్రులకు మ్రొక్కి చనె సువేలాద్రికడకు.

ఉ. అంతట బ్రహ్మ వాయుజసమాగమనాదిసమస్తకార్యవృ
త్తాంతము వ్రాసి పత్ర మొకఁ డాతని కిచ్చె నతండుఁ గొం చెదన్

సంతస మంది యవ్వీధికి ✽ సాగిలిమ్రొక్కి సువేల మెక్కినన్
వింతగఁ జూర్ణ మయ్యె గిరి ✽ విన్నన కేగెఁ గపీంద్రుఁ డుద్ధతిన్. 432

## హనుమంతుని గర్వభంగము

మ. రవ మొప్పంగను మింటిత్రోవఁ జనుచున్ ✽ రత్నాకరోదీచ్యభూ
ప్రవిబద్ధాక్షియుగంబుమీఱఁ దన గ✽మ్యప్రాంతమం దొక్కచో
నవశుంభై దిగజాఱి యచ్చట తపో✽వ్యాసంగుఁడౌ తాపస
ప్రవరున్ జూచి నితాంతగర్వమున నా✽వాతాత్మజుం డిట్లనెన్. 433

ఉ. మౌనివరేణ్య! రాముపని ✽ మాన మెలర్పఁగఁ జేసి వచ్చితిన్
బూనితి దప్పికన్, గమల✽పూర్ణసరస్సులు జూపుమా యనన్
మౌనియుఁ దర్జని౯ దెలుప ✽ మారుతి పత్రము నంగుళీయమున్
మానికమున్ మునీంద్రుకడ ✽ న్యాసముగా నిడి పోయె నీటికై. 434

గీ. అచట మఱియొక్కకపి రాము✽నంగుళీయ, మామునీంద్రుకమండలు✽వందు నునిచి
పోయెఁ బత్రమణుల్ గొని ✽ వాయుజుండు, నంగుళీయక మేదియం ✽ చడిగె మునిని.

గీ. అనఁగ ముని చూపెఁ గుండిక ✽ నక్షిసంజ్ఞ, మారుతియుఁ గాంచె మౌనిక✽మండలువున
అందుఁ దత్తుల్యరామము✽ద్రాళిఁ గాంచి, యద్భుతం బంది వాయుజుం ✽ డనియె నంత.

గీ. రామముద్రిక లోముని✽రాజ! దీనఁ, జాలఁగా నుండె నెక్కడి ✽ వేల వచ్చె?
నిందు నా తెచ్చుముద్రిక ✽ యేది యనిన, వాయుసుతుతోడ మునిరాజు ✽ పల్కెనిట్లు.

శా. రామాజ్ఞన్ ధరణీజలం గన సమీ✽రప్రోద్భవుల్ లంకకున్
ప్రేమం బొప్పఁగ నేగి సీత యిడు నా ✽ శ్రీరామముద్రాళి నా
ధామంబందు నిడం గమండలువులోఁ ✽ దన్ముద్రలన్ వానరుల్
తామే యుంచిరి వీనిలోఁ బ్రకృతము✽ద్రం జూడు మో మారుతీ! 438

చం. అన విని రాము లెందఱు? ధర✽రాత్మజ లెంద? ఱెందఱో మరు
త్తనయులు? నెన్నిసారు లిటు ✽ దాటిరి సంద్రము? వింత యయ్యె రా
మునికథ లెన్ని యయ్యె ముని✽ముఖ్య! వచింపుమటన్న నేను లె
క్కను వచియింపలే నిపుడ ✽ కైకొని ముద్రికలం గణింపుమా. 439

చం. అన విని వాయుజుండు తన✽యంజలితో రఘురామముద్రికల్
గొని గణుతింప వేలు మఱి ✽ కోటులుగా నొకచోట నుంచుచుం

గనుఁగొన నక్షయం బగుటఁ ƒ గాంచి గణింపఁ దరంబె యంచు వా
నిని గొని కుండిక న్విడిచి ƒ నెమ్మది వింతగొనె న్మహాత్మున్. 440

చం. మునికి నమస్కరించి తన ƒ మో మటు నెల్వెలఁబోవుచుండఁగాఁ
దనవలె నెందఱో యిటులు ƒ దానవప్రోలికి నేగి యాధరా
తనయను జూచి వచ్చిరఁట ƒ తత్కపివీరులకన్న మిన్న నే
యని మది గర్వము న్విడిచి ƒ యచ్చటినుండి క్రమక్రమమ్ముగా. 441

గీ. చనియె నాత్మీయవానరƒసంఘ మున్న, చోటి కాతని వానరుల్ ƒ చూచి ముదము
గాంచి వాలమ్ము లల్లార్చి ƒ కౌఁగిలించి, సీతఁ గని వచ్చితినటంచుఁ ƒ జెప్ప వినిరి.

మ. పరమానందము జెంది కేపుచు బళీ ! ƒ వహ్వారె ! యో మారుతీ !
కరముం గష్టము లోర్చి వచ్చితివి నీ ƒ కౌశల్య మల్పంబె ? వా
నరజీవంబులు నిల్పితీ వవనిజాƒనాథుం గనంబోదమం
చు రయంబారఁగఁ బోయి ప్రోవఁ గని రా ƒ సుగ్రీవునారామముల్. 443

## వానరులు మధువనంబుఁ జేరుట

ఉ. తేనెలుఁ బండ్లునుం గలవు ƒ దీననటం చభయంబుగా ఫలో
ద్యానమునం గదాజ్ఞను ముƒదమ్మునఁ జేరి సమస్తవానరుల్
తేనెలు ద్రావి పండ్లు దిని ƒ త్రేన్పులు మీఱఁగఁ దృప్తిఁ జెందుచు
న్వానరచేష్ట లొందు చనిƒవారితరీతిగ సంచరింపఁగాన్. 444

గీ. వలదటంచును దధివక్త్రƒవానరుండు, వారి వారింప వినక యƒవ్వానిఁ బట్టి
వాన రేశున కీతఁడు ƒ మేనమామ, యని యెఱింగియుఁ బడమొత్తి ƒ యనిచి రపుడు.

గీ. దధిముఖుం డేగి వానరƒధవునితోడ, నంగదాదులు చేసిన ƒ యక్రమంబు
లన్నియును దెల్ప సీతను ƒ గన్నవారె, కాన నామధుకాననాƒసీను లైరి. 446

ఉ. వీరలు సీతఁ గాంచుటను ƒ వీతభయాత్మకులై వనంబునం
గోరి ఫలాదు లైరనుచుఁ ƒ గోతులఱేఁడు గ్రహించి మామతో
వారల కడ్డు వోక ఫలƒభక్షణముం బొనరించి పిమ్మటన్
శ్రీరఘురాముచెంత కతిƒశీఘ్రత రమ్మనుమయ్య మాతులా ! 447

గీ. వారు కృతకార్యగౌరవƒవంతు లయ్యు, తెలియ కీవడ్డు వోవ మƒర్దించి రేమొ
కాన క్షమియింపు మవ్వారి ƒ గౌరవమున, నతిరయమ్మున నిటకు రƒమ్మనుము పొమ్ము.

చం. అన విని యాతఁ డేగి యట ǂ నంగదముఖ్యులఁ జూచి ప్రేమతో
నను మహనీయులార ! యిది ǂ యంతయుఁ జెప్పితి జేనితోడ ర
మ్మనియె మిమ్ముఁ రయమ్మున ఫ ǂ లాదులఁ దిన్న యనంతరంబె మీ
కనుచిత మే నొనర్చితిని ǂ యజ్ఞత దాని సహింపుఁడీ దయన్. 449

చం. అన దధివక్త్రివాక్యముల ǂ నంగదముఖ్యులు నాలకించి వే
జని రఘురామచంద్రునకు ǂ సాగిలి మ్రొక్కిరి మ్రోల నిల్చి పా
వని పరమేష్ఠిదత్తశుభ ǂ పత్ర మొసంగి ధరాజ యిచ్చు నా
ఘనమణి నిచ్చె రామునకుఁ ǂ గాకకథ న్వచియించె నమ్రుఁడై. 450

ఉ. మారుతివాక్యముల్ సుజన ǂ మాన్యుఁడు రాఘవుఁ డాలకించి బ్రా
హ్మీరమణీయపత్రగత ǂ వృత్తము నెల్లఁ బఠించి లంకలో
మారుతి చూపినట్టి యతి ǂ మానుషపౌరుషముం గ్రహించి యా
ధీరుని గౌఁగిలించి కడుఁ ǂ దృప్తి దలిర్పఁగఁ బల్కె నీగతిన్. 451

ఉ. ఓ మరుదాత్మజా ! యిటు మ ǂ హోపకృతిం బచరించినా వహో !
యీమహనీయకార్యమున ǂ కే నిడఁజాల సమోపకారక
శ్రీమహితార్థ, మందులకుఁ ǂ బ్రేమ మెయి న్నినుఁ గౌఁగిలించితిన్
మామకభక్తవర్యులకె ǂ మత్పరిరంభణభాగ్య మబ్బెడిన్. 452

వ. ఓ దాక్షాయణీ ! అనంతకోటిసంఖ్యాకులగు వానరులలో హనుమంతుం డెంత ధన్యాత్ముఁడో చూడుము. లీలామానుషవిగ్రహుండగు శ్రీరామునివలన స్వయంకృతానితరలభ్యపరిరంభణమహాఫలం బందెఁ గావున నామరుదాత్మజుండు రామబ్రహ్మైకాంతికభక్తుండు జీవన్ముక్తుండు నయ్యెఁ జుమా యని శంకరుండు మఱియు నిట్లనియె. 453

ఉ. ఏమహనీయపాదయుగ ǂ మెప్పుడునుం దులసీదళాదులన్
భూమిజనుల్ యజించి యతి ǂ మోదము మీఱఁగ ముక్తిఁ గందు రా
రాముఁడు ప్రేమపూర్వ పరి ǂ రంభణభాగ్య మొసంగె నద్దిరా
యీమరుదాత్మజుం డవని ǂ నెంతటిపుణ్యుఁడో ? యెంతధన్యుఁడో ? 454

చం. అన విని భీతభీతుఁడు చ ǂ లాంగుఁడు నై మరుదాత్మజుండు రా
ముని గని దేవ ! త ప్పొకటి ǂ మూఢుఁడనై యొనరించినాఁడఁ ద్రో
వను మునిచెంత నుంగరముఁ ǂ బాఱఁగవైచితి దానిఁ బిమ్మటన్
గనుఁగొనలేక వచ్చితిని ǂ కావుము నాయపరాధ మోప్రభూ ! 455

చం. అనుటయు నవ్వి రామవిభుఁ డా తనితో నను మారుతాత్మజా!
మునినయి నేనె కన్పడి సరోముద్రితగర్వము మాన్ప నీయెడం
గనికర ముంచి మున్నటులు గైకొనినాఁడ మదంగుళీయమున్
గను మిది నీకడం గొని ప్రకాశతఁ దాల్చితి నీకనిష్ఠికన్. 456

గీ. అనిన రామునియంగుళీయకముఁ గాంచి, మదము విడనాడి చిత్రసమ్మదము లొంది
ఈరఘుస్వామి శ్రీవిష్ణుఁడే మదీయ, శక్తి కీతని దయయె ప్రేరణంబు నిజము. 457

వ. అని తలంచుచు హనుమంతుండు నాఁటినుండియుఁ బరమభక్తుండై గర్వరహితుం
డై యుండె. 458

మ. సుదతీ! పార్వతి! రామభక్తుఁడు మరుత్పూనుండు రామార్థమై
విదితుండై యొనరించు సత్కృతివిధావిస్తారముం గూడి స
మ్మదమున్ ముక్తియు భుక్తి సర్వవిధకార్యం బిచ్చుచున్ బావని
ప్రదమై యొప్పెడి సుందరాఖ్యకథ నీరూపమ్మునం జెప్పితిన్. 459

వ. అని చెప్పిన పరమేశ్వరువచనమ్ములు విని దాక్షాయణి తారకరామచంద్రకథాకర్ణ
నోత్సాహ యగుటం బరమానందకందళితహృదయారవింద యయ్యె. 450

మాలిని. వితతసుజనరమ్యా! వీతరాగానుగమ్యా!
స్మితలసితసుభాషా! శేషభూషావిశేషా!
శ్రుతిసముదయవేద్యా! సూరిసంఘాతహృద్యా!
శ్రితసమవనభావా! శ్రీభవానీశదేవా! 451

ఇది శ్రీ గుండు లక్ష్మణశాస్త్రి విరచితం బైన
ఆంధ్రానందరామాయణమ్మునందుఁ
జతుర్థాశ్వాసము
సమాప్తము.



శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# ఆంధ్రానందరామాయణము

## సారకాండము

### పంచమాశ్వాసము



శ్రీమత్తారకమంత్రచింతనరతా! చిద్రూప! భక్తావళి
క్షేమప్రాపణశక్తపాదయుగళా! శ్వేతాంగరుగ్భాసురా!
వామాంగీకృతశైలరాజతనయా! వందారుబృందారకా!
సోమాలంకృతమౌళి! యోగిజనసంస్తుత్యా! భవానీశ్వరా! 1

వ. అవధరింపుము. 2

చం. అనువుగఁ బ్రాణనాథుఁ గని యంబిక పల్కె దృఢానురాగయై
ఘనతరమైన రామవిభుగాథ పదంపడి యెట్లు చెల్లెనో
విన నభిలాష మయ్యెడు సవిస్తరము న్వచియింపుమా యన
న్విను మని శంభుఁ డిట్లనె నవీనసుధామధురోక్తు లొప్పఁగాన్. 3

### రాముఁడు వానరులతో నబ్ధితీరముఁ జేరుట

ఉ. మంగళవాక్యముల్ నుడువు మారుతితో నను రాఘవుండు సీ
తం గని క్షేమవార్తలవిధంబు వచించి మదీయచిత్తము
ప్పొంగఁగఁ జేసియుంటి వట భూసుత యెంతటిమోద మాత్మలో
నం గొనెనో? మహాత్మ! యిఁక నాకు నినుం గొనియాడ శక్యమే. 4

ఉ. మారుతనందనా! సుజనమాన్య! దశాస్యపురీవిశేషముల్
వీరులసంఖ్యయు న్మఱియుఁ జూచినచిత్రములెల్లఁ జెప్పుమా
క్రూరదశాస్యకృత్యములకుం దగునట్లుగ నెంతయుం బ్రతీ
కారము సేయు నెంతు సరిగా వివరింపుము చూచినట్లుగన్. 5

ఉ. వాయుజుఁ డిట్లనెన్ దివిజవైరిపురంబు త్రికూటమందు రా
మా ! యతివర్ణనీయరుచిరమన్మణికల్పితసౌధజాలమై
ఆయతనిర్మలాంబుపరిఖాన్వితమై సుమవాటికాళితో
ఛాయుతమై యనంతవిభవమ్మున నొప్పును నాకమో యనన్. 6

చం. నలుగడలందువారములు నాలుగు తాజిలుఁ బశ్చిమంబునన్
బలియురు హస్తిపుల్ సుపరిపాలన జేయుదు రుత్తరంబునన్
బలువురు నాశ్వికు ల్గలరు ప్రాగ్దిశ నట్టులె యుండు యామ్యమం
దలి రథికాళిసంఖ్య నియుతం బటు లుందురు మధ్యకక్ష్యలోన్. 7

మ. చతురంగంబులసైనికుల్ బహువిధాస్త్రప్రాజ్యదోస్సారులై
సతముం గావలి యుండ యంత్రశతసంసక్తోగ్రశాతఘ్నికాం
చితమై వాయువుకైన నుంతయును లోఁ జేరంగ దుస్సాధమై
వితతాంభోనిధివేష్టితం బగుచు నవ్వీ డొప్పెడిన్ రాఘవా ! 8

ఉ. ఆసురవైరిప్రోలు భవదాజ్ఞ శిరమ్మునఁ దాల్చి పోయి నీ
దాసుఁడనైన నేను కడుధైర్యముతో ధరణీజఁ గాంచుచున్
జేసినకర్జముల్ వినుము చిచ్చిడి కాల్చితి లంక నెల్ల నా
యాసురసేనయందు చతురంశముఁ జంపితి సాహసమ్మునన్. 9

సీ. ప్రాకారగోపురప్రాసాదములఁ గూల్చి, పరిఖమ్ములను బూడ్చివైచినాఁడ
యంత్రశతఘ్నుల నాయుధమ్ములనెల్ల, విఱిచి సంద్రమ్ములో విసరినాఁడ
లీలోపవనభూజజాలంబుఁ బెకలించి, బయలుగాఁగను బాడువఱపినాఁడ
నడ్డువచ్చినవారి నవలీలగాఁ జంపి, మించు మీకీర్తి వర్ణించినాఁడ
గీ. వీడు వహ్నికిఁ దృప్తిగా వేల్చినాఁడ, నింతలో వీడు నిర్మించిరేని ఱేఁడ !
కదలి మీతోడఁ జని దానిఁగాల్చువాఁడ, దేవరకు దాసుఁడ నటంచుఁ దెల్పినాఁడ.

వ. రామచంద్రా ! మఱియుఁ దత్పురీవిశేషమ్ములు విను ముత్తరమ్మున సువేలాద్రి
యుఁ బశ్చిమమ్మునఁ బరలంకయు దక్షిణమ్మున 'నికుంభిల' యను నాభిచారిక
హోమస్థలమ్మును యోగినీవటమ్మును తూర్పున లఘులంకయుఁ గలవు. మధ్యభాగ
త్రికూటశిఖరమ్మునఁ బ్రధానలంకారాజధాని యలరు నో రామా ! వేగమ సాగర
తీరమ్మున కేగఁ బయనింపుము సాగరతరణోపాయం బట నాలోచింత మన విని
సుగ్రీవుం జూచి రామచంద్రుం డిట్లనియె. 11

చ. చెలువుఁడ! లెమ్ము వానరుల సిద్ధము సేయుము పోద మిప్పుడే
యలఘుశుభాకరంబు విజయాఖ్యముహూర్తము నాశ్వినాఖ్యమా
నెల, సితపక్షమున్, దశమి నేఁ డుడువున్ శ్రవణంబు, చక్కఁగా
యలవడునూ జయంబు మన కర్కజ! యోడుదు రోయి! రక్కసుల్. 12

వ. కావున వానరయూథపులెల్ల సైన్యము నలుదిక్కులఁ గాచున ట్లొనర్పుము, నా యగ్రభాగమ్మున నలుండును వెనుక నీలుండును పార్శ్వమ్మున సుషేణజాంబవంతులును మఱియు గజగవయగవాక్షగంధమాదనమైందద్వివిదపనసశరభాదులు విదిక్కుల నుండునటు లొనర్పుము, హనుమంతునిపై యేను నంగదునిపై లక్ష్మణుండు నెక్కి వచ్చెదము, నీవు నా చెంతల నుండు మిటు దృఢవ్యూహపూర్వకంబుగా రిపువిజిగీషు లేగుట మేలన సుగ్రీవుం డట్ల సర్వంబు సంఘటించిన రామచంద్రుఁ డైరావతారూఢుండగు నింద్రునిం బోలి హనుమదంసారూఢుఁడై సేనామధ్యమ్ముననుండి సకలవానరపరివృతుండై చనుచున్నంత. 13

చ. కెరలుచుఁ దోఁక లెత్తుకొని క్రేళ్ళుఱుకన్ దరు లెక్కి యాగుచున్
బరుగిడి యాగు చొక్కకరిపై నొక రెక్కుచు నేలఁ గూలుచున్
దఱచు కిలార్భటుల్ దనర దర్పితవృత్తిని మల్లఁ గొట్టు చం
దఱుతరుచారు లాకడలిదాపున కేగగసాగి రత్తఱిన్. 14

సీ. ఏనొక్కరుఁడఁ జాలనే రావణు వధింప, నింద తేలా యంచు నెగురు నొకఁడు
పొలసుదిండుల నెల్లఁ బొలియించి రాముని, దేవిఁ దెచ్చెద నంచుఁ దెల్పు నొకఁడు
హనుమంతునట్లు నే నటు చనియున్న చో, నవనిజఁ దేనె యంచను నొకండు
రాముని చెంతకు రావణుఁ గొని తెచ్చి, హననంబుఁ జేయింతు ననను నొకండు
గీ. ఇట్లు సల్లాపముఖరులై యెల్లకపులు, కామరూపులు ద్విరదసంకాశతనువు
లుత్సవమ్మున కేగెడి యోజఁ జనిరి, రామచంద్రునితో జయరావు లగుచు. 15

ఉ. ఆరహి రామచంద్రునిప్రయాణమునన్ శుభసన్నిమిత్తముల్
మీఱఁగ రేబవళ్లును జలింపక చందనసహ్యశైలయు
గ్ధారుణి దాటి యామ్యదిశగా సమరోద్ధతి మీఱ వారకూ
పారతటంబుఁ జేరి యట వాసము జెందిరి సక్రమంబుగా. 16

గీ. అచట సైకతతీరమ్మునందుఁ జేరి, రామచంద్రునిమ్రోలఁ దారాగణంబు
లటులు వసియించి యబ్ధి దాటుటకు వారు, మంతనం బుండి రతిబుద్ధిమంతు లగుచు.

## రావణుని మంత్రాలోచనము

ఉ. అంతట లంకలోన మరుదాత్మజకృత్యముఁ జూచి తా సభా
భ్యంతరమందు రావణుఁడు నాప్తులతోఁ గొలువొందియుండి యా
త్యంతికమిత్రుఁడై తగు ప్రహస్తునితో నను మిత్రమా! హనూ
మంతుఁ డొకండు వచ్చి యతిమానుషచర్యలఁ జేసి పోయెఁగా. 18

చం. పురమునఁ జేరెఁ జూచె నట భూసుత నక్షునిఁ జంపెఁ దోఁట ని
స్తరువుగఁ జేసెఁ బాలకులఁ జంపెను బల్వుర నస్మదీయులన్
దురమున జంబుమాలిముఖదోర్బలశాలురఁ జంపె నింక నే
కరణి భవిష్యదర్థ మది కల్గునొ యేమియుఁ దోఁప దక్కటా! 19

చం. సురల జయించినాఁడ సురసుందరులన్ గొనితెచ్చినాఁడఁ గి
న్నరులను మానవావళిని నాగుల గెల్చితి ముజ్జగంబులం
గరము వశంబుఁ జేసితిని గాంచితిఁ గేరితి నట్టి నాకు వా
నరునకు లొంగిపోవుట మనమ్మున నెంచిన దుఃఖ మయ్యెడిన్. 20

గీ. కోఁతియఁట! రావణాసురుకోటఁ గాల్చి, రక్కసులఁ జంపి విజయవిరాజి యగుచుఁ
బట్టుపడ కేగెనన్న నీపల్కు విన్న, నరసురాదులు పక్కున నవ్వికొనరె! 21

గీ. ఏమిచేసిన నా కింక హితము గల్గు,నట్టిపని మీరు మదిలోన నరసియుండి
పల్కుఁ డో మంత్రివరులార! భవ్యులార!, యేమియును దోఁపకుండె నింకేదిదిక్కు.

చం. అన విని మంత్రు లిట్టు లని రయ్య విచార మదేల వానరుం
డనుచు నుపేక్షఁ జెందుటనె యాతనికృత్యములెల్ల సాగె నా
తని వధియించు టెంతపని దానవనాథ! గతం బదేల నీ
వనుమతి నిచ్చితేని జగ మంత నవానరముం బొనర్పమే. 23

చం. అన విని కుంభకర్ణుఁ డపు డన్నఁ గనుంగొని పల్కె నన్న! నీ
వనయముఁ జేసి తాదిని ధరాత్మజఁ దెచ్చుట తప్పు దాని కే
మనిన ఫలంబు లే దిపుడె యాజ్ఞ నొసంగుము రాము లక్ష్మణున్
వననిలయేశుతో సకలవానరులం గడతేర్చి వచ్చెదన్. 24

ఉ. కోఁతియొకండు వచ్చి యిటు కోటలుఁ బేటలుఁ గాల్చు చెల్లరన్
భీతులఁ జేయ లేపి ననుఁ బిల్వఁగ రాదొకో నేనె యుండినన్

గోతిని జంపి ముద్దగను ౹ గూరిచి చక్కఁగఁ జప్పరించి నీ
చేతము రంజిల న్నమలి ౹ చెచ్చెరఁ దృప్తిగ మ్రింగకుందునే. 55

చం. అనఁగ విభీషణుండు వినౘయాదికసద్గుణభూషణుండు స
జ్జనుఁడు రఘూత్తమాంఘ్రియుగౘసారసభక్తిసుపోషణుం డనెన్
దనుజవరేణ్య! కూళలగు ౹ తావకమంత్రులమాట విన్న నిం
కను బురిఁ జేటు గల్గు ఘటౘకర్ణుని దొల్లటిమాట యొప్పగున్. 26

ఉ. కోఁతియటంచుపేక్ష యని ౹ కూసిరి వీరలు నిక్క మొక్కఁ డీ
కూతల కర్థ మున్నె చిఱుౘకోఁతిని బట్టఁగలేక యిట్లు ని
ర్హేతుకదుష్ప్రలాపమున ౹ నేమిఫలం బగు వీరు నీముఖ
ప్రీతిగ మాట లాడుదురు ౹ వీరలమాటలు నమ్మఁబోకుమా. 27

కం. చిన్నన్నమాటయును నీ, మన్ననకేకాని నీతిౘమార్గవిధానం
పన్నము గాదు తలంపఁగ, నన్నా! వినుమా మదీయౘమగు హితబోధన్. 28

సీ. ధరణిజఁ దెచ్చుట ౹ ధర్మవిరుద్ధంబు, పరభార్యఁ గొనుట పాౘపంబు గాదె
యాపాపమే కపిౘరూపంబుగా వచ్చి, యీపురి దైత్యుల ౹ రూపు మాపెఁ
గుంభకర్ణేంద్రజిౘత్కుంభనికుంభులు, ధూమ్రాక్షదుర్ముఖాౘదులు తలంప
సంగ్రామమున రామౘచంద్రుని నెదిరించి, పోరలే రడియాసఁ ౹ బొంద నేల

గీ. కనకమయభూషణాంచితౘగా నొనర్చి, జనకజను రాఘవున కిచ్చి ౹ శరణ మొందు
మటులు కాకున్న హరిహయు ౹ లడ్డుపడిన, రామచంద్రుఁడు నిను జంపు ౹ రాక్షసేంద్ర!

ఉ. కావున నాహితంబు విని ౹ గర్వముఁ జెందక మంత్రు లాడు నీ
కావరము ల్గణింపక ప్రౘకాశితనీతిని లోఁ దలంచి సా
ధ్వ్యాహవమైన ధర్మపథ ౹ మారసి సీతను వీడి హాయిగా
శ్రీవిభవంబులం గొని భుౘజింపుము ప్రాణధనేచ్ఛ గల్గినన్. 30

గీ. మనుజమాత్రుండు కాఁడు సుౘమా యతండు, వాని గెలువంగఁ జాల రెౘవ్వారలైన
సీత నర్పించి తత్పదాౘశ్రితుఁడ వగుము, యిదియె గతి గాని లే దింక ౹ నితర మనిన.

గీ. ధర్మముహితంబునుడువుసోౘదరునిజూచి,మృత్యువృతుఁ డౌట వినకుండిౘమిట్టిపడుచుఁ
గనలి తల లూచు చాదశౘకంఠుఁ డపుడు, పరుషతరమైనవాక్యము ౹ ల్పలికె నిటులు.

మ, తులువా! మిత్రసరూపశత్రుఁడవు నీౘతో మైత్రి యింకేల నీ
తల భిన్నంబగు నింకఁ బ్రేలినను సోౘదర్యుండవం చోర్చితిం

జలమున్ రాక్షసధర్మము న్వీడుచు నీ జన్మమ్మునుం గాల్పనే
ఖలుఁడా! పో మ్మొటకైన వేగమున నా కంటం బడం జంపెదన్. 33

## విభీషణుఁడు రాముని శరణ మొందుట

కం. ఇగ్గతిఁ దిట్టిన నన్నున్, దిగ్గున విడనాడి లేచి ధీరతతోడన్
బ్రగ్గడలఁ గొని విభీషణుఁ, డగ్గగనాధ్వమున నేగి యట రాముఁ గనెన్. 34

వ. ఇట్లు విభీషణుండు సకలసత్త్వమనోహరదివ్యమంగళవిగ్రహుఁడగు రామచంద్రునిఁ జూచి యానందపులకితభక్తివినయవినమితాంగుండై కేల్గవ మోడ్చి యిట్లనియె.

కం. రామా! రఘుకులనీరధి,సోమా! వేదాంతవేద్య! శుభతరనామా!
కామాదివైరిగిరిసు,త్రామా! సుగుణాభిరామ! రాజితధామా! 36

గీ. రావణాసురుతమ్ముఁడ రామచంద్ర!, నే విభీషణనాముఁడ నిన్ను శరణ
మొంద వచ్చితి వికచారవిందనేత్ర!, యభయ మిడి నన్నుఁ గావు మోయద్దగాత్ర!

ఉ. నీచదశాస్యుఁ డేనుడువు సీతని వీడి ననుం దృణమ్ముగాఁ
జూచి పరాభవించుటను క్షుద్రుని వానిఁ ద్యజించి రాఘవా!
నీచరణాంబుజంబు లిఁక నే శరణం బని నమ్మి వచ్చి నిన్
జూచితిఁ జేది పెన్నిధిని జూచినపోలిక నన్నుఁ బ్రోవుమా.

చం. అన విని యార్తరక్షణమహావ్రతదీక్షితుఁడైన రాఘవుం
డనియె విభీషణుం గని ముదాన్వితుఁడై, యభయంబు నీకు, నా
యనుజులతో సముండవు సుమా! మది భీతిఁ దొలంగి యుండుమా
దనుజవరేణ్యుఁ జంపి నినుఁ దప్పక లంక కధీశుఁ జేసెదన్. 39

గీ. అని కరమ్మున నాదానవునికరమ్ముఁ, గనికరమ్మునఁ గీలించి కౌఁగిలించి
సౌమ్య! మీయన్న యే వచ్చి శరణ మన్నఁ, గాచెదనటన్న నరుదె నిన్ గాచు టిపుడు.

సీ. అని రాముఁ డంజనాతనయునితో నను, మారుతీ! యీయబ్ధితీరమందు
సైకతలంకను జతనంబు చేయుమా, వీనికి నభిషేకవిధి నొనర్తు
నరివధానంతర మాలంక నిడుటకుఁ, బ్రతిరూపముగఁ జేయువాఁడ నేఁడె
నీవొనర్చినలంక నీపేరఁ బరఁగు నం, చన నాతఁ డటు సేయ నలరి రాముఁ

గీ. డావిభీషణు నపుడె పట్టాభిషిక్తుఁ, గా నొనర్చెను నేఁటి కక్కడలిచెంత
లంక యలరు మరుత్సుతలంక యనఁగ, రమ్యశుభగాత్రి! యోగిరాజపుత్రి!

ఉ. అంతట మింట నిల్చియె శుకాఖ్యుఁడు రావణదూత సాధ్వసా
క్రాంతుఁడునై ప్లవంగపతిఁ గాంచి యనుం రవిపుత్ర! రావణో
దంతము నాలకింపుము యథార్థముగా రఘురామభార్య నేఁ
బంతముతో హరింపఁగను భావ్యమె? నీ కిటు రాక యర్కజా! 42

కం. రాముని సతిఁ దెచ్చిన, నీ, కేమైనను బాధ కలిగెనె ప్లవగులతో
వే మఱలి పొమ్ము మీపురి, కీమాడ్కి విరోధభావ మేలా? మనకున్. 43

గీ. అనుచు రావణుసందేశ మతఁడు చెప్పఁ, గీశు లాతనిఁ బట్టి సంకెలలఁ గట్టి
రతనిసహచారి శార్దూలుఁ డనెడువాఁడు, పఱచి రావణుతో శుకవార్తఁ దెలిపె.

వ. ఇట్లు శుకబంధనమ్ము శార్దూలునివలన నద్దనుజశార్దూలుండు విని దురంతచింతా
క్రాంతుండై భావికార్యవిధానం బాలోచించుచుండె నంత నిక్కడ రామచం
ద్రుండును. 45

మ. మంతనమందు దైత్యహనుమద్రవిజాదులవాక్యజాత మా
లింతునటంచు లేచి రవళించు సముద్రు నదల్చె దాన నా
ప్రాంతమునం సముద్రుఁడు రవం బొనరింపఁ డనంతరంబు నా
మంతనమున్ ముగించి నియమమ్మున రాముఁడు దర్భశాయియై. 46

## శ్రీరాముఁడు ప్రాయోపవేశ మొందుట

కం. ప్రాయోపవేశనం బిటు, లాయుర్విం జెంది యుదధిఁ బ్రార్థింపంగా
నాయుదధి రాకయున్నఁ దృతీయదినమ్మునను రామదేవుండు రుమన్. 47

వ. దర్భాస్తరణమునుండి లేచి నితాంతారుణితలోచనుండై పరిసరవర్తియగు లక్ష్మణుం
జూచి యిట్లనియె. 48

ఉ. రాఁడు సముద్రుఁ డెంతటిగరాసా? కనుంగొను మీజడాత్ముఁడో
వాఁడు మృదుత్వ మొందునొకొ ప్రార్థన మెంత యొనర్చుచున్న, నీ
వాఁడిమి వీనిచెంత నిఁకఁ బోలదు మత్ఖరశస్త్రజాతమా
వేడిమిచే నజీవనుని వీని నొనర్చెద నేఁడు లక్ష్మణా! 49

తే. అంపచిచ్చున గాధమౌ నట్లొనర్చి, ప్లవఁగు లెల్లరు నడచుచు లంకఁ జేరు
నట్లొనర్చెద నని వింట నపుడు గూర్చె, నగ్నిసమమైన ఘోరతరాశుగంబు. 50

తే. ధరణి చలియించెఁ జీఁకట్లు తవరెఁ గడలిఁ, గడలి క్షోభించి వెనుక కామడకుఁ బాఱె
సంతపించెను జలచరసంఘ మపుడు, రామబాణప్రయోగసంభ్రాంతి దనర. 51

చం. కడలి మనుష్యరూపమునఁ గన్పడి రత్నపుఁగానుకిచ్చి యు
య్యెడ రఘుపుంగవుం గని యకంపితభయమ్మున వేఁడె రాఘవా!
బడలితి నీశరంబుఁ గని పైఁబడ నోర్తునె? లంక కేగ నా
జడములఁ ద్రోవ నిచ్చెదను నాకుము నీకె శరణంబు వేఁడితిన్. 52

చం. అనినఁ గృపాళుఁడై పలికె నారఘురాముఁ డమోఘమైన మ
ద్ఘనశర మెడ వీడెదనొ తద్భువిఁ దెల్పుమటన్న సాగరుం
డనియె మదుత్తరమ్మున నఘాత్ములు వన్నెరియించుచుంద్రు వా
రిని ద్రుమకల్పవాసుల వధింపుము దేవ! భవచ్ఛరమ్మునన్, 53

వ. అనిన రామచంద్రుఁ డమోఘశరంబు ద్రుమకల్పలక్ష్యమ్ముగా వీడిన నది క్షణ
మాత్రమ్మున నేగి యాదుశ్శీలురం గడతేర్చి మఱలి రామతూణీరమ్ముఁ జేరె నంత
సముద్రుండును రామా! నాపై నలునిచే శిలాసేతువు నిర్మింపఁజేయుము, నీట
రాలఁ దేల్చువర మాతనికిఁ గలదు, మున్నొకపాలుని సాలగ్రామమును గంగా
నదిలో నీనలుండు బాలుడైవ నద్దానిఁ గనుంగొని విప్రుం డలిగి నలుం జూచి నీవు
నీట నిడు రాలెల్లఁ దేలుఁగా కని శపించె నంత నీలుం డది వరంబుగాఁ గొనియెఁ
గావున నాఘనునిచే సేతువు నిర్మింపఁజేసికొని వానరులతో స్వేచ్ఛమై చని శత్రు
సంహార మొనర్పు మని రత్నాకరుం డంతర్హితుం డయ్యె నంత రామభద్రుండును
సేతునిర్మాణమ్మునకు నలు నాదేశించి తదాదిని నిర్విఘ్నపరిసమాప్తికై విఘ్న
నాథుఁ బ్రతిష్ఠించి నలనిర్మితంబులగు శిలారూపనవగ్రహమ్ముల సాగరమ్ములఁ
బ్రతిష్ఠితమ్ముల నొనర్చి పూజించి మఱియుఁ దనపేర నొకశివలింగమ్ముఁ బ్రతిష్ఠింప
నెంచి మరున్నందనుం గాంచి యిట్లనియె. 54

గీ. కాశి కేగి మహేశలింగద్వయమ్ముఁ, గొని ముహూర్తంబు దాటకమునుపె రమ్మ
టన్న మారుతి చని మింటనె తెన్నుఁ బట్టి, కాశి కేతెంచి నన్నిటఁ గాంచె గిరిజ!

చం కని రఘురాముకోర్కెఁ బలుకన్ విని నేనును లింగయుగ్మముం
గొను మని యిచ్చి "యామ్యదిశకుం జనఁ గోరితి నే నగస్త్యునిం
గనుఁగొన రాము విశ్వమయుఁ గాంచియె పోయెద" నన్న వాయుజుం
డనియె మహేశ! యేటికి ప్రయాణము నీకు నగస్త్యుచెంతకున్. 56

గీ. దాని విని గాని పోవఁగాఁదలఁపు రాదు, తెలుపు మొక్కింత యష్టమూర్తీ! యటన్న
పలికితిని మున్ను వాయుసంభవునితోడ, వినుము పార్వతి! తత్కథావిధము నెల్ల.

## అగస్త్యుఁడు వింధ్యగర్వ మడఁచుట

ఉ. నారదుఁ డొక్కనాఁడు మును నర్మదలో నభిషిక్తుఁ డౌచు నోం
కారవిభూత్తముం గొలిచి కౌతుక మొప్పఁగఁ జూచెఁ ద్రోవ సం
సారజతాపహారి శశిజాజలమండితమై చరాచరా
ధారభువి న్వసుంధరగఁ దథ్య మొనర్చెడుదాని వింధ్యమున్. 58

కం. దేవమునిఁ గాంచి వింధ్య, గ్రావం బెదురేగి తెచ్చి కడుభక్తిని సం
భావించి సాదరమ్మున, భావం బలరంగ ధర్మపద్ధతిఁ బలికెన్. 59

ఉ. సారదయామయా! సుగుణసాగర! మామకపాపవహ్నికి
న్నీరదతుల్య మయ్యెఁగద నీచరణాబ్జపరాగ మోమహో
దార దయాళు మాధవపదద్వితయాంచితసేవనాదరా!
నారద! యుష్మదాగమమున న్మదభీష్టము సిద్ధిఁజెందెడిన్. 60

శా. శ్రీవైకుంఠపదాబ్జభక్తవర! నీ సేవం గృతార్థుండనై
గ్రావాళిం దలకట్టు నైతిఁ బరిపక్వం బయ్యె మత్పుణ్యముం
గైవల్యాపరమూర్తి వీవు త్రిజగత్కల్యాణ! మీబోంట్లకున్
సేవ జ్జేసిన జన్మము న్సఫలమై చెన్నారదా నారదా! 61

గీ. అనఁగ విని నారదుండు వింధ్యాద్రిఁగాంచి, కించిదుచ్ఛ్వాసుఁడైయుంటఁగాంచి యద్రి
గర్వమునఁ బల్కె నుచ్ఛ్వాసకారణంబుఁ, బల్కుమా నీదుఖేదంబుఁ బాపఁగలను.

వ. మఱియు నాప్రభావమ్మునకు నేగిరిప్రభావంబును సరిగాదు వినుము. 63

ఉ. భూధరణంబు మేరుముఖభూధరపాళికిఁ దుల్య మంచు నే
యూధరఁ బూర్వులెల్ల వచియింతురు గాని మహాత్మ! సర్వమున్
నే ధరియింతు మత్సముఁడు నిక్కముగా మఱి లేఁడు భూమిభృ
న్నాథుఁడు గౌరితండ్రియుఁ బినాకికి మామయుఁ గానఁ బూజ్యుఁడౌ. 64

గీ. కనకమును రత్నసానువుల్ గలిగియున్న, సురల కాలయమైనను సూరివంద్య
మేరుగిరి నన్ను నెవ్వడు మించఁగలదె, సకలపూజ్యతలో నాకు సాటియగునె?

గీ. మఱియు నెన్నని పుడమిపై మహీధరములు, కలవు వానికి స్వస్థానగౌరవంబె
కాని యెటు కల్గు నారీతి గౌరవంబు, నున్నతియు సర్వపూజ్యత యుర్వియందు.

సీ. మందేహశైలంబు తుండిలం బుదయంబు, నుదయైకసుగుణతాయుక్త మగును
నిషధంబుఁ బరికింప నిర్గతౌషధి యస్త, మస్తప్రభంబు నీలాద్రి వల్లు

మంథరం బాలోక ✽ మంధరం బగుఁ జంద,నాలయంబును భుజం✽గాలయంబు
రైశూన్య మయ్యెను ✽ రైవతంబును హేమ,కూటత్రికూటాది✽కుధరసమితి
గీ. బహుళకూటోత్తరపదాఖ్య ✽ భాగ్యయుతమె, క్రౌంచకిష్కింధసహ్యాద్రి✽గణము లెల్ల
వసుమతీదేవి కరయఁగా ✽ బరువుచేటె, కాని యివియెల్ల నాసరి ✽ గావు సుమ్ము.

ఉ. నారదుఁ డంత వింధ్యవచ✽నంబున కచ్చెరు వంది యాత్మలో
నీరహి నెంచె వింధ్య మర✽రే! యతిగర్వముఁ జెంద నొప్పునే ?
ధారుణి శ్రీగిరిప్రముఖ✽ధన్యతరాద్రులు శృంగదర్శనా
పారవిముక్తిదంబు లయి ✽ వందలు వేలుగ లేవె యీధరన్. 68

చం. అని మది వీనిగర్వపరి✽హారము గాఁదగు నంచు నెంచి యా
తనిఁ గని మౌనివర్యుఁ డనెఁ ✽ దథ్యమె నీవచనంబు వింధ్యమా !
యనవరతంబు మేరుగిరి ✽ హాస్యము సేయును వింజ మెంత త
ద్ఘనత మతేమి యంచు నది ✽ గాక నినుం దలపెట్ట వేగిరల్. 69

ఉ. అంచితమౌ మదుచ్ఛ్వసిత ✽ మందుల కే సుమి యెవ్వ రేరికి
న్వంచకులైన మాకుఁ దల✽వంపులు గావు సుమీ ప్రశంస గా
వించితి గానఁ దెల్పితిని ✽ వింధ్యమ ! నీకు శుభంబు గావుతన్
మంచిది పోదు నంచు సుర✽మౌని చనెన్ సురమార్గచారియై. 70

సీ. అంత వింధ్యగిరీంద్ర ✽ మాత్మలో దుఃఖించి, యామేరుగిరికి శ్రైష్ఠ్యం బదెట్లు
సూర్యుండు గ్రహయుక్తిఁ✽జుట్టును వలగొను,ఘనుఁ డటంచును మేరు✽వునకు సతము
నాచుట్టుఁ దిరుగఁడే ✽ నలినాప్తుఁ డని యెంచి, యర్కమార్గము మించు✽నట్లు పెరిఁగె
నుదయించి తపనుఁ డా✽యుర్వీధ్రమును జూచి, నిలిచె నవ్వల కేగ✽నేర కచట
గీ. రెండువేల్ రెండువందలు ✽ రెండునైన, యామడలదూర మే నిమే✽షార్ధమునను
పోవవలయును వింధ్య మీ✽త్రోవలోన, నలముకొనియుండె నెట్టు లవ్వలికిఁ జనెద ?

వ. అని సహస్రాంశుఁ డున్నచోటుననే నిలిచియుండ నిట్లు బహుకాల మతిక్రమించెఁ బ్రాచ్యోదీచ్యులు సూర్యఖరకరప్రతప్తులైరి. అంబరంబునఁ దారాగ్రహంబులు నిరుద్ధంబులై ప్రోవువడియె, యజ్ఞాదిసకలకర్మకలాపం బడంగె, జగత్త్రియంబు చలించెనంత వియచ్చరులు విధివాక్యమ్మున వింధ్యగురుండగు నగస్త్యుని సమాశ్రయించి మునివర్యా! వింధ్యావలేపమ్మున జగం బసూర్యంపశ్యం బయ్యెఁ గాన నీవేగి వాని నడఁగింపు మని వేఁడిన నాకుంభసంభవుండు నాకడ కేతెంచి విన్నవింపనే నాతనిం జూచి మౌనీంద్రా ! జగదుపకారార్థ మావింధ్యగర్వం బణంచి దక్షిణ

దిక్కున కేగి యట నుండుము. కాశీపురిని నన్ను విడచితి నని ఖేదింపకు మే నచిర
కాలమ్మున శ్రీరామపూజార్థమ్ముగా వచ్చి సేతువుచెంతఁ దత్ప్రతిష్ఠితుండనై లింగ
రూపమ్మున నుందుఁ దత్ప్రభృతిగా నీవు నన్నుఁ బూజింపఁగల వంతదనుక మానస
పూజ నొనర్చుచుండు మని చెప్పితి నది విని యతండు లోపాముద్రాన్వితుండై
వింధ్యప్రాంతముఁ జేరం గని గురువరుం డేతెంచె నని భూసమంబుగ నణంగి కామ
రూపమున గురువరుం బూజించి యంజలి ఘటించి యగ్గిరి గురువరా! కింకరుండ
నేమియాజ్ఞ యనిన నయ్యగస్త్యుం డిట్లనియె. 72

ఉ. వింజమ! సంతసించితిఁ బ్రవీణత నొందితి వార్యసన్మనో
రంజక మైనభంగి ననురాగముఁ జెందితి విట్లు నాయెడ
న్వంజము గానిభక్తి నిటు ✽ వచ్చెడుదనుక నణంగు మేను వే
గం జముదిక్కుతీర్థములఁ ✽ గన్గొనఁగా నిటు లేగి వచ్చెదన్. 73

చం. అని ఘటజన్ముఁ డేగెను య(?)మాశకు వింధ్యము దాఁ బునర్జనిం
గొనినటు లాత్మ నెంచుచును ✽ గుంభభవుం డిఁక వచ్చు రేపు రే
పనుచును ద్వాదశాబ్దములు ✽ నారయుచుండెను గాని కుంభజుం
డును నిటు రాఁడు వింధ్యమును ✽ నూల్కొన దెప్పటికిన్ సమున్నతిన్. 74

గీ. అంత గ్రహతారకాన్వితుఁడై యినుండు, పోవ మొదలిడెఁ దా యథాపూర్వముగను
సకలజనములు భానుసంచరణకలన, స్వస్థత వహించి మదిలోన ✽ సంతసిలిరి. 75

గీ. దండకావని నాయగస్త్యుండు జేరి, నాదురాకను గోరుచున్నాఁడు వాని
కోరికను దీర్ప నే నబ్ధితీరమునకు, వేగ వచ్చెద మారుతీ! ✽ వెడలు మీవు. 76

కం. అని వీడుకొలువ మారుతి, చనియెను లింగద్వయంబుఁ ✽ జయ్యనఁ గొని యా
ఘను రామచంద్రుఁ గనుఁగొన, మనమున నవలేపభరము ✽ మల్లడిగొనఁగన్.

ఉ. ఆతనిగర్వముం దెలిసి ✽ యారఘురాముఁడు వానరాధిపుం
గోఁతులఁ జూచి యిట్లనియె ✽ గూఢమనోగతభావుఁడై యిటన్
వాతజుఁ డాలసించె నిఁక ✽ భవ్యముహూర్తము దాటు లింగమున్
ఖ్యాతిగ సైకతంబుననె ✽ కల్పనఁ జేసి ప్రతిష్ఠఁ జేసెదన్. 78

## సైకతలింగప్రతిష్ఠకు మారుతి కోపించుట

సీ. అని వానరులతోడ ✽ మునులతోఁ గూడియు, సైకతలింగసంస్థాపనమ్ము
జేసి రామవిభుండు ✽ చిత్తమ్ములో స్మరి,యించెఁ గౌస్తుభమణి ✽ నెలమి నదియు

నాకసమున్ననుండి యర్కకోట్యాభమై, యేతెంచె దాని సీతేశుఁ డపుడు
కంఠమ్మునను దాల్చి కడఁగి తచ్ఛక్తిచే, జనియించు ధనవస్త్రకనక ధేను

గీ. తురగదివ్యాన్నపాయసాదుల మునీంద్ర,వితతిఁ బూజింప వారు సంప్రీతి మెఱయ
మఱలిచనుత్రోవ నెదురయి మారుతాత్మ,జాతుఁడిట్లనె మ్రొక్కియాశ్చర్యమమర.

చం. మునివరులార ! మీ రెచటఁ బూజితులై యిటు వచ్చుచుంటిరో
యన మును లిట్లు పల్కి రనఘా ! రఘురాముని చేత లింగ మీ
దినమున నబ్ధిచెంగటఁ బ్రతిష్ఠిత మయ్యెను మేము వానిపూ
జనములఁ జెందియుంటి మని సంయము లేగిన వాతసూతియున్. 80

చం. మనమున రోష మొంది గుణమండనుఁడైన రఘూత్తముండు నన్
బనిచె శ్రమంబు నోర్చితిని వచ్చెడునంతకు సైపలేక న
న్ననుచితరీతి నిట్టు లపహాస్య మొనర్పఁదలంచె బాపురే !
యని యభిమానియై దిగెఁ బదాహతి నేల యడంగ నుద్ధతిన్. 81

తే. పదయుగాహతిచే నేల పల్లమగుట, నతనిపదయుగ్మచిహ్నంబు లచట నుండెఁ
గపివరుం డంత రాముని కడకుఁ జేరి, పలికె నీగతి నతిరోషకలితుఁ డగుచు. 82

చం. మఱచితివా ? కొ సీతను శ్రమంపడి యారసినట్టి నన్ను నీ
వఱుగుమటంచుఁ గాశికకు నంపి పరాభవ మిట్లు చేయుదే !
యరుగు మనంగ నేలకో ? శ్రమాన్వితుఁ జేయఁగ నేల ? నీదునాం
తరగతభావ మే నెఱుఁగఁ దత్పరి కేగుదునే యెఱింగినన్. 83

ఉ. ముంగడ తావకాభిమతమున్ గుఱుతించినఁ గాశి కేగి యీ
లింగము లేల తెత్తు ? నొకలింగము నీ కని నా కొకం డటం
చుం గడువేగ వచ్చితిని చూడుము వీని నిఁ కేమి చేసెదో
వంగినవాని వంచు టది ప్రాజ్ఞులలక్షణమే రఘూత్తమా ? 84

ఉ. కోపము నొంది యీగతిని గొంచెపుగర్వముతో వచింపఁగా
నోపవమానపుత్ర ! కన లొందఁగ నేల ? మదీయలింగ మీ
వోపికఁ దీసివేయుము శిలోన్నతలింగమె యుంచువాఁడఁ గా
శీపురవిశ్వనాథుని ప్రసిద్ధపులింగము వీటఁ బుత్తునే ? 85

చం. అనురఘురాముపల్కు విని యాహనుమంతుఁడు తోఁకఁ జుట్టి తీ
ద్ధనసికతాఢ్యలింగమును గట్టిగ లాగుచు భిన్నవాలుఁడై

ఘనమగు మూర్ఛ గ్రమ్మఁగొనఁగా నవనీతలమందునం బడన్
వనచరయోధులెల్లరును బక్కున నవ్విరి కేళ్లుదాటుచున్. 86

గీ. ఊఁకుననుబట్టిలాగినఁ దోఁక తెగెను, మూర్ఛబడెఁ గాని యాలింగమూర్ధ మించు
కైనఁ జలియింపకుండె నాయనిలజుండు, కొంతవడి లేచి స్వస్థుఁడై వింతఁ జెందె.

మ. గతగర్వుండయి వాయుజుం డవనిజాకాంతు న్మహాభక్తిమై
నతులఁ ద్దన్పి మహాపరాధమును మార్గనం బొంది నేఁ జేసితిఁ
నతకల్పద్రుమ! రామచంద్ర! వరదా! నానేరము ల్గాచి య
జ్ఞతఁ బోఁగొట్టి భవత్ప్రభావవిదుఁగా స్వామీ! ననుం జేయుమా. 88

చం. అన రాముం డనె విశ్వనాథునిశుభాఖ్యం బొల్చు నీలింగ మో
యనఘా! మామకలింగసన్నిధి నుదీచ్యక్షోణి స్థాపింపుమా
యన నట్లాతఁ డొనర్ప విశ్వపతి లింగార్చాదిహీనుండు మ
ద్ఘనలింగంబును బూజచేసినను వ్యర్థం బంచు రాముం డనెన్. 89

గీ. రామలింగేశ్వరాభిఖ్య రామచంద్రు, సైకతపులింగమున కయ్యె సరసనున్న
యనిలజస్థాపితంబైన యట్టిలింగ, మునకు విశ్వేశ్వరాభిఖ్య పొలిచె గిరిజ! 90

గీ. అనుచు వచియించి రాముఁ డిట్లనియెఁ గపికి, మన్నిమిత్తమ్ముగాఁ దెచ్చియున్న లింగ
మవని నుంపుము విశ్వనాథాలయమున, భావికాలమునాఁడు స్థాపన మొనర్తు.

గీ. అనఁగ వాయుజుఁ డటులు తా నాచరించె, నాఁటనుండియు నావిశ్వనాథు చెంత
స్థాపనము లేక యెట్టిపూజనము లేక, లింగ మొక్కటి యుండు నో మంగళాంగి!

వ. మఱియు రామచంద్రుండు మారుతిం గాంచి యిట్లను నోజగత్ప్రాణనందనా! యిచట నీవు భిన్నలాంగూలుండవై భూనిగూఢపాదుండవై స్వగర్వము నూహించి కొనుచున్నటు లొకమూర్తి నుంపు మనఁ దనయంశమున నతం డట్లొనర్చె, నోదాక్షాయణీ! శ్రీరామప్రతిష్ఠితరామలింగేశ్వరసమీపమున మారుతిమూర్చాస్థానమునఁ బూర్వోక్తరూపమున హనుమన్మూర్తి నేఁటికిం గానంబడు నచటఁ బాపనాశకంబగు హనుమత్తీర్థంబు గలదు, మఱియు రామచంద్రుండును తనయంశమ్ముచే సేతుమాధవనామమునఁ దనమూర్తి నట నుంచె, లక్ష్మణుఁడు నట్లే రామాజ్ఞ నొనర్చె, నారెండును రామలక్ష్మణతీర్థంబు లయ్యె, నంత రాముండు గతగర్వుండగు మారుతిం గరుణించి భిన్నలాంగూలమును దనచేతం బట్టి తత్పుచ్ఛశేషంబున నుంచి సంధించుటయుఁ దదాదిగ మారుతి నిగర్వుం డైయుండె. హను

మద్వ్యాలదృఢవేష్టితాకర్షితశిరం బగుట రామప్రతిష్ఠితసైకతలింగశిరోభాగ మిప్పటి
కిని దచ్చిహ్నిత మైయుండె. ఆసైకతలింగమునుండి నే నావిర్భవించి రాముం
గాంచి యొనర్చినసంభాషణంబు నుడివెద సావధానముగ విను మని శంకరుండు
మఱియు నిట్లనియె. 93

## శివుఁడు రామునకు లింగోత్పత్తిఁ జెప్పుట

సీ. శ్రీరామ! రవిధామ! సీతామనోహరా!, వినుము తెల్పెదఁ బూర్వవృత్త మొకటి
మహి నొకప్పుడు నేను మలినాంబరుండనై, విప్రవేషము దాల్చి భిక్షకొఱకు
ఋష్యాశ్రమంబు జేరితినఁ దాపసాంగనల్, మద్రూపమును గాంచి మరులుగొనుచు
నను వెంబడించిరి నాథులు వల దన్నఁ, గాంచి తాపసులు క్షోభించి నన్నుఁ
గీ. దెలియనేరక కోపసంకలితు లగుచు, ద్విజకులాధమ! నిన్ను మా వెలఁదులెల్ల
రతిని గామించి రటుగాన రతినిదాన, మైననీలింగ మిలఁ గూలు ననిరి సుమ్ము.

చం. ఇటు మునులెల్ల నన్ను శపియింపఁగ నాదగులింగ మద్ధరం
దటుకునఁ గూలె నే నపుడ దర్శన మొంద సతుల్చనంగ నం
తట వడి లింగ మంబరముదన్కను బెర్గుటఁ జూచి బమ్మ తా
నటమట నొంది దాని తుది నారయఁ బై కెగసెన్ రయమ్మునన్. 95

ఉ. కోటిశరత్తు లీగతి నకుంఠితశక్తిని బోయెఁ గాని త
త్కోటి గనంగలేక నను గొబ్బునఁ జేరి భయంబుఁ జెందుచున్
సూటిగ లింగవర్ధనపుఁజొప్పు వచింపుము దేవ! దీనిచేఁ
జేటు జగాన కల్గదొకొ చేకుఱదో ప్రళయం బవేళలన్? 96

వ. అనుటయు. 97

ఉ. ఆతనితోడఁ బూర్వకథ నంతయుఁ బల్కి మదీయశూల మా
ధాత కొసంగి లింగము విదారణ మొందఁగఁ జేయు మన్నఁ దా
భీతిలి నీదులింగమును భిన్నము సేయఁగఁజాల నీవె యో
భూతప! లింగఖండకృతిఁ బూను మటంచుఁ ద్రిశూల మిచ్చినన్. 98

ఉ. వారక నేను శూలమున ద్వాదశఖండము లంద లింగమున్
దారితముం బొనర్చితిని తజ్జములై పదిరెండులింగముల్
దారుణజ్యోతిరాఖ్యఁ దగు ద్వాదశలింగము లయ్యె నోధరా
జారమణా! వచించెదను శ్రద్ధగ నీవివు డాలకింపుమా. 99

వ. ఓంకార, సోమనాథ, త్ర్యంబక, మల్లికార్జున, నాగేశ, వైద్యనాథ, కాశీవిశ్వేశ్వర, కేదారేశ, మహాకాళ, భీమేశ, ఘుసృణేశ్వరు లీపదునొకండ్రును, మేరువున కీశాన్య శిఖరముగా నుండు గంధమాదనం బొకటియు నీపండ్రెండును, జ్యోతిర్లింగసంజ్ఞ నొప్పుచుండుఁ, దద్గంధమాదనలింగము చిరకాల మేమానవులకుం గాన్పింపకుండె నంతఁ గొంతకాలమునకు మునులు దానిం గాంచి లింగగతుఁడగు నన్ను ధ్యానమ్మునఁ గాంచి యోశంకరా! ఈలింగము భవత్ప్రసన్నగ్నంబై జగత్పూజ్య మగునని వర మిచ్చిరి. పిదపఁ బ్రళయకాలవాతసమాధూతసు మేరుశృంగసంకాశమగు గంధమాదనలింగ మీదక్షిణతీరమునఁ బడియె, నిదియె గంధమాదనలింగము చూడు మస్మదీయద్వాదశజ్యోతిర్లింగ మిదియే సుమా! రామా! త్వత్ప్రతిష్ఠితలింగమున కీశాన్యమున నింతవఱ కెవ్వరికిని గానరాకున్న దిప్పుడు మోక్షప్రదంబగు దీనిని నీవును వానరులును జూచిరి. నీచేఁ బ్రతిష్ఠితంబగు లింగమువలన దీనికిఁ బ్రకాశము గల్గెఁ గాన దీనియందుఁగల జ్యోతిస్సు త్వత్ప్రతిష్ఠితసైకతలింగమందు నాయనుమతిచే నుండును. నేఁడు మొదలు శ్రీరామేశ్వరలింగమే మదీయద్వాదశజ్యోతిర్లింగముగా నెన్నఁబడు, పూజాదికము రామలింగేశ్వరునకే జనులు చేయుదురుగాక! మఱియు నగస్త్యునివాక్యమునను నీవాక్యమునను నేను గాశీపురిని విడనాడి యీరామేశ్వరలింగమందే యుందు నని మఱియు నిట్లంటి. 100

ఉ. సేతువుచెంత నీకరముచేతఁ బ్రతిష్ఠితు రామలింగవి
ఖ్యాతుని నన్ను నేజనుఁడు గాంచి యజించి నమస్కరించునో
యాతఁడు బ్రహ్మహత్యమొద లైనయఘంబులఁ బాసి ముక్తుఁడౌఁ
గాతమటంచు నే వర మఖండముగా నిడినాఁడ రాఘవా! 101

గీ. కాశిలోనున్న మణికర్ణికాజలంబు, నస్మదభిషేకమున కంచు నధికభక్తి
నిచటి కెవ్వరు దెత్తురో యినకులేశ!, వారికి వరంబు నీ వింకఁ బలుకు మయ్య!

మ. అను నావాక్యము లాలకించి గిరిజా! యారామచంద్రుం డనే
మనుజుం డెవ్వఁడు సేతుమజ్జనము నేమం బొప్పఁగాఁ జేసి వే
డ్కను రామేశ్వరుఁ గాంచి యుక్తవిధి సంకల్పించి యాసేతుబం
ధనభూవాలుక నింత చేకొని నితాంతశ్రద్ధ దీపింపఁగన్. 103

చం. బరిణెలు మున్నుగాఁ గలుగు పాత్రములం దిసు ముంచి కాశికా
పురి చని తత్త్రివేణి నిసుమము న్విధిఁ గల్పి నదీష్ణుఁడై వియ

త్సరిదుదధార సేతుగతశర్వుని స్నాతు నొనర్చి ప్రాంతసా
గరమునఁ దృక్తిభారుఁడయి కాంచును ముక్తిని దప్పకుండఁగన్. 104

శా. సేతుస్నానమునందు బిందుఫలముం జెప్పంగ శక్యంబె? త
త్స్నాతుల్ బ్రహ్మహణాదిఘోరదురితత్యక్తాత్ములై జ్ఞానులై
చేతఃప్రీతిగ బ్రహ్మభావయుతులై చిద్రూపులై దుర్భవ
వ్రాతం బొందక ముక్తు లౌదురు కదా రామేశ్వరాజ్ఞాగతిన్. 105

ఉ. తారల నెన్నవచ్చు సికతాతతి నెన్నఁగవచ్చు నాయకూ
పారతరంగసంఘము లుపాయముచే గణుతింపవచ్చుఁ గా
కారయ సేతుదర్శనతదంబునిమజ్జనరామలింగగా
రీరమణాంఘ్రిదర్శనవరిస్థఫలంబు గణింప శక్యమే? 106

ఉ. ఆరఘుభక్తు యిట్టులు వరావళి నిచ్చె ననంతరమ్మునన్
సారతపస్వి కుంభభవసంయమి వచ్చి ననున్ వినమ్రుఁడై
చేరి నమస్కరింపఁగను శ్రీరఘురాముఁ డగస్తి మ్రొక్కినన్
శ్రీరఘురామ! నీదయ భజింపఁగ నయ్యెను విశ్వనాథునిన్. 107

మ. చిరకాలమ్మున కీమరుస్థలి జగత్ శ్రీవర్ధకంబయ్యెఁ ద్వ
త్కరసంస్థాపితరామలింగవిభునిం గానంగ నయ్యె న్నతా
దరణా! నాకును నొక్కలింగ మిట సంస్థాపింపఁగాఁ గోర్కె య
న్న రఘూత్తంసుఁడు నేను నూకొనఁగ నానందుం డగస్త్యర్షియున్. 108

మ. తనపేరన్ శివలింగ మచ్చటను సంస్థాపించి పూజించి రా
ముని రామేశ్వరు విశ్వనాథుని ననుం బూజించి భక్తిం బురా
తనమూ లింగము గంధమాదన మనం దత్రత్యమూదానిఁ దాఁ
గని నైజాశ్రమ మొందెఁ గుంభజుఁ డెదం గాఢూహాలం బొందుచున్. 109

వ. ఓ దాక్షాయణీ! సేతుస్థానముననున్న రామలింగేశ్వరాలయమున కాగ్నేయమున నగస్త్యేశ్వరలింగము, నీశాన్యమున గంధమాదనము నను లింగద్వయం బిప్పటికిని భాసిల్లుచుండు, వానినిం గొంద రెఱుంగుదురు కాని స్వర్గ, మర్త్య, పాతాళ లోకంబుల రామప్రతిష్ఠితంబగు రామలింగేశ్వరునిప్రసిద్ధి వ్యాపించియుండె నని చెప్పి శంకరుండు మఱియు నిట్లనియె. 110

## రామనామశక్తిచే నలుఁడు సేతువు నిర్మించుట

ఉ. అంతట రామునాజ్ఞను నలాఖ్యుఁడు సేతువిధాన మెంచుచున్
స్వాంతమునందు గర్వము నపారము నందెను రాముఁ డావిధం
బంతయు నాకళించె నలుఁ డంతట నొక్కొకరాయి నీటిలో
సంతనకట్టఁ గట్ట నిడఁ డయ్యన భంగవిధూతమై చనెన్. 111

వ. అంత. 112

మ. గతగర్వుండయి నెమ్మనమ్మునను దుఃఖం బంది శ్రీరామునో
నతఁ డారీతి వచింప రాముఁ డనె "రామా" యన్న వర్ణద్వయిన్
జతురత్వంబున నొక్కటొక్కటిగఁ బాషాణాళిపై వ్రాసి మేల్
జతనం బొందఁగఁ గట్టుమన్న నలుఁడున్ సంధించె నావైఖరిన్. 113

వ. ఇట్లు నలుండు నిజవరకారణంబున నీట రాలు దేల రామనామాక్షరద్వయలేఖన ప్రభావమ్మున రాలు పరస్పరసంధితంబు లగుచుండఁ దొలిదినమ్మునఁ బదునాల్గు యోజనంబులును, రెండవనాఁ డిరువదియోజనమ్ములును, మూఁడవనాఁ డేకవింశతి యోజనమ్ములును, నాల్గవనాఁ డిరువదిరెండుయోజనమ్ములును, బంచమదినంబున నిరువదిమూఁ డామడలుగా నిట్లు నూఱామడల పొడవును బదిరెండామడల వెడల్పునుం దనర సుందరమ్ముగ నవక్రంబుగ దృఢతరం బచలంబుగా శిలాసేతువును నిర్మించె నని చెప్పి శంకరుండు మఱియు నిట్లనియె. 114

ఉ. వారిధి రాలు దేలి పెరవానినిఁ దేలఁగఁ జేసెనన్న స
వ్వారిధి దాటి వానరులు వారక యన్యుల దాటఁ జేయుటల్
వారిధి శైల వానరప్రభావము గా దరయంగఁ బార్వతీ!
శ్రీరఘురామచంద్ర సవిశేషమహామహిమప్రభావమే. 115

ఉ. సేతువథమ్మునం గపులు సింధువు యామ్యతటంబుఁ జేరి రా
వాతజుపైన నంగదునిపైని వసించియె రామలక్ష్మణుల్,
కోఁతులఁ జేఁడుఁ గోఁతులు నకుంఠితవైఖరి వెంట నంట సం
జాతముదమ్మునం జనిరి శత్రుజిఘాంసువులై రయమ్మునన్. 116

గీ. అట్లసంఖ్యాకమహా వానరాళితోడ, నలసువేలాచలముఁ జేరియర్కకులుఁడు
రమ్యతరమైన లంకాపురమ్ముఁ జూడ, నెంచి తత్పర్వతం బధిరోహించె వేడ్క. 117

సీ. ప్రాకారసుమమాలి। కాకీర్ణయై సౌధ, శాతకుంభస్తనా। న్వితయగుచు
లీలోపవనభూజ। పాలాశకేశియై, యమలకాసారవ। దాస్య యగుచు
నిర్మలేందీవర। నేత్రసంయుక్తయై, హర్మ్యాగ్ర కేతన। హస్త యగుచుఁ
బుటభేదపరిఖాంబు। కటితటీపటయునై, రణదబ్ధివరనూపు। రయును నగుచుఁ
గీ. గనకరుచిమయభిత్తి। కాకాయ యగుచు, లలితహరినీలమృగమద। తిలక యగుచు
శ్రీసతీరీతి నీలంక। చెన్నమీఱు, బళిర! యని రామచంద్రుఁ డ। బ్రంబు నొందె.
వ. అంతలోన. 119
మ. ఒకసౌధమ్ముననుండి బాహుయుగవీ। రోద్యద్రిక్తశాఖాచర
ప్రకరంబుం గనురావణాసురుని శ్రీ। రాముండు వీక్షించి యా
శుకుని న్వీడిన నాతఁ డేగి యట ర। క్షోనాథుతోఁ బల్కెఁ దే
వ! కడుం ధీరుఁడు రాఘవుం డతనితో। వైరంబు నీ కేటికిన్. 120
గీ. అనుజుఁడైన విభీషణు। నాదరించి, సీత రామున కర్పించి। శీఘ్రముగను
నతని శరణంబు నొందిన। బ్రతుకు గలుగు, నటులు కాకున్నఁ గీడగు। నసురనాథ!
గీ. అనిన వానినిఁ గని రావ। ణాసురుండు, కనలి ధిక్కార మొనరించి। కఠినముగను
నవలఁ ద్రోయింపఁ బాఱుఁడై। యాశుకుండు, వానరాజ్ఞను దత్సేన। లోనఁ జేరె.
వ. శుకుండు రక్కసుండై పాఱుం డగుటకుఁ గారణంబు వచింతు వినుమని శంకరుండు పార్వతితో నిట్లనియె. 123
సీ. శుకుఁడు ము న్నొకభూమి। సురుఁడు వరిష్ఠుండు, బ్రహ్మజ్ఞుఁడై సవ। వ్రాతమునను
దేవతృప్తి నొనర్చి। దితిజవిరోధంబు, నొందియుండఁగ నగ। స్త్యుండు వాని
మాంసాన్న మిడు మను। మాట కాతండును, నంగీకరించిన। యంతలోన
వజ్రదంష్ట్రిసురారి। వచ్చి మాయగ శుక, భార్యయై యాకుంభ। భవున కిడియె
గీ. నరునిమాంసంబు నదికని। పరమహాని, కనలి శుకు శపియించె రా। క్షసుఁడ వగుమ
టంచు నాతఁడు వానిఁ బ్రా। ర్థించినంత, ముని వచించెను శాపవి। ముక్తి యిటులు.
గీ. దనుజుఁడవు నయ్యు శ్రీరామ। దర్శనంబు, దశముఖునిమ్రోల నీతిబో। ధంబు సేయఁ
బూర్వరూపంబుఁ బొందెదు। భూసుర! యనె, దాన భూసురుఁడయ్యె నా। దనుజుఁడిట్లు.

## అంగదుని రాయబారము

ఉ. ఆరఘురాముఁ డగ్గిరిచ। రావళితో వసియించి మంతనం
బారసి నీతి యూటను ద। శాస్యున కాదట రాయబారముం

గూరుప నంగదుం బనిచె । గొబ్బున నేగి యతండు రావణుం
జేరి స్వవాలపీఠిని వసించి వచించె నవక్రవైఖరిన్. 126

ఉ. రావణ! విన్ము నాహితము । రాముని దేవి నలంకరించి స
ద్భావత వాని కిచ్చి ప్రమదంబును జెందుము రాముఁ డన్న సా
క్షీవరుఁడే సుమా! యతనిఁ । జేరుము ద్వేషము మాను మాత్మలోఁ
గేవలభక్తితో నతని । కీర్తి నుతించిన ముక్తి యౌఁ జుమా! 127

ఉ. దానవనాథ! యచ్ఛుభపదద్వయపోతము నాశ్రయించుటన్
జ్ఞానులు ఘోరమైన భవసాగరమున్ దృటిలోన దాఁటి వి
జ్ఞానఫలంబు మోక్షమును । జయ్యనఁ గొందురొ యట్టిరాముఁ డీ
మానవమాత్రుఁడే? తలఁప । మాధవుఁడే సుమి నిశ్చయంబుగన్. 128

సీ. కాకపక్షము లుండుకాలమ్మునని యొక్క, కోలచేఁ దాటకఁ । గూలనేసెఁ
దాటకేయుని గెంటి । తత్సోదరు సుబాహు, నాగ్నేయశరమున । నవనిఁ గూల్చె
ఘటికాత్రయంబులో । ఖరదూషణాదుల, ససహాయుఁడై కూల్చె । నడవిలోన
మాతంగ్రిని బలోర్మిమాలిని గుణశాలి, వాలిని నొకకోలఁ । గూలనేసె

గీ. ఇట్టిరామునితో వైర । మేలకొనెదు, తెలియ కిటు రాముభార్యను । దెచ్చి తీవు
తెలివిఁగొని వచ్చు నాపదల్ దీర్చికొనుము, శరణమొందుము జీవించు తెరువు గనుము.

గీ. కడఁగి నాదుహితంబు నిక్కంబటంచు, వినిన సుఖమొందెదవు సుమ్ము । దనుజవర్య!
యనిన నంగదునీతిబోధాళి వినక, దురభిమానమ్ముతోడ దుందుడుకు గదుర.

ఉ. భీతి జనింప నాడెదవు । పీతభయుండను లోకరావణ
ఖ్యాతుఁడ సర్వదేవవిజయంబును జెందితి నీశుశైలముం
జేతుల నెత్తినట్టి జగజెట్టిని నాకడఁ బ్రేలెదౌర! నీ
కోఁతితనంబుఁ జూపి యిటు । కూసిన నేమగు వానరాధమా! 131

చం. అని పటురోషభీషణరవార్భటితో నను రాము లక్ష్మణు
న్ననిలయేశు మారుతిని । వానరుల న్మఱి యావిభీషణు
న్నినుఁ గడతేర్చి యెల్లరను । నేర్పున ముద్దగఁ జేసి లీలఁగా
మునుకొని నోటఁ బెట్టికొని । మోదముతో వడి మ్రింగనే యనన్. 132

కం. వాలితనూజుం డిట్లనెఁ, బౌలస్త్యతనూజ! నీదుపౌరుషము జగ
జ్జాలంబు నేను నెఱుఁగమె?, యేలా చెప్పంగ రాక్షసేశ్వర వినుమా! 133

సీ. బలివాలదృఢపాశ।బంధితుండవు నీవె, కార్తవీర్యునికారఁ। గంటి వీవె
హరపదాంగుష్ఠవి।న్యాసదుర్భరభార, కైలాసమర్దిత।కరుఁడ వీవె
పాండురద్వీపని।వాసిస్త్రీప్రమదాళి, పాణిపీడితముఖ।పాళి వీవె
హరినప్తయైన క।శ్యపపుత్రుఁ డద్రియ,న్యాసిచే బంధింపఁ।బడితి వీవె
గీ. మాట లింకేల యుయ్యెల।మంచమునకుఁ, గ్రిందు నిను వ్రేలఁగట్టఁడే? ।కీశరాజు
నాదుస్వేదాదిజలముల। నానుముఖము, లివియకావె? భవద్బల। మెఱుఁగనొక్కొ.

సీ. తోఁకతో నినుఁ గట్టి। తోయధుల న్ముంచి, ప్రాణంబుతో వీడె। వాలి మున్ను
పెడకెక్కలను గట్టి। బిడ్డలాడఁగఁ జేసె, నాటమెకముగ ని।న్నర్జునుండు
వాని జయింపఁగా। వడిఁ జను నిను భుజ,పాశబద్ధునిఁ జేసె। బలియు మున్ను
తనశైలమును మదో।ద్ధతుఁడవై యెత్తఁగా, శివుఁడు నీచేతుల। క్షితికి నడఁచెఁ
గీ. తెలియు నీశక్తి రాముని।దెలిసికొనుము,శివునిచాపంబు విఱిచెఁ బ్రా।భవమమీఱఁ
గార్తవీర్యఘ్నుఁడౌ రాము।గర్వ మడఁచె, వాలి వధియించె బలి నధః।పతితుఁ జేసె.
గీ. అట్టిరాముఁడు మానవుం।డనఁగ నగునె?,వాని వైరమ్ముచే సౌఖ్య।మూనఁ దరమె?
నరులవానరులన్ మాని।వరముఁ గొంటి, వారితోఁ బోరి బ్రతుకంగ।వశమె? నేఁడు.

చం. అన భటులన్ గనుంగొని దశాననుఁ డుగ్రత మీరు వీని మో
మునఁ బడఁదన్ని పంపుఁ డన। మూఁకలు వారును నస్త్రపాణులై
మునుకొన నంగదుం డపుడు। ముష్టిపదాహతి వాలసంగతిన్
దనుజుల నెల్లఁ జంపి కడు।ధైర్యము వీర్యము శౌర్యముం దగన్. 137

ఉ. రావణుమోములం దనక।రంబులచేఁ బడమొత్తి తానహం
భావముతోఁ దదీయకర।పాదముల న్నలియంగఁగొట్టి వేఁ
బోవుచు నొక్కచోటఁ దన।మూర్ధముపై రయభిన్నసౌధముం
బూవుగతిన్ ధరించి రఘు।పుంగవుచెంతకు వచ్చె వ్రేల్మిడిన్. 138

వ. అటులు సౌధముతో వచ్చి రావణుని దుర్వృత్తమ్ము నివేదించిన యంగదుం గని రాముం డిట్లనియె. 139

ఉ. వాలిజ! యేల తెచ్చితివి। బల్మిని సౌధము? నవ్విభీషణుం
డేలుఁ గదా పురంబు తగ।నే మును పిచ్చిన మిత్రవిత్తముం
గేల స్పృశింప? దాని నట।కే కొనిపొమ్మన నంగదుం డనెన్
వాలపుదెబ్బకున్ శిరము।పైఁ బడి వచ్చె నెఱుంగనో ప్రభూ! 140

గీ. అని వచించియు రాముప ల్కాలకించి, శిరముపైనున్న సౌధముం జేతఁ బట్టి
దాని నెప్పటియట్ల తత్స్థానమందు, వీడి యంగదుఁ డారామవిభునిఁ జేరె. 141

వ. పిదప నారామచంద్రుం డద్భుతకార్యకారియు నవిరళోత్సాహభరితుండును నగు నంగదు నగ్గించి విలాసార్థమ్ముగాఁ జాపమ్మున నొక్కశరమ్ము సంధించి ప్రాసాదోపరిగతుండగు లంకేశ్వరునిపై విడిచిన నయ్యమోఘశరంబు వానరసంఘమ్ములు చూచుచుండ క్షణమాత్రమ్మున నేగి యారావణునికిరీటదశకమ్ము నూడ్చి యాతపత్రమ్ము భంజించె నంత రామపరాక్రమసంభృతోత్సాహుండును నంగదముఖాకలితరావణదురాచారుండును నగు వానరేంద్రుండు కోపారుణితలోచనుండై. 142

చం. వినుతపరాక్రముండు రఘువీరునికైన వచింప కత్తఱిం
గనలుచు లంకఁ జేరి దశకంఠు సమున్నతసౌధసంస్థు దు
ర్వినయమతిం బరాభవపరీతు సుహృత్సచివాదివేష్టితుం
గని దృఢముష్టిచేఁ బొడిచి క్ష్మాస్థలిఁ బీఠమునుండి కూల్పఁగన్. 143

వ. ఆరావణుండును లేచి వేగ సుగ్రీవునితోఁ గలియంబడినంత. 144

సీ. వానరదానవుల్ బాహుయుద్ధము సేయఁ, గలియంగఁబడి భీతికరము గాఁగఁ
గరముల నూర్వంఘ్రి కఠినముష్టులతోడ, నన్యోన్యహృద్ఘాత మమరఁ బోర
క్షణమాత్రముననె రాక్షసనేత కపినేతృ, ఖరనఖవిక్షతకాయుఁ డగుచు
నల్ల గాఱ శ్రమంబు నానయు మది నొంది, నిల్వలేకయె పాఱె నిలయమునకు
గీ. నేగు వానికిరీటంబు లాగి కేలఁ, బట్టి విజయంబుతో రఘూద్వాహునికడకు
నేగి మ్రొక్కిడి జరిగినవృత్తమెల్లఁ, జెప్పెఁ గపిరాజు కపులు జేజేలు వెట్ట. 145

ఉ. ఆతనిఁ జూచి రాముఁ డెద నచ్చెరువు న్వెత నొంది యార! యీ
రీతిగ నాకుఁ దెల్పకయ రింగన నొక్కఁడ వేగఁ జెల్లునే
యాతనిచేత నీకొక మహాపద గల్గిన నక్కటక్కటా!
సీత యిఁకేల నాకవని జీవిత మేల సుహృచ్ఛిరోమణీ! 146

వ. కావున నాయభిమతం బరయక నెట్టిసాహసమ్ముల నెన్నండుఁ దలపెట్టకుండు మని శతవిధమ్ముల శపథపూర్వకంబుగ సుగ్రీవు నదలకించి సర్వసైన్యములకు లంకాపురమ్ము ముట్టడింప ననుమతి యొసంగిన. 147

## ✽ కపిసైన్యములు లంకను ముట్టడించుట. ✽

గీ. అంత వానరులెల్ల రా✽మాజ్ఞ నొంది, లంక నాలుదువారంబు✽లను మృదంగ
భేరికారావ మలరఁ బ్ర✽వేశ మొంది, సింహనాదంబు లెసఁగంగఁ ✽ జెలఁగి రపుడు.

గీ. రాత్రిచరనాథముకుటంబు ✽ రాముఁ డపుడు, ప్లవఁగ సేనానియా వాలి✽భవునకొసఁగి
దక్షిణద్వారసీమకుఁ ✽ దరలు మనియె, మారుతిని బంపెఁ బశ్చిమ✽ద్వారమునకు.

గీ. నలునిఁ దూరుపుగవనికి ✽ నలసుషేణు, నుత్తరద్వారసీమయం ✽ దుండఁ బనిచె
రామునకు మ్రొక్కి నియమిత✽ధామములకుఁ, జనిరి వానరసేనాను ✽ లనుపమముగ.

వ. అంత రావణుండు వానరాధిపజర్ఝరీకృతదేహుండై యేకాంతమ్మున నుండి సుగ్రీవ పౌరుషం బెన్నుచు వింతఁ జెంది వంత లొందుచున్నంతఁ దన్మాతామహులు మాలి సుమాలిమాల్యవంతు లను మువ్వురుఁ బరస్పర మాలోచించి తుదకు సాహసించి వారిలో మాల్యవంతుఁ డనువాఁడు నీతికోవిదుండును ధర్మప్రశాంతహృదయుండును సర్వలోకక్షేమార్థియు నగుట రావణుం జేరి యిట్లనియె. 151

సీ. దానవనాథ! సీ✽తాదేవి పురిలోనఁ, జేరినదాదిగా ✽ ఘోరరీతిఁ
బురరాక్షసవినాశ✽బోధకమ్ములు గాఁగ, నుత్పాతములు చాల ✽ యుద్భవించె
ఖరములు వాపోవు ✽ నురుములగతి మేఘ, రాజి వర్షించును ✽ రక్తములను
జలియించుచుండె న✽ర్వాస్వరూపాళులు, కాళిక యగ్రభా✽గమున నిల్చి

గీ. భయము దోఁపఁగ నవ్వును ✽ బకపక మని, యూల ఖరములు పుట్టు మా✽ర్జాలములకు
నాఖునకులావళికిఁ బోరు✽లగుచునుండె, గరుడనాగంబులకు నిల్లై ✽ కల్గుఁ బోరు.

గీ. వికటుఁడును ముండుఁడును గృధ్ర✽పింగళుండు, కాలపురుషుఁడొకండుగ✽రాళముఖుఁడు
బొంచిచూచెడు ప్రతిగేహ✽మును మహాత్మ!, చేటురాకుండ శాంతిని ✽ జేసికొనుము.

ఉ. దానికి శాంతిఁ దెల్పెదను ✽ దానవనాయక! చిత్తగింపుమా
జానకి భూషణావళిఁ బ్ర✽సాధితగా నొనరించి రామభూ
జానికి నిమ్మదే దురిత✽శాంతికరం బగు దానవేశ్వరా!
దీనికి మించుశాంతి జగ✽తిన్ మఱి లేదు తలంచిచూచినన్. 154

చం. అన విని రావణుం డతని ✽ నాగ్రహదృష్టిని జూచి పల్కె రా
మునకుఁ జరుండవై యిటులు ✽ బుద్ధులు చెప్పఁగ వచ్చితొక్కొ? వేఁ
జను మెటకేని నీనుడులు ✽ సైచితి వృద్ధుఁడు బంధుఁ డంచు, నిం
కను నిటు ప్రేలెదేని నిను ✽ ఖండితుఁ జేయుదు దానవాధమా! 155

చం. అన విని మాల్యవంతుఁడు భయంపడి లోనఁ దలంచె నీగతిన్
విను నోకో ? నాహితంబులను । వీతవివేకుఁడుఁ గాలసంగతుం
డినకులుతోడ వైరము వహించిన వీఁ డిఁకఁ బ్రాణయుక్తుఁడై
మనఁగలఁడే ? యటంచుఁ దన । మందిర మేగె నితాంతఖిన్నుఁడై. 156

ఉ. అక్కరణిం దశాస్యుఁడు సభాంగణమందు వసించి శూరులన్
రక్కసులం గనుంగొని చరాలున నేగుఁడు మీరు నాలుగో
దిక్కులనున్న ద్వారములఁ । దేకువతోడ నగణ్యసేనతో
నక్కపు లియ్యెడం జొరనియట్టులు చూచుచు నుండుఁ డేపునన్. 157

వ. అని పూర్వద్వారమ్మున ధూమ్రాక్షుండును, బశ్చిమద్వారమున వజ్రదంష్ట్రుఁడును, దక్షిణద్వారమున నరాంతకుండు, నుత్తరద్వారమున మహోదరుండు నుండునటుల నియోగించి వారల వస్త్రాలంకారాదులఁ బరితుష్టులఁ జేయ వారు రయమ్మున రావణునకు నమస్కరించి బహువిధాయుధపాణులై చతురంగసైన్యమ్ములతో నియమితస్థానమ్ములఁ జేరి సింహనాదము లొనర్చుచుండి రిట్లు రామరావణసైన్యద్వయం బట్లు సంగరంబున కాభిముఖ్యము వహించియుండె నంత. 158

సీ. కట్టుపకాసులై । కనలి రక్కసులెల్ల, వానరసైన్యంబు । వడి నెదిర్చి
ప్రాసపట్టిసభిండివాలపరశ్వధ, బాణశక్త్యసిశూలపాణు లగుచు
వానరవీరుల । వధియించుచుండంగ, వానరుల్ గిరితరుపాణు లగుచు
నఖదంతభూమిజశిఖరిఘాతమ్ముల, దానవసైన్యవధం బొనర్ప

గీ. రథము లశ్వంబు లిభపత్తిరాజితోడ, రక్కసులు వానరాళితో । నక్కజముగ
ద్వంద్వయుద్ధంబు సల్పి రద్వంద్వముగను, దేవదానవయుద్ధం బిదే యనంగ. 159

కం. ఓహరి సాహరి నొందుచు, నాహవదోహలత మెఱయ । నాసురవైరుల్
బాహుబలాఢ్యులు కపులున్, సాహసమునఁ బోరి రుభయసైన్యము వారల్. 160

వ. ఇట్లు సంకులసమరంబున నలుఁడు ధూమ్రాక్షుని, మారుతి వజ్రదంష్ట్రు, నంగదుండు నరాంతకుని, సుషేణుండు మహోదరునిఁ గడతేర్చి రిట్లు నఖదంష్ట్రాయుధులగు వానరులచే రక్కసిమూకలు చతుర్థాంశావశేషమ్ముగా నెల్లరుం గడతేరుటఁ గాంచి యంగదాదులు జయరవంబులతో రాముచెంత కేతెంచి నమస్కరించి యున్నంత నల్పావశేషమ్ముగాఁ గూలిన స్వసైన్యముం జూచి యింద్రజిత్తేతెంచి రామలక్ష్మణులను వానరులను నాగాస్త్రపాశబద్ధులం గావింప రాముఁ డాత్మలో

గరుడునిం దలంప నతఁడు వచ్చి యస్త్రాదిహులం బరిమార్చె నంత బ్రహ్మవరశక్తిచే నింద్రజేత యంతర్ధానంబు నొంది బ్రహ్మాస్త్రప్రయోగమ్మున శరాసారం బడంప నెల్లరు నొడ లెఱుంగక మృతప్రాయులై పుడమిం బడిరి. విధ్యస్త్రగౌరవంబునఁ గొంతవడి రామలక్ష్మణులు మూర్ఛ మునింగి రందు రాముఁడు లేచి పతితవానర సైన్యములం గాంచి విచారించుచుఁ బడియున్నలక్ష్మణుం జూచి లక్ష్మణా! చాపముఁ దెమ్ము బ్రహ్మాస్త్రప్రయోగమ్మున నెల్లరక్కసులఁ గడ తేర్చెద ననునంత నింద్రజిత్తు లంకఁ జేరె, నంతఁ దదస్త్రశక్తిం దప్పి పతితసైన్యంబునకై వంత నొందుచుఁ దిరుగాడుచున్న మారుతివిభీషణులం జూచి సంతసించి రామచంద్రుం డిట్లనియె. 161

గీ. బ్రతికియుండినచో జాంబవంతు నొకని, యరసి చూడుఁడు సర్వసైన్యములు బ్రతుకఁ దగునుపాయంబుఁ జెప్పి మోదంబుఁ గూర్చు, చతురుఁ డాతఁడు పొంతుతక్షణమెయనిన.

ఉ. అంతట వార లుల్కకసహాయత సైన్యములెల్లఁ జూచి యా
ప్రాంతమునందుఁ గూలి కొఱప్రాణముతో వెత నొందునాతనిం
జెంతకుఁ జేరి ప్రాణములఁ జేద్పడ కుంటివె? యంచు భూమిజా
కాంతునిపల్కుఁ దెల్ప మదిఁ గౌతుక మొందుచు జాంబవంతుఁడున్. 163

ఉ. మీ రెవరో యెఱుంగను నిమీలితనేత్రుఁడ నయ్యాలార! యా
మారుతి జీవయుక్తుఁడొకో? మారుతి యుండిన నెల్లవానరుల్
ధారుణిఁ బ్రాణ మొందుదురు తథ్య మనంగ విభీషణుండు నె
వ్వారినిఁ బృచ్ఛసేయక యె వాయుజు నేల ప్రశంస సేయఁగన్. 164

చం. అనఁగ విభీషణుం బలికె నాజరతుం డరరే! మహేశ్వరాం
శను జనియించినట్టి బలసారుఁడు మారుతి వానరుండె? వా
నిని గనుమన్న వాయుజుఁడు నెమ్మది సంతస మంది జాంబవం
తునికి నమస్కరించి పరితోషముతో ననె నమ్రభావుఁడై. 165

## హనుమంతుఁడు ద్రోణాద్రిఁ దెచ్చుట

గీ. ఆర్య! యెవ్వని నీ విపు డడిగియుంటి, వాతఁడనె జీవయుక్తుఁడ వాతజుఁడను
భావలాడెడు నితఁడు విభీషణుండు, నాదుపని యేమొ తెల్పుమా నయవిభూష!

సీ. అన జాంబవంతుఁ డిట్లనియె మారుతి! నీవు, క్షీరాబ్ధిఁ గల ద్రోణగిరిని దెచ్చి
బ్రతికింపుమా కపివర్గంబునెల్లను, ద్వదధీన మీకపిప్రాణవితతి

యనఁ దక్షిణంబ తా నరిగి గంధర్వగోపితమైన శైలంబు వెతకుచుండ
జేజేలగిడ్డి తాఁ జెమటఁ గంటికిఁ బాయఁ, గాంచి యాగిరిఁ బెల్లగించి దానిఁ

గీ. బూవువలెఁ బట్టి రణరంగభూమిఁ జేరు, నంత నోషధిగంధంబు నంది బ్రతికి
రక్కసులు లేతు రంచును బక్కఱేఁడు, నలవిభీషణుఁ డారాము నాజ్ఞఁ జెంది.

గీ. కలనులోఁ జచ్చియున్న రక్కసులనెల్లఁ, బట్టికొనిపోయి యబ్ధిలోఁ బాఱవైచి
రపుడు ద్రోణాద్రితో దిగె ననిలసుతుఁడు, మూర్ఛమునిఁగినకోఁతులమూకలోన.

ఉ. తెచ్చినకొండపైఁ గలుగు దివ్యతరౌషధులన్ గ్రహించి వే
వచ్చి సుషేణనామవరవైద్యుఁడు దద్విధి సంప్రయుక్తిచేఁ
జచ్చినరీతినున్న కపిసైన్యములన్ బ్రతికింప వారలున్
హెచ్చినకాంతిఁ జెంది యపు డెల్లరు లేచి రనామయాంగులై. 169

వ. అంత వాయుజుండు ద్రోణాద్రిని యథాస్థానమునం దుంచి వచ్చెఁ బిదపఁ గుబేర ప్రేషితదివ్యోదకమ్మున రామాదు లందఱుఁ గనులు దుడిచికొన నంతర్ధానగతుల సైతముఁ గాంచెడుశక్తి వడసి రంత దశగ్రీవునినియోగమ్మున నతినాద, ప్రహస్త, మహానాద, దరీముఖ, దేవశత్రు, నికుంభ, దేవాంతక, నరాంతకసారణాదులు తమ తమ చతురంగసైన్యములతోఁ జనుదెంచి జన్యం బొనర్ప నంగదాదివానరయూథపతు లారక్కసులనెల్ల నవలీల సంహరించి నిగర్వులై సంగరాతృప్తులై యుండిరి. మఱియును, 170

ఉ. అంతటఁ గుంభకర్ణసుతులై తగు కుంభ నికుంభనాములం
బంతముతోడ రావణుఁడు బంపిన వారలు పోరుచుండఁగా
వంతుగఁ జంపి రిద్దఱిని వాలితనూజుఁడు జాంబవంతుఁ డి
ట్లంతము నొందువార్తను దశాస్యుఁడు దా విని రుష్టచిత్తుఁడై. 171

గీ. కడఁగి భీషణబలుఁ డతికాయుఁ డనెడి, యాత్మసుతు నంపెఁ బోరున కతనిఁగూడ
రాముతమ్ముఁడు దారుణరణమునందు, బాణపాతమ్మునను లంకఁ బడఁగఁగూల్చె.

## రావణశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట

ఉ. పావకదీప్తి గల్గు శరపట్టిసకార్ముకశూలశక్తిసం
భావితమౌ శతాంగము జవంబున నెక్కి చతుఃప్రకారమౌ
దేవవిరోధిసైన్యతతి తెంపునఁ బెంపున శంఖభేరికా
రావముతోఁ జెలంగ సమరంబున కేగె దశాస్యుఁ డంతటన్. 173

గీ. యుద్ధభూమికిఁ జని కడుఁ గృద్ధుఁ డగుచు, శక్తిఁ గైకొని యావిభీషణునిమీఁద
వైవఁ గని దాని కెదురుగా వచ్చి నిలిచె, ధైర్యమున లక్ష్మణుఁడు వీరధర్మ మమర.

ఉ. రావణశక్తి లక్ష్మణునురమ్మున నాట నతండు గూలె ర
క్షోవిభుఁ డాతనిన్ నగరుకుం గొనిపోవఁ దలంచి పూనికై
తా వివిధప్రకారములఁ దత్తనువున్ గదలింపలేక ల
జ్జావనతంబులై తన దశాస్యము లొప్పఁగ నిల్చె నయ్యెడన్. 175

గీ. హానికృత్యంబుఁ గని వేగ వాయుజుండు, వచ్చి పిడికిటఁ బొడువ రావణుఁడు నల్ల
గ్రక్కుచును గూలె నంత లక్ష్మణుని బట్టి, వాయుజుం డేగుచుండ రావణుఁడు లేచి.

చం. అరదము నెక్కి వాయుజు శరావళిఁ గొట్టిన లక్ష్య మొందకా
కరువలిపట్టి యేగె నది గాంచి రఘూద్వహుఁ డాగ్రహమ్మునన్
సురరిపువక్షముం బగుల సూర్యకరోపమబాణ మేసె నా
యరదము సూతకేతుధనురశ్వయుగాదులతోడఁ గూలఁగన్. 177

గీ. అర్ధచంద్రాంబకంబున నతనిమౌళిఁ, బగులఁగాఁ గొట్టి విహ్వలభావుఁడైన
యసురపతిఁ గాంచి రాముఁ డిట్లనియె నేఁడు, పురికిఁ జని విశ్రమించి రేపరుగుదెమ్ము.

గీ. నాబలంబును జూచెదు నాఁగ నానఁ, జెంది దశకంఠుఁ డప్పుడే చేరెఁ బురము
సోలియుండినలక్ష్మణుఁ జూచి రాముఁ, డార్తిఁ గొని వాయుసూతితో ననియె నిట్లు.

ఉ. సొమ్మసిలెన్ సహోదరుఁడు చూచితె మారుతి! వీని లేమి నే
నిమ్మహి జీవ మొందు టది యేల? ధరాజ యిఁకేల? ఘోరజ
న్యమ్మది యేల? యక్కటకటా! యిటఁ దమ్మునిఁ గోలుపోతిఁ గై
కమ్మకు నెమ్మనమ్మున సుఖమ్మగుఁ జుమ్మిది విన్న నెంతయున్. 180

గీ. ద్రోణగిరిఁ దెచ్చి మూర్ఛలోఁ దోఁగియున్న, నాదుతమ్ముని బ్రతికించి నాకొసంగి
ముదము గల్పింపుమా మరుత్పుత్ర! నీకుఁ, బున్నె మగునయ్య! వేగమే పోయిరమ్ము.

## హనుమంతుఁడు కాలనేమిం జంపుట

గీ. అనఁగ రామునిపల్కుఁ దా నాలకించి, వాయుజుం డేగె ద్రోణపర్వతముకొఱకు
నసురవల్లభుఁ డావార్త నాలకించి, కాలనేమిని బంపె విఘ్నం బొనర్ప. 182

వ. అట్లు రావణునిపంపున, 183

ఉ. వాయుజుకంటె మున్ను హిమవంతముచెంగట నాశ్రమమ్ము దా
మాయగ వే రచించి యొకమౌనిగతిం గపటంపురూపునం

జేయుచునుండెఁ బల్లవము శిష్యులతో నటఁ గాలనేమి య
వ్వాయుజుఁ డంత నచ్చటికి వాయుజవంబున నేగి యాదృతిన్. 184

సీ. జడదారిఁ గనుఁగొని వడఁగొంటి నన వాఁడు, తనకమండలు చూప ననిలసుతుఁడు
దీనిచే దప్పిక తీర దన్న నతండు, కాసార మిచటనే కలదు వేగ
ముగ నేగి కన్నులు మూసి నీరును ద్రావి, విశ్రమం బొందఁగా వేగ రమ్మ
యోగదృష్టిని జూచి యుంటి లక్ష్మణుఁ డట, మూర్ఛఁ దేరెను మంత్రముల గ్రహింపు

గీ. మట్టిమంత్రంబుచే గిరి నరయఁగలవు, దాచియుందురు దాని గంధర్వవరులు
వానరులజీవనార్థము దానిఁ గొనెదు, మంత్ర మొందియు దక్షిణ మాకు నిడుము.

వ. అని యాకుహనాముని వాత్సల్యాభినయపూర్వకమ్ముగా నుడివిన. 186

ఉ. నిక్కమటంచు నమ్మి కపి నిర్మలవారి గ్రహింప నేగి తా
నక్కమలాకరంపుజల మక్షినిమీలన మొంది త్రాగుచో
నక్కపిఁ బట్టి నక్ర మొకఁ డప్పుడె మ్రింగఁ దదంతరాంత్రము
ల్ముక్కలు సేసి యమ్మకరిపొట్టను జీలిచి వచ్చె నాతఁడున్. 187

సీ. అంతట నక్రమ్మ యతిసుందరాంగియై, హనుమంతుతోడ నిట్లనియె మున్ను
నంటరానితనంబు నందిన నను జూచి, రతి కొక్కతపసి కోరంగ నేను
నంగీకరింపమి నతిక్రుద్ధుఁడై నక్ర, మగు మని శపియించి యతఁడు తుదకు
పవమానసుతునిచేఁ బ్రాణంబుఁ గోల్పోయి, ముందటిరూపంబుఁ బొందె దనియె

గీ. అయ్య! నే ధాన్యమాలిని యప్సరసను, నిన్నుఁ బంపినవాఁడు దుర్నీతిపరుఁడు
కాలనేమి యనంగ రక్కసుఁడు రావణాజ్ఞచే నుండెఁ జంపుమా యతని వేగ.

గీ. అనఁగ మారుతి యచటికి నరిగి వేగ, యయ్య! గురుదక్షిణను గొన్మటంచు వజ్ర
కఠినముష్టిని వానివక్షమునఁ బొడువ, నల్లఁ గ్రక్కుచుఁ బుడమిపైఁ ద్రెళ్లె వాఁడు.

## హనుమంతుఁడు భరతునిం జూచుట

ఉ. పావని యంతఁ బాల్కడలిపజ్జను ద్రోణముచుట్టు నున్న యా
కావలివారి గెంటి గిరిఁ గైకొని మింటను బోవుచుండ నా
త్రోవను వానిఁ జూచి భరతుం డెద నాతని రాత్రిచారిఁగా
భావనఁ జెంది వాఁడు గొనుపర్వతముం ధరఁ గూల్చెఁ గోలచేన్. 190

మ. గిరిఁ గూల్పన్ ధర డిగ్గి యాభరతు వీక్షింపంగ రామభ్రమం
బరుదారం గపి యిట్లు పల్కె రఘురామా! యేల యే తెంచితో

యరిచే నోడి పలాయితుండవె? కటా! | యన్న న్మరుత్సూనునిన్
భరతుం డెంచి నిశాచరుం డని మహా | బాణంబు సంధించినన్. 191

గీ. బాణసంధాన మొనరించు | భరతుఁ గాంచి, యయ్య! నేరామదూత న | టన్న భరతుఁ
డిట్టు లనె రామునకు నీకు | నెట్లు మైత్రి, యనఁగఁ దద్వృత్తమెల్ల నా | యనుమ నుడువ.

చం. భరతుఁడు సంతసించి తన | బాణముచే గిరి నెత్తి యీయఁగాఁ
గరములఁ బట్టి మారుతి సు | కామజవమ్మున లంకఁ జేరి త
ద్గిరిరుహవల్లిచేత బ్రతి | కించెను లక్ష్మణు వానరావళిన్
గిరిని యథాస్థలి న్విడిచి | కేరుచుఁ ద్రోవ నయోధ్యఁ జెంగటన్. 193

గీ. భరతుతోడను సౌమిత్రి | బ్రతికె ననుచుఁ, జెప్పి విను తెన్నుగా లంకఁ | జేరె ననుమ
భరతుఁడిట నెల్లరను గూడి | పయనమెంచె, రామసాహాయ్యమునకు సా | భ్రాత్రమమర.

## ఐరావణ మైరావణ చరిత్రము

సీ. అంతట సభలోన | నాసీనుఁడై దశ, కంఠుఁడు దూతలఁ | గాంచి పలికెఁ
బాతాళలోకని | వాసులై రావణ, మైరావణులఁ గాంచి | మచ్చరిత్ర
మవ్వారితోఁ బల్కుఁ | డని పంప దూతలు, పాతాళమున కేగి | వారితోడ
నటు చెప్ప వారు వి | హ్వాలచిత్తులై రేయి, లంకలో రాముని | లక్ష్మణాఖ్యు

గీ. నపహరించి వధింప నూ | హలను జెంది, వచ్చి మారుతి బహుదీర్ఘ | వాలపరిఘ
మధ్యమున కెట్టెటో చేరి | మాయవలన, గ్రావనిద్రితరామల | క్ష్మణులఁ గాంచి.

గీ. ఆకసమునుండి రక్కసు | లసుగు దెంచి, రామలక్ష్మణు లున్న యా | రాతి నెత్తి
కొని రసాతల మొంది ర | క్కుటిలమతులు, పిదప మారుతి కని వారి | నెదకుటకును.

సీ. పోవుచు నుండంగఁ | ద్రోవలో లంకకు, దక్షిణదిక్కునఁ | దనరునట్టి
గుహ చెంతనున్న ని | కుంభిల యనుచోట, గుర్వణియా నొక్క | గువ్వ తనదు
విభుతోడ ననె నాథ! | వేవిళు ల్గలదాన, నరమాంసమును దె | మ్మనం గపోత
మనె రామలక్ష్మణు | లను రక్కసులు నేఁడు, పాతాళమున దేవి | ప్రమద మొంద

గీ. చంపుదురు తచ్ఛరీరమాం | సమును దెచ్చి, యతివ! నీ కిచ్చెద నటన్న | ననిలజుండు
విని నితాంతము విస్మయా | విష్టుఁ డగుచుఁ, దా రసాతల మేగె నా | క్రతంబు మీఱ.

కం. ఒకచోట ద్వారసీమ, | న్మకరధ్వజనాముఁ డంత | మారుతిఁ గని తా
వికటముగఁ బల్కె నెవ్వఁడ, | వొకో యెట కేవేల పోదు | వో యన నతఁడున్.

ఉ. ఏ నొక రామదూతను మ ✽ హి న్నిదురించెదు రాము లక్ష్మణుం
దానవు లిద్ద ఱీపురికి ✽ దారుణవృత్తిగఁ దెచ్చినారు నే
నానరసూనుల న్వెదుక ✽ నాగతుఁడం జుమి నీ వెఱింగిన
ట్లైన వచింపుమా యనఁగ ✽ నామకరధ్వజుఁ డిట్లనెం గపిన్. 199

గీ. అయ్య! నాతండ్రి హనుమంతుఁ ✽ డనెడువాఁడు, సేమముగ నుండెనా? కపి ✽ సేనయందు
నెఱిఁగియుండిన వచియింపు ✽ మీం వటన్న, నచ్చెరువు దోఁప మారుతి ✽ యనియె నిట్లు.

గీ. భార్యయే లేదు వానికి ✽ బ్రహ్మచారి, యైనవానికి సుతుఁడ వీ ✽ వగుదు వెట్టు
లనిన మకరధ్వజుం డిట్టు ✽ లనియె నార్య!, యనుమ లంకాపురిని గాల్చి ✽ యరుగు వేళ.

గీ. తోఁకఁ జల్లార్చ సాగర ✽ తోయములను, ఘామజాతకఫంబు న ✽ త్తోయమందు
నుమియ నది మ్రింగిమకరి యా ✽ సమయమందె, నన్నుఁగనెఁగాన మారుతి ✽ నాకుఁదండ్రి.

గీ. అనినఁ దనవృత్త మెఱిఁగించు ✽ ననిలసుతునిఁ, దనజనకుఁడంచుఁ దెలిసి వం ✽ దన మొనర్చి
రక్కసులకూటవృత్తుల ✽ నిక్కముగను, రాముకథఁ దెల్పె నమ్మక ✽ రధ్వజుండు.

సీ. దశకంఠమిత్రు లీ ✽ దానవు ల్దెచ్చిరి, తత్ప్రేరణమ్ముచే ✽ దాశరథులఁ
గామాక్షికిని రేపు ✽ ఖండించి బలి యీయ, నిశ్చయించిరి తండ్రి! ✽ నీ వటఁ జని
కోవెలలోఁ దూరి ✽ కూర్చుండు మచటికిఁ, జనుదెంతు రవ్వారిఁ ✽ జంపుమయ్య!
కపటచిత్తులయెడఁ ✽ గపటమే తగుఁ గాని, యార్జవమ్మున నేమి ✽ యగును దండ్రి!

గీ. అనిన మారుతి త్రసరేణు ✽ వంతరూప, మొంది కోవెలలోఁ జేరి ✽ యుండి తల్పు
లెల్ల బిగియింప రక్కసు ✽ లేగుదెంచి, యంబికాపూజకై ద్వార ✽ మందు నిలువ.

సీ. వచ్చి రంచు గ్రహించి ✽ వాతజుఁ డంబిక, యట్టులు వారితో ✽ నిట్టు లనియె
గంత తెన్నునఁ బూజఁ ✽ గావించి పదపడి, పుష్పహారాదుల ✽ భూషితులను
దూణీర కోదండ ✽ పాణులుగా జీవ, సహితులా రామల ✽ క్ష్మణులలోని
కీగుడి తల్పుల ✽ నిసుమంత తెఱచియు, వేగఁ బంపుడు నాకుఁ ✽ బ్రీతి యగును

గీ. ఎవ్వరేనియు నను గాంచి ✽ రేని వార, లంధు లగుదురు చూడకుఁ ✽ డనిన వార
లంధభీతిని నిసుమంత ✽ యైనఁ గనక, యటులు పూజాదిక మొనర్చి ✽ రధికభక్తి.

వ. ఇట్లు గవాక్షమార్గమ్మునఁ గ్రేఁగంటనైనఁ జూడక పూజ లొనర్చి తా ముపహా
రమ్మున కాయితముఁ జేయు నన్నరాసులును, బరమాన్నకుంభములును, బంచా
మృతఘటంబులును, గోట్లకొలంది పలురకమ్ముల పండ్లును నిమీలితాక్షులై గంత
తెన్నున లోనికిం జేర్చి నివేదించిన మారుతి వానినన్నిటి నల్పకాలమున హాయిగ

భక్షించి వానితో ననియె, నోరక్కసులారా! యింతియేనా? యుపహార మల్పమ్ముగాఁ దెచ్చితి రాహా! నాయాఁకలి తీరదు. పూర్ణభోజనం బిడరేని మిమ్ముఁ గడతేర్చి మ్రింగెద నన భీతులై యూరిలోనున్న గేస్తులయిండ్లను రాజగృహమ్ములను గల భోజ్యపదార్థజాతంబు బల్మిని దెచ్చుచుండఁ బ్రతిగృహంబునను గోలాహలం బుప్పతిల్లె. ఆకోన్నబాలుర కొక్కకబళంబైన లేకుండఁ దెచ్చి దేవియను భ్రాంతిచే హనుమంతుని కర్పింప నతఁ డారగించి యిదియే చాలు నింక రామలక్ష్మణులం బంపుఁ డని బిగ్గరగాఁ బల్కిన నాలసించిన దేవి కోపమొందు నని బహువిధాలంకారభాసమానులగు రామలక్ష్మణుల నిమీలితాక్షులై లోనికిఁ బంపిరి. అంత లోనున్న మారుతి స్మితపూర్వకముగా వారికి నమస్కరించి సంతోషమ్మునం గౌఁగిలించిన వారును మారుతిం గాంచి సంతసించి తల్పులు తెఱచి బయటి కేతెంచి యారక్కసుల నదల్చి శరజాలమ్ముల క్షణమాత్రకాలమ్మునఁ గడతేర్ప వారిద్దఱు నంతలో బ్రతికి వచ్చి రామలక్ష్మణుల నెదిరించిన రాముఁడు మఱియు వారిఁ జంపినం బునర్జీవితు లైరి. ఇట్లు శతవారమ్ములుగాఁ జంపినను వారు మరణింపకుండుటఁ గాంచి మారుతి వింతఁజెంది పురిలోని కేగి తిరుగాడుచు నొక్కమంతనపుచోటున నైరావణభోగపత్నియగు నాగకన్యకం గాంచి యీ యైరావణులు చావమికిం గారణ మేమి? వీ రెట్లు మరణ మొందఁగలవారని యడిగిన నప్పొలఁతుక యిట్లనియె— 206

ఉ. అన్న బలాత్కృతి న్నను దు* రాత్మతఁ దెచ్చి సుఖంపుచుండఁగా
నన్నుఁ దదీయసోదరుఁ డ*నారతము న్మను లొంది చూచు ని
ట్లన్నను దమ్మునిం దనుప్ర*వంతటి దేహపటుత్వశక్తిసం
పన్నత లేమి నం దొకఁడు * నైరి మఱొక్కఁడు నాకు మిత్రుఁడో. 207

గీ. అట్టులనుటకు మది దుఃఖ * మందుచుంటి,నిద్దఱిని జంపు టది నాకు * హితమె నన్నుఁ
బత్నిగా రామవిభుఁడు చే*పట్టునేని, వారిఁ జంపునుపాయంబుఁ * బల్కుదాన.

గీ. అనఁగ మరుదాత్మజుఁడు దాని*కనియెరామ,చంద్రగురుభారమునసీదు*శయ్య విఱుగ
కున్న నిన్నాలిగాఁ గొను * నతఁ డటన్న, మంచి దని చెప్పె నామె త*న్మరణవిధము.

సీ. మున్ను బాలురు వేడ్క * ముండ్ల గ్రుచ్చిన తేంట్ల, వీరలు విడిపింపఁ * బ్రీతిఁ జెంది
భ్రమరాళి యిట్లను * రాక్షసవరులార!, బ్రతికినారము మీకృ*పాపటిమను
రక్షింతుమయ్య మీ*ప్రాణంబు లేమును, నని యిటఁ జంచరీ*కాళి నిలిచి
యమృతంబుఁ గొని తెచ్చి* యారక్కసుల మేని, క్షతజబిందువు ముట్టఁ*జచ్చియున్న

గీ. తత్క్షణంబునఁ బ్రాణంబుఁ దాల్తురయ్య, యిదియె వీరికి జీవనహేతు వయ్యెఁ
బడకటింటను బెట్టి గాభ్రమరములను, వానిఁ జంపిన వీరింక బ్రతుకరనిన. 210

వ. మారుతియు వారి పడకటింటి కేగి కోట్లకొలందినున్న చంచరీకమ్ములఁ జంపిన నందొకటి విడివడి ప్రాణార్తమై శరణమొందిన నద్దానిం గాంచి వాయుజుండును నీవైరావణభోగపత్నిశయ్యను గజభుక్తత్యక్తకపిత్థంబువలె గుల్లగా దొలిచి యిట నుండక చను మన నట్లొనర్చి చంచరీక మేగె నట రామచంద్రుఁ డారక్కసులఁ జంపిన మఱి వారు బ్రతుకరైరి. అంత నప్పురంబున మకరధ్వజుని రాజుగాఁ జేసి లంక కేగుట కుద్యమించు రాముం జూచి మారుతి నాగకన్యావృత్తంబుఁ దెల్ప చిఱునగ వొంది యారాముఁడు చని తద్గృహరామణీయకంబుఁ గాంచుచున్నఁ దదీయదివ్యమంగళవిగ్రహదర్శనానందపులకితాంగియై యనిమేషాక్షియై నాగకన్య చూచుచున్నంత రాముఁడు ప్రతిజ్ఞాభంగభీతిని నిష్కామహృదయుండై తచ్ఛయ్య పైఁ గూర్చుండునంతఁ దద్భారమ్మున నాశయ్య భగ్నం బయ్యె, నాశాభంగ మొంది యప్పుడఁతుక తనకోర్కి విన్నవింప రాముఁడును నీ వీదేహంబు విడిచి భూలోకమున బ్రాహ్మణకన్యకగాఁ బుట్టి మూఁడుజన్మములదనుక నన్నుఁ గూర్చి తపం బొనర్చి ద్వాపరయుగాంతమునఁ గృష్ణావతార మొందిన నాకు ధర్మపత్ని వగుదు వని వరం బిచ్చె. అదియు నప్పుడే యగ్నిఁబడి దేహత్యాగ మొనర్చి భూలోకమున నబ్ధితీరమున బ్రాహ్మణునకుఁ గన్యాకుమారీనామమున నుద్భవించె. అంత నిట హనుమంతుఁడు రాము నాత్మభుజంబులఁ దాల్చె మంత్రిని రాజ్యమం దునిచి మకరధ్వజుం డాత్మభుజంబుల బ్రహ్మాండధారక శేషాంశసంభవుండగు లక్ష్మణుం దాల్చి లంకం జేర్చె, నంత సుగ్రీవాదులు రామలక్ష్మణులం గవుంగిలించి సంత సింప నట జరిగినవృత్తంబెల్ల వానరులతో రామచంద్రుండు నుడువ నానందించు చుండి రంత లంకాపురమ్మున, 211

## రాక్షసులు కుంభకర్ణుని మేల్కొలుపుట

సీ. దశరథసుతునిచే దానవు లచ్చిర, న్నార్త నాలించి రావణుఁడు లోనఁ
గడుభీతి నొంది రాక్షసులతో నిట్లనె, మనుజునిచే నాకు మరణ మనుచు
ధాత తెల్పెను మున్ను తథ్యమే యాయెనా, రాయణుండే రాముఁ డయ్యెఁ జుండి
యుతఁ డింక నను జంపు ననరణ్యభూపతి, మును నేను జంపునప్పుడు శపించె

సీ. మాకులమ్మున। శ్రీహరి మనుజుఁడగుచుఁ, బుట్టిపరివారయుతు నిన్నుఁ బొలియఁజేయు
ననుచు నది నిక్క మయ్యె నో యసురులార !, కుంభకర్ణుని వేగ మేల్కొల్పి తెండు.

కం. అనఁగాఁ బలువురు రక్కసు, లనుమానముఁ జెంది జేని యనుమతి గానం
జని కుంభకర్ణుని గనుం, గొని రంత విశాలశయనగుహానిద్రితునిన్. 213

వ. ఇట్లేగి కుంభకర్ణశ్వాసవాతసమాకర్షితశరీరులై రక్కసులు తదీయబిలసమానాస్య
నాసికారంధ్రమార్గమున నుదరంబులోనికిఁ బోవుచు నిశ్వాసమ్మున మరల బయట
కేతెంచుచు యాతాయాతంబులం జెంది పీడితులై యెట్టకేలకుఁ దప్పి వానిబాహు
వులకుఁ బాశములు గట్టి లాగి యతనిం గదలించుచు గదాఖడ్గకుంతపట్టిసపరశ్వధ
ద్రుమకాష్ఠపాదశిలాదులచే మోదుచు నెండుకట్టియల దేహంబున నిడి కాల్చుచు
ఖరోష్ట్రగజమహిషాశ్వములచే మేనఁ ద్రొక్కించుచు నిట్లు బహుప్రయత్నమ్ము
లొనర్చిన నెట్టకేలకు లేచి మేను విఱిచికొనుచు నావులింత లలరఁ గొంతసేపటికిఁ
గనులు విప్పి బహుక్షుధాయుక్తుఁడై తన కని తెచ్చియుంచిన సూకరమహిషాదుల
నమలి మ్రింగుచు మైరేయరక్తఘటసహస్రంబులలోని పానీయంబుఁ గ్రోలి చాలక
సమీపకాసారజలంబులఁ బీల్చి వాని నిర్జలంబుల నొనర్చుచు నిట్లు కృతాల్పా
హారుండై రావణుం జేరి నమస్కరించి తదుక్తవర్తమానరామవృత్తాంత మాలించి
యాకుంభకర్ణుం డిట్లనియె. 214

ఉ. నారదు నొక్కెడ న్వనమునం గని పల్కితి మున్ను "తాపసా !
యీ రిపు డేగు టెచ్చటికొ ? యేర్పడఁ జెప్పు డ"టన్నఁ బల్కె నా
మారమణుండు రాముఁ డయి క్ష్మాతలమందు దశాస్యముఖ్యులం
బోరున సంహరింపఁ గ్రతుభుక్తతి కోర జనించెఁ గాదొకో ? 215

చం. సురలు నయోధ్య కేగి యట సూనుని రాముని జూచి వేగ వా
నరసహితంబుగా దనుజనాథుని రావణుఁ జంపఁ గోన కిం
కరుగు మటంచు మానుడిగ నాతనితో వచియింపు మం చనన్
ద్వరఁ గొని యేగుచుంటి రఘువల్లభు చెంతకు నో నిశాచరా !. 216

తే. అనుచు వచియించి నారదుం డరిగి యిటులు, రాము బోధించి పంపె బిరాన నాఁడె
పురికి నేతెంచి నేను నీమ్రోలఁ జేరి, విన్నప మొనర్చినాఁడ నే విన్నపలుకు.

ఉ. కావున నేఁడు నామనవిఁ గైకొని సీత నొసంగి యేగి స
ద్భావముఁ జెంది మిత్రునిగ దాశరథి న్మది నెంచి యీపురిన్

శ్రీవిలసిల్ల సౌఖ్యములఁ జెందుట మే లని తోఁచె నామదిన్
దేవ! యటే యొనర్చి మము నిచ్చలు గావుము రాక్షసేశ్వరా! 218

తే. ఈపగిదిఁ బల్కు సోదరుఁ గోపదృష్టిఁ, గాంచి యిట్లనె దనుజశేఖరుఁడు నీకు
నిద్ర చాలమిఁ దెల్పు నీ నేత్రయుగము, పొమ్ము గాఢముగా నిద్రఁ బొందుమయ్య.

సీ. అనఁ గుంభకర్ణుండు నాలించి జవమునఁ, బురిఁ దాఁటి సంగరభూమిఁ జేరఁ
గపులు వానినిఁ గాంచి కడుభీతులై రాము,పార్శ్వమ్ముఁ జేరి రక్షమ్ముఁ జెంది
యట విభీషణుఁ డేగి యన్నతో ననెను బెద్దన్నతో నిట్లంటి యన్న! నేను
సీత రామున కిచ్చి సేమంబుఁ గొను మంచు, బోధింప ధిక్కారపూర్వకముగ

తే. నన్ను వెడలంగఁ గొట్టె నావాఁడె నేను, శరణ మని చేరి శ్రీరామచంద్రవిభుని
సేవఁ జేయుచు నుంటి నో చిన్న యన్న!, యనినఁ దమ్మునితో నిట్లనియె నతఁడు.

తే. ఐహికాముష్మికసుఖంబు లందఁగోరి, మంచిపనిఁ జేసి తరియించుమార్గ మొంది
యుంటి విప్పుడు నా ప్రోలనుండవలదు, స్వపరభేదంబుఁ దెలియ దీసమయమందు.

చం. అన విని యావిభీషణుఁడు నన్నకు మ్రొక్కి చనెన్ యథేచ్ఛగా
ఘనుఁడగు కుంభకర్ణుఁ డటఁ గాలను గేలను వానరావళిం
దునుముచు మ్రింగు చంగములఁ దున్క లొనర్చుచు వానరాధిపుం
గని పడఁగొట్టి శూలమునఁ గైకొని వానిని బ్రోలు చేరఁగన్. 222

తే. చనెడు తెన్నునఁ దెలిసి యావనచరేశుఁ,డతనిముక్కునుఁ జెవుల నాహాసముగఁ డఁ
గొఱికి వైరూప్య మొందించి యుఱికి మరల, రాముఁ జేరెను విజయాభిరాముఁడగుచు.

శా. ఔరా! వానరుఁ డెంత చేసె నని లజ్జాయత్తుఁడై ప్రోలికిం
జేర న్మాని కపీశు వానరుల నా శ్రీరామునిన్ లక్ష్మణు
న్వీరత్వమ్మునఁ జంపి కాని చన నిర్వీ డంచుఁ గుంభశ్రవుం
డారామాదులు గల్గుచోటికి రణవ్యాసక్తిమై యేగినన్. 224

వ. ఇ ట్లేగి రాము నెదిరించి యుద్ధభూపతిత ద్రుమశిలావళిని రామునిపై వైవ నామహా
వీరుండును వాని నన్నిటిని బాణమ్ములఁ జూర్ణంబుఁ గావించి వాయవ్యాస్త్రమునఁ
గుంభకర్ణుని సాయుధబాహుద్వయంబు ఖండించిన నార్చుచు నయ్యసుర మీఁదికి
వచ్చుచున్న నతనిపాదమ్ముల నర్ధచంద్రబాణద్వయంబున ఖండించె నిట్లు రామబాణ
చ్ఛిన్నపాదబాహుండై భయంకరబడబానలతుల్యప్రభంబగు నాస్యంబు విప్పుచు
దొరలుచు రాముని మ్రింగునూహ సోముం జేయు రాహు వన నేతెంచిన రాముం

డును దద్వివృతాస్యంబు శరపూరితంబొనర్ప నాతం డార్తనాదుండై యెదు రేతెంచుచుండ రాముం డైంద్రాస్త్రమున వానికంఠంబు ఖండించె నంత జేజేలు సంతసించి రామునిపైఁ బూలవానఁ గురిసి, ప్రశంసించి రంత నవ్వార్త విని రావణుండు సోదరునికై విచారించుచుండ నింద్రజిత్తు దుఃఖితుం డగుతండ్రిం గని యిట్లనియె.

ఉ. ఏల విచార మొందెదు సురేశ్వర ! శూరులచావు లిట్టివే !
కేలి యరణ్యమేచ్ఛగతిఁ గీశుల మానవుల న్వధింపఁగా
వేలిమికై నికుంభిలకు వేఁ జనువాఁడ ననుజ్ఞ నిమ్మనన్
మే లని తండ్రి యాజ్ఞ యిడ మేఘరవుం డతికోపుఁడై చనెన్. 226

## ఇంద్రజిత్తు నికుంభిలాహోమముఁ జేయుట

సీ. రక్తమాల్యాంబరయుక్తుఁడై రథశస్త్ర, ధనురాదిసాధనార్థంబు గాఁగ
యోగినీవటభూమి నున్నకందరమందు, నాభిచారికహోమ మాచరింప
వార్యనిలానలవ్యాఘ్రహిరాక్షస, కంటకసప్తదుర్గంబు లలర
హోమకుండంబున నూర్ధ్వభాగమ్మునఁ, గృష్ణాహినటు దలక్రిందు గాఁగ
తే. వ్రేలఁగట్టియు నెఱ్ఱనిపూలు వలువ, గంధమును దాల్చి బహుసిద్ధ గడలుకొనఁగ
నంతరాయంబు రాకుండ నాచరింప, విజయ మగునంచు నింద్రజి వేల్చె నిట్లు.

వ. అమ్మారణహోమమ్మున మౌనమ్ముఁ దాల్చి రక్తపుష్పాక్షతమ్ములఁ దత్తద్దేవతలఁ బూజించుచు గుంజాసర్షపరక్తచందనేక్షుఖదిరపలాశాశ్వత్థోదుంబరభల్లాతకాస్థిమాషమాంసభల్లాతకఫలార్కనింబబీజపూరకృష్ణధుత్తూరరోచనాపామార్గబదరికానలదాలకబంధూకనరముండవసాంత్రసర్పఖండమండూకాదివివిధద్రవ్యమ్ములను త్వగ్గంతాస్థిస్నాయులోమమ్ములను నానావనచరమాంసమ్ములను సమంత్రకమ్ముగా నగ్న్యాహుతుల నొనర్చుచుండె నంత విభీషణుండు. 228

శా. సేనామధ్యగుఁ డయ్యు ధూమము వియత్సీమ న్నిరీక్షించుచున్
దా నాహోమవిధానముం దెలిసి సీతానాథుతోఁ బల్కె ర
క్షోనాథాత్మజుఁ డాభిచారికమునుం గ్రూరంబుగాఁ జేయు, న
ద్దానిన్ విఘ్న మొనర్పకుండినఁ బ్రమాదం బయ్యెడిన్ రాఘవా ! 229

సీ. సకలసురాసురాజయ్యుఁ డౌఁ గాన నీ, రారేఁడు లెవ్వఁ డాహారనిద్ర
లొందకుండునో వాఁడు మ్రందించు వీనినం, చనె నల్వ వనవాస మాది గాఁగ

సౌమిత్రి యట్టిఁడె ♦ సతతంబు నినుఁ గొల్చు, వాఁడని యెఱిఁగితి ♦ వసుమతీశ!
సౌమిత్రిఁ గొనిపోయి ♦ హోమమ్ముఁ జెడఁగొట్టి, వానిని జంపించి ♦ వచ్చువాఁడ
తే. అని రఘూత్తమునానఁ గైకొని విభీష, ణుండు మారుతిముఖ్యులా ♦ దండిమగలు
వెంబడింపఁగ లక్ష్మణాన్వితుఁ డగుచు, నానికుంభిలకడ కేగె ♦ నతిజవమున. 230

## లక్ష్మణుం డింద్రజిత్తుఁ జంపుట

వ. ఇట్లు చని లక్ష్మణునకు నికుంభిలాస్థానముఁ జూప నంగదునిభుజమ్ములపై నుండి లక్ష్మణుండు నాగ్నేయాస్త్రమునఁ గంటకమ్ములను, బాణమ్ముల రక్కసులను, గారుడమ్మున సర్పములను, బర్వతాస్త్రమునఁ బులులను, బర్జన్యాస్త్రమున ననలంబును, నాశమొందించి హనుమంతునిచే వాయువును బీల్పించి, వాయవ్యాస్త్రమున జలముల నెండించె; నిట్లు సప్తపరిఖంబులు భగ్నమొందించియు నచ్చోటుఁ గానమిం గనలి మారుతి యోగినీవటం బుత్పాటింపఁ బోవ నద్దానిపై నున్న యోగిని భయమ్మున నింద్రజిదాశ్రితంబైన గుహం జూపింపఁ బాదఘాతంబునఁ బిధానశిలం జూర్ణంబుఁ గావించి గుహాసంస్థితుఁ డగు మేఘనాదుం గని తర్జనభర్జనాది బహువిధమ్ముల వేలిమికి విఘ్నం బొనర్ప వాఁడును గనలి హోమము మాని క్రోధావిష్టుండై యతిరయమ్మున రథారోహణ మ్మొనర్చి కపుల నదల్చి లక్ష్మణు మ్రోల కేతెంచి. 231

చం. సరగున నస్త్రశస్త్రముల ♦ సాహస మొప్పఁగ మున్ను దారకా
సుతుఁ దలపించి పోరు నెడ ♦ శూరత మీఱఁగ లక్ష్మణుండునుక్
శరముల వానిగుఱ్ఱముల ♦ స్యందన కేతనసూతచాపముల్
వరకవచంబుఁ బోనడఁచి ♦ వానిని జర్జరితాంగుఁ జేసినన్. 232

చం. ధర వసియించి వేఱువిలు దాలిచి సారతరాంబకాళిచే
నరవరసూనుకత్తళము ♦ నాశ మొనర్చిన లక్ష్మణుండు బల్
శరమున వానిదక్షిణభుజంబును దుల్చిన వాఁడు వామస
త్కరగతశూలుఁ డౌచు భయదంబుగఁ బైకొని వచ్చె నత్తఱిన్. 233

తే. శూలయుతమైన వాని డాకేలు దునిమి, దశముఖునిచెంతఁ బడనేసెఁ ♦ దద్భుజంబు
నంత వివృతాస్యుఁడై వాఁడవారి వేగ, మ్రింగ నుంకించి రాఁగ సౌమిత్రి యపుడు.

ఉ. రాముని లో స్మరించి రఘురామశుభాహ్వయచిహ్నితంబునౌ
భీమశరంబు వైవ గిరిభిద్రిపుకుండలహాళిమండితో

ద్దామశిరంబు నద్ది ప్రమదంబున వానరు లార్వ రాక్షస
స్తోమము లార్తిఁ జెందఁగ వసుంధరఁ గూల్చె నిమేషమాత్రలోన్. 235

వ. ఇట్లు జగద్వినుతపరాక్రముండగు లక్ష్మణుని మహాకార్యమ్మున నవిరళానందభరితులై యమరు లగ్గించిరి. పుష్పవర్షంబు వెలయ మింట శంఖదుందుభినిస్వానంబు లుప్పతిల్లె నంత. 236

తే. శంఖరావంబు విని సీత సంశయించి, త్రిజటఁ గని శంఖరావంబుఁ దెలిసి రమ్ము
కారణం బేమొ? యన నామె కాంచి వచ్చి, యింద్రజిద్వధవృత్తంబు నెల్లఁ దెల్పె.

తే. సీత ముద మొందె నిట నింద్రజిచ్ఛిరంబు, ననుమ కైకొని యానంద మినుమడింపఁ
గపివిభీషణసౌమిత్రి కలితుఁ డగుచు, వివిధరవములతో రామవిభునిఁ జేరి. 238

వ. వందనం బిడి సౌమిత్రిచ్ఛిన్నమేఘనాదశిరంబుఁ జూపెఁ బిదపఁ దనకు సాగిలి మ్రొక్కిన లక్ష్మణుం గౌఁగిలించి రామచంద్రుఁ డానంద మొందె నంత నక్కడ రావణుండును. 239

తే. భుజముఁ గని యింద్రజిత్తటఁ బొలియుట విని, పుత్రశోకమ్ముతో సభ మూర్ఛఁ జెంది
తేరి యుద్ధతుఁడై వాలుఁ దెంపునఁ గొని, జానకి వధింతు నని పోవు సమయమునను.

తే. వాలుగల కేలుఁ బట్టి సుపార్శ్వమంత్రి, యతని వారించి యనె నిట్టు లసురనాథ!
కనలి పొలఁతుకఁ జంపుట కడు నధర్మ, మరులఁ బొలియింపు మవనిజ నందఁగలవు.

## సులోచన సహగమనముఁ జేయుట

చం. అని మఱలించె నంతఁ దన ప్రాణవిభూత్తమబాహుదండముం
ఘనశరయుక్త మంగదవికాసము గల్గినదానిని సులో
చన కని భర్తృశక్తిని బ్రశంస నొనర్చుచు నేడ్చుచుండఁగాఁ
గని భుజ మాథరాస్థలిని గాండముతో లిఖియించె నీగతిన్. 242

తే. "అతివ! తప్పదు కర్మఫలానుభవము, చింతఁ గొనకుము శేషునిచేతఁ జచ్చి
ముక్తి కేగుచునుంటి నో ముదిత! నీవు, రాము నడిగి మదీయశిరంబుఁ గొనుము.

చం. అడిగిన నిచ్చు రాముఁడు దయామయుఁ డట్టిశిరంబుతో శిఖం
బడిన మదీయమైనసహవాసముఁ జెందెద" నంచు వ్రాసి కే
ల్వడి నిటు వ్రాయు వ్రాలుఁ గని వానిపడంతి సులోచనాఖ్య వెం
బడిఁ బఠియించి విస్మయ మపారతరంబగు ధైర్యముం దగన్. 244

సీ. సంతసమ్మున సులోచనయు భూషలు దాల్చి, యత్తమామల యాజ్ఞ | నవధరించి
శిబికాస్థయై రాము | చెంత కేగుచు నుండ, రామభీతినిఁ జెంది | రావణుండు
నుర్వీజ నంపుచు | నున్నాఁడు గాఁబోలు, నని వానరులు నామెఁ | గనెదు వేడ్కఁ
బాలకిదరిఁ జేరి | వాహకవరులచే, నింద్రజిత్సతి యని | యెఱిఁగి వారు

తే. రాముదర్శింప నేగు నీ | రమ్యగాత్రి, విన్నపము సేయుమాటల | విందు మనుచు
ప్రమదమమరంగ నారాము | పజ్జఁ జేర, సతియు నతిభక్తి శ్రీరామ | చంద్రుఁ జేరె.

వ. ఇట్లు చేరి ముకుళితకరకమలయై రామచంద్రునిం గాంచి యామె యిట్లనియె. 246

మ. దళదంభోజదళాక్ష! భక్తవరచేతఃపద్మనిత్యాలయా!
ఖలరక్షోవనదావ! చక్రధరరేఖాపాణిపద్మద్వయా!
లలితాకారధరాత్మజాహృదయలోలా! నీలమేఘప్రభా
కలితాకార! జగత్త్రయీసతతరక్షా! రామచంద్రప్రభూ! 247

చం. నతు లొనరించి వేఁడెద మనఃప్రియమౌ నొకకోర్కె దేవ! నా
పతిశిర మిచ్చితేనిఁ గొని | పావకులోఁ బడి తచ్ఛిరంబుతోఁ
బతిగతిఁ జెందెద న్సతికి | భవ్యమె యీగతి కాన నట్టి స
ద్గతినిడువాఁడవౌదు వీకఁ | గాంతు శిరం బిడుమయ్య! యం చనన్. 248

చ. కలికిరో! నీపయిం గరుణ | గల్గెఁ బతిన్ బ్రతికింతు నగ్నిలోఁ
పలఁబడనేల? యన్న సతి | పల్కెను లక్ష్మణుచేతఁ జచ్చుటి
ట్లలవడు నొక్కొ! నా ధవుఁడు | ప్రాణములొందిన రామ! వానికిం
గలిగెను ముక్తి జీవనము | కంటెను మే ల్బ్రతికింపఁబోకుమా. 249

చం. అని రఘురామదేవునకు | నంజలిఁ జేసి నమస్కరించి త
ద్ఘనతరభాషల న్విని ము | దంబున నవ్వడు భర్తృశీర్షముం
గొని పురినున్న బాహువులఁ | గూర్చి తదీయశరీరయోగముం
గొని శుచియై సులోచనయుఁ | గూలి చితిం బరిదగ్ధదేహయై. 250

తే. దివ్యదేహంబుఁ దాలిచి | తేజరిల్లి, భర్తతోఁ గూడి శ్రీరామ | భద్రుకరుణ
నమరయానాధిరూఢయై | యాక్షణంబ, ముదముఁ జెందుచు వైకుంఠ | పురము జేరె.

తే. రావణుఁడు నంత సపరివా | రంబుగాఁగ, జేరి కపిసైన్యములతోడఁ | బోరుచుండ
రక్కసుల నెల్లఁ జంపి యా | రాముఁ డసుర, వల్లభుని బాణమున లంకఁ | బడఁగ వైచె.

సీ. రావణుండును మాయారాక్షస కృతకృత్రి,మం బైనరాముని మస్తకంబు
సీతకుఁ జూపి యాసీతఁ గైకొనువేడ్క, నరుగుచుండఁగ బ్రహ్మ యంతలోన
నేతెంచి సీతతో నిట్లనె రాముని, కృత్రిమశీర్షంబుఁ గేలఁ దాల్చి
వచ్చి రావణుఁడు సీతాపతి చచ్చెనని నీకుఁ, జెప్పెను దుఃఖంబుఁ జెందఁబోకు
తే. మనుచు బోధించి చనియె నాయసురవరుఁడు, సీతకును జూపి కృత్రిమశీర్ష మపుడు
సీత! నామాట మును విశ్వసింపవిదిగో, వాలిసె నీనాథుఁ డిఁక నన్నుఁ బొందుమబల!

మ. అన నమ్రాననయై వచించె దనుజేశా! రాముఁడే సంగరం
బున నీశీర్షములెల్లఁ ద్రుంచు శరయుగ్మార్థమ్ము లేఁ గాంచెదన్
ఘనమాయుండవు నిన్ను నమ్మెదనె రక్షస్సంఘతూలావనీ
ధనికాయాగ్నిని రాముఁ జంపఁగను సాధ్యం బెట్లు నీ కారయన్. 254

వ. ఇటుఁలు సీతావాక్యారాహతమర్ముండై యపత్రపాన్వితుండై రావణుండు నిజగేహం
బుఁ బ్రవేశించియుండె నంత. 255

సీ. రామాజ్ఞచే వానరస్తోమ మిషీకాళిఁ, గొని లంకఁ గాల్పఁగాఁ జనియె వేడ్క
సౌధాదులం దగ్ని సంధాన మొనరింపఁ, గాలెడు లంకను గాంచి పౌరు
లడలి కోలాహలం బడర నిర్విణ్ణులై, చూడఁగా రావణాసురుఁడు వచ్చి
యంబుదాస్త్రమునఁ జల్లార్పఁగా వానరుల్, శ్రీరాముచెంతను జేరి రంత
తే. దివిజవైరియు శుక్రోపదేశ మొంది, మంతనమ్మున గుహను హోమంబుఁ జేయ
ద్వారములనెల్ల మూయించి క్రూరవృత్తి, వేల్మి కగువస్తుజాతంబు వెంటఁగొనుచు.

## రావణుని హోమమును వానరులు ధ్వంస మొనర్చుట

వ. హోమమందిరమ్ముఁ జేరి మౌనియై రక్తావగాహనం బొనర్చి కపాలమాలియై ప్రేతాసనమ్ముననుండి శస్త్రపరిస్తరణమ్ములతో నగ్నిం బ్రతిష్ఠించి కేశాదిపదార్థమ్ములచేఁ బదియేండ్లకు లోనియీడుగల శిశువులశిరంబులచేఁ బలలఖండములచే శత్రుసంహారార్థముగా వేల్చుచున్నంత. 257

తే. వేల్మిపొగఁ గాంచి వేగ విభీషణుండు, రామచంద్రున కిట్లనె రావణుండు
చంపు వేలిమిఁ జేసెడు సొంతమైన, సర్వలోకమ్మువారి కజయ్యుఁ డగును. 258

చం. అన విని రాముఁ డాకపుల కాన నొనర్చిన వారు సాలలం
ఘనమున రావణాలయముఁ గన్గొని పాలకరాక్షసావళిం

దునిమిరి క్రోవలో సరమ తోఁచి కరాంగుళిసంజ్ఞఁ జెప్పినం
దనదగు పాదఘాతమునఁ దన్నె గుహాశిల నంగదుం డొగిన్. 259

మ. శిలఁ జూర్ణించి దశాస్యు నంగదుఁడు ముష్టి న్మోదె శాఖాచరుల్
మలలన్ భూజములన్ శ్రమావధిగనే మర్దించినన్ దైత్యుఁడుం
జలనం బందమిఁ గన్ను విప్పమిఁ బ్రపాసంయుక్తులై తత్సతిన్
బలిమి న్వేనలిఁ బట్టి తెచ్చి రటకు న్మందోదరి న్వానరుల్. 260

తే. కబరి విడివడఁగాఁ గంచుకంబు జాఱ, నేడ్చుమందోదరిని దానవేశ్వరుండు
చూచి వేలిమి విడనాడి లేచె నంతఁ, గపులు బర్వెత్తి రారాముకడకుఁ బిదప.

శా. ఖేదం బంది వచించె నామె దశమగ్రీవైక శేషా! ప్రియా!
క్రోధం బందక సీత రామునకు బల్లూర్మి న్సమర్పించి నీ
సోదర్యుం బురి కీశుఁ జేసియు రమేశుం గూర్చి మద్యుక్తి స
మ్మోదం బొప్పఁ దపంబుఁ జేయుము వనీభూమి న్ముముక్షుండవై. 262

తే. ఏల హోమమ్ము లోకనాథ! యిపియు నెల్ల, నింద్రజిత్తునితోఁ బోయె నిద్దఱ మిట
మిగిలితిమి కాదె? సిరు లేల? నగర మేల?, ప్రాణము లివేల? రమ్ము తపం బొనర్ప.

చం. సతి వచియించుమాటను నిశాచర శేఖరుఁ డాలకించి యీ
గతి వచియించె రాముఁ డల కంజదళాక్షుఁడు సీత యారమా
సతి యని నే నెఱుంగుదును జానకిఁ దెచ్చుట రాముచేత నే
మృతిఁగొని ముక్తి నందఁగఁ జుమీ? యిది నిశ్చయ మెట్లుచూచినన్. 264

కం. కావున నోమందోదరి, నీవును ననలంబుఁ జేరి నిర్మలమతివై
మానవులోకమ్మున నా,తో వసియించుచునుఁ గొనుము తుల్యసుఖమ్ముల్. 265

## రామరావణయుద్ధము

సీ. అని పల్కి రావణుం డరదమెక్కి చనంగ, ముకుటంబు జాఱి తద్భూమిఁ బడియె
మది భీతి జనియించె మఱియు నెన్నెనియు, త్పాతము లొప్పడమె నవ్వానిఁ గనక
ప్రథనభూమికి భాణవర్షణుండై యేగి, కృత్రిమసీతను గేలఁబట్టి
వానరుల్ చూడంగ వధియించె నదిగాంచి, హాహారవమ్ముల నఖిలకపులు

తే. పరువులెత్తుచునున్న యాతరుణమందు, బ్రహ్మ చనుదెంచి వారితోఁ బల్కె మాయ
సీత యియ్యది దుఃఖంబుఁ జెందకుఁడని, చెలఁగి యార్చెను వానరసేన యంత.

చం. వనరుహసంభవుండు చనె వానరయోధవరేణ్యులెల్లఁ బో
రొనరుప నెంచి రామవిభు యుక్తిగ నేగిరి పాకశాసనా
జ్ఞను సకలాస్త్రచాపశరసాధనకేతనయుక్తమౌ రథం
బును గొని వచ్చె మాతలి ప్రభూతజవమ్మున యుద్ధభూమికిన్. 267

ఉ. ఆరథ మెక్కి రాముఁడు దశాస్యు నెదిర్చి సుఘోరమౌ శరా
సారముఁ జిమ్మ రావణుఁడు సామ్యముగా శరపాళి వీడఁగాఁ
బోరిరి వార లిద్దఱుఁ బ్రభూతభుజాబలసార మొప్ప న
వ్వారిమహారణమ్మునకు వారిరణంబె సమానమౌ ధరన్. 268

వ. అంత రావణుం డాగ్నేయదైవాస్త్రము నేయఁ బ్రత్యస్త్రంబుల రాముఁడు నివారించె; మఱియు రావణుం డేయు సర్పాస్త్రమును గారుడంబునను, బర్జన్యాస్త్రమును వాయవ్యమునను నివారించి రాముఁ డాగ్నేయాస్త్రము నేయ రక్కసుండు బర్జన్యాస్త్రమున నివారించెఁ బిదప రామచంద్రుండు గ్రీష్మాదిత్యుం బోలి ప్రతాపప్రదీపితమూర్తియై ప్రళయభైరవుమాడ్కిఁ ద్రిపురసంహారణభద్రుం డగురుద్రుం బోలి కోప మొంది మండలీకృతకోదండుండై పరాజ్ఞాతశరసంధానమోచనుండై రక్తలోచనుండై యొప్పె మఱియుఁ బదివే లేనుంగులను, నియుతాశ్వంబులను, సార్థశతరథంబులును. శతకోటిపదాతులను సంహరించుసంజ్ఞకై మింట నొక మొండె మాడుచుండు. తాదృశకబంధకోటినర్తనకాలమున నొకమాఱు చాపైకకింకిణీరవం బగు, నట్టులు నిజకోదండకింకిణీరవంబులు నిరువదియు నొకఘటికాద్వయకాలమ్మున కగున ట్లాకర్ణాంతాకృష్టపరిత్యక్తశరాసారంబు రాక్షసచాతురంగికసైన్యానలంబుపైఁ గురిపించుచుఁ బర్జన్యుం బోలి యారాజన్యవీరుండు సంగరదిదృక్షాసమాగతాంబరవిమానస్థితదేవగంధర్వకిన్నరకింపురుషచారణసిద్ధసాధ్యజోఘుష్యమాణజయదుందుభినాదగర్జాలలితుండై శరధారాధళధళ్యరుచితటిల్లతికాప్రభాగోచరుండై బాణపరంపరాంబుదాచ్ఛాదితాంబరుండై కాలమేఘాకారుండై రక్కసులం గూల్చుచుండ నచ్చటఁ గేశశైవాల, కరిగిరి, కరపాదభుజగ, కబంధమకర, శిరఃకూర్మ, కేతనచామరచక్రాంగడిండీర, ఛత్రపుండరీక, శతాంగయానపాత్ర, శరచాపఖండబహుతరంగ, మేదోమాంసమస్తిష్కపంకంబులతో బహుముఖరక్తనదులుఁ బ్రవహింప భూతప్రేతపిశాచడాకినీశాకినీకూశ్మాండగృధ్రకాకశ్వసృగాలజాలంబు లామిషార్థకలహకోలాహలప్రచురగళదఘ్నరక్తనదీనిమజ్జనోన్మజ్జనకేళీవినోదంబు నొంద, రక్తపానమాంసభక్షణతృప్తభూతంబు లాత్మీయబంధువులం బిల్చి వారలకు

రక్తమాంసంబులతోడ విందు లొనర్ప నిట్లదృష్టాశ్రుతానాలోచితాసమానాతిమా
నవంబై సంగరాంగణం బొప్పె మఱియును. 269

ఉ. రావణుఁ డంత రామరథరాజమునం గల వజ్రకేతనం
బావసుధం బడం దునిమె నంతట రాముఁడు కేతనస్థలిం
బావని నుండు మన్న నిజబాహులఁ దాళముఁ బీకి తెచ్చి య
త్తావున నుంచి దానిపయిఁ దాను వసించెను వేడ్కఁ నాతఁడున్. 270

ఉ. మారుతిఁ గాంచి రావణుఁడు మార్గణజాలముచేతఁ దాళముం
మారుతి నాతపత్రమును మాతలి నశ్వసురేశచాపముం
ధారుణిఁ గూల్చె నంతటను దత్కృపి మాతలి సోలిరంత నా
మారుతి లేచె వానిభుజమండలమందు వసించి రాముఁడున్. 271

తే. తుములసమరంబు రావణుతోడఁ జేయఁ, బంక్తికంఠుఁడు మారుతిఁ బరిఘమునను
వక్షమునఁ గొట్టఁ గరువలిపట్టి సోలి, పుడమి దంభోళిహతగిరిఁ బోలి కూలె. 272

వ. అంతఁ బుండరీకాక్షుండగు రాముఁ డాత్మరథంబుఁ దలంప దారుకసారథికంబును, శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకనామకచతురశ్వయుతంబును, ఛత్రచామరకలితంబును, గరుడకేతనంబును, కౌమోదకీనందకపాంచజన్యసుదర్శనశార్ఙ్గవిరాజమానంబును నగురథం బంబరమార్గమ్మునఁ దనచెంత కేతెంచినం గని దానికి వలగొని, మ్రొక్కి యెక్కి శార్ఙ్గపాణియై రావణు నెదిరించె మఱియును. 273

ఉ. భానుకరోపమానశరవారముచే దశకంఠుశీర్షముల్
భానుకులుండు ద్రుంప నవి పైఁ జని మిన్నున నుండి రాముచేఁ
బ్రాణము వీడియుంటిమి సెబా సని సుస్మిత మొప్ప జానకీ
జానికి మ్రొక్కఁ దచ్చరణసారసభూమికి వచ్చుచుండఁగన్. 274

తే. చిఱుపగవ్రుగ్గు రావణశీర్షములను, గాంచి రాముఁడు నసుర జంపఁగా శిరంబు
లరుగుదెంచు నటంచు బాణాళి వాని, నూఱుముక్కలుగాఁ జేసె వైరు లడల.

వ. ఇట్లు రావణశిరంబుల ఛేదించినను బునరుద్భవం బొందుటఁ గాంచి వానిం గూడ ఖండించె మఱియును. 276

సీ. ఉజ్జ్వలతరాస్త్రవితతి నేకకోత్తరశత,వారములు ద్రుంచె రాఘవేశ్వరుఁడు రాక్ష
సేశ్వరునిశీర్షముల నవి యెప్పటివలె, మొలుచుచుండెను బిదప నద్భుతము దోఁప.

వ. రామచంద్రుండు విభీషణుం గాంచి యిట్లనియె. 278

ఉ. వీనిశిరంబు లీగతి విభీషణ ! మొల్చెడు నెంతత్రుంచినన్
దానవుఁ డింకఁ జావఁడొకొ ? తన్మరణం బెటు లన్న వాఁ డను
న్వీనికి నాభియం దమృతవృత్తము గల్గు నెలార్చుమా యనన్
మానవనాథుఁ డగ్నిమయమార్గణ మేసి హరించె నాసుధన్. 279

ఆ.వె. ఇటులు చేసితలలఁ బటు బాహువులఁ గూల్చ, మున్ను వోలెనవియు మొలువవయ్యె
రెండు బాహువులు నొకకండు శీర్షముతోడ, నుండి వాఁడు బోరుచుండె మఱియు.

ఉ. దారుకచోదితుం డగుచు ధాత్రృశరం బతిలోకవీరుఁడౌ
శ్రీరఘురాముఁ డేయ నది శీఘ్రమె రావణుఁ జంపివచ్చి తూ
ణీరముఁ జేరె నంత రఘునేత ముదం బెదనొందె దైత్యశా
రీరజతేజ మా హరిశరీరమునందునఁ జేరె వింతగన్. 281

తే. చూచి జేజేలు వానిఁ బ్రస్తుతు లొనర్చి, పూలు గురిపించి వాద్యముల్మ్రోయఁ జేసి
రచ్చరల యాటపాట లంతంతఁ జెలఁగె, విపులతరమోద మెల్లెడ వెల్లివిరిసె.

ఉ. ఆదట భర్తచచ్చుటకు నార్తిని జెందియు ధీరచిత్త మం
దోదరి దేహము న్విడిచి యొప్పుగ భర్తనుగూడి యేగి దా
మోదరలోకమం దతిసుఖోన్నతిఁ జెందెను రామసాయకా
పాదితమైనమృత్యు వపవర్గదమౌగద యెట్టిపాపికిన్. 283

వ. ఇట్లు శ్రీరామచంద్రుండు లోకకంటకుండగు రావణుం బొలియించి. 284

సీ. ఆవిభీషణుచేత నసురనాథున కౌర్ధ్వ, లౌకికకర్మకలాపమెల్లఁ
జేయించి సౌమిత్రిచే విభీషణుని లం, కానాథుఁ జేయించి వానిచెంత
న్యాసమౌ తద్వాయునందనకృతలంక, విడిపించి రాముండు పిదప సీత
కీవార్త వినిపింపనెంచి విభీషణ, వాయుజాదుల నంప వార లేగి

తే. రచట సీతను గాంచి యార్యను మ్రొక్కి, రాముఁ డాసురనాథు దురంబునందుఁ
జంపినవిధంబు, శిష్టమౌ సకలచరిత, నామెతోఁ బల్కి మోదంబు నందఁజేసె.

ఉ. అంతట భూతనూజకు శుభాభిషవం బొనరించి తత్పురీ
కాంత లలంకరించి శిబికన్ వసియింపఁగఁ జేసి కంచుకుల్
చెంత బరాబరుల్ సలుపఁ జిత్తము రంజిల వాద్యఘోషముల్
వింతగ మ్రోయఁ దెచ్చి రఘువీరునిచెంత వసింపఁ జేయఁగాన్. 286

ఉ. పాలకినుండి డిగ్గి తనభర్తను జేరి నమస్కరించి తా
వ్రీళ మనోజ్ఞమౌ వదనబింబము వాలిచి నిల్వ రాముఁ డా
శీలవతిన్ జగత్త్రితయసేవ్య నెఱింగియు రోషభాషణో
ద్వేలతమీఱఁ బల్కె నిటు విశ్వజనంబుల ప్రత్యయార్థమై. 287

ఉ. రావణపట్టణాంతరచిరస్థితిలబ్ధకళంకనైన ని
న్నేవిధి గారవింతుఁ దరుణీ! చను మెచ్చటికేని నీమనో
భావమువచ్చిన, ట్లమలభానుకులస్థితి రాజధర్మమున్
బో విడనాఁడఁజాల నిను ముట్టఁగఁజాలఁ దొలంగు మియ్యెడన్. 288

వ. అనునంత నతర్కితోపనతంబగు నీవిపాదసంఘటనమ్మునఁ గఠోరాశనిపాతనిర్దహ్యమానసుకుమారలతయుంబోలి విగతచైతన్యయై నేలఁ గూలి యాజనకరాజనందన కొంతవడికి లేచి శతవిధమ్ముల నాదయామయి ననూనయించియు నకృతార్థయై నిజాదేశమ్మున లక్ష్మణుండు సాశ్రులోచనుండై చితిఁ గూర్ప సుగ్రీవవిభీషణజాంబవదనిలజాంగదాదులు కింకర్తవ్యతామూఢులై ఱిచ్చవడి చూచుచుండ నయ్యగ్నికి ప్రదక్షిణించి నమస్కరించి సభక్తికమ్ముగా నిట్లనియె. 289

ఉ. మానసవృత్తినైన మఱి మాటలఁ గాయముచేతనైన నా
ప్రాణసమాను రామవిభుఁ బంకజలోచనుఁ దప్ప నన్యునిం
గానమి మాటలాడమియుఁ గైకొనకుండుట నిక్కమేని వై
శ్వానర! నన్నుఁ గాల్పకయె చల్లనివాఁడవు గమ్ము నాయెడన్. 290

తే. అని వచించియు మండెడు నగ్నిలోన, ధరణిసంభవయావసోర్ధారఁబోలి
భూతజాలంబు వంతలఁ బొంది యడలఁ, గోపశోకపరీతయై కూలె నపుడు.

తే. వీతిహోత్రుఁడు దొడవుల సీత నపుడు, భూషితాంగిని జేసి సంతోష మొంది
పుత్త్రి నల్లున కిచ్చెడుపోల్కి గాఁగ, రామునంకంబుఁ జేరిచి ప్రేమఁ బలికె. 292

చం. పరమపతివ్రతామణి భవత్పదపంకజభక్తియుక్తయున్
సరసిజవాసినీసమప్రశస్తచరిత్ర జగత్త్రపూజ్య యీ
ధరణిజఁ బూతగాత్రి నిఁక దాశరథీ! గ్రహియింపు మీవె యి
క్కరణి నుపేక్ష సేయుదె? జగజ్జనహృద్గతభావవేత్తవై. 293

తే. కాని నా కొక మేలయ్యెఁ గంజనేత్ర!, సర్వభక్షణదోషంబు సమసిపోయి
పూతగాత్రుఁడ నైతి భూపుత్త్రికతన, పూతజనసేవ శ్రితశుభాభ్యుదయకరము. 294

వ. అని యగ్ని దేవుండు రామునితోఁ బ్రసంగించుచున్నంతఁ దత్ప్రదేశమ్మునకు. 295

చం. దశరథుఁ డింద్రముఖ్యులగు । దైవతములు చనుదెంచి ప్రేముడిన్
విశదముగా ధరాత్మజ ప।విత్రచరిత్ర గ్రహింపు మన్న న
ద్దశరథనందనుండును ముదమ్మున సీతఁ గొనెన్ తిరస్క్రియా
దశతొలఁగన్ బ్రహర్ష లలి।తస్మిత ముగ్ధముఖాబ్జములే దగన్. 296

వ. మున్ను బంచవటిం దా నగ్ని నిడిన రాజసరూపసీతను గ్రహించి యాదరణం బొనర్చియున్నంత జేజే లమోఘదర్శనులు గాన రాముకోర్కెపై నింద్రుండు రణరంగమృతవానరులపై నమృతవర్షమ్ముఁ గురిపింప కుంభకర్ణభక్షితు లగువారుదక్క సర్వవానరులు జీవించి రంత రాముఁడు కుంభకర్ణభక్షితవానరుల కేశనఖాస్థిభాగమ్ములనైన నెమకి తెమ్మని మారుతిని నియోగించిన నతం డట్లు తెచ్చె నంత వారు గూడ నింద్రదయమానుగ్రహమ్మునఁ బునర్జీవితులై రిట్లు నిరపాయమ్మగు సర్వసైన్యంబుఁ జూచి రాముం డపరిమితానందభరితుం డయ్యెఁ బిదప రామాజ్ఞఁ గొని మాతలి రథసహితుండై యింద్రాదులం గూడి దేవలోకంబుఁ జేరె దశరథుండును సీతారామలక్ష్మణులం గని యభినందించి యాశీర్వదించి విమానముతో సురనగరి కేగె నంత. 297

సీ. రామచంద్రుని జూచి । రావణసోదరుం, డభ్యంజనస్నాన । మాచరింపఁ
బురికి రమ్మన నేను । పురిఁ జేర నని యాత్మ, భరతుండుదోఁప నా।దరముమీఱ
వానరావళితోడ । వైదేహితోడను, బుష్పకారూఢుఁడై । ముదముగదుర
మకరధ్వజుఁడు గరు।త్మంతుండు దారుకుం, డలవిభీషణుఁడుఁ ద । న్ననుసరింప
గీ. వెలసియున్నట్టి యాశుభ।వేళయందు, ప్రాంజలి విభీషణుండు శ్రీ।రామచంద్రుఁ
గాంచి సంశయ మొక్కటి।కలదు నాకుఁ, దెలియఁబల్కుము కరుణానిధీ! మహాత్మ!

ఉ. నీవు రణమ్మున న్నిలను । నిద్రిల లక్ష్మణుతోడ నిన్ను నై
రావణుఁ డప్పు డాత్మనగ।రమ్మునఁ గాఱియఁ బెట్టువేళ మై
రావణుతోడ వాని సమ।రమ్మునఁ జంప కుపేక్ష సేసినా
వేవిధి కర్థ మేమి? జగ।దేకధనుర్ధర! చెప్పవే యనన్. 299

సీ. రాముఁడు నవ్వుచు । రాక్షసేశ్వర! విన్ము, బ్రహ్మ మారుతిచేత । భ్రమరవధము
నిర్ణయించెను గాన । నే నుపేక్షించితి, వాయుసంభవయశః।ప్రాప్తికొఱకు
రాక్షసనీతుల । రామలక్ష్మణులను, విడిపించెఁ గరువలి।కొడుకటంచుఁ
బ్రజ లీతని నుతింప । భక్తుఁడౌ నీతని, సేమంబునకు నిట్లు । చేసినాఁడ

తే. నటులు కాకున్న రక్కసులనఁగ నెంత?,పొరఁగడ తేర్పనోకొక్కొ? హుంకారమున నె
కాకనేత్రంబుఁ గొననె యిషీకమునను, నుదధిఁ గూల్పనె? మారీచు । నొక్కకోల.

తే. శస్త్రములు లేక వారలఁ । జంపలేక, కాదు మారుతికై యుపేక్షకుఁడనైతి
ననిన రాముని పల్కుఁ దా । నాలకించి, పలికె సామీరి రాక్షసప్రవరుఁ డ. 301

వ. రాక్షసేంద్రా! మఱచితివా? సేతునిర్మాణకాలమున గర్వితుండ నగుననుఁ గని లింగోద్ధరణవ్యాజమ్మున మత్పుచ్ఛచ్ఛేదనం బగున ట్లొనర్చె నట్టినిరుపమానభుజాబలవిరాజమానుండగు నీదశరథసూనునిచెంత నాబల మన నెంత? యీమనుజసింహునకు మశకప్రాయులగు నారక్కసుల నుక్కడంచుట యక్కజంబే? దాసుఁడ నగు నా కట్టికీర్తి జనింపఁజేసెఁ గాని యన్యంబు గాదన విభీషణుండు నతిభక్తి రఘుపతికి నతి నొనర్చె నంత. 302

ఉ. జానకి పల్కె నీత్రిజట । సాధుచరిత్ర కృపాఢ్య రాఘవా!
దీనికిఁ గోర్కె లిమ్మనఁగ । దేవికి మోద మెలర్ప రాముఁ డు
దానవి! నామొసంగు వివిధంబుల హారదుకూలభూషల
న్మానుగఁ దాల్చి నాపలుకు । మాటల భక్తిగ నాలకింపుమా. 303

వ. కార్తిక మాఘ చైత్ర వైశాఖమాసమ్ముల నాదిని ద్రిదినంబులందు భవత్ప్రీతికై యెవ్వరు స్నాన మొనర్తు రాస్నానఫలమ్మునఁ గృతకృత్యా వగుదువు. మఱియుఁ దన్మాసమ్ముల నెవ్వ రటులు స్నాన మొనర్పకుందురో వారల సంపూర్ణమాసస్నానఫలం బొందెదవు. మఱియొకవరము వినుము. శుచిలేని గృహమ్ముల శ్రాద్ధాదికర్మకాలమ్ములఁ బుత్రాదులు క్రోధలోభాదులతో నిచ్చుహవ్యకవ్యములు దేవపితృవర్గముం జెందక నీకు భోజ్యంబు లగు నవభ్యంగపాదశౌచమును దిలహీనతర్పణంబు నదక్షిణాకమ్మును నగు శ్రాద్ధము నిన్నుఁ జెందుఁగాక యని త్రిజటకు వరము లిచ్చి తత్త్రిజటాసరమాన్వితుఁడై విభీషణసుగ్రీవమకరధ్వజహనుమదాదులతో విమానారూఢుఁడై గగనమార్గమ్మున నేగుచు సీతకుఁ దత్రత్యవిశేషమ్ములఁ జూపుచు రాముం డిట్లనియె. 304

## రాముఁ డయోధ్య కేగుట

సీ. అదె లంక గనుఁగొను । మదె రణస్థలి యదె, శిలలచేఁ గట్టిన । సేతు వదియె
అదె సేతుబంధాఖ్య । నమరుతీర్థ మటంచు, సతికిఁ జూపుచు విభీషణునికోర్కిఁ

బుష్పకం బట నిల్పి ✽ భూస్థలిఁ దా నిల్చి, ధనురగ్రమున సేతుసవును హరించె
నాఁటనుండియు ధనుష్కోటినా బరఁగెడు, నట మున్గుచో మోక్ష ✽ మగును జుమ్మి
తే. యచట రాముఁడు కోదండ ✽ మవధరించి, ప్రబలెఁ గావునఁ గోదండపాణి నాఁగ
నాశ్రితావనఘనబిరుదాంకుఁ డగుచు, నమరియుండును నిచ్చలు ✽ నద్రితనయ !
తే. అంత సంపాతి యచటికి ✽ నరుగుదేర, రాముఁ డాతని మన్నించి ✽ ప్రేమమలరఁ
దీర్ఘ మొక్కటి నీవు విశోధింపు మన్న, నతఁడుఁ దీర్థంబుఁ గల్పించె ✽ ననుజుపేర.
వ. పిదప సంపాతియు రామాజ్ఞఁ గొని పుష్పకారూఢుఁడై యుండ విమానముతోఁ
జనుచు రామేశ్వరంబుఁ జేరి సీతతో రాముం డిట్లనియె. 307
సీ. అదె మేము మంత్రార్థ ✽ మధివసించినభూమి, యది దర్భశయన మల్లదియెచూడు
మర్కాద్రిగహ్వరరూప ✽ మగుశిలానవకంబు, నీరవార్ణవ మదె ✽ నీరజాక్షి !
యనునంతఁ గిష్కింధ ✽ కరిగినపుష్పకం, బట నిల్పి తారారుమాదిసతుల
సీత కానందంబుఁ ✽ జేకూర్పఁగా రామ, విభుఁడు పిల్పించి సుప్రేమ మలర
తే. నవ్విమానమునం దుంచి యచటుఁగదలి, యేగుచును జానకిని గాంచి యిట్టులనియె
నదె ప్రవర్షణబుఋశ్యమూకాద్రియుగము, నింపు గలిగెడు చూడు మా పంప నీవు.
వ. అయ్యవియె కృష్ణాభీమరథీనదు లయ్యది గోదావరీతటఘటితపంచవటి యదె యగ
స్త్యాశ్రమం బదె సుతీక్ష్ణాశ్రమం బల్లది యత్ర్యాశ్రమం బదియె చిత్రకూట మదియె
కాళింది యల్లదె జాహ్నవి యిదియె భరద్వాజాశ్రమం బని సీత కావిశేషంబులఁ
జూపుచు విమానముతోఁ బుడమికి డిగ్గి సపరివారమ్ముగా రామచంద్రుండు
భరద్వాజాశ్రమంబుఁ జేరిన నామహాని రామాగమనమ్ము విని భూలోకస్వర్గముగా
నొనర్చిన తనయాశ్రమమ్ములోనికి సపరివారమ్ముగా రాము రప్పించి యర్ఘ్యపాద్య
భోజనాదులఁ దృప్తుఁ గావించె; నిట్లు రామచంద్రుండుఁ బదునాల్గువత్సరంబులకు
నంతిమదినసం బగు మాఘశుక్లచతుర్థిని దదాశ్రమమ్ముఁ జేరియుండి మారుతిం
గాంచి యిట్లనియె. 309
సీ. సామీరి ! వేగమే ✽ సాకేతమున కేగి, భరతునిఁ బొడగాంచి ✽ వననివాస
మాదిగా వైరిసంహారాంత మగు నాదు,కథను జెప్పుము యథాతథము గాఁగ
శృంగిబేరమున నా ✽ చెల్మికాఁడగు గుహుఁ, జేరి మద్గాథలఁ ✽ జెప్పు మనఁగ
హనుమంతుఁడును నిషాదాధీశుతో మున్నె, నుడువ నాతఁడు రాముకడకుఁ జేరె
తే. నచట విడనాడి యనిలజుఁ ✽ డరుగునంత, భరతుఁ డానాఁడు రామసంప్రాప్తి లేమి
నగ్నిఁ జేరెడు దృఢనిశ్చయంబుతోడ, సోదరుండగు శత్రుఘ్నుఁ ✽ జూచి యనియె.

## భరతుఁడు విలపించుట

తే. రామలక్ష్మణు లేలొకో ? రారు కలను, నందు మ్రందిరో ? పిల్చితి నఖిలనృపుల
నాతనికి సాయపడి నేగు నాశ ననుజ !, కడచెఁ బదునాలుగేఁడుల కాల మెల్ల.

ఉ. ఆనయశాలి రామి ననుజా ! యిఁకఁ బ్రాణముఁ దాల్ప నేల ? యీ
భానుఁడు గ్రుంకునంత కిట భ్రాతలఁ జూడఁగ వేచియుండి వై
శ్వానరుఁ జేరి నాప్రతిన సాంగముఁ జేయఁగఁ జచ్చువాఁడ నా
దానవనాథునిం దునుమఁ దత్పురి కేగుము నీవు తమ్ముఁడా ! 312

ఉ. దానవుఁ జంపి సీతను ముదమ్మున ముక్తఁగఁ జేసి రాముఁ డా
మానుజు లేనునుం బిదప నౌర్ధ్వశరీరసుఖంబు నొందఁగా
మానుగఁ గర్మముల్ సలుపుమా ! యనుమాటకు నెల్లతల్లులు
న్మానవనాథపౌరమునిమంత్రిభటాదులు దుఃఖ మొందఁగన్. 313

చం. భరతుఁడుఁ జుట్టువారుపరివారముఁ జూచి యనూనయించి, తా
సరయువుఁ జేరి స్నాతుఁ డయి సంయమిసంతతి కెల్ల దానముల్
సరగున నిచ్చి వచ్చి చితిసన్నిధి నేఁడు ప్రదక్షిణమ్ము లా
దరమునఁ జేసి జానకిని దాశరథి న్మది సంస్మరించుచున్. 314

ఉ. మాతల బావతుం గురుల పూనుల విప్రుల మ్రొక్కి దేవతా
ప్రీతిగఁ బూజ సల్పియుఁ గుబేరదిశాభిముఖత్వ మొంది యు
ద్ధ్యాతరఘూత్తమాంఘ్రియుగతోయజభక్తిపరీతుఁడై తదీ
యాతతదర్శనార్థవిహితాదరుఁడై కడు వేచియుండఁగాన్. 315

తే. అట్లు భరతుండు పూనుసాహసమువలన, పురజనాక్రందనము మిన్నుముట్టుచుండు
నంత నంబరవాసియాననుమ చూచి, మధురముగఁ బల్కె జనమనోవ్యథ లడంగ.

కం. నిరతానందమయాత్మక !, వరతాపసవేష ! రామపదభజనరతా !
నరతాదరణా ! యశోలా, భరతా ! విషయప్రవృత్త్యపరతా ! భరతా ! 317

ఉ. ఓరఘునందనా ! నిభృతయోగవినిశ్చలచిత్తపద్మ ! యీ
ఘోరము మానుమయ్య ! చితిఁ గూలకుమయ్య ! ధరాతనూజతో
వైరుల సంహరించి జయభాసురుఁడై తరుచారిపాళితో
శ్రీరఘురామచంద్రుఁ డిదె చేరెఁ బ్రయాగకుఁ గైకయీసుతా ! 318

ఉ. చూచెద వెల్లి రాము నినుఁ । జూచెదు వేడుక నుండు నన్న శా
ఖాచర శేఖరోక్తశుభ।కౌతుకదాయకవాక్సుధాఝురీ
సేచన మొంది తృప్తుఁ డయి । చిచ్చునకు న్నతి సల్పి మారుతిం
జూచి కవుంగిలించె మదిఁ । జొక్కుచు నాభరతుండు ప్రేముడిన్. 319

కం. కరువలిపట్టి రఘూత్తము, చరితం బాభరతునకును । సాంగముగా వి
స్తరతం జెప్పిన విని లోఁ, బరమానందంబుఁ జెంది । భరతుండు వెసన్. 320

చం. పురము నలంకరింపుఁ డని । మోదముతో నియమించి పట్టపుం
గరిపయిఁ బాదుక ల్నిలిపి । కౌతుక మొప్ప మహోత్సవమ్ముతోఁ
బురజనమంత్రివర్గమును । భూసురులుం జనుదేర నేగి యం
బరమునఁ గాంచెఁ బుష్పకవి।మానము భానువిభాసమానమున్. 321

తే. పంచదశవత్సరాదిఁ ప్రభాతమందు, మాఘసితపంచమిని దద్వి।మానమునను
రాముఁగని మ్రొక్కె భరతుఁడా । రాముఁడంత, భరతు నాలింగనమొనర్చి । ప్రమదమొందె.

ఉ. ఉల్లము రంజిలం బురజ।నౌఘము నందఱి కన్ని రూపులన్
సల్లలితంపుఁగౌఁగిళుల । సాగిలి మ్రొక్కుల మేలిమాటలం
దల్లుల మానులన్ సఖులఁ । దక్కినవారల నెల్ల బాపురే!
పిల్లలనైన వీడకయె । ప్రీతులఁ జేసెను రాముఁ డత్తఱిన్. 323

వ. ఇట్లు రామబ్రహ్మ మొక్కఁడైనను బహురూపి యగుట వింత నొంది సకలజనములు చూచి యానందించుచుండ రామచంద్రుండును మాతృవందనపూర్వకమ్ముగా వసిష్ఠాదులకు నమస్కరించిన సీతయుఁ గౌసల్యాదిశ్వశ్రూజనంబునకు నరుంధతీముఖతాపసపురంధ్రీజనంబునకును సాగిలి మ్రొక్కిన లేవనెత్తి వారలు సీత నాలింగనం బొనర్చి యానందబాష్పసలిలసిక్తదేహఁ గావించి రంత భరతప్రార్థనమ్మున రాముఁడు సానుజుండై శ్మశ్రుకర్తనపూర్వకమ్ముగా నభ్యంగనస్నానం బొనర్చి దివ్యాంబరాలంకారహారపరిశోభితగాత్రుండై నందిగ్రామమున వసిష్ఠాదిమాన్యజనమ్ముతోఁ బేరోలగం బున్నంతఁ గౌసల్యాదులు సీత నభ్యంగనాలంకారదివ్యాంబరాదుల నలంకరించిన నాసీతారాములు లక్ష్మీనారాయణుల ట్లతిమనోహరదివ్యమంగళవిగ్రహదిదృక్షుజనానందదాయకులై యున్న రామపాదుకలం దలఁ దాల్చి కొంపోయి రామపాదమ్ములకుఁ దొడిగి వినయావనతుండై కేలు జోడించి యాదలఁ గీలించి సకలజనంబులు వినుచుండ భరతుం డిట్లనియె. 324

ఉ. భాసురతేజ! రామ! ముని | పావనతావకపాదుకాద్వయి
న్యాసముగా సమస్తభువ|నాధిపతిత్వ మొసంగి తీవు నీ
దాసుఁడ నీకుమారుగనె | తాల్చుచు నేలితి గోష్ఠముఖ్యముల్
చేసితి నేఁటి కంద అను|సించుగతిం బదిరెట్లు రాఘవా!. 325

ఉ. కావున నీదురాజ్యరమఁ | గౌతుక మొప్ప గ్రహించి నిచ్చలు
న్నీ విఁకఁ బ్రేమ నేలు మవ|నీసుతతో నన రాఘవుండు త
ద్భావము నెంచి సంతసిలె | బాపురె! యంచు జనాళి మెచ్చఁ దా
సేవకురీతిఁ జెంత నివ|సించెఁ గడు న్భరతుండు నమ్రుఁడై. 326

ఉ. అంతట వాద్యఘోషము జ|య్యారవ మొప్పఁగ వారకామినుల్
వింతగ నాట్యముల్ సలుప | భేరులు మ్రోయఁగ వందిమాగధుల్
చెంత జయార్థము ల్పలుక | శ్రీరఘురాముఁడు సీతతో రథా
భ్యంతరవాసియై చనియె | నాత్మపురమ్మున కెల్లవారితోన్. 327

మ. పురనారుల్ నిజసౌధపాళులను గ|ర్పూరాదినీరాజనా
దరపాత్రీకరలై వసించియు సుగం|ధప్రాజ్యపుష్పాళిఁ బైఁ
గురియింపం జని తేరు డిగ్గి పనిచె | క్షోణీజ నంతఃపురి
న్మఱి సీతేశుఁడు పుష్పకంబుఁ గని యు|మ్మాడిక న్వచించెం గృపన్. 328

తే. ఓవిమానవరంబ! నీ | కొడయఁడైన, ధనదుకడ కేగు మతఁడు మో|దంబు నొంద
ననఁగ రామునియాజ్ఞ న|య్యాన మపుడె, యంబరంబున కెగిరి యా|యలకఁ జేరె.

## శ్రీరామపట్టాభిషేకము

తే. అఖిలకపులను విడిదల|యందు నునిచి, శ్రీరఘుస్వామి చెలఁగి వ|సిష్ఠునాజ్ఞ
సీతతోఁ గూడి పట్టాభి|షేకమునకు, భద్రపీఠంబుఁ జేరెను | ప్రాఙ్ముఖముగ. 330

మ. చతురంభోనిధిజాహ్నవీముఖసమ|స్తప్రాజ్యధున్యంబువుల్
ద్రుతగాముల్ విపినౌకసు ల్గొనుచు సా|ధుస్వాంతులై తెచ్చినన్
శ్రుతివాఙ్నాదము మీఱఁ దజ్జలము సం|శుద్ధిం దగం గూర్చి మం
త్రతతిన్ స్నాతులఁ జేసె నొజ్జ యట సీ|తారాములం బ్రేముడిన్. 331

సీ. ఆరాము సింహాస|నాసీనుఁగాఁ జేసి, ఛత్రంబుఁ బట్టె ల|క్ష్మణుఁడు వెన్క
భరతశత్రుఘ్నులు | వాలవ్యజనపాణు,లై పార్శ్వములఁ గొల్చి | రతిముదమునఁ

బాదుక ల్దలఁ దాల్చి వాయుజాతుఁడు మ్రోల,వసియించె భక్తిసంభరితుఁ డగుచు
వానరరాజు జంబుసపాత్రంబుఁ గొనె విభీషణుఁ డొక విమలదర్పణముఁ బట్టె
తే. తమలపాకులపెట్టెను దాల్చె వాలి,జాతుఁ డంబరకోశంబు జాంబవంతుఁ
డట్లు తాలిచె సర్వదిశాంతరముల, నిలిచి యానందవినయముల్ నెగడ మిగుల.
తే. పట్టుపరుపులు తలగడ ల్బఱచియున్న, సింహపీఠాంతరమ్మున సీతతోడ
రామచంద్రుఁడు వైరివిరాముఁ డమల, ధాముఁ డిట్టులు పట్టాభిరాముఁ డయ్యె.
వ. మఱియు సౌమిత్రిభరతశత్రుఘ్నహనుమంతులకు దాపలవైపుల సంపాతిగుహామక
రధ్వజగరుడులును, సుగ్రీవవిభీషణాంగదజాంబవంతులకు దాపలవైపులఁ జిత్రరథవిజ
యసుమంత్రదారుకులును నివసించి రాజోపకరణపాణులై రామసేవాపరాయణులై
యుండిరి. మఱియు నోపార్వతీ! నేనును దేవతలును యక్షగంధర్వకిన్నరులును
గామరూపమ్ముల నోషధిపర్వతవృక్షసాగరనదులు నేతెంచి రాము సేవించుచుండ
జేజేలు సీతారాములపై విరులవాన గురిసిరి. సురనాయకుండు రామభక్తినిరతుండై
ఉ. కాంచనదివ్యరత్నమణిఖండవినిర్మితమై రవిప్రభో
దంచితమైన మాలను సదాగతిచేతను గాన్కగా వడిం
బంచెను దేవదుందుభిరవంబులు మీఱ సురాంగనావళుల్
మించులరీతిగాఁ దళుకు మేనులడా ల్దనర న్నటింపఁగన్. 335
వ. ఇట్లు రామచంద్రపట్టాభిషేకమహోత్సవదిదృక్షాసమాగతులనెల్ల భరతుండు గౌర
వించుచుండ నేనును భరతునిచే సపర్యల నంది శ్రీరాముఁడు పరంధాముఁ డని
యెంచి భక్తిపరవశుండనై శ్రీరామనామపరబ్రహ్మంబు నిట్లు స్తుతియించితి వినుము.

## రామగీతాష్టకము

తే. మిత్రసుతమిత్రుఁ బరమపవిత్రగోత్రు, జానకీసుకళత్రు సజ్జలదగాత్రు
వరదయాపాత్రు నరవిందపత్రనేత్రు, రామచంద్రునిఁ గొల్తు నిరంతరంబు. 337
తే. సకలభవసారు నౌపనిషత్ప్రచారు, ధార్మికవతారుఁ బరిహృతధరణిభారు
జితవికారు సుభావళిసింధుసారు, రామచంద్రునిఁ గొల్తు నిరంతరంబు. 338
తే. కలితలక్ష్మీనివాసు జగన్నివాసు, క్షయితలంకానివాసు జగద్విలాసు
బాడబనివాసు శరదిందుభాసిహాసు, రామచంద్రునిఁ గొల్తు నిరంతరంబు. 339
తే. కంఠమందారమాలు వాగ్రసరసాలు, సద్గుణవిశాలు ఖండితసప్తతాలు
రాత్రిచరకాలు నమృతభుగ్రాజిపాలు, రామచంద్రునిఁ గొల్తు నిరంతరంబు. 340

తే. శ్రుతిశిరోగీతవైభవాంచితనిధాను, దళితరిపుమాను వరసుధాంధఃప్రధాను
హస్తివరయాను యోగజితావసాను, రామచంద్రుని గొల్తు నిరంతరంబు. 341

తే. అసితఘనధాము సకలనేత్రాభిరాము, నతులగుణసీము మధురవాచాభిరాము
ప్రాజ్యసర్వప్రణామము సత్రాప్యకాము, రామచంద్రుని గొల్తు నిరంతరంబు.

తే. రాజలీలాశరీరు సత్రప్రధనధీరు, విశ్వసారుని భూతలవిహృతభారు
విజితసర్వవిచారు గంభీరు వీరు, రామచంద్రుని గొల్తు నిరంతరంబు. 343

తే. ఖలతరణిజాతు సుజనరక్షావినీతు, సాంగపరిగీతు మునిమానసప్రతీతు
భక్తిరాగోపగీతుని వాగతీతు, రామచంద్రుని గొల్తు నిరంతరంబు. 344

చం. అని మది భక్తి రామవిభు నంతికమం దలనాఁడు నాతని
న్వినుతి నొనర్ప గీతముల నే నిటు లష్టకము రచించితిన్
ఘనతరభక్తి దీనిని ద్రికాలమున న్బఠియించునట్టివా
రనితరలభ్యకామముల నంది సుఖింతురు రామసత్కృపన్. 345

తే. అనుచు రాము నుతించి సభాంతరమున, నే వసింపఁగ దశరథుఁ డేగుదెంచి
దేవయానంబునం దుండి దివిజయుక్తి, జానకీరాములను గాంచి సంతసించె.

వ. పట్టాభిషిక్తసీతారామదర్శనానందపులకితాంగుఁడై దశరథుం డారామచంద్రునితో
నిట్లనియె. 347

గీ. నేను ధన్యుఁడ నీజననీత్రయంబు, ధన్య మీయర్కకులమెల్ల ధన్య మఖిల
ప్రజలుఁ గడుధన్యు లీరాజ్యపదమునందుఁ, జిరమునకు నీవు సుప్రతిష్ఠితుఁడవగుట.

తే. అనినఁ దండ్రికి వందన మాచరించెఁ, గోసలాత్మజ మున్నగు కోమలాంగు
లఖిలపౌరులు భరతాదు లైనసుతులు, మంత్రులును మ్రొక్కి రాజికి మహితభక్తి.

ఉ. వారల వేఱువేఱుగ శుభస్థితిఁ బ్రశ్న మొనర్చి దేవతా
వారముతోడ రామునిసపర్యలఁ జెందియు నన్నుఁ గూడి యిం
పారఁగ నాజి వేగ సురయానముతో దివిఁ జేరె నేనున్
శ్రీరఘురామునాజ్ఞఁ గొని ప్రీతమనస్కుఁడ నౌచు వచ్చితిన్. 350

సీ. శ్రీరామచంద్రుండు క్షితిఁ బాలన మొనర్ప, వసుమతి సస్యసంపన్న యయ్యె
సర్వలోకస్థులు సౌఖ్యంబు జెందిరి, గంధహీనసుమాళి గంధ మొందె
ఫలహీనతరువులు ఫలములఁ జెందెను, సకలజీవావళి సౌఖ్య మొందె
నీతిభీత్యరిచోరభీతిదుర్ణీతులు, గితవాదిదుష్కృతిమతులు లేరు

తే. బాలమృతి లేదు వైధవ్యబాధ లెఱుఁగ, రంగనలు క్షామబాధ లెఱుంగ రెల్ల
రాజ్యజను లౌర! రాఘవప్రాభవంబు, రమ్యశుభగాత్రి! యోగిరిరాజపుత్రి!

## రాముఁడు సుగ్రీవాదుల బహూకరించుట

ఉ. రాముఁడు లక్షగోవుల విరాజితగోవృషరాట్సుతంబునన్
భూమదహస్తివాజిరథభూషణచేలసువర్ణరత్నముల్
క్ష్మామరపాళి కిచ్చి మణిమంజులహారము సూర్యసూతికిన్
భూమశిరోమణిన్ దనుజభూపతి కిచ్చెను బ్రేమ మొప్పఁగన్. 352

ఉ. అంగదు నంగదమ్ములఁ బ్రహర్షితుఁ జేసి సమున్నతప్రభా
భంగురరత్ననిర్మితము వాయుసమర్పిత మైనమాల సీ
తాంగనచేతి కీయఁ బ్రమదాన్విత యామె పతీంగితజ్ఞయై
చెంగటనున్న వాయుజునిచేతి కొసంగెను దాని నంతటన్. 353

ఉ. మారుతి తన్మణీరుచిరమాలికఁ దాలిచి తత్ప్రభాస్థలిన్
శారదనీరదావృతవిశాలసురాలయమట్లు రాజిలెన్
శ్రీరఘురాముఁ డాసుగుణసింధువు ప్రాణసమానబంధువౌ
మారుతితో సుధామధురమంజులవైఖరిఁ బల్కె నీగతిన్. 354

వ. ఓమరున్నందనా! నీవలన మే మపరిమితానందకందళితహృదయారవిందుల మైతిమి కావున నీయెడఁ బ్రసన్నుండ నైయుంటి నీ కిష్టం బెయ్యదియో కోరు మిచ్చెద నన సంతసమ్మునఁ జెన్నారి దరిఁ జేరి సామీరి యిట్లనియె. 355

సీ. నీనామ మెప్పుడు నేమమ్ముతో మది, సంస్మరించినఁ దృప్తి సనదు మనము
గాన నీనామ మీక్ష్మాతలమ్మున నెంత, కాల ముండునో యంతకాల మేను
జీవించునట్లుగాఁ జేసితేని మహాత్మ!, రామ! నీతారకనామ మెపుడు
సంస్మరించుచు భూమి సంచరించెదు వేడ్క, కలదు గావునఁ గృపాకలితుఁడ వయి

తే. వరము దయసేయు మరవిందపత్రనేత్ర!, వరదయాక్షేత్ర! నవవారివాహగాత్ర!
యార్యహృత్పద్మమిత్ర! యో యాజిపుత్ర!, తతవిచిత్రచరిత్ర! సీతాకళత్ర!

ఉ. ఎక్కడ నీయశోవిభవ మింపుమెయిన్ వినిపించుచుండు, నే
నక్కడ నిల్చునట్టులు సురాలయతీర్థనదీతటంబులం
దక్కినసర్వభూములను ద్వత్కథ షడ్ఘటికావిరామమున్
జిక్కక యుండునట్టులు ప్రసాదమున న్వర మిమ్ము రాఘవా! 357

ఉ. మారుతివాక్యముల్ విని యమందకృపామతి నాదరించి యా
శ్రీరఘురాముఁ డంతఁ గపిశేఖర! ముక్తి లభించె నీకు, నీ
ధారుణి క్రుంగువేళ ననుఁ దప్పక చేరెద వంతదనుక మ
త్తారకమంత్రరాజజపతత్పరతన్ వసియింపు మిచ్చటన్. 358

వ. అనినఁ బిదప సీత వాయునందనునిపై దయ నొంది యను నోమరున్నందనా! నీ వెచ్చట వసియింతు వచ్చట మదాజ్ఞానుసారమ్ముగా సకలభోగమ్ములు నిన్నుఁ జెందెడు. మఱియు గ్రామారామపత్తనవ్రజఖేటసద్మవనదుర్గపర్వతసర్వగీర్వాణాలయనదీక్షేత్ర పుణ్యతీర్థజలాశయ యజ్ఞవాటోపవనాశ్వత్థవట బృందావనాదులందు సకలజనంబు లపమృత్యుహారణంబునకును భూతప్రేతపిశాచరాక్షసశాకినీడాకినీ కూశ్మాండబాలగ్రహాదిపీడాహరణంబునకును, ద్వన్మూర్తి నారాధించుచు నీనామమును సంస్మరింతురుగావుత మని వరంబు లిడిన రాముఁ డనుమతించె నంతఁ దక్కంగల సుగ్రీవవిభీషణమకరధ్వజసంపాతిగుహాదులను వివిధదేశాగతసామంతబంధురాజ సముదయంబులను వివిధాంబరాభరణాదుల సత్కరించి యలరించి యారామ చంద్రుండును. 359

ఉ. జానకితో సమస్తకపిసంఘముతో భుజియింపనుండి తాఁ
బ్రాణముఖాహుతుల్ సలిపినంతటఁ జెంతఁ ద్రిపాదపీఠిపైఁ
గానఁగనైన పళ్లెరముఁ గౌతుక మొప్ప మరుత్సుతుండు కై
బూని పవిత్రరామవిభుభోజనశిష్ట మటంచు భక్తితోన్. 360

ఉ. తా నపు డారగించుచును దక్కినవారలకున్ ధరాత్మజా
జాని ప్రసాదమం చిడిన సంతస మొంది నిజాన్నపాత్రముల్
మాని విభీషణాదులు సమంజసభక్తి భుజించి యోజగ
త్ప్రాణజ! మేలు చేసితి సెబా సని సంతస మొంది రాత్మలన్. 361

ఉ. ఓహరిసాహరిన్ రఘువరోత్తమభోజనశిష్టలబ్ధికై
యోహనుమంత! పెట్టు మని యొక్కొకఁ డిట్టులె యార్వఁ బెచ్చుకో
లాహల మయ్యె రాముఁడు సిలాజయు సుస్మితవక్త్రు లౌచు న
న్యాహృతభోజ్యముల్ గొని రనంతకుతూహలతృప్తచిత్తులై. 362

తే. ఇట్లు కౌతుక మేపాఱ నెల్లకపులు, సత్కృపామూర్తియౌ రామచంద్రునింటఁ
బెండ్లివా రన భోజనప్రీతు లగుచుఁ, గతిపయదినంబు లుండి యుత్కంఠతోడ.

సీ. ఇంతలోఁ బుష్పకం బేతెంచి శ్రీరాముఁ, గాంచి యిట్లనె భక్తికలిత మగుచు
ధనదుఁ డిట్లనె నన్నుఁ గని పుష్పకంబ! మా, యన్న నిన్గొనె మున్ను నన్ను గెల్చి
రావణుం బోలియింప రాముని సొత్తైతి, శ్రీరాముపురిని వసింపు మతఁడు
వైకుంఠపురికి నేపట్టున నేగునో?, యపుడె రమ్మిచటికి నంతదనుక

తే. రామచంద్రు వహింపుచు రామునాజ్ఞ, నధివసింపుము నీ వయోధ్యాపురంబు
నినఁగ విని వచ్చితిని రామ! నిను భజింప, నీదుభజనంబు మోక్షసంపాదిగాదె?

చం. అన విని రామచంద్రుఁడు మహాముద మంది యను న్విమానమా!
వననిలయేశముఖ్యుల జవమ్మున వారలతావుఁ జేర్చి ర
మ్మనఁగ విమానముం బటురయంబున వారి గృహాళిఁ జేర్చి యా
యినకులచంద్రునాజ్ఞ వసియించెను దన్నగరాంతికమ్మునన్. 365

సీ. రామాజ్ఞఁ గొని యేగి రాక్షసేశుఁడు లంకఁ, బాలించె ధార్మికపద్ధతిగను
బాతాళరాజ్యంబుఁ బాలించె సుగుణియై, మకరధ్వజుండు ధర్మమ్ముతోడఁ
బన్నగాశనుఁడు సంపాతిని యువరాజు,గాఁ జేసి తా రాజగతి వహించెఁ
గిష్కింధఁ బాలించెఁ గీశరాట్టు గుహుండు, రాజయ్యె శృంగిబేరంబునందు

తే. అనుమ రాముని మ్రొక్కి హిమాద్రి కేగెఁ, దప మొనర్పఁగ నిటు లేగి దానవేశుఁ
డినసుతాదులు బంచదినము లుండు, రప్పు డప్పు డయోధ్యకు నరుగుదెంచి.

శా. యాతాయాతము లొందుచుం గపు లయోధ్యాపాలకుండైన యా
సీతేశుం భజియించుచుండఁగ జగత్క్షేమంకరప్రక్రియన్
జాతానందయుతాప్తభూమిదివిషత్సామంతసంస్తుత్యవి
ఖ్యాతుండై ధర నేలె రామవిభుఁ డుద్యద్బాహుశక్త్యున్నతిన్. 367

తే. ఒప్పకుండిన సౌమిత్రి నుంచె యౌవ,రాజ్యమునయందుఁ బదపడి రామచంద్రుఁ
డవని నెల్లరు రంజిలునట్టు లేలెఁ, దనదురాజాఖ్య సార్థకత్వంబు నొంద. 368

ఉ. రాజస మింత లేక యువరాజుగ నుండినలక్ష్మణుండు వి
భ్రాజితతేజు రామవిభుఁ బంకజలోచనుఁ డంచు నమ్మి యు
ర్వీజను లక్ష్మిగాఁ దలఁచి విశ్రుతభక్తి భజించుచుండె న
య్యాజితనూజమైత్రిఁ గొనియాడఁ దరంబె గిరీంద్రనందినీ! 369

## శ్రీరాముని రణయజ్ఞ వర్ణనము

వ. శ్రీరామచంద్రుండు మున్ను కౌశికయజ్ఞమ్మునం బ్రారంభించిన రణయజ్ఞంబు తిరిగి యయోధ్యకుం జేరునాటికి సంపూర్తి నొనరించె నట్టిరణయజ్ఞంబు వర్ణించెద వినుము. రణరంగమే యజ్ఞకుండము, కాందిశీకత్వాభావమే వేదమార్గాశ్రయము, శరశస్త్రఖణఖణనాదమే వేదశాస్త్రఖణనాదము, శరశాణకషణమే స్రుక్స్రువసంమార్జనము, భూప్రసారితశరంబులే పరిస్తరణములు, రణధీరత్వమే పరిసమూహనము, రోషంబే పావకుండు, బాణఖండితభూపతితమాంసఖండములే స్రువహుతహవిఃపదార్థములు, రక్తధారలే వసోర్ధారలు, భయంకరహాహాకారమే యోంకారస్వాహాస్వధావషట్కారఘోషంబు, సముత్తేజితశస్త్రకాంతులే యగ్నిజ్వాలలు, స్వేదస్రావమే ధూమవ్యాప్తి, వీరహస్తచ్యుతసాయకసమూహమే ప్రవృద్ధాగ్నిజ్వాలాశాంత్యర్థపృషదాజ్యసేచనంబు, జ్ఞానదత్తజీవబలిదానమే దీపబలిదానము, దేహాభిమానప్రాణసంరక్షణాభిలాషికాందిశీకత్వమే బలిదీపహరణబలిభక్షణదోషాసంప్రాప్తముక్తులగు బలిదీపహరులు, శిరంబులే పూర్ణాహుతిద్రవ్యంబులు. జయార్థవీరకృతసవ్యోచ్చాటనమే ప్రదక్షిణము, నిజపదప్రదానమే దక్షిణ, సురసుమవృష్టియే బ్రాహ్మణాభిషేకము, జయమే యజ్ఞఫలప్రాప్తి, చరాచరానందమే నిజగోత్రజనసంతోషము, భూతతృప్తియే ద్విజసంతర్పణముగా సుబాహుపశుయజ్ఞమున రామసోమయాజి విశ్వామిత్రయాగసంరక్షణావభృథస్నాతుండైనను, తృప్తిం జెందక మహారణయజ్ఞాచరణకుతూహలియై రోషారణిమంథనసంజాతమహారోషాగ్నిం బ్రతిష్ఠించి, భూమిపాత్రమున విరాధసుధిరాజ్యమునం బాత్రప్రోక్షణ మాచరించి, ముఖాహుతికై శూర్పణఖాకర్ణనాసాచ్ఛేదనం బొనర్చి, పంచప్రాణాహుతులకై ఖరదూషణత్రిశిరోమారీచకబంధులం జంపి, శిఖాబంధముక్తికై శబరీభవబంధమోచనం బొనర్చి నేత్రజలస్పర్శనంబునకై వాలిం జంపి తద్రక్తం బిడి హవిఃపచనంబునకై లంకాదహన మ్మొనర్చి కుంభకర్ణౌదనం బింద్రజిత్పక్వాన్నము రాక్షససేనావ్యంజనమ్ము సారణశాల్యన్నము ప్రహస్తవటకంబు నికుంభపర్పటంబు కుంభలవణంబు కాలనేమిపాయసం బతికాయశర్కరయు నైరావణక్షీరము మైరావణాజ్యంబు యుద్ధాంతరావణసంహారదధ్యోదనమ్ముగా సత్పాత్రరోషకాలానలునకు నివేదించి హతరాక్షసకేశత్వక్కీకసాద్యుచ్ఛిష్టబలిత్యాగము నాత్మసంతోషరూపయాగవిసర్జనము లంకారణసవనశాలాపరిత్యాగమ్మున నయోధ్యాపురనదీతటప్రవేశ మ్మొనర్చి సామ్రాజ్యపట్టాభిషేకావభృథస్నాన మొనర్చి రామచంద్రుండు రాజ్యపాలనాది

మంగళకార్యాచరణుండై పరిత్యక్తరణుండై భక్తపూజితచరణుండై నిత్యనిరతిశయా
నందకారణుండై యుండె మఱియును. 370

సీ. శ్రీరామరణయజ్ఞ × చిత్రంబుఁ జెప్పితి, వింటివే? పార్వతీ! × విన్ము మఱియు
నాత్మ యైనను రాముఁ × డఖిలకార్యాధ్యక్షుఁ, డయ్యుఁ గర్తృత్వాదు × లందకున్న
నానందమునఁ దృప్తుఁ × డై లోకమునకెల్ల, ధర్మబోధ మొనర్చి × తనరి తాను
ధర్మకార్యవిధావి × ధానాదరుండునై, గార్హస్థ్యధర్మసం × కలితుఁ డగుచు

తే. నవనిఁ బాలించె సర్వరా × జ్యంబునందు, వ్యాధితస్కరవైధవ్య × పన్నగాది
బాధ లేమియు లేకుండఁ × బ్రజల నెల్లఁ, దండ్రిగతిఁ బ్రోచె శ్రీరామ × ధర్మమూర్తి.

తే. సీతతో బంధువులతోడఁ × జిత్త మలర, నిజపురమ్మున వసియించె × నిగమతుల్య
రామరణయజ్ఞశుభచరి × త్రంబు నీకు, భక్తి నుడివితి భూధర × వరకుమారి! 372

తే. ఒక్కదినమున బహుముని × యుక్తుఁ డగుచు, వచ్చెఁ గుంభజుఁ డారామ × భద్రుకడకు
భక్తి వినయంబులొప్పఁ ద × త్పాదములకు, మ్రొక్కి పూజించియాసన × మ్ములనొసంగి.

చం. ఘనమతి రాముఁ డిట్లనె స × గస్వ! మహామునివర్యులార! మీ
తనయులు శిష్యులున్ సుఖులె? × తాపసవృత్తి నిరంతరాయమై
యనువగు నొక్కొ? నేఁడు భవ × దాగతిచేత మదన్వయంబు బా
వనతఁ గొనె న్భవత్కృపను × వైరులఁ జంపి జయంబు నొందితిన్. 374

చం. అన విని మౌను లిట్టు లని × రార్యమతీ! ఘననాదముఖ్యదు
ర్దనుజులఁ జంపియుంట జయ × రాముఁడవై కృతకృత్యుఁ డైతి వీ
వనుపమలోకరక్షణప × రాయణుఁ డైతివి రామచంద్ర! నిన్
గని ముద మొంద వచ్చితి మ × ఖండయశోవిభవైకభూషణా! 375

ఉ. మౌనులమాటల న్విని క్ష × మాతనుజాధిపుఁ డిట్లను న్మహా
దానవు లుండ మేఘరవ × దానవు ము న్నిటు లెంచ నేల నా
మౌనులగ స్తినిం గనఁగ × మౌనివ రేంగితమున్ గ్రహించి య
న్యూనముదమ్మున న్ఘటజ × న్ముని రాముని తోడ నిట్లనెన్. 376

తే. ఉదయమాదిగ వరముల × నొంది పిదప, గోత్రభిజ్జేతయై సుర × కోటికెల్లఁ
బ్రక్కలో బల్లెమైన య × వ్వానిచరితఁ, దెల్పెదను విన్ము రాఘవా! × తెల్లముగను.

## రావణాదుల జన్మవృత్తాంతము

సీ. కృతయుగంబునను బంకజభూపుత్రుండు, నురుతపస్వియుఁ బులస్త్యుండు మున్ను
దృణబిందుసుతయందుఁ దేజస్వియగు విశ్రవోనామసుతుఁ గనె వాని కెలమి
నలభరద్వాజుని యాత్మజయందిలఁ, బొడమె వైశ్రవణాఖ్యుఁ బొల్చుసుతుఁడు
చతురాననుఁడును వైశ్రవణునిదపమున, కెద మెచ్చి యిచ్చె ధనేశపదవి

తే. పుష్పకంబు నొసంగె నాపుష్పకంబు, నెక్కి తండ్రిని గనఁ జెంత కేగి యతని
కెరఁగి యిట్లనెఁ దండ్రి! వాణీశ్వరుండు, నుండ నిమ్మెడఁ డీవు నా కొసఁగుమనిన.

చం. అన విని విశ్రవస్సనియె నట్లయిన న్మును విశ్వకర్మ గ
న్ననఁ బటువైభవమ్మున ఘనంబగు లంక యనం బురంబుఁ గ
ల్పన మొనరించె రాక్షసులు వాసము సేయఁగ దాని వీడియే
వనజదళాక్షభీతిసురవైరు లధోభువి కేగి రిమ్మగన్.

తే. కావునను బుత్ర! నీవు లంకాపురమ్ముఁ, గాఁపురమ్ముగఁ జేయుచుఁ గౌతుకమున
నుండుమా యన ధనపతి తండ్రియాన, నచట వసియించెఁ జిరకాల మాదరమున.

ఉ. అంతసుమాలి నా దనుజుఁ డాత్మజఁ గైకసి వెంటఁ గొంచు భూ
ప్రాంతమునందు నొక్కెడ ధనాధిపుఁ బుష్పకవాసుఁ గాంచి యా
స్వాంతరుఁడై సుతం గనుచు నాదృతిఁ బల్కెను విశ్రవోమునిం
గాంతునిగా వరింపు మికఁ గాంచెదు పుత్రుల శ్రీదతుల్యులన్. 381

వ. వాని వరించితేని తదీయతేజస్సంభూతులును నిరుపమానతేజోధనసంపన్నులై మాకు సాయపడుదురన విని కైకసి మదనమోహితయై సంధ్యాకాలమ్మున నత్తపసిమ్రోల నిల్చి ముగ్ధాలక్షణవిదగ్ధయై కాలియంగుటమ్మున నేల వ్రాయుచు నధోముఖయై యున్నం గాంచి విశ్రవసుం డిట్లనియె. 382

ఉ. ఎవ్వతె వీవు నీజనకుఁ డెవ్వఁడు పేరెవ రేల వచ్చితో
జవ్వని? యన్నఁ బ్రాజ్ఞులకు సర్వము గోచరమౌనుగాదె? మీ
కెవ్విధిఁ దెల్పుదాన గ్రహియింపుఁ డటన్నను విశ్రవుండు తా
నవ్వనితాభిలాషమును ధ్యానమునన్ గ్రహియించి యిట్లనెన్. 383

చం. తెలిసెను నీదుకోర్కి సుదతీ! సుతలబ్ధికి నన్నుఁ గూడఁగాఁ
దలఁచితి విట్టిసంజ ననుఁ దప్పక కూడితివేని బుత్రకుల్

ఖులు లుదయింతు రిద్దఱు ప్రకాశామబలుల్ దనుజాఢ్యులన్న నా
కలికి యనుం ద్వదాత్మజులు కర్బురు లౌట విచిత్ర మారయన్. 384

తే. అన నతం డనె మూఁడవతనయుఁ డొకఁడు, సత్త్వగుణశాలి సాధువై సంభవించు
ననఁగ నాతనిసంయోగ మంది యుక్త, కాలమున యందు సంతతిఁ గాంచె నామె.

వ. రావణకుంభకర్ణవిభీషణు లను మువ్వురఁ బుత్రులను, గ్రాంచీశూర్పణఖాకుంభీనస
లను మువ్వురఁ గూఁతుండ్రను గనియె నందు రావణకుంభకర్ణులును గ్రాంచీ
శూర్పణఖాకుంభీనసులును దారుణాకారచేష్టాయుతులై మునిజనహింసకు లైరి
మూఁడవయాతఁ డగు విభీషణుం డొక్కఁడు సత్త్వగుణప్రధానుండై యుండె
మఱియును. 386

సీ. అందు రావణుఁ డను నాతఁడు మాత్రాజ్ఞ, లింగంబుఁ గొన నీశు చెంగటికిని
జేరి యీశుని మోదచిత్తునిగాఁ జేయ, నాత్మశీర్షార్ధంబు నట్టె కోసి
వీణఁ జేయఁగ నెంచి వింతగాఁ దొడమీఁదఁ, దుంబంబుగాఁ దలతున్క నిల్పి
పాదంబులే యగ్రభాగంబుగాఁ జేసి, యంగుళు ల్మెట్లుగా నాచరించి

తే. ఆంత్రములఁ దీసి తంత్రులయ ట్లమర్చి, యట్లు తనకాయమే వీణయట్ల చేసి
షడ్జమధ్యమధైవతస్వరము లమర, నోటఁ బాడెను సరసంపుఁబాట లపుడు. 387

ఉ. నందినిఁ జూచి పల్కెను పినాకి ముదమ్మున వీనిశీర్షముఁ
ముందటిరీతిఁ గూర్చి యిటు పొల్పుగఁ దెల్పుము శైవలింగముం
జెందఁగ లేవు సుమ్ము శశిశేఖరుఁ డీయఁ డటంచు వేఁగ నీ
మందిరసీమఁ జేరు మనుమా! యను నట్టులు నంది తెల్పినన్. 388

ఉ. నాఁటికి మాని వాఁడు మఱునాఁడును బూర్వపురీతిఁ జెందియే
పాటలు బాడె నందియును బల్కెను బూర్వపురీతి వాఁడు ని
ప్పాటనె పాడుచుం బదిపవళ్లు వసింప హరుండు వానిదా
పాటకు మెచ్చి యోదనుజవల్లభ! కోరు మటంచుఁ బల్కుచున్. 389

చం. శిర మతుకంగ వాఁడు శశిశేఖరుఁ గాంచి వరంబుఁ గోరె నో
హర! భవదీయలింగ మిడు మమ్మకు, నాకును బత్ని గాఁగ నీ
గిరిజ నొసంగు మన్న నిడెఁ గృత్తివసానుఁడు రామచంద్ర! దు
శ్చరితు లకార్యకార్యసువిచారులె? దాత కదేయ ముండునే? 390

చం. ఇటు గొని యేగురావణున । కిట్లనె శంభుఁడు నీవు శీర్షముం
జటుకునఁ గోసికొంటి పది।సారులు గాన దశోత్తమాంగసం
ఘటనము బాహువింశతియుఁ । గల్గును నీ కన సంతసించి రా
త్ర్యటుఁ డుమతోడ లింగమును । నాదటఁ గైకొని యేగుచుండఁగాన్. 391

వ. ఓరామచంద్రా! యీసందర్భమునఁ గల్పభేదంబుచే శతవారంబుగా శిరచ్ఛేదనం బొనర్చె ననియు దానంజేసి శతశీర్షుండును ద్విశతబాహుండు నయ్యె నని కొంద అందురు. పదంపడి రావణుం డేగుచుండ నోరామా! విష్ణుండవగు నీవు ద్విజరూప మున మధ్యమార్గమున వాని మోసగించి పార్వతిని విడిపించి లింగముం జిరస్థా యిగానుండునటులు చేసి తిరోహితుండవైన నదియె గోకర్ణక్షేత్రం బయ్యె నిట్లు నిరాశుండై రావణుండు ద్విజరూపహరిప్రేరితుండై పాతాళముననున్న మయు పుత్రికయగు మందోదరిని వివాహంబై యింటికిఁ జని యలబ్ధమాతృకార్యుండై త్రపాన్వితుండై యుండునంత రావణమాతయగు కైకసి యొక్కనాఁడు. 392

మ. సురయానాన్వితు నాకుబేరుఁ గని తా । శోకించి పుత్రత్రయి
న్నిరసించెం బురుషత్వహీనశవముల్ । నిస్సారు లీరల్ ధనా
కరసాపత్న్యసహోదరుం గనియు దుః।ఖంబుం ద్రపన్ లోనఁ జెం
దరుగా మీ దొకజన్మమే? తలఁప వ్య।ర్థమ్ముల్ భవత్కృత్యముల్. 393

శా. ఆకర్ణించి తదీయవాక్యము సుతుల్ । సాపత్రపాచిత్తులై
గోకర్ణస్థలిఁ జేరి రందుఁ దపముం । గుంభశ్రవుం డాత్మ ని
ర్భీకుండై పదివేలయేండ్లు సలిపెం । చిన్నాతఁడున్ సత్తపః
ప్రాకామ్యంబును జెందె నిష్ఠఁ గొనుచున్ । బంచాబ్దసాహస్రికల్. 394

మ. ఒకవేయేఁడులు రావణుండు దప మ।త్యుగ్రక్రమం బొప్ప ధూ
మకృతాహారుఁడునై యొనర్చి తల బ్ర।హ్మప్రీతిగా దుల్చి వే
ల్చి కఠోరంబుగ నీగతి న్నవశిర।శ్ఛేదంబుఁ గావించియున్
స్వకరాసిన్ దశమోత్తమాంగదళనో।త్సాహంబుతో నుండఁగాన్. 395

మ. చతురాస్యుం డరుదెంచి యిట్లనె దశా।స్యా! నిన్ను నే మెచ్చితిన్
ధృతితో ఘోరతపం బొనర్చితివి సం।దేహంబు వోనాడుమా
హితముం గూర్చెదఁ గోరు మన్న దనుజుం । డీమానవు ల్దక్క జీ
వతతి న్వధ్యుఁడ గానియట్లు కరుణిం।పం గోరెదన్ వాక్పతీ! 396

చం. అన విని నల్వ వానికి సురాసురయక్షముఖాద్యవధ్యతం
గొను మని యిచ్చి శీర్షములు గూరిచి పిమ్మట నవ్విభీషణుం
గని యమరత్వము న్సుమతి కల్గునటంచును బల్కి పాకశా
సనపదకాంక్షి యైన దనుజాతుని నాఘటకర్ణుఁ జేరియున్. 397

వ. కుంభకర్ణవాంఛితంబు మాన్చి విరుద్ధపుఁగోర్కి కోరునటులు వానినాల్కనుండి బుద్ధి విమోహితుఁ జేయు మని సరస్వతికి నియోగించి చతురాననుండు కుంభకర్ణుం గాంచి నీకోర్కిఁ దెల్పు మన నాతఁడు నిద్రను వరంబుగాఁ గోరె నది కని యాఱు నెలలు నిద్రించి యొకనాఁ డాహారంబుఁ గొనునట్లు వరం బిచ్చె మఱియును. 398

తే. ఇట్లు వరమిచ్చి వాణీశుఁ డేగె లబ్ధవరుల దౌహిత్రుల సుమాల్యసురుఁడు వినియు
నభయుఁ డయ్యెఁ బ్రహస్తాదులనుగమింప, భూమికిని జేరెఁ బాతాళమునుద్వజించి.

సీ. రావణుం డొకనాఁడు రాజరాజును గెల్చి, లంకఁ గైకొనె నిరాతంకవృత్తిఁ
దనవారితోఁ గూడి తత్పురంబున నుండి, యేలె రాక్షసరాజ్య మెల్లఁ దాను
ధనపతి విజితుఁడై తనతండ్రియనుమతిఁ, గైలాసమున కేగి గరళకంఠుఁ
దపముచేఁ దనిపి యాతనిసఖ్యమును జెంది, విశ్వకర్మను బిల్చి వేగముగను

తే. పురము నిర్మింపఁగాఁ జేసెఁ బొల్పుమీఱ, నలక యను పేరఁ దగు నట నిల్చి యుత్త
రాశ కధికార మొంది మహేశభక్త, శేఖరుం డయి శుభములఁ జెందియుండె.

వ. అంత రావణుండు విద్యుజ్జిహ్వున కాత్మసహోదరిత్రయమ్ములో శూర్పణఖ యను దాని నిచ్చి వివాహం బొనర్చి దండకారణ్యా మరణం బొసంగె, నంతఁ జిరకాలమున కామె మృతభర్తృక యైన దానికి సహాయులుగాఁ దనపినతల్లికొమరులగు ఖరదూషణత్రిశీర్షుల నేర్పఱచె. మఱియుఁ గుంభీనసిని మధుదానవునకు భార్యగా నొసంగి మధువనంబు దాని కరణం బొసంగెఁ, గ్రౌంచి యనుదానిని ఖడ్గజిహ్వునకు భార్యగా నొసంగి పరలంకను దాని కరణంబుగా నొసంగె, మఱియు వైరోచన దౌహిత్రియగు వృత్రజ్వాల యనుదానిని గుంభకర్ణునకు వివాహంబుఁ జేసె, గంధర్వరాజగు శైలూషునిపుత్రిక సరమ యనుదానిని విభీషణునకు వివాహం బొనర్చెఁ, బిదపఁ గొంతకాలమునకు మందోదరియందు మేఘనాదుఁ డనుపుత్రుం గాంచె, వాఁడు జన్మించునపుడు మేఘమువలె నఱచిన జనులు వానిని మేఘనాదుం డనిరి. వరసంప్రాప్తనిద్రాయుతుండై కుంభకర్ణుండు గుహాగేహమ్మున నిద్రాముద్రితుం డయ్యె నిట్లు కొంతకాలంబు సనునంత. 401

## రావణుని దండయాత్ర

మ. వరగర్వంబున రావణుండును బరీ।వారంబుతో దేవకి
న్నరగంధర్వపతన్మరుద్గణమునీ।న్నాగాదులం జంపి త
త్సరసీజాక్షుల దారుణంబుగ బలా।త్కారంబుగాఁ బట్టుచుం
జెఱలం బెట్టుచు నుండుట న్విని మదిన్ । శ్రీదుండు ఖేదమ్మునన్. 402

తే. నీతి గా దిది పాపపు।రీతి గాని, నాఁతులను బట్ట వీరవి।ఖ్యాతి యగునె ?
భూతికాలముల కిది తప్పు । భ్రాత! యనుచు, దూతముఖమున ధర్మసం।ప్రీతిఁ దెలుప.

చం. కనలి దశాస్యుఁ డన్న నల।కాపురి కేగి యెదిర్చి గెల్చి యా
తనివరపుష్పకంబుఁ గొని । తత్క్షణ మాపురి వీడి మార్గమం
దున నొకచోటున న్విడిసి । తోరపుసైన్యముతోడ హాళిమై
వనమున రేయి నొక్కఁడును । వాయువిహారము సల్పుచుండఁగాన్. 404

వ. మ న్నొకనాఁడు కుబేరపుత్రుండగు నలకూబరుండు రంభాసంయోగాభిలాషియై కోరిన నామె యొకనిర్ణీతదినంబునాఁటిరాత్రికి నలకాపురంబున కేతెంచుట నిశ్చితంబౌట నారాత్రి యట రావణుండు విడిసిన రాత్రి యాట నజ్ఞాతవృత్తాంతయై స్వర్గంబున నుండి, మోహినీదేవతయో సావయవచంచలాలతయో యన నొప్పు నారంభ యరుగుదెంచుచున్న యవసరంబున. 405

శా. కుంభిన్యార్త్తికరుండు పంక్తిగళర।క్షోనాథుఁ డీక్షించెఁ దాఁ
గుంభోరోజ సరోజనేత్ర మదవ।త్కుంభీంద్రయానన్ లస
ద్రంభోరుద్వయి లోకజిత్స్మర సము।ద్యత్త్యక్తబాణాకృతిన్
రంభ న్భాసురవిగ్రహం జకితనే।త్రద్వంద్వ నా తెన్నునన్. 406

చం. కనుఁగొని దాని బల్మిఁ దమ।కంబునఁ బట్టి దశాస్యుఁ డవ్వని
న్మనమలరంగఁ గామశర।మర్దితుఁ డౌట మనోజకేళికా
ఘనచతురత్వ మేర్పడఁ బ్ర।కామసుఖంబులఁ దేలి దాని నం
తనె విడువంగ యక్షపతి।నందనుఁ జేరి వచించె నామెయున్. 407

చం. విని నలకూబరుం డసుర।వీరు శపించె ని కెన్నఁడేని నొ
ప్పనిసతి బల్మిఁ బట్టినను । వైళమ జచ్చునుగాక యంచు నా
తనిఘనమైనశాపమును । దానవుఁడు న్విని నాఁటనుండి యం
గనలను బల్మిఁబట్టఁడు ని।కామముఁ గామవికార మొందినన్. 408

వ. ఇట్లు భూపర్వతాంతరదృఢలగ్నబాహుండై వ్యాధబద్ధపక్షపక్షిం బోలి దీనుండై రావణుండును. 417

ఉ. ఆహరుని న్నుతించి వివిధాగమసూక్తుల నొక్కనాఁ డను
గ్రాహితుఁడై విముక్తిఁ గొని క్రన్నన దాఁపురమైనశాపముం
బాహులపీడయుం మఱచి పర్వలు మీఱఁగ నేగె నంతటం
హైహయపట్టణంబునకు నాతనితో సమరంబుఁ జేయఁగాన్. 418

సీ. ఆకార్తవీర్యార్జునాఖ్యు బాహుసహస్రుఁ, బురబహిర్గతునిఁగాఁ జరులవలన
నాలించి మధ్యాహ్నమందు రేవాతీరమున శివార్చనము సమ్మోద మొంది
యాచరించుచు నుండ నర్జునుం డయుతాత్మ, జాయలతో నదీజలములోన
బాహులచే సేతుబంధంబుగా నీరుఁ, బూరించి వారివిహార మొందఁ

తే. బొంగి యానీరు తటముల ముంచివైవ, విఘ్నితార్చనుఁ డగుచుఁ గోపించి లేచి
రాత్రిచరనాథుఁ డుగ్రవిక్రమము మీఱ, దురము నొనరించె నర్జునుతోడ నెదిరి.

ఉ. భూవరుఁ డాతనిం గెలిచి పోఁడిమిఁ దూలిచి కట్టి పట్టికిం
గేవలదారుహస్తిగతిఁ గేళి నొనర్ప నొసంగె నిట్టు లా
రావణుఁ డార్తి నప్పురిఁ జెఱం బడ నంతఁ బులస్త్యుఁ డాదృతిం
బ్రోవఁగ వేఁడి యర్జునుని ముక్తునిఁ జేసెను బౌత్రు రావణున్. 420

ఉ. దానవనాథుఁ డిట్లు తనతాత దయ న్విడిపింప సిగ్గు లోఁ
బూనక వాలితో నెదిరి పోరునఁ జంపెదునూహ నేగి య
వ్వానరనాథుఁ డబ్ధిని జపం బొనరించుచునుండ మెల్లఁగా
వానిని జేరె వాలియును వాలనిబద్ధుని జేసి పట్టియున్. 421

ఉ. వానిని జంకఁ బెట్టుకొని వార్ధుల నాల్గిట ముంచి ప్రోలికిం
దానవుతోడఁ జేరి ప్రమదంబున నంగదు మ్రోలఁ గాంచి త
త్సూనుని ముద్దిడం గరముతోఁ దొడఁ జేర్పఁ జలత్కరంబుమై
వానరనేతృకక్షగతపంక్తిముఖుం డిలఁ గూలె జాఱుచున్. 422

ఉ. ఆయసురేశుఁ జూపి తనయాండ్రకుఁ గోఁతులకుం బ్లవంగపుం
దూయెడక్రింద వ్రేలునటు లుంచె నధోముఖునిం బొనర్చి తా
రేయనిస్వేదవారిని శరీరము మోములు నాన నిట్టులే
పోయెను గాల మెంతొ కపిపుంగవుఁ డంతట జాలి మీఱఁగా. 423

తే. వాని వీడుచుఁ బలికె నెǂప్పటికి నీవు, పోరఁగా రాకు మన వాఁడు ǂ వోర ననుచు
సఖ్యముం గొని పుష్పకǂచారుఁ డగుచుఁ, బలియురను జూచు చేగ నǂబ్బలిపురంబు.

చం. అటఁ జని కాంచె రమ్యమగు ǂ నబ్బలిపట్టణ మర్కకోటిభా
పటలమహోజ్జ్వలం బసురǂవల్లభుఁ, డంత మహత్ప్రభావమై
తటుకునఁ గూలెఁ బుష్పకము ǂ దానవుఁ డొక్కఁడు నేగి లోనివా
కిటఁ గనె వామనాకృతివిǂగీతుని విష్ణు జయిష్ణు రాఘవా! 425

ఉ. అంబుజపత్రనేత్రుఁ బతిǂగాధిపపత్రుని మేఘగాత్రుఁ బీ
తాంబరునిన్ సరోజనిలǂయాశ్రితవక్షు శ్రితాళిపక్షునిం
గంబురథాంగసాధనవిǂకాసిచతుర్భుజు సర్వలోకవా
సుం బరు ద్వారపాలపదǂచుంచుఁ గృపాంచితదృక్ప్రపంచునిన్. 426

ఉ. రావణుఁ డిట్లు వానిఁ గని ǂ రా జెటనుండె వచింపు మన్న వాఁ
డేవిధిఁ బల్కమిం బధిరుఁ ǂ డీతఁ డటంచు బలీంద్రుగేహముం
గావర మొప్పఁ జేరి యటఁ ǂ గాంచె సతీయుతు నక్షకేళికా
కేవలమోదమూర్తిని సుకీర్తిని నబ్బలిచక్రవర్తినిన్. 427

వ. ఇట్లు బలిం గాంచి యాతనివైభవంబున కచ్చెరు వొందుచుఁ దద్గృహరామణీయక మాలోకించుచు బలితేజోవిజితతేజుండై కొంతవడి మౌనముద్రితుండై నిల్చె. బలియు నాటతమకంబున రావణుం జూడక నెత్తు మాడుచుండ నక్షం బొకటి చేజాఱి దూరంబునం బడియె, నప్పుడు రావణుం గని ప్రాకృతునకుఁ జెప్పుకరణిఁ బాచిక నిటు దెమ్మన వల్లె యని దానిచెంతఁ జేరి కరంబున నెత్తంపుఁబాచిక నెత్తంబోవ నది కదలమి నిర్వదిచేతులం బట్టి లాగినం గదలకుండె నదియుంగాక తత్కరాంగుళిశతం బక్షసక్తంబై తద్భారక్షుణ్ణంబై రక్తసిక్తంబై యుండుట నసహ్యార్తిచే నాక్రోశింప బలిచక్రవర్తి కని ప్రహాసభాసురుండై యాయక్షం బొకజరఠదాసిచేఁ దెప్పించి రావణుం గని చీ, చీ! యీఁడుదానిపాటిపాటవంబు లేనిపాపాటరి వీవిట కేల వచ్చితని గృహబాహ్యదేశమ్మున కాఁదాసిచే గెంటించె నంత నక్కడిరాజభటులు వానిం గని వీఁ డెవ్వఁడో లోని కెవ్వనియాజ్ఞం జనె నేమికతంబో తెలిసికొనునంతదనుక వీనిని విడువఁదగ దని రావణుం బట్టి మందురయందుఁ బాశబద్ధుం జేసి వాని నిచ్చలు నశ్వశకృదుద్ధరణకర్మకరుఁగాఁ జేసి స్వోచ్ఛిష్టభోజిఁగాఁ జిరకాల మట నుంచిన రావణుం డిట కేతెంచుట మొదటితప్పని యెంచి పశ్చాత్తప్తుండై సమయంబుఁ గని మున్ను చూచిన ద్వారపాలకరూప

విష్ణునిం గాంచి నమస్కరించి యిర్వదిచేతులచేఁ దత్పాదంబులం బట్టి నన్నుఁ
బ్రాణంబుతో నిల్లు చేరున ట్లొనర్పు మన రామచంద్రా! భవదీయాకారాంతరం
బగు నామహామహుఁడు వానిం బాదాంగుష్ఠమున మిన్నున కెగయఁ దన్నిన
బ్రతికితి నిదియె మే లని యటనుండి పుష్పకారూఢుఁడై లంకాపురంబుఁ జేరి పున
ర్జాతునిఁగాఁ దలంచుచుండె మఱియును. 428

ఉ. ఈవిధిఁ బుష్పకస్థుఁ డగు చెల్లజగంబుల గెల్చునాసతో
రావణుఁ డేగుచున్ మును ధరాతలమం దొగి నచ్చటచ్చటం
జేవ చెడం బరాభవముఁ జెందియు సిబ్బితి లేక దాలిలో
దేవురులాడు భైరవుని తేజివిధంబున దాడి కేగెడిన్. 429

ఉ. ఈరహి నేగ నొక్కపరి నీపురిఁ జేరి భవత్కులీనుఁడున్
ధీరుఁడు సప్తతంతుశుభదీక్షితుఁ డౌ ననరణ్యు గెల్వ నా
ధారుణిభర్త భూమిఁ బడి దానవునిన్ శపియించె రావణా!
మారఘువంశజుండె నిను బ్రమందఁగఁ జేయు సపుత్రసైన్యునిన్ 430

తే. అని శపించి నరేశుఁ డారయమరపురికిఁ, జనె దశగ్రీవుఁ డింటికిఁ జనియుఁ బిదప
మహానిశేఖరుని సనత్కుమారుఁ గాంచి, మ్రొక్కి యిట్లనె భక్తితో నొక్కనాఁడు.

ఉ. దేవులలో వరిష్ఠుఁడగు దేవుఁ డెవం డన మహానినాథుఁడు
న్మావరుఁ డన్న రావణుఁడు మావరుచేఁ జెడు రాక్షసాళి యే
త్రోవకుఁ బోవుసన్న ముని ధూర్జటి మోక్షపుఁద్రోవ కన్న నా
రావణుఁ డిట్లనె న్మునివరా! హరిచే మృతి నాకు నెట్లగున్. 432

చం. అనఁగ సనత్కుమారముని యాతనితో ననెఁ ద్రేత రాముఁడై
వనజదళాక్షుఁడే మనుజభావముతోడ నయోధ్యఁ బుట్టు నా
తనిపయి వైరమొందిన మృధంబునఁ జంపు నినున్ హతుండవై
ఘనతరముక్తి నొందెదవు గావున నట్లొనరింపుమా యనన్. 433

ఉ. దానవనేతడెందము ముదంబును జెందఁగ ముక్తిఁ గైకొనన్
జానకి నాదటన్ ఛదనశాలఁ జరింప హరించెఁ గోప మీ
పూని మృధంబున స్మరణ మొందఁగఁ జేయు దటంచు నట్టులా
దానవనాయకుం డవితథం బగు ముక్తినిఁ జెందె రాఘవా! 434

ఉ. సీతను గొంచశోకవనిఁ జేరిచియున్ ఘనమాతృభావమే
చేతమునందుఁ జెందె రఘుశేఖర! వానిని నజ్ఞులెల్లఁ గా

మాతురవృత్తి దుష్టుఁ డయి యమ్మహిజాత హరించె నందు రా
పాతకభావ మొందునెడ భగ్గున మండుచు బూది గాఁడొకో? 435

ఉ. శూరత మీఱ ధాత్రిపయి శూరులఁ గానక యొక్కనాఁడు దా
నారదుఁ జూచి మ్రొక్కి మునినాథ! మదీయబలంబు నోర్చు నా
వీరవరేణ్యు లేడఁ బృథివిం గలరేని వచింపు మయ్య! యా
వీరులతో దురంబుఁ గొన వేడుక కల్గె చిరంబునుండియున్. 436

చం. అన విని నారదుండు మది నారసి తన్మదభంగకాంక్షియై
యనుఁ దెలిదీవి నుందురు మహాబలశాలురు రాక్షసేంద్ర! యే
రని హరిచేతఁ జత్తురో? తదంఘ్రులఁ గొల్తురో? యట్టిపుణ్యులా
ఘను లట నుద్భవింతు రతికాయు లజయ్యులు నెట్టివారికిన్. 437

చం. అనఁగ దశాస్యుఁ డంత సచివావళిఁ గూడియుఁ బుష్పకంబుతోఁ
జనియెను వెల్లదీవికిని సంగరకాంక్ష వహించి గర్వియై
చని చని యొక్కచో నిహతసారము పుష్పక మువ్వి నిల్వ నా
దనుజుఁడు దానిని న్విడిచి తా నొకఁ డేగెను సాహసమ్మునన్. 438

శా. ఈరీతిం జనఁ బూలుఁ గోయు నొక దాసేణాక్షి యాత్రోవలో
వీరమ్మన్యు దశాస్యుఁ బట్టి నొకకే ల్వే సాపి లీలార్థమై
యోరీ! యెవ్వఁడ? వెవ్వఁ డంపె? నిను నీయూ రేమి? పే రేమి? యం
చారీతిన్ సతులెల్లఁ బట్టికొని యాహ్లాదమ్మునన్ నవ్వుచున్. 439

ఉ. మాటికిమాటికిం గరవిమర్దన మొప్పఁగ నవ్వుటాల కా
పాటలగంధు లొక్కొకరు పాణులఁ దన్ముఖపాళి మోఁదుచున్
బోటిరొ! చూడుమమ్మ! పదిమోములు నిర్వదిచేతు లున్న యీ
కీటక మంచు వానిఁ దలక్రిందుగఁ గైకొని త్రిప్పి రొప్పుగన్. 440

ఉ. వంతుల కీగతి న్సతులు వానిఁ గరంబులఁబట్టి త్రిప్పఁగా
నింతి యొకర్తు తత్పదము లేకకరంబునఁ బట్టి త్రిప్పుచున్
బంతివలెం జరాలున నె బాఱఁగఁ జిమ్మఁ బరాఖ్యలంకకుం
జెంతలఁ గ్రాంచినాఁ బరఁగు చేడియదొడ్డిఁ బడెం దశాస్యుఁడున్. 441

మ. అతికష్టంబునఁ దత్సతీకరవిమర్దాదివ్యథాముక్తుఁడై
యతులాశ్చర్యముతోడఁ జింతిలె సరోజాక్షారులై వానిచే

మృతులౌవారల కిట్టిశక్తి కలుగు ♦ న్మేల్మేలు నే నట్టులే
మృతిఁ గైకొం చటఁ బుట్టువాఁడ నిఁక న♦మ్మే లెట్లు నా కబ్బునో? 442

ఉ. శ్రీపతి నాపయిం గనలు ♦ జెందెడుకర్జముసేత మేలు నే
నేపగిదిం బొనర్తు నని ♦ యెంచియె జానకిని౯ హరించె నా
శ్రీపతి నీవటంచు రమ ♦ సీత యటంచుఁ దలంచి తల్లిగా
నాపెను జూచి నీవలన ♦ నాతఁడుఁ జచ్చి విముక్తుఁ డయ్యెఁ జూ. 443

## వాలిసుగ్రీవుల చరిత్రము

ఉ. రావణజన్మకర్మములు ♦ రాముఁ డగస్త్యుఁడు దెల్ప సంతసం
బావహిలంగఁ దా విని మ♦హామునితోడ వచించె వాలిసు
గ్రీవులజన్మకర్మముల♦రీతిని నీవలన న్వినంగ నా
భావము వేడ్కఁ జెందెడు త♦పఃపరిపూర్ణ! మునీంద్ర! తెల్పుమా. 444

తే. పాకశాసనపద్మినీ♦ప్రాణనాథు, లిరువురును వాలిసుగ్రీవు ♦ లనఁగఁ బుడమిఁ
బుట్టి రందురు తెల్పుమా ♦ పూర్వగాథ, సద్దయాసాంద్ర! ఘటజ వా♦చంయమీంద్ర.

తే. అనఁగ విని కుంభసంభవ♦మునివరుండు, జానకీజానిఁ గని రామ♦చంద్ర! వినుము
వాలిసుగ్రీవసంభవ♦వార్త నీకుఁ, దేటపడఁ దెల్పువాఁడ సుర♦ధీశరణ్య! 446

ఉ. మేరుమహామహీధ్రమున ♦ మేటిసభన్ వసియించి తొల్లి యా
నీరజసూతినేత్రగళ♦న్నిర్గతమోదజలేపదంశమున్
ధారుణి భావి నారసి ము♦దంబున వీడఁగ నంతలోననే
వీరుఁడు వానరుండు ప్రభ♦వించెను ఋక్షరజోభిధానుఁడై. 447

ఉ. వానిని జూచి పద్మజుఁడు ♦ వానర! నీ విట నుండు మన్న న
వ్వానరుఁ డట్టు లుండి బహు♦వాసరము ల్చన నొక్కనాఁడు త
త్కాననమందు మూలఫల♦కాంక్షఁ జరించుచుఁ జూచె రత్నసో
పానసరస్సునందు జల♦పానకుతూహలతం దటస్థుఁడై. 448

తే. అమలతరమైన తత్తటా♦కాంతరమునఁ, బ్రతిఫలితమైన యాత్మరూ♦పంబుఁ జూచి
నీట గొబ్బున దుమికియు ♦ నెమకి యన్య, కపిని గానక యొడ్డు వే♦గముగఁ జేరి.

ఉ. అంగనయై కపిప్రవరుఁ ♦ డాత్మసతీత్వముఁ గాంచి యయ్యొ! నే
భంగముఁ జెందితిం బురుష♦భావము వోయి పడంతి నైతినం

చంగద నొందుచుండఁగ సు।రాధిపుఁ డామెను జూచి మోహ ము
ప్పొంగఁగఁ దేజము న్విడువఁ । బుచ్ఛమునం బడె దాన నామెకున్. 450

తే. బాలుఁడొక్కఁడుజనియించె । వాలమునను, వాలమునఁబుట్టుటందగె । వాలినాఁగఁ
బిదపనామెను గని కామ।వివశుఁ డినుఁడు, శుక్రమును వీడఁ గుత్తుక । చోటఁబడియె.

తే. దాన నొకకపిబాలుఁ డు।ద్భవముఁ జెందె, గ్రీవజాతుఁ డతండు సు।గ్రీవుఁ డయ్యెఁ
దరుణిపుత్రద్వయంబుతో । నరిగి యొకటఁ, బండి నిదురించి లేచెఁ బ్ర।భాతమునను.

తే. రేయి సనఁ బూర్వలబ్దనా।రీత్వమెల్లఁ, బోయి యెప్పటి పురుషత । బొడమనాతఁ
డచ్చెరువుమోదమునుజెందు।నవసరమున, నజుఁడుసనుదెంచికిష్కింధ।కధిపుఁ జేసె.

ఉ. సూనులతోడ ఋక్షరజ।సుం డటు లప్పరి నేలి నాకసం
స్థానముఁ జేర వాలి కపి।సంఘము నేలుచునుండె రాజుగా
మానవనాథ ! వాలిఘృణి।మాలిసుతోద్భవగాథ నీకు స
న్మానము మీఱఁ జెప్పితిఁ జు।మా ! యన రాముఁడు మౌని కిట్లనెన్. 454

ఉ. వాలిసహోదరుం డయిన । భాస్కరజుం బురి వీడ గెంటుచో
వాలిసమానసారుఁ డగు । వాయుజుఁ డర్కజమంత్రియే కదా
యేల జయింపకుండెను మ।హేంద్రజు నాత్మబలం బెఱుంగడో ?
వాలి జయింపలేక మృదు।భావముఁ జెందెనొ ? తెల్పుమా యనన్. 455

చం. విని ఘటజన్ముఁ డిట్లనియె । విన్ము రఘూత్తమ ! యంజనాద్రిపై
ఘనతరమూర్తి కేసరి ని।కామబలుండుఁ గుటుంబినీయుగం
బున విలసిల్లు నం దతని।పొల్తుక యంజననాపడంతి యం
జనమున నుండఁ గృధ్రివల।నంబడెఁ బాయసపిండ మత్తఱిన్. 456

తే. పుత్రకామేష్టిఁ జేయున।ప్పుడు లభించు, పాయసంబునఁ బ్రీతిమై । భర్త యొసఁగు
భాగమును బాఱవైచెఁ గు।భావ కైక, దానిఁగొని గృధ్రి యట వీడెఁ । దపన తేజ !

ఉ. ఆపరమాన్నభాగ మవు । డంజన సాపడెఁ దత్సపత్నియా
నాపృశదంశకాననయు । నండకుఁ జేరఁగ దూరభర్తలై
యాపడఁతుల్ వినోదముల । నందఁగ వాయువు చూచి బద్ధనా
రీపటముల్ హరించియు ని।రీక్షణ మొందెఁ దదూరుయుగ్మమున్. 458

తే. చూచియంజనతోఁ గామ।సుఖములొందె, నటులనిరృతిపృషదంశ।కాస్యఁ గూడె
వారలిద్దఱు సుతులను । బడసియుండి, రనుమయు పిసాచి ఘుర్ఘుర।స్వనుఁడు నాఁగ.

చం. వరమధుమాసమందు సితపక్షమున న్హరివాసరంబునం
దిరమగు పైతృభంబునను ధీరుఁడు నంజన కుద్భవించెఁ గొం
దఱు మును లందుఁ బూర్ణిమ సదాగతిసూతి జనించె నందు రా
కదువలిపట్టి సిస్తులని కామభుజాబల వేగుఁడై తగెన్. 460

సీ. సామీరి యట నొక సమయమం దుదయించు, భానుబింబముపక్వఫల మటంచు
నూహించి తిన నెంచి యుత్ప్లుతి నేఁబది, యామడ లేగి తిగ్మాంశుఁ గదియ
నమవస యగుటచే నానాఁడు రాహువు, రవిని బాధింపఁగా రాక భీతిఁ
జని యింద్రుఁ గని నిన్నుఁ గొని మ్రింగెదను మున్ను, భానుఁ బట్టుట నాక వశ్యకార్య
తే. మట్టిదానికి నంతరాయంబు కలిగె, వాయుజునిమూలమై నేఁడు వచ్చి వాని
శిక్ష సేయుమటన్న శచీప్రియుండు, వెల్లయేనుఁగు నెక్కి వేవేగఁ జనియె. 461

తే. సురలతోఁ జని వాయుజుఁ జూచి యింద్రుఁ, డతనిపై వీచె ఘోరవజ్రాయుధంబు
దానఁ గూలెను శైలంబుపైన నతఁడు, హనువు నలియుట హనుమంతుఁడయ్యె నాఁడు.

చం. సుతుఁ బవిపాతితుం గనుచు శోకము జెంది మనంబులో సదా
గతి సుతు సేదఁదీర్చి రుషఁ గైకొని సంచలనంబు మాని కుం
భితగతి నుంట మూర్ఛను దివిన్ భువి నెల్లరుఁ జెందఁగా శచీ
పతిని దిరస్కరించి విధి వాయువుఁ జేరుచు బుజ్జగించుచున్. 463

మ. పవమానా! యిటు నీవు నిశ్చలతతో వర్తించినన్ జీవముల్
శవతుల్యంబులు గావె? నీవెకద విశ్వప్రాణ మీపాటికిన్
బవిధార్యజ్ఞత సైపుమయ్య! నిను నేఁ బ్రార్థించుచున్నాఁడఁ బెం
పువడం గోరిక లిత్తు నీసుతునకుం బూర్ణాయు వోఁ గావుతన్. 464

చం. అన విని వాయు వాత్మ ముద మందుచు మున్బలె సంచరింపఁగా
జనములు లేచి రెల్లరుఁ బ్రశాంతి వహించెను లోక మంతట
న్వనజభవుండు మారుతిఁ గృపం గని పల్కెను వాయుజా! యిదే
కొను మమరత్వవజ్రతను గూఢరమాధిపభక్తియోగముల్. 465

తే. నీదుగమనమ్మునకు నడ్డు లేదు మఱియు, హరికి సాయంబుఁ జేసెద వయ్య! యనుమ!
యని విధాత తిరోహితుఁడయ్యె నంత, భానుఁ గబళించుపూన్కి స్వర్భానుఁ డరిగె.

వ. అనిన రామచంద్రుం డగస్త్యునిం గని రాహువు రవిం గబళింపఁ గతం బేమియో
నుడువు మన నగస్త్యుం డిట్లనియె. 467

సీ. సురలతో రాహువు సుధఁ ద్రావి యమరుఁడై, సురల బాధింపఁగాఁ జూచునంత
దర్శపూర్ణిమలందుఁ దపనేందువుల నీవు, బాధింపు మనిరి దేవతలు నట్టి
రవిసోమబాధయే గ్రహణంబునాఁ దగు, మనుజులు దానధర్మము లొనర్చి
రాహుతృప్తి నొనర్చి రవిసోములను విముక్తులఁ జేసి పాపముక్తులుగ నుందు
తే. రదియె యుపరాగ మంద్రు నీ వడిగినట్టి, చిత్రతరమైన దివ్యచారిత్ర మెల్లఁ
బల్కితిని వాయుసూనుని బలముఁ దెల్ప, వశముగా దైన నిసుమంత పల్కవాఁడ.

చం. ఒకపరి వాయుజుండు మును లుండెడు నాశ్రమమందుఁ జేరి యా
జ్ఞికకుశస్రుక్స్రువాదులను గేళిమెయి న్వెదఁజిమ్మి మౌనిబా
లకుల నదల్పఁగా నిజబలంబు లవంబు నెఱుంగనట్టు లిం
కొకరుఁడు దెల్పఁగాఁ దెలిసి యుండునటుల్ శపియించి రామునుల్. 469

చం. అనుమ మునీంద్రశాపవశుఁ డై యసమర్థుఁడు వోలె వాలిపైఁ
గనలఁడు వార్ధి దాఁటి చనఁగా మును ఋక్షవిభూక్తివైఖరిన్
దనబలముం గ్రహించెఁ జుమి దాశరథీ! కపిరావణాదివ
ర్తనము వచించితి న్మిగుల ధన్యుఁడ నైతిని మౌనిమండలిన్. 470

చం. సకలము నీ వెఱింగియును సత్కృప నాయెడ నుంచి సన్ముని
ప్రకరములో వరిష్ఠపదభాస్వరుఁ జేయ మదీరితంబు విం
టకు ముద మొంది తీవు కరుణానిధి వౌటను రామచంద్ర! నీ
యకుటిలమైన యాశ్రితజనాదరభావము వర్ణ్యమౌ కదా? 471

వ. ఇట్లు రామచంద్రదర్శనం బొనర్చి యగస్త్యుండు మునిజనసహితుండై స్వాశ్రమంబుఁ జేరె వింధ్యాద్రి పైకెగయు నని యయ్యగస్త్యుండు దక్షిణదిక్కున నిత్యనివాసియై యుండె నని చెప్పి శర్వాణితో శంకరుండు మఱియు నిట్లనియె. 472

ఉ. రాముఁడు విశ్వవంద్యుఁడు పరాత్పరుఁ డయ్యు సమస్తబాంధవ
స్తోమము గొల్వ భూమిసుతతోఁ జరియించె గృహస్థుఁ డట్లు, ని
ష్కామత నొందియుం సకలకామసుఖంబులఁ జెందె వానర
స్తోమము వాయుజాదులు విశుద్ధమతిం బరిచర్య సేయఁగాన్. 473

సీ. రాజీవనేత్రుండు రామచంద్రుఁడు భూమిఁ, బాలింప ధర సస్యవతిగఁ దనరె
ఫలవంతములు దరుల్ కులధర్మనిష్ఠులు, సకలజనంబు లుత్సవము లలరెఁ

బతిభక్తినిరతలు ✽ భామినీమణులెల్లఁ, బుత్రశోకాదులు ✽ బుట్ట వెచట
నీతి వీడరు జను ✽ లీతిబాధలు లేవు, ధర్మంబు నాల్గుపా✽దముల నడచు

తే. జారచోరాదులగు దురా✽చారపరులు, లేరు వైధవ్య మొందిన✽లేమ లేదు
లేవు లేములు లేరు మ✽లీమసులును, రామరాజ్యంబులో గిరి✽రాజతనయ ! 474

చం. నరశుభధర్మబోధకు జ✽నార్దనుఁ డో రఘురాముఁ డిట్లు తా
నరవరుఁడై శుభక్రియ ల✽నారతముల్ భువి నొప్పునట్లుగా
గురువరునాజ్ఞఁ జేయుచును ✽ ఘోటకయాగము లెన్నొ లింగముల్
ధరణిఁ బ్రతిష్ఠితంబులుగఁ ✽ దత్పరుఁడై యొనరించె సీతతోన్. 475

వ. ఇట్లు పదునొకండు వేలపదునొకండునూఱులవత్సరంబులు త్రేతాయుగమానమ్మున
ధర నేలె నక్కాలంబు గలిమానమ్మున నేకాదశలక్షైకాదశశతవత్సరపరిమితం బగు
ని ట్లేకపత్నీవ్రతస్థుండై సకలగార్హస్థ్యధర్మకారియై యుండె సీతయుఁ బ్రేమానువర్తన
ప్రశ్రయదమంబులచే భర్తను సేవించుచుఁ దదింగితసూచితపరిచర్యాకారిణియై
సర్వదా బహుమతయై యాతని రంజింపఁజేయుచుండె నని చెప్పి పరమేశ్వరుం 476
డిట్లనియె.

చం. గిరివరనందినీ ! విబుధ✽కీర్తితముల్ సకలాఘహారియుం
బరమపవిత్రము న్నిరత✽భావుకదం బగు సారకాండస
చ్చరితముఁ జెప్పితిన్ జనులు ✽ సర్వమనోరథసిద్ధిఁ గాంతు రీ
చరితఁ బఠింప విన్నను ని✽జంబుగ నారఘురామునత్కృపన్. 477

వ. అని చెప్పినఁ బరమేశ్వరువచనంబులు విని దాక్షాయణి తారకరామచంద్రకథా
కర్ణనోత్సాహ యగుటం బరమానందకందళితహృదయారవింద యైయుండె 478
ననుటయు.

మాలినీ. శ్రుతిశిఖరసువేద్యా ! ✽ సూరిచిత్తైకహృద్యా !
హుతభుగళికనేత్రా ! ✽ యుక్తగోరాజపత్రా !
దితిజవనహుతాశా ! ✽ తీవ్రతాంచద్గరాశా !
శ్రితసమవనభావా ! ✽ శ్రీభవానీశ ! దేవా ! 470

ఉ. రాజుల కేరి కీయకయె రాజవతంసుఁడ వీ వటంచు న
వ్యాజపుభక్తి రాఘవుని భవ్యచరిత్రము నీకె యీఁగతిన్
భూజనులెల్ల మేలనఁగఁ బొల్పుగ నంకిత మిచ్చియుంటి వి
భ్రాజితదివ్యతేజ! యనురక్తిని బ్రోవుము నన్ను శంకరా! 480

—: గద్య :—

శ్రీ సీతారామచంద్రకరుణాకటాక్షవీక్షణావాప్తకవితావిశేష శ్రీమద్గుండువంశ
పయోవారాశితారేశ రామస్వామిబుధేంద్రసూను సుబ్బాంబాగర్భ
శుక్తిముక్తాఫలాశ్వలాయనసూత్రాగస్త్యసగోత్రోద్భవోభయ
భాషావిద్వత్కవివిధేయ లక్ష్మణనామధేయ విరచితాం
ధ్రానందరామాయణ సారకాండంబునఁ
బంచమాశ్వాసము సంపూర్ణము
సారకాండము సమాప్తము.

శ్రీ భవానీశంకరార్పణమస్తు.



శ్రీపతిముద్రణాలయము, కాకినాడ—౧౯౫౨.

# దివ్యస్మృతి.



శ్రీమాన్య ! శుద్ధకవితా
ప్రామాణ్య ! రఘూత్తమాంఘ్రిరాజీవధ్యా
నామోదపూతజీవిత !
ప్రేమాలయ ! లక్ష్మణాఖ్య విబుధవరేణ్యా !

సిరి గల పట్టణంబున వసించియు నిత్య మకించనార్తిచేఁ
దెరలితి- విట్టియుత్తమకృతిన్ రచియించియు ముద్రణార్థమై
తెరు వొకయింత లేక అతిదీనత నూరును నూరు రేఁబవల్
దిరిగితి- వాప్రయత్నము ఫలింపకమున్నె గతించినావు హా !

తారకమంత్రరాజజపతత్పరమైన త్వదీయచిత్తమం
దీరిక లెత్తు కోరికల కేకముఖం బగురూప మయ్యె నీ
చారుకృతిప్రచార, మది సాగకమున్నె యతృప్తితో నిటుల్
ఘోరదురంతమృత్యువునకున్ బలి యైతివి పండితాగ్రణీ !

నవనవరాగరంజితమనఃప్రియచారుపురాణధోరణీ
ప్రవణుఁడ వై రసప్రచురభావపరిష్కృతసత్కవిత్వవై
భవుఁడవు నై యుదాత్తగుణవద్బహుకావ్యవిధానలబ్ధగౌ
రవుఁడవు నై యెసంగు కవిరాజమణీ ! యిఁక లేవు మా కిలన్.

ఈకృతి నింతమాత్ర వెలయించి గురూత్తమ ! నీసపర్య నె
ట్లో కృతి నైతి సంభృతమహోదయకీర్తిరమాభిరామమై
ఆకమలార్కతారకశశాంకము నై పెనుపొందుఁ జక్కనౌ
నీకృతి, యద్వితీయతఁ బునీతసభాజితసాహితీభువిన్.

నిను సుస్నిగ్ధహృదంతరున్ మధురవాణీభూషణున్ సస్మితా
నను నత్యున్నతకంఠభాసురపురాణస్వచ్ఛవాగ్ధోరణీ
వినుతప్రాభవు హాస్యలాలసు జగద్విఖ్యాతు శ్రీరామభ
క్తుని వేదాగమపండితోత్తముఁ దలంతున్ భక్తిభావమ్మునన్.

నడకుదురు,
16-5-1952.

గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి.
అరుణాశ్రమము.

